1953-54. శ్రీ కొల్లూరి వెంకటరత్నం గారు
రాజమహేంద్రవరం

స్వస్థలానికి దూరాన స్వస్థమైన వసతి
ఉత్తమ తరగతి శాఖాహార
భోజన, వసతిగృహము
& ఫలాహారశాల

★ ★

సికింద్రాబాదు & హైదరాబాదు
పట్టణాలలో
అద్వితీయమైనది

★ ★

మకాం చెయ్యండి

సౌఖ్యవంతమై - ధారాళంగా
గాలివచ్చే గదులు (స్నానపుగదులు కలిసివున్నవి)
రుచ్యమైన శాకపాకాలు
చక్కని ఆదరణ

★

రెండుహొటళ్లును పట్టణముల
నడిమధ్య ఉన్నవి.

# తాజ్‌మహల్ హొటల్

| 88, ఆక్సుఫర్డు వీధి,<br>సికింద్రాబాదు - దక్కన్<br>ఫోన్ నం. 7474 | కింగ్ కోఠీ రోడ్డు,<br>హైదరాబాదు - దక్కన్. |
|---|---|

తంతి: *"COURTESY"*

# ఆంధ్రపత్రిక

(నలువది నాలుగవ
ఉగాది సంచిక)

[illegible]

**(1953-54)**

సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్

*

[వెల రూ. 2]

# ఆంధ్రపత్రిక

## విజయ ఉగాది సంచిక

### విషయానుక్రమణిక

### ముఖచిత్రం—రాధాకృష్ణ

శ్రీమతి సరళారామన్ (డెహ్రాడూన్)

### చిత్రములు :

నచికేతు-యముడు; చిత్రకారుడు: శ్రీ యస్. రాజం; కోణార్క-దేవాలయ కుడ్యశిల్పము-చిత్రకారుడు: శ్రీ గోవింద్. ప్రమథగణం - (భువనేశ్వర దేవాలయ కుడ్యశిల్ప ప్రతి చిత్రము : శ్రీ కె. వేణుగోపాల్), "నటరాజు"- కీ. శే. శ్రీ అడివి బాపిరాజుగారు, జీవితభారం-చిత్రకారుడు శ్రీ ఎ. పైడిరాజు, మురళి: శ్రీ వేలూరి రాధాకృష్ణ, ఆర్ఫ్యస్ - యూరిడిస్, చిత్రకారుడు జి. యఫ్. వాట్స్.

---

# ADVERTISER'S INDEX



కోణార్క దేవాలయ కుడ్యశిల్పము

చిత్రకారుడు శ్రీ గోవింద్.

ఓం

నందన సంవత్సరము, ప్రపంచ చరిత్రపై సుదీర్ఘ ప్రభావముగల ఘట్టముల కాటపట్టయి గూడ, ప్రపంచ నౌకను, కాలప్రవాహముననీ సుడిగుండములనుండి తప్పించి శాంతిపథముననే విజయవంతముగ నడిపించి, విజయాంకిత మొనర్చినది. సర్వశుభసూచక నామ యగు 'విజయ'కు సుస్వాగతము.

ద్వితీయ ప్రపంచ యుద్ధానంతము విశ్వ శాంతి సాధనలో ఏడేండ్లు గడిచినవి. ప్రాకృతికమైన ప్రతి జీవితవిషయమును ఏడేండ్ల కొకసారి, పారమార్రి, పునరుద్భవము కాగలదని లోకసామాన్యమగు నమ్మకము గలదు. ఈ ఏడేండ్లలో విశ్వశాంతిసాధన, మారురూపమున, ప్రపంచ అగ్రరాజ్యముల మధ్య ముసుగులో గ్రుద్దులాటగా గడిచినది. నందన వత్సరాంతమున, ఆ ముసుగు తొలగి, శాంతియో, సమరమో ప్రత్యక్షముగ తేలిపోవలెనన్న క్షత్రనీతికి ప్రాతిపదికలేర్పడినవి.

అమెరికాలో ట్రూమన్ ప్రభుత్వము, సామ దాన భేదోపాయముల మూడిటిపైననే, రష్యాతో సామరస్యమునకై ప్రయత్నించినది. కొరియా యుద్ధ విషయమున దండోపాయావలంబనములో సమితి రాజ్యములను కూడగట్టుకొని, సమితిపేరటనే చర్య జరిపించి, సంధి రాయబారములకు ప్రయత్నము లెడ తెగక సాగించుచునేవచ్చినది. అమెరికన్ అధ్యక్షుడు, సైనిక మనస్తత్వవేత్త యగుటతో అమెరికన్ విదేశాంగ రాజనీతి, సామాన్యపౌరదృష్టినుండి తొలగి వీరరస ప్రధానముగా రూపొందుచున్నది. దండోపాయమునకు వెనుదీయమన్న చర్యలకు ప్రాతిపదికవైచుచు, కొరియాయుద్ధము, ఫార్మోజాలోని చాంగ్ సైన్యములకు, చైనా ప్రభుత్వమునకు మధ్య యుద్ధముగా విస్తరించుటకు క్రియారూపముగ ప్రేరేపించుచున్నది.

స్టాలిన్ మృతికి పూర్వమే అమెరికన్ రిపబ్లికన్ ప్రభుత్వము, ఈ విధాన మవలంబించినది. శాంతి భంగము గాకుండుటకు, స్టాలిన్ ప్రతిష్ఠయు, ప్రభావమును, ప్రత్యక్ష యుద్ధప్రారంభ విముఖత్వమును, చాలవరకు పనిచేసినవి. అతని మృతితో, ఏర్పడిన, రష్యన్ నూతన నియంతృత్వ మే అంతరమున నడచునో, ప్రపంచశాంతి కెంత దోహద మగునో, భవిష్యత్తే నిర్ణయించవలసియున్నది. కాని స్టాలిన్‌మృతితో, రష్యన్ నూత్నప్రభుత్వము, మహానాయకుని గోల్పోయిన నీరసముతో లొంగి వచ్చి శాంతి చేకూర్చు నని కాని, లేక స్టాలిన్‌కున్న నిగ్రహము లేక, వెంటనే కలబడి, తమ బలప్రాబల్యము ముందోడిపోయి, తద్వారా శీఘ్రముగా ప్రపంచశాంతి లభింపవచ్చునని గాని, అమెరికన్ ప్రభుత్వ మాశించిన అది అడియాస మాత్రమే కాగలదని స్పష్టమే. ఈ విపరీత స్థితిని మనసులో నుంచుకొనియే తక్కిన ప్రపంచ రాజ్యములన్నియూ, ముఖ్యముగ భారతదేశమువంటి తటస్థ రాజ్యములన్నియూ, అలజడిపడుచున్నవి. తాము సహాయము చేయ మిత్రరాజ్యములు ససైనికముగ తమప్రక్కనే నిలువవలెనన్న ఉబలాటమును గూడ అమెరికన్ రాజనీతిజ్ఞులు వెల్లడించుటతో, బ్రిటన్ మొదలైన దేశముల రాజకీయజ్ఞులలోకూడ అలజడి ప్రారంభమైనది.

తటస్థ రాజ్యములు, సైనిక బలముతో గాకపోయినను, నైతిక బలముతోనైన, ఏకకూటముగా తమ ప్రభావములను విస్తరించుకొని, ఇరు కక్షులుగా విడిపోయిన ఈ అగ్రరాజ్యముల రెండిటి మధ్య, సమరస

శక్తిగా నిలచి ప్రపంచ శాంతిని కాపాడవలె నన్న భావము, పండిట్ నెహ్రూ, బెవాన్ మొదలైన ప్రముఖులనీ యుద్యమప్రారంభమునకు ప్రేరేపించుచున్నది.

ఈజిప్టులో ప్రభుత్వము మార్పొకటి ఈ సంవత్సరమున గణనీయ విశేషము. అచటి రాచరికము నిస్సారమై, పరిపాలనావిధానమంతయు పాడరిపోనున్న సమయమున, సామాన్య సైనిక మాత్రుడగు జనరల్ నజీబ్ సైనిక విప్లవమును ప్రారంభించి ప్రభుత్వమును హాతాదధీన మొనర్చుకొని, దేశక్షేమదృష్ట్యా నక్రమమైన నియంతస్థానమున నిల్చినాడు. దేశములో నిర్దుష్ట పరిపాలనాయంత్రస్థాపనకును, అభ్యుదయకరములగు భూసంస్కరణ విధానాలంబనములకును నజీబ్ ప్రాముఖ్య మిచ్చుటలో, ఈజిప్టు రాజ్యాంగము కొంత సుస్థిరత చేకూర్చుకొనుచున్నది. నేటి ఈజిప్టుతో వ్యవహరించుటలో నూతనమార్గ మవలంబించుట బ్రిటనుకు కూడ అవసర మగుచున్నది.

భారతదేశము తన విదేశాంగనీతి వలనను, దేశ పునరుద్ధరణ కార్యకలాపములవలనను, దేశ విస్తృతముగ శాంతిస్థాపనా సామర్థ్యమువలనను ఇతోధికముగ ప్రపంచరాజ్యముల గౌరవ మందుకొనుచు శక్తివంతముగా వ్యవహరించుకొనగల్గుచున్నది. ఆముందు సంవత్సరమున, ప్రపంచమున ఇంతకుముందు కని విని యెరుగనంత విస్తృత పరిమాణములో, ప్రజాస్వామ్యసూత్రబద్ధమయి, ప్రశాంతముగ ఎన్నికలను జరిపించుటలోనే, భారత ప్రభుత్వ పరిపాలనాసామర్థ్యము, ప్రజాస్వామ్యదేశము లన్నిటికి అచ్చెరువు గొల్పినది. ఆతర్వాత, రాజ్యాంగబద్ధముగ శ్రేయోరాజ్యాదర్శములో ప్రజాస్వామ్య పద్ధతిని పంచవర్ష ప్రణాళిక కుపక్రమించుటలో భారతదేశము ప్రపంచ అభ్యుదయ కాముకుల మన్నన లందుకొన్నది.

ఈ ప్రణాళికను విజయవంతముగ నిర్వహించుటకు, ప్రభుత్వము మిశ్రమ ఆర్థికవిధానములపైనను, ప్రజల సహకారకృషిపైనను ఎక్కువ ఆధారపడినది. నందన సంవత్సరమున ప్రారంభమైన ప్రణాళికాంతర్భాగమగు కమ్యూనిటీ ప్రాజెక్టులకు ప్రజాసహకారము విరివిగ లభ్యమైనది. ప్రణాళిక కృషి పెద్ద ప్రాజెక్టుల విషయములో రెండేండ్ల క్రిందటనే ప్రారంభమైనది. స్వల్పముగ ఫలసాయముకూడ విజయ సంవత్సరముననే కొంత లభింపవచ్చును. వ్యవసాయ సంస్కరణము, అధికాహారోత్పత్తి, నూతన పారిశ్రామికాభివృద్ధి, సంఘసేవాకార్యక్రమము లాదిగా గలవన్నియు, విజయ మొదలు మూడుసంవత్సరములలోనే తీవ్రముగ జరుగవలసియున్నవి. ఈ ప్రణాళికలకైన వ్యయమును స్వదేశమునను విదేశమునను కూడ విజయవంతముగ సేకరించగల ధైర్యము ప్రభుత్వమునకు చేకూరినది. దేశప్రజ యావన్మందియు యథాశక్తిగ సహకరించిన ప్రణాళికను విజయవంతముగ నెరవేర్చగలమనే ప్రభుత్వము విశ్వసించుచున్నది. ఈ ప్రణాళికను విజయవంతముగ నిర్వహించుటకు కేంద్రమున, రాష్ట్రములలో కూడ, ఒకే పక్ష ప్రభుత్వముల ప్రాబల్యము, సుస్థిరత్వము, దాదాపు ప్రణాళికపట్ల తక్కిన అన్ని పక్షముల ఆమోదమును గూడ, విజయలబ్ధికే సూచకములుగ నున్నవి.

నందన సంవత్సర మాంధ్రరాష్ట్ర యవతరణకు నాందీప్రస్తావనమంతయు పరిపూర్ణముగ పూర్తి చేసికొనినది. ఆంధ్రరాష్ట్ర సాక్షాత్కరణభాగ్యము విజయ సంవత్సరమున కొనగూడక తప్పదు. ఆంధ్రప్రజకు "విజయ" సార్థకాభిధాన కాగలదు.

భాషా రాష్ట్రముగ ఆంధ్రరాష్ట్రమును ఆంధ్రులు కోరిరి. ఆ సిద్ధితో స్వకీయ వ్యవహారములందాంధ్రభాషకు ఇతోధికమైన ప్రాముఖ్యము లభించవలసియున్నది.

ఆంధ్రభాష యొకప్పుడు పరిపాలక భాషగా విరాజిల్లినది. పర ప్రభుత్వముల రాకతో, పరిపాలనకనువైన భాషాపదము లెన్నియో వ్యవహారమున అంతరించిపోయినవి. నేడు, మరల ఆ భాషకంతకు

పునరుజ్జీవము చేకూరవలసియున్నది. కేవలము పాత పదములనియే కాదు. ఆంగ్ల భాషాభావముల ప్రాతిపదికతో నెలకొల్పబడి, సాంఘిక, అంతర్భాగములుగ స్థిరత్వ మందుకొనిన అనేక నవీన విషయములకు, శాస్త్రములలో, వ్యాపారములలో, వ్యవహారములో, పరిపాలనలో, విద్యలలో, కళలలో, సర్వ సాంఘిక సాంస్కృతిక వ్యవస్థలలో దేశీయమైపోయిన అనేక విషయములకు, ఆంధ్రభాషలో ప్రాతిపదిక పదజాలము స్థిరముగా రూపందుకొనవలసి యున్నది. ఈ ప్రయత్నమున కృషి, ప్రభుత్వపరముగానూ, ప్రజాపరముగానూ కూడ జరుగవలసియున్నది. శాసన సభలు, విశ్వవిద్యాలయము, న్యాయస్థానములు మొదలగు అధికార సంస్థలు తెలుగున వ్యవహరింప బూనుకొనవలసియున్నది. ఈ వ్యవహారము సులభమగుటకు, పండితులు, శాస్త్రజ్ఞులు, సాహితీపరులు, సర్వులునూ సమిష్టిగా దీర్ఘకృషి చేయవలసిన అవసర మెంతేని యున్నది. ఈ సహకారము నంతను ప్రోత్సహించి రాబట్టగల బాధ్యత రాబోవు ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వముపై నున్నది.

నూతన సంవత్సరము సర్వవిధముల శుభదాయకము కాగలదనే ప్రతి సంవత్సరారంభమున యాసింతుము. నందన సంవత్సర మీ యాసల నడియాసలొనర్పక ప్రపంచమును శాంతముగ నడపుకురాగల్గినది. విజయసంవత్సర మితోధికముగ అభ్యుదయప్రదమై, శుభప్రదమగుగాత యని ఆశించుచున్నాము.

సర్వేజనా స్సుఖినో భవంతు.



# దీపమాలిక

★

శ్రీ పి. గణపతిశాస్త్రి

నిను దలపోయునంతనె కనీనికలం దరళాశ్రు వల్లన
ల్లన దిగజారి, కన్గొలుకులం బ్రవహించి మహేంద్ర చాప మో
హానతర వార్ష నీలఘనమై బరువైన యెడంద రమ్యన
ర్తన కవితావిచిత్ర జలధారల నుర్వుల బర్వు లెత్తెడిన్

అసిధారాధిషణుల్ మహాగహన వేదాంతాధ్వనీనుల్ క్షమా
హసిత ప్రస్ఫురితా! ఒకింత కనలే దమ్మా! భవన్మూర్తి! నే
నిసుకన్ మక్కువ నాటలాడు శిశు వెంతే దవ్వునం దల్లి నె
న్నొన లిట్టేగురుతించు లీల నిను గ న్గొంటిన్ నిమేషమ్మునన్!

నీ శివరూప దీపమవనిం బడ ద్రోసి యహం కృతి జ్వరా
వేశ వశీకృతుల్ హృదయ పీఠములం దిడు కొంద్రు దూరదూ
రాశల బెళ్కులీను వికృతాశయ మృణ్మయ మూర్తు; లైన గా
నీ, శిశుఖేలనమ్మని హసింతువు! నాజననీ! కృపాఖనీ!

చదువుల్ సంధ్య లొకింత లేక చెడి దుస్సాంగత్యముల్ సేసి నె
మ్మది గీలించిన యల్గులైన సుతులే మాతృప్రభూతాదరా
స్పదులై మించెదరందు రమ్మయి శతాంశమ్మైన నా తల్లి! నీ
హృదయమ్మింత కరంగు నన్నమతి గాంక్షింతున్ యథేచ్ఛాగతుల్

ఏచిర జన్మ పుణ్యఫల మిమ్మెయి నిమ్మ్నగ బండెనో గద
మ్మా! చరణాంకితమ్ము హృదయమ్మల రెన్ లసదిందు జాహ్నవీ
వీచికమై, తదీయసిత ఫేనసలీల విలోల కుందమా
లాచల డోలపై కలకలస్వన మందగళన్మరాళమై!

నీమణి పాదుకారుణ ఘృణి స్ఫురణ మ్మెద రత్నదీప శో
భామహనీయ భాగ్యమొదవం గరుణించినదంచు నాతలం
పే మరి తావకార్చన మహీ మసృణాగరు ధూపమాలగా,
మామక దేహ మాభరణ మంగళపీఠికగా నమర్చెదన్

నీతలపోతజీవతరణీగతికై పవమానపూర్ణ, మా
శాతరళమ్ము పైడి తెరచాపవలెన్ నిరతమ్ము దారితో
డై తనియింప, నిత్యభయదారవ సంకుల జీవితాబ్ధి వీ
చీతతులే తమంత దరి జేర్పగ నే బయనింతు హేలగన్!

---

# శకుంతల

★

వడ్లపట్ల దుర్గాప్రసాదరాయకవి *

అల్ల వినువీథిఁ గొంత దవ్వరిగి యంత
ముందరకుఁ బోవ నవ్వరి బోడి యడుగు
లాడక వెనుకకుఁ దిరిగిచూడఁ జిఱుత
చుట్టి మూగి పుల్గులు పొదచూప వెఱచి.

"అమ్మక చెల్ల యేనుగను - లార గనుంగొనుచుండ నివ్విహం
గమ్ములు చుట్టునుం గవిసి - గాసి యొనర్చెడి మత్సుతాకలా
పమ్మ" నటంచు నాశిశువు - పాలికిఁ జెచ్చెరఁ బాఱివచ్చి ఖే
దమ్మున నవ్విహంగము క - దంబకమున్ వెస బాఱదోలుచున్.

గ్రక్కున నక్కుమారితఁ గరద్వితయంబున నెత్తి ప్రేమతో
నక్కునఁ జేర్చి దాని రుచిరాంగము నాపద మస్తకంబునున్
జక్కఁగఁ దేఱిచూచి మునిశక్తిమెయిం బొలివోవ కున్కికిన్
మిక్కిలి సంతసించి యనిమేష మధువ్రతవేణి యిట్లనున్.

"పక్షివరేణ్యములారా
యక్షీణ కృపాకటాక్షమలరఁగ నిట మీ
పక్షంబుల మఱువుననిడి
రక్షించుడి నాయపత్య రత్నము నెమ్మిన్.

అళులార యీకూన యాకొని యేడ్చుచో మధువులానగనిచ్చి మనుపఁగదరె
తరులార యీపాప దగ గూరివగచిన ఫలరసంబుల డప్పి వాపఁగదరె
పొదలార యీకందు ప్రొద్దువేడిమి సోకి కందకుండఁ జివుళ్లఁ గప్పఁగదరె
శిలలార యీపట్టి చలికి వానకు డయ్యకుండ మీమఱుఁగున నునుపఁగదరె

మెకములార యీచిఱుతను మ్రింగకుండ
జాలిఁ గనికరించి తొలగి చనఁగఁగదరె"
యనుచుఁ గన్నమోహమున నయ్యడవినున్న
భూతకోటుల కెల్లను మ్రొక్కికొనుచు.

---

*ఈ మహాకవి 1857 లో జన్మించి 1905 వరకు జీవించెను. జన్మస్థలము, అంబరుపేట. ఆర్వేల నియోగులు. శ్రీవత్స గోత్రులు. కాశీపరిషద్, వైయాకరణ పండితులై శిష్య బృందములను వెలయించుకొన్న లక్ష్మీపతి 'శాస్త్రి' గారీయన తండ్రి. వృత్తిరీత్యా బళ్లారి, కృష్ణా మండలములలో మేజస్ట్రేటు ఆఫీసు ఉద్యోగములలో ఈకవి జీవితము గడిచినది. ఈయన "నిర్వచన భారతాభ్యుదయ"మను, దాదాపు 2000 పద్యములు గల ప్రబంధమును రచించిరి. అది ఈనాటికీ అముద్రితముగానే వారి కుమారులయింట మిగిలిపోయినది. ఆ గ్రంథమునుండి, "శకుంతల"యను శీర్షికతో పై పద్యములను వారి వంశీకుల యనుమతితో నిట ప్రచురించుచున్నాము.—సం.

ఆకలిగూరి యత్తఱి ప్రియాత్మజ యేడ్వఁగ స్తన్యమిచ్చి యా
సైకత మేదినీస్థలిని చల్లని యాకులనీడ గల్గుపెన్
ప్రాకుల గ్రేవ నాచిఱుతఁ గ్రమ్మఱఁ జేరిచి కొంత సేపటన్
వ్యాకుల మందుచున్ నిలిచి యశ్రులు గన్నులఁ గ్రమ్మ దేరఁగన్.

"అమ్మా ముద్దులపట్టి నిన్నిటఁ బృథివ్యాపోగ్ని వాతాంతరి
క్షమ్ముల్ దిక్కులు దిక్పతుల్ రవియునున్ జంద్రుండుఁ దారావితా
నమ్ముల్ బ్రహ్మయు విష్ణువీశ్వరుఁడు నానాసంయమి శ్రేష్ఠు లే
వమ్ముల్ వాటిలకుండ నెప్పుడనుకంపాస్ఫూర్తి రక్షించెడిన్."

అని దీవించుచు నన్నిలింప తను మధ్యాతల్లి జంబాత్మజన్
వనమధ్యంబున నొంటిమై నునిచిపోవంగాఁ శకుంతంబులున్
జని తాపత్యనితాంతమోహభరితస్వాంతంబులై యాత్మప
క్షనికాయంబులఁ గప్పిదాని నచటన్ గాపాడఁగాఁ జొచ్చినన్.

సమిధల్ పువ్వులు సంగ్రహింపఁదగ శిష్యశ్రేణితో గణ్వ సం
యమిచంద్రుం డరుదెంచి కాంచె ఖగవర్యానీకముల్ గొల్వఁగా
రమణీయంబగు మాలినీతటమునన్ రాకేందుబింబాకృతిన్
సముదీర్ణద్యుతిఁ గ్రాలు నాశిశువు నాశ్చర్యంబు సంధిల్లఁగన్.

ఆలోకించి నిజాశ్రమంబునకు గన్యారత్నమున్ మౌని శా
ర్దూలుం డల్లనఁ దోడితెచ్చి లతికాందోళీస్థలిన్ బ్రోల్లస
న్నాళీకచ్ఛదపుంజ కల్పితకనత్తల్పంబునన్ నిల్పన
బ్బాలారత్నము జూడవచ్చి రెలమిన్ వాచంయమాబ్జేక్షణల్.

చనుదెంచి మునిపురంధ్రీ
జన మబ్బాలిక యపూర్వ సౌందర్యంబున్
గని సంభ్రమమారఁగదీ
వన లోనఁగుచు వెన మహోత్సవము గావింపన్.

ఆ ముద్దులబిడ్డను గా
రామార శకుంతవితతి రక్షించుటచే
నాముని ముఖ్యుడు దానికి
ప్రేమ శకుంతల యనంగఁ బేరొనరించెన్.

ఇట్లు పుత్రికి గణ్వమునీంద్రు డాఖ్య
నలిపి సమధికాపత్య వాత్సల్యమునను
దివ్య మకరంద నిజహోమధేనుదుగ్ధ
మధుర ఫలరసాధికముల మనుచుచుండు.

# శకుంతల

అకళంక చంద్రరేఖాకృతి నిరతర ప్రవర్ధమానమ్మగుచు వపువు సాగడ
గురుతర కనకాబ్జ కుట్మలంబుల మాడ్కి నురమున వక్షోజయుగళ మమర
దివ్యకందర్పాస్త్రదీధితుల్ పురణించు రుచిర దృఙ్మాలికా రుచులు దనర
తరగలపై నల్లత్రాచు కైవడి వళీయుతరోమరాజి చెన్నొంది మెరయ

భ్రమర పరివేష్టితోత్ఫుల్ల కమలలీల
చికుర విభ్రాజితాస్యంబు చెలువుమీఱ
పులినతలలీలఁ గటియు విపులత జెంద
శిశువు నవయౌవనోదయ శ్రీవహించె.

ఇటుల వయోవిభూతి వహియించి తపోధను నాశ్రమంబునన్
విటపిలతా నికుంజములవీథుల నిచ్చల మేయవచ్చు బల్
చిటిపొటి కూనలన్ గలుగు జింకలతోడ వినోదలీల న
క్కుటిల వినీలకుంతల శకుంతల శైశవకేళిఁ దేలుచున్.

పూదీవ బాదలకుఁ బాదులు కావించి పొలుపారఁ బన్నీట బ్రోదిసేయు
మిసిమిగ్రొం బసిరిక మెసవగా మరుపుచు హోమధేనువు క్రేపుప్రేమ మనుచు
పిననాడు పెనిచిన పేర్మిఁ జూడఁగ వచ్చు పులుగుపిండులతోడఁ బ్రొద్దుపుచ్చు
చిన్నారి జడదారి చిన్నెలాడులఁ గూడి క్రొత్తావి పూదోటఁ గోష్టి సలుపు

నోము సల్పెదనని మునిగీము నెల్ల
వేడ్కఁ గైసేయు నెత్తావి విరులసరుల
ననుదినంబును మునిపల్లె కరుగుదేరు
నతిథి నభ్యాగతులనరసి యాదరించు.

"జననీ స్తన్యము లాన నోమక యజస్రంబున్ భవద్దుగ్ధ పా
ద నిరూఢిం బ్రతుకంగ దోపుకతనన్ నైజంబుగా నీవయిన్
జననీ భావ మెలర్చు నాకు" ననుచుం జంద్రాస్యప్రస్ఫీతమా
ననురాగంబున హోమధేనువునుఁ గంఠాశ్లేషమున్ జేయుచున్.

అంతే వాసులకున్ ముని
చింతారత్నంబు దెలియఁ జెప్పెడినెడ వి
స్నంత సకల ధర్మములు శ
కుంతలయుఁ గ్రహించు బుద్ధికుశలత పేర్మిన్.

---

# పద్యరచన - శిష్ట వ్యావహారికభాష

★

శ్రీ కోట సుందరరామశర్మ

పదిహేనేండ్ల క్రితం ఒకమాటు ఒకమాట అన్నారు గురువులు శ్రీ గిడుగువారు. ఒకనాటి సందెచీకటి వేళ (లో వెలుగున్న వారికి వెలి వెలుగేలా?) "గద్యరచనకు శిష్టవ్యావహారిక భాష వాడండి, పద్యరచనకు ఏభాష వాడాలి అనే ప్రశ్న జోలికి మనం పోవద్దు" అని. అప్పటినుంచీ నా మనస్సులో ఒక సమస్య ఏర్పడింది. అస్మత్తుల్యులు ఇంకా ఎందరో ఉంటారనే భావిస్తాను ఈ సమస్య విషయంలో.

పైన ఉటంకించిన గిడుగువారి మాటల్లోనే ధ్వనితమవుతుంది సమస్య ఏమిటో. పద్యాల్లో ఏదో గ్రాంథికమనే భాషనే వాడనివ్వండి, శిష్టవ్యావహారిక భాషను అందులోనూ వాడాలని తంటాలుపడి మనం ఇంకా పేచీపడవద్దు అని వారి అభిప్రాయం. "పద్యరచనలలో ఉన్నది నూటికి నూరుపాళ్ళ గ్రాంథికము కాదు" అని వారికి తెలియకకాదు వారా ముక్క అన్నది. శిష్టులు గద్యంలో వ్యవహరిస్తారు; కాబట్టి శిష్టవ్యావహారికం గద్యానికి అన్వయిద్దాం అనివారి ఆంతర్యం అయినట్లు నేనూహించాను. ఆ విధంగా ప్రస్తుతం తెలుగు రచనలనుచూస్తే గద్యం శిష్ట వ్యావహారిక భాషలోనూ, పద్యం గ్రాంథిక మనే భాషలోనూ ప్రచురంగా నడుస్తూ ఉండడం మనకు గోచరిస్తోంది. ఇట్టి విచిత్రపద్ధతి ప్రపంచంలో మరే భాషలో నయినా ఉందా అని విచారిస్తే లేనట్లు చెప్తున్నారు పెద్దలు. మనం బాగా ఎరుగున్న ఇంగ్లీషు భాషలోని గద్యపద్యముల భాష ఒక్కటే. ఛందస్సు కోసరమని అన్వయ క్రమం (*Prose order*) లో మార్పు లుండవచ్చు; అక్కడక్కడ పాతమాటలు పడవచ్చు. *Said* (చెప్పెను) అనే మాట బదులు *Quoth* అనేది, ఇట్టివే మరికొన్ని చిన్నప్పుడు మనలో కొంతమంది చదువుకొన్నాము. "వెండియు" పదాన్ని "మఱియు" అనే అర్థంలో అవసరం పడితే పద్యాల్లో అంతా వాడుతున్నాం. అంతే కాని గద్యభాషకూ పద్యభాషకూ ఇంత తేడా ఇంకెక్కడా కనపడదు.

ఈ సందర్భంలో కొంచెం వెనక్కి వెళ్ళిచూద్దాం. "ప్రాచీన కాలంనుంచీ గ్రాంథికతా ముద్ర పడడానికి వీలుకాని పదాలూ, పద సముదాయాలూ ఎన్నెన్నో పద్యకావ్యాల్లో అగుపించడం లేదా?" అనే ఊహ కలుగకపోదు ఎవ్వరికైనా? కవిబ్రహ్మ తిక్కనే "చాపము నా కందిమ్ము" అన్నాడు. శబ్దపల్లవమని దీన్ని వైయాకరణులు సమర్థింతురు గాక. "అనవల సంటి" నన్నాడు మధ్య కాలానికి చెందిన చేమకూర వెంకటకవి. ఆధునిక కవులలో లబ్ధప్రతిష్ఠులు కీ॥ శే॥ కొడాలివారి "హంపీ క్షేత్రం" లో "కంటి సిరిగిరి పోయిం దంతరాగ్నిచ్ఛటక్" ఇది మచ్చుకు ప్రబంధపద్ధతిని నడిచిన పద్యకావ్యాలలోని ఉదాహరణలు. ఇక ప్రాచీన కాలంనుంచీ చాటువులలో శిష్టవ్యావహారిక ప్రయోగాలు లెక్కలేనన్ని. శ్రీనాథు డంతటివాడే "చిల్లరదేవుళ్ళు" అన్నాడు. "చల్లాయంబలి" ద్రావినాడు. ధూర్జటి శతకంలో భవలతల్ "కోసీకోయ" ని మనః ప్రవృత్తికి పశ్చాత్తపించినాడు. ఇటీవలి కాలంలో హాస్యానికి వ్రాసిన చాటువులలో "విస్సాయి వస్సాడషే" అనే ఛాందసుల పలుకుబడికి ఉదాహరణమున్నూ, గార్డు "బిగు లూదుతాడు," రైలు "లగెత్తుతాది" "దాని తోకలో మణుసులు కూకుటారు" (పూర్తిపద్యం జ్ఞాపకం లేదు — అనే అశిష్ట జనోక్తి మొదలయినవాటికి ఉదాహరణలు లభిస్తాయి. అయితే ఇది శిష్టవ్యావహారిక మనిపించుకోదు. సభాముఖాన ఇట్టివి ఛాందస ప్రయోగములనీ, గ్రామ్య ప్రయోగములనీ అనిపించుకొంటాయి గదా! "ఆభీరాది గిరః గ్రామ్యం" అనే దండ్యాచార్యుని పాదమునే చదువుతూ ఉండేవారు గిడుగువారు. ఇట్టి చాటుపద్య ప్రయోగములమాట అటుంచి ప్రాచీన కావ్యప్రయోగాలకు సయితం "బాల కవిశరణ్యం" నిజంగా బాల కవిశరణ్యం. గురుబ్రహ్మలు చెళ్ళపిళ్ళవారు ఎన్నో ప్రయోగాలు వ్యాకరణసిద్ధాలు (ఏ వ్యాకరణమనీ, వ్యాకరణమంటే ఏమిటే అని ప్రశ్నలు పుట్టడం ఎప్పటి కప్పుడు సహజమే) కాని వాటిని గుప్పేస్తూ ఉండేవారు, సంభాషణలో నేమి, ఉపన్యాస వేదికలమీదనేమి, ప్రథమాచార్యులకు కాని ప్రయోగాలకు ద్వితీయాచార్యులు గతి కల్పించారు. ప్రథముడు సూరి కుదర్చనివానికి ద్వితీయుడు 'ఆచార్యులు' సూత్రాలు చేశారు. ఇంకా కుదరని 'కొబ్బరాకు' లకు, 'మామిడాకు' లకు తర్వాతి వారు సూత్రాలు వ్రాశారు. ఇంతకూ చెప్పవచ్చే దేమిటంటే వ్యాకరణం అనుశాసన మనే సంగతి మరువరాదనీ, "లోకం పృచ్ఛ" అను భాష్యోక్తిని సర్వదాస్మరించవలెననీ; ఇటు వంటప్పుడు "వింటే" "కంటే" తప్పులేనిది "చేస్తే" తప్పని చెప్పవలసిన విచిత్రత ఏర్పడ్డది తెలుగుభాషలో.

తదుపరి గేయ కవిత్వంవంక చూద్దాం. కీర్తనలు, పదాలు, పాటలు ఎన్నో లక్షలు. "ఉండేదే రాముడొకడు" త్యాగయ్యకు. "పరికిణీ తొక్కాడు పదియేండ్ల కన్నెలా" కిన్నెరసాని "కదలింది" "కాల్వలై పారింది" ఇవి అశిష్టములా? ఇందు కవిత్వము లేదా? కీ॥ శే॥ చిలుకూరి వారి మాటగా చెప్పవలసివస్తే ఇవి ఛందోబద్ధములైన పద్యపంక్తులు కావా?

పైన చెప్పిన ఆయా ఉదాహరణలు వ్యావహారిక భాష కావ్య పద్యములలో కూడా చొచ్చుకొని పోవడానికి ప్రయత్నించిందనీ కాని ఏదో ఒక పంథాను నడవాలనే ప్రవృత్తి ఏర్పడి

లోపంవల్ల కవులు శిష్టవ్యావహారిక భాషను పద్యరచనలోనికి విరివిరిగా చొప్పించలేదనీ తోస్తోంది. శిష్టవ్యావహారిక భాషలో ఉండే స్వాభావికతను గుర్తించి కొందరు 'ముందడుగు' కవులు దానికి ఎంత దగ్గరగా వచ్చేభాష వ్రాశారో చూడండి — ఉదాహరణానికి.—

> "అతని కేమివచ్చినది అంతయు తీరినవెన్క రాజ్యమున్
> చేతునటన్న ఆస; మతి చెడ్డదిపో, యువరాజు చావగా
> నే తన కబ్బునా పదవి? నేటికి పాపము పండిపోయెన
> య్యా తనవంటివాని కిదియా తగుబుద్ధి వినాశకాలమే॥

దాపురమయ్యె............" (కొడాలివారి హంపీక్షేత్రం.) ఇట్టివి ఎన్నో ఉదహరించవచ్చు.

ఈమధ్య నావద్దకు ఒక చిన్న తర్జుమాపని వచ్చింది. హిందీలో సూరదాసు అనే ఒక భక్తకవి భాగవతం అంతా పదాల్లో వ్రాశాడు. దశమస్కంధానికే ఎక్కువ ప్రాధాన్యం. ముఖ్యంగా శ్రీ కృష్ణుని బాలక్రీడలూ, గోపికల విప్రలంభ శృంగారమూ ఇతడు అధికంగా వర్ణించాడు. అందులోని ఒక పదం, ఇందులోంచి ఒక పదం తర్జుమా చేయవలసిందని ఒక సంస్థవారు నన్ను కోరారు. బాలక్రీడలకు సంబంధించిన పదమిది.

**మూలం :—**

మైయా, మోహి దాఊ బహుత్ ఖిఝాయో। మోసోఁ కహత మోల్ కో లీనో తహి జసుమతి కబ్ జాయో। కహా కహాఁ, ఏహి రిస కే మారే ఖేలన హీ నహిఁ జాతు। పుని పుని కహత కౌన్ హై మాతా కో హై తుమరో తాతు। గోరే నంద జసోదా గోరే తుమ కత స్యామ సరీర్। చుటకీ దే దై హఁసత గ్వాల సబ్ సిఖై దేత బలవీర్। తూ మోహీ కో మారన సీఖీ దాఊహిఁ కబహుఁ న ఖీఝైఁ మోహన్ కో ముఖ రిస సమేత లఖి జసుమతి సుని సుని రీఝై। 'సూర' స్యామ మోహి గోధన కీ సౌఁ, హౌఁ మాతా, తూ పూత్॥

ఇందులోని భాష గ్రాంథిక మవునా కాదా అని ఒక సందేహము చదువరులకు కలుగవచ్చు. మామూలుగా నేడు పత్రికల్లో కనబడే, రేడియో మున్నగు వాటిద్వారా వినబడే హిందీ కాదిది అనే సంగతి స్పష్టమే. ఆ కాలంలో చాలమంది కవులు ముఖ్యంగా సంగీతానికి అనుకూలంగా పదాలు రచించినప్పుడు "వ్రజభాష"ను ఉపయోగించేవారు. వ్రజభాష అంటే శ్రీకృష్ణుడు సంచరించిన వ్రేపల్లెగల మండలములోని హిందీయొక్క ఒక మాండలిక భాష. ఏ భాషలో నయినా పదసాహిత్యమునకూ గేయకవిత్వానికీ శిష్టవ్యావహారిక భాషనే వాడుతారు కవులూ, పదకర్తలూ సంగీతం అట్టిభాషనే కోరుతుంది గనుక. అందుకనే త్యాగరాజాది గాయకులూ పాటలువ్రాసిన అడివి, నండూరి, విశ్వనాథ కవికొండలాదులూ శిష్టుల వాడుకభాషనే వాడారు.

ఇందుచేత తర్జుమా పని మొదలుపెట్టేముందు నాకు ఒక ప్రశ్న పుట్టింది. తర్జుమా పద్యాల్లోకే చెయ్యాండి వీలుంటే అన్నారు వాళ్ళు. సూరదాసు ప్రతిపిల్లవాడికీ అర్థమయ్యేటట్లు, పిల్లలు సహజధోరణిలో అన్నట్లు తన రచన చేశాడు. దాని తర్జుమా పదాలుగాగాని, పద్యాల్లోకిగాని చెయ్యవచ్చుననిపించింది. పద్యాలుగా మారుద్దామనుకొన్న నాకు శిష్టవ్యావహారికభాషను వాడితే బాగుంటుందనిపించింది. భాషాసహజత్వం మూలగతమైన సహజత్వానికి అనుగుణంగా ఉంచ వీలవుతుందని. శిష్టవ్యావహారిక భాషలోనే పద్యాలు అనుకొంటూ వ్రాసుకు వెళ్ళాను — ఏమీ కష్టం కనపడలేదు. క్రొత్తమార్గంకనుక వింతవింతగా కనుపించింది. పై పదానికి నేను వ్రాసిన కందాలు.

1. "అమ్మా ఏడ్పించాడే
   ఇమ్మాటలు పలికి అన్న 'ఎప్పుడురాని
   న్నమ్మ యశోద కనిందట
   అమ్మేరస లెవరో నిన్ను' అని అంటాడే.
2. ఇందుకు కోపం రాదా ?
   అందరితో కలిసి ఇంక ఆటకపోనే
   'నందయ్య తెలుపు, అమ్మయు;
   ఎందుకురా నీవు నల్ల'నిట్లంటూంటే.
3. పకపక నవ్వేరమ్మా
   ఒకరొకరే చిటికవేసి ఊరక గొల్లల్
   'పికిరీలు' చేయుడంటూ
   ఇక అన్నే వాళ్ళనెల్ల ఎగదోశాడే.
4. నన్నే ఎప్పుడు కొడతా
   వన్నంటే నీకు ఇష్టమాకాలే' యను నా
   వెన్నుని కోపపుఁ బలుకులు
   విన్నదియై నవ్వుకొనుచు వ్రేతయిటులనున్.
5. "కన్నా, వినరా, బలరా
   మన్న మొదటినుంచి పట్టి అల్లరివాడే
   నాన్నా, ఈ ఆవులతో
   డన్నా, నేనమ్మ నువ్వె అసలుకొడుకువూ"

ఇది ఈవిధంగా వచ్చింది. నాల్గవ కందం ఉత్తరార్థం గ్రాంథికభాషలో వ్రాశాను. అక్కడ ధ్వనికారాదులు చెప్పిన "కవ్యుక్తి" "కవికల్పితపాత్రోక్తి" అనేమాటలు అన్వయిస్తే ఎలా ఉంటుందో అనిపించింది. వచనంలో ఇట్టిపద్ధతి ఆధునికకాలంలో క్వాచిత్కంగా గోచరిస్తూనే ఉంది. ఉదాహరణకు శ్రీ కొటూరి వేంకటేశ్వరరావుగారి "ముగ్గురు మూర్తులు" అనే ఆంధ్రీకృత నవలలో సంభాషణలు శిష్టవ్యావహారికంలోనూ, కథాకథనమూ, వర్ణనలూ 'గ్రాంథికతా' ముద్ర గల భాషలోనూ ఉన్నాయి. ఇదొక క్రొత్త కలగలుపు. విశ్వవిద్యాలయము లీ గ్రంథమును పాఠ్యగ్రంథంగాకూడ నిర్ణయించినాయి. కాబట్టి పద్యాల్లోకూడా సంభాషణాదులు అంటే కవికల్పితపాత్రోక్తులు శిష్టవ్యావహారికంలో ఎందుకు పెట్టకూడదు అన్న నా ఆలోచనాపూర్వక ప్రయత్నాన్ని లోకానికి చెపుదామనిపించింది. అదే ఈ వ్రాత. యతిప్రాసలు తెలుగు కవిత్వానికి సహజాలంకారాలూ, శబ్దసాధుత్వసాధుత్వ విషయనిర్ణయోపకారములూను. శిష్టవ్యావహారిక భాష వీనికిగాని, ఇవి ఆభాషకుగాని భంగకరములు కానక్కఅలేదు — అలవాటులేదు కాబట్టి వింతగా కనపడవచ్చు—

ఆపైన మరొక్క విషయం చూడ బుద్ధి వేసింది. పై చెప్పిన పద్యాల్ని 'గ్రాంథికం' లోకి మార్చగలమా అనిపించింది. వచన విషయంలో వలెనే పద్యములలో కూడా ఈ పని కష్టంగా కనపడ లేదు. ఎట్లంటే:—

1. "అమ్మా ఏడ్పించెను న
   న్నిమ్మాటలు పలికి అన్న" ఎప్పుడురాని
   న్నమ్మ యశోద కనినదట?
   అమ్మరి యసలెవరో నిన్నువని యనుచుండున్.

2. ఇందుకు కోపమురాదా
   అందరితో కలిసి యింక ఆటకెపోవన్
   నందయ్య తెలుపు, అమ్మయు;
   ఎందుకురా నీవు నల్ల నిట్లనుచుండన్.

3. పకపక నవ్విరె అమ్మా
   ఒకరొక రేచిటిక వేసి ఊరక గొల్లల్
   'పికిరీలు' చేయు డనుచున్
   ఇక అన్నయె వారినెల్ల నెనద్రోచెనమా.

4. నన్నే ఎప్పుడు కొట్టుదు
   వన్న యనిన నీకు నిష్టమాలే" యను నా
   వెన్నుని కోపపు బలుకులు
   విన్నదియై నవ్వుకొనుచు వ్రేతయిటులనున్.

5. "కన్నా, వినరా, బలరా
   మన్న మొదటినుండి వట్టి అల్లరివాడే
   నాన్నా, ఈ అవులతో
   డన్నా! నేనమ్మ నీవె అసలు కొడుకవున్.

ఇక ఈ గ్రాంథికీకరణంద్వారా పద్యాల్లో శిష్టవ్యావహారిక భాషాప్రయోగంలో ఒక్క రహస్యము గోచరమయింది. కంద పద్యములో మాత్రలు ప్రధానము. 4 మాత్రలు గల భ, జ, స, నల, గగ అనే గణములుమాత్రమే వాడాలి. అందుచే పై గ్రాంథికీకరణము సులభమయింది. ఇట్టిమార్పు చేయవలసిన అవసరం మాట అటుంచి, అట్టిమార్పులుచేసే స్వాతంత్ర్యం సామాన్యంగా ఉపయోగించే చంపకమాల, ఉత్పలమాల, శార్దూల మత్తేభ విక్రీడిత ములవిషయంలో అంత సులభం కాకపోవచ్చు. కనుక పద్య కావ్యాల్లో ఈ క్రిందిపద్ధతులను పాటించి, శిష్టవ్యావహారిక భాషను ప్రవేశపెట్టవచ్చునని తోస్తోంది!—

(1) కవికల్పితపాత్రోక్తులకు శిష్టవ్యావహారికభాష నుపయోగించడము.

(2) మాత్రాప్రాధాన్యము గల అంటే గణనియమము సడలింపు వీలిచ్చే (అంటే ఈగణమే ఉండాలనే నియమములేని) తేటగీతి, ఆటవెలది, సీస కందములు మొదలయినవానినే సంభాషణపట్ల ఉపయోగించడము—

"పురాణ మిత్యేవ న సాధు సర్వం
న చాపి కావ్యం నవ మిత్యవద్యం"

అనే కవ్యుక్తిని స్మరిస్తూ, ఈ నాలుగు ముక్కలూ మనవి చేశాను—గద్యభాషకూ పద్యభాషకూ ఇతరత్ర ఎక్కడాలేని ఇంత అంతరం తెలుగుభాషలో తొలగించలేకపోయినా తగ్గించలేమా? ప్రాచీన కావ్యాల్లో క్వాచిత్కంగానూ, చాటువులలో ప్రచురంగానూ దొరలిన శిష్టవ్యావహారికభాషా ప్రయోగాలు పద్యరచన కేల ఉపయోగపడరాదు? ఈ విషయమై పెద్దలు ఆలోచించవలెనని ప్రార్థన. ఇది సాహిత్యరంగంలో సంచలనం కలిగించుగాక. సంచలనం కలిగిస్తేనే ఈ నావ్యాసపు టుద్దేశం ఫలవంతమని భావిస్తాను.





న చి కే తు - య ము డు.

చిత్రకారుడు : శ్రీ యస్. రాజం.

# వైతరణి

★

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

నాచికేతుడు : అమ్మా ! యమధర్మరాజుగా రింటిలో నున్నారా?

యమి : అయ్యా, ఎవరు మీరు?

నాచి : ఔద్దాలికియు, అరుణియు నగు వాజశ్రవసుని కుమారుడను.

యమి : అయ్యో బాబూ. ఇంత చిన్నపిల్లాడ వీ లోకమున కేల వచ్చితివి?

నాచి : మృత్యువునకు చిన్న పెద్ద లున్నట్లు!

యమి : అది యేమయ్యా! అరుణి. నీ వగ్నిహోత్రమువలె వెలిగిపోవుచున్నావు. నీకు మృత్యు వెక్కడిది? నీ పేరేమి?

నాచి : నాచికేతుడు.

యమి : నాచికేతుడా? చిత్రగుప్తా, ఈయన యెవరో తెలిసినదా?

(నాచికేతుడా నాచికేతుడా? యని పది కంఠములు వినిపించును)

నాచి : అమ్మా, చెప్పలేదు. యమధర్మరాజుగా రింటిలో నున్నారా?

యమి : అయ్యా, తమరీ లోకమున కెందుకు వచ్చితిరి?

నాచి : నా తండ్రికి నామీద కోపము వచ్చి నన్ను మృత్యువునకు దానము చేసెను.

యమి : ఇది చిత్రముగా నున్నది. నీ తండ్రికి నీమీద కోప మెందుకు వచ్చెను.

నాచి : పీతోదకలు, జగ్ధతృణలు, దుగ్ధదోహాలు, నిరింద్రియలైన గోవులను దానము చేసినవారు, అనందములను లోకములకు పోవుదురు. అట్టి లోకములనుండి నా తండ్రిని రక్షించుటకు నే నిచ్చటికి వచ్చితిని.

యమి : ఆహా. అట్టి గోవులను దానము చేయుట కొడుకును చంపుట వంటిది. ఏమి పుత్ర హత్య ?

నాచి : కాదమ్మా, నేనే యడిగితిని. నాయనగారూ! నన్నెవ్వరికి దానము చేయుదురని? మూడుమారు లడిగితిని. ఆయన నన్ను మృత్యువున కిచ్చెను.

(మృత్యువున కిచ్చెనా? మృత్యువున కిచ్చెనా? యని పది కంఠములు)

నాచి: అమ్మా, నాకు చెప్పలేదు, యమధర్మరాజుగా రింటిలో నున్నారా?

యమి : నీవు నాచికేతుడవు, అగ్నిమూర్తివి; నిన్ను మీ తండ్రి మృత్యువునకు దానము చేసినాడు. నీవు మృత్యువశంగతుడ వయితివి. యముడు నీ కెట్లు కన్పించును? యముని ధర్మరహస్యమంతయును నీవే. యముని తేజస్సంతయు, మహిమ యంతయు, మృత్యువశంగతమయినది. ఆయన నిస్తేజు డయినాడు.

నాచి : నేనొక ఋషిబాలకుడను, నేను మృత్యువునకు దత్తుడనగుటచేత యమునకు తేజోహాని యెట్లు జరుగును ? ఆయన యింటిలో లేడు కాబోలు నన్ను మీ రెలయించుచున్నారు.

యమి : ఋషి బాలకా ! నీవిచటికి వచ్చి మూన్నాళ్ళయినది. ఆతిథ్యము స్వీకరించవు. యముడు వచ్చి నన్నేమనునో ? మూన్నాళ్ళు ఎవనియింట నతిథి నిరాహారిగా నుండునో వానిస్థితి యేమి చెప్పవలయును ? మొదటిదినమున గృహస్థుయొక్క సంతానము నశించిపోవును. రెండవదినమున నతని పశుసంపద నశించిపోవును. మూడవదినమున నతని పుణ్యమంతయు నశించిపోవును.

నాచి : దానిపేరే మృత్యువు. సంతానము, సంపద, పుణ్యము ఈ మూటియొక్క కూడికయే భూలోకము యొక్కయు, స్వర్గలోకము యొక్కయు జీవియొక్కయు సంబంధము. ఇవి మూడు నశించి పోవుటయే మృత్యువు.

య : ఓయి నాచికేతా, నీవు మహాగ్నిమూర్తివి. నీకు గూడ మృత్యువున్నదా ?

నా : నాకు మృత్యువెట్లున్నది ? మృత్యువు నందినవాడు యువి రాడును. వానికి మృత్యువు, తద్భావమునకు మృత్యువు. తద్భావము లాశ్రయించి యున్న జీవభావముతో గూడియున్న శరీరమునకు మృత్యువు.

యమి : మృత్యువనినచో భయమగుచున్నది.

నా : భయమే మృత్యువు, మృత్యువే భయము.

య : అట్లనా ? మృత్యువనగా భయమా ?

(మృత్యువనగా భయమా ? యని పదిగొంతులు వినిపించును)

ఒకగొంతు :

ఉదయపర్వతముపై మూడుసార్లుగా నుదయించె నినుడు
కదలియస్తగిరీంద్ర గహ్వరమ్మునఁ గడుంగ్రాలెనినుడు
మెదలిన సూర్యతేజమ్ములోపల మిణుగురు ల్లేవు
కదిసి దక్షిణదిశా మహిమ కడమ దిక్కులయందు చేరె.

మరియొకగొంతు :

రవితనూజుడు ధర్మరాజు రాజీవ నేత్రమ్ములందు
కవురు గప్పినయట్లు తేజమంతయు కాలాగ్ని క్రమ్మ
యవసథమ్మున వచ్చి యతిథి మూన్నాళ్లన్నమ్ము లేక
వనసిపోవుట చేత పున్నెమంతయు నాశమైపోవ.

ఇంకొక గొంతు:

ఇది మహాప్రళయమ్మో యేమొ? యెల్లసంతతియు
కదుపులో నావుల గుంపు బ్రతుకులకాచు పున్నెమ్ము
నదవదలైపోయె సృష్టిలేదాయె నద్దానిమూల
పదవియే భంగమ్ము పడసె జీవునిబాట మూసికొనె.

యముడు: ఆ బ్రాహ్మణబాలకు డెక్కడ? యెక్కడ?

యమి: మహారాజా, ఇక్కడిక్కడ.

యము: అయ్యా, నా యింట మూన్నాళ్లు నీవు నిరాహారుడవైయున్నావు. అన్నము తినకుండ. నమస్కారార్హుడవయిన బ్రాహ్మణుడవు. మూడురాత్రులు నాయింట నున్నట్టి నీకు నమస్కారము. నాకు శుభమగుగాక. నా శుభమును గోరి నీవు మూడు వరములను కోరుము.

నాచి: యమధర్మరాజా, నా తండ్రియయిన గౌతముడు కోపము మారి సుమనస్కుడై శాంతసంకల్పుడై నాతో మాటాడు గాక.

యము: ఓ యయ్యా, నీ తండ్రి యౌద్దాలకిమృత్యు ముఖము నుండి వెలికి వచ్చిన నిన్ను నా యాజ్ఞచేత స్వీకరించుగాక. మరి రెండవ వరము కోరుము.

నాచి: ఓయి మృత్యువా, ఇచ్చట భయములేదు. ముసలితనము లేదు. ఆకలిదప్పులు లేవు. దుఃఖములేదు. ఇట్టిలోకమునకు చేరు మంత్రము నా కుపదేశింపుము. ఏ యజ్ఞముచేత మృత్యువును గెలువవచ్చునో యా యజ్ఞమును, నా యగ్నిహోత్రమును నా కుపదేశింపుము.

యము: ఓయీ, నీ పేరేమి?

నాచి: నన్ను నాచికేతు డందురు.

యము: ఏమీ, యేమీ?

[నేపథ్యమున గీతము వినిపించును.]

ఎవడు పుష్పము నెరుగునో
పుష్పవంతుడు ప్రజావంతుడు తాను పశుమంతు
డును నగునో

చంద్రముడు జలమునకు పుష్పము
అని యెరింగినవాడు నిజముగ
పుష్పవంతుడు ప్రజావంతుడు తాను పశుమంతుడును
నగునో.

నీటి యాయతనమ్మెరింగిన
వాడు తా గృహమేధి యగును
నీటి యాయతనమ్ము నిష్కళుం.

ఎరిగి తానాయతనియే యగును
అగ్ని యాయతన మ్మెఱింగిన నాయతని యగును
అగ్ని యాయతనమ్ము నీళులు ఆయతని యెరుగు
నీటియాయతనమ్ము వాయువు
వాయునాయతనమ్మెరింగిన యాయతనవంతుడగూ
వాయు నాయతనమ్ము నీళులు తెలిసినవాడు గృహమేధి
ఎవడు తపసును చేసి యాయతనమ్మెఱుంగునో
వాడు తానై యాయతనవంతు డగు
అతని యాయతనమ్ము నీరగు
అతడు గృహమేధి
పుష్పవంతుడు ప్రజావంతుడు తాను పశుమంతుడును
నగునో

యము: నాచికేతా, మహాగ్నిస్వరూపా, నీవు నా యింటికి వచ్చితివి. నీ ప్రశస్తి నా లోకములో పాడబడుచున్నది వినుమంటివా?

(మరల వినిపించును)

యోపాం పుష్పం వేద
పుష్పవాన్ ప్రజావాన్ పశుమాన్భవతి

యము: ఓయి మహర్షి. నీవే నాచికేతాగ్నివి. పుష్ప మనగా సర్వ పుణ్యము, సర్వజ్ఞానము, వికృతా వికృత పరిణామభూతమైన సర్వజగత్తు. వివర్తమైన సర్వజగత్తు దానికి మూలభూతమైనది; యీ సర్వజగత్తు. ఈ పుష్ప మహిమచేతనే సర్వసృష్టి సాగుచున్నది. సర్వ జీవలోకము నడుచుచున్నది. పుష్పము నెఱిగినవాడే పుష్పవంతుడు. వాఁడే ప్రజావంతుడు. వాఁడే పశుమంతుఁడు. ఈ పుష్పజ్ఞానము, ఓయి నాచికేతా. ఓయి వహ్నిరూపా నీ యుపాసనచేతనే తెలియును. నీవు పుష్పాకృతివి. ఆ మహాగ్నివి నీవే! నిన్ను ఉపాసించుటచేతనే నా లోకములు ధర్మలోకము లయినవి. నీవు మూన్నాళ్ళిక్కడ నుపవసించి పుష్పమును వాడునట్లు చేసితివి. నీకీ రెండు వరము లిచ్చి మరల నేను నిలువద్రొక్కుకొంటిని. ఈ పరిజ్ఞానమంతయు మృత్యువుయొక్క యాతలి యొద్దు.

అమృతమయమ్ము కైరవసుమాప్తుని
మండల మద్ది వారి మూ
లము నది యెవ్వడో యెఱుగు
లాలిత చంపక మల్లికా జపా
సుమ బహుళార్త గోనిచయ సూన
సమృద్ధిని గాంచు నీ స్వరూ
పము నెఱుగున్ జగచ్ఛలన
భావ విశారదుడౌ ఋషీశ్వరా.

నాచి: ఎవడు త్రిణాచికేతుడో వాడు మృత్యుపాశములను తెగనరికి దుఃఖాతీతుడై స్వర్గసుఖము ననుభవించును. ఓ యమ

ధర్మరాజా! ఇది నీ కృపావిశేషము. నాకీ రెండవవరము లిచ్చుటచే నీ ధర్మలోకము నిలిచినది. నా స్వరూప మవగతమైనది. ఉత్తర విషయము నా మూడవ వరము.

ఇటనుండి యేగి యెచ్చటికేగు మానవుడు
కొందరున్నాడందురు కొందరు లేడందురు
ఉండెనంటకు హేతు వున్నదా యమరాజ!
లేడనుటచే నిజమ్మాడిరా యమరాజ!
ఈ సందియమ్మే మహాయమ్మ యమరాజ
ఈ సందియము తీర్పవే యమరాజ!

(పెద్దమోత, గాలి, ఉరుములు)

ఒకగొంతు : చెలియలికట్టను దాటిపోయి
వలపలి గుట్టలు మోదిపోయి
జలధుల పొంగులు రేగిపోయి
వలభులశిఖలు తూలిపోయె.

మరియొకగొంతు: గిరి మహాశిఖరముల్ కర్ణమ్ములై
దర వికస్వర శిలల్ చూర్ణమ్ములై
ప్రత్యంత గిరులెల్ల దీర్ణమ్ములై
గగన శకలమ్ములు ఘూర్ణమ్ములై

ఇంకొక : ప్రళయ వాయుసమితి పరువెత్తిపరువెత్తి
విలయనాద రేఖ విసువెత్తి విసువెత్తి
చలనభావమెల్ల జళుకారి జళుకారి
కవిత బ్రహ్మభావములు గుడుసుళ్లయి

వేరొక : మేఘావర్తమ్ములు పుష్కలా
మోఘాంభోధర సంతతి
ఓఘమ్ములు వ్యూహమ్ములు
మేఘమ్ములు చెరియించున్.

యము : ఋషిబాలకా, యెంతప్రశ్న వేసితివి? ఇచట దేవతలకు గూడ సంశయమే. ఇది పరమ విచికిత్సితము. ఈ ధర్మ మణువు. ఇది చక్కగా నెప్పుడును తెలియదు. నీ వింకొక వరమడుగుము. నీవు నన్ను బలవంతపెట్టకు. నన్ను వదలిపెట్టుము.

(ఒక సన్ననిగొంతు)

మల్లికాసుమ సౌరభపేశలమంద
మారుతము వీతెంచెన్
హాలీసకముల గంగాజలముల
అంభోధరములు విహరించెన్
కల్లోలాగ్ర చలజ్జలనిధులవి
క్రమముగ నుపశాంతించెన్
వల్లీబాలనవారుణపత్ర ప్రభాపటలి
చిదిలించెన్ కాంతులు

నా : మృత్యుదేవా, ఈ పరమ రహస్యము నీవు కాక మరెవ్వరు చెప్పగలరు? మరి దేవతలే దీనియెడ సందియం పడుదురుగదా? స్వామీ మరి యొక్కమాట. నేను నాచికేతాగ్నిని. నా యగ్ని స్వరూపము లోకమునందు నిలువవలెనన్నచో నీ మహారహస్యమును నీవు చెప్పవలయును.

య : శతాయుష్కులను, పుత్రపౌత్రులను కోరుము. పశుసంపదను హించించుము. ఏనుగుల నడుగుము. గుఱ్ఱముల నడుగుము. బంగారము నభిలషింపుము. ఈ సర్వభూమండలముయొక్క రాజ్యాధిపత్యమడుగుము. నీకొక్కనికి చావులేదు. వెళ్ళుము. వెళ్ళుము. దీనినడుగకుము.

నా : యమరాజా, నాకివేవియును వలదు.

యము :

వీనియన్నింటితోడ సమానమైన
యే వరముగాని కోరుమోయీ కుమార
ఈ సమస్త ప్రపంచ పుష్పామృతాకృ
తి సమస్తమ్ము కానగదోయీ యిది విడి.

నా : నాకింకేమియు వలదు. తక్కినవన్నియు నేనే, నాకి దియే కావలయును.

యము :

మర్త్యలోకమున దుర్లభమైన కామములు
మరి యథేచ్ఛముగాగ నడుగవయ్యా కుమార
కొదమ వెన్నెలతీగ మెదువైన మేను వెవ
లారు కామినుల ముత్తములు కోరగదయ్యా
అరదములు కోరుకొను మమృత సంగీతముల్
పవలు దివిటీలు పుష్ప మనోజ్ఞ మకుటముల్
ఇవి మనుష్యులకు సాధ్యములు కావేకదా!
అవి కోరుకొనుము మృత్యురహస్య మేమిటికి?

నా : ఓయి యమరాజా, ఇవి యన్నియు నాకు వలదు.

తాకిన గందిపోవు నమృత ప్రవణమ్ములై
మైన పుష్పముల్
చేకొని నంత యౌవనము జీర్ణముగున్
లలితాంగు లందునన్
నాకము నంటుచున్నను ననంత మనోహర
భోగభాగ్యముల్
తేకువమాలి నిస్పృహను తెచ్చుతుదిన్
వెస పిప్పియై చనున్.

ఓయి యమరాజా! లోకమున—అన్నాదులచేత కడుపు నిండును. తృప్తియగును. ధనముచేత కాదు. ధనము వచ్చినకొలది ధనతృష్ణ పెరుగును. పైగా నీవు రాజ్యముచేసి నన్నాళ్ళు మా యాయుర్దాయము. కనుక నేను కోరిన వరమే నాకు కావలయును.

ఒక గొంతు:

చిరిగిపోనిది చావులేనిది
　　సేవధింబలె నయిన దానిని
చిరిగిపోవుచు చావుపొందుచు
　　చెడినమానవు డెవడు కోరడు
మృత్యువున్న దటంచు తెలిసియు
　　మృత్యువున కెదురేగు నెవ్వడు
నృత్యసంగీతములు ధనములు
　　మృత్యుదేవత తీయు తోవలు.

మరియొక గొంతు:

సాంపరాయమ్మనగ మృత్యువు
　　చనిన పిమ్మట జీవితమ్మని
లింపులకు నయిన విచికిత్సాలీన
　　మధుమయమయిన మార్గము
దీని నచికేతుండు కోరును
　　దీని నచికేతుండు కోరును
దీని తెలిసినవానికే నమధీతమై
　　చను మృత్యుమర్మము.

యముడు: నచికేతా! నీవు మహాగ్నిరూపమవు, పూర్వమీమాంసా సమిష్టి రూపమవు. నీవీ మృత్యురహస్యము తెలిసికొన వాంఛింతువేని నా వెంట రమ్ము. నేను నీకు నరకలోకములు చూపింతును. తత్తజ్జీవుల యనుభూతి విశేషముచేత నీకా యర్థము విస్పష్టమగును.

నాచి: యమరాజా, నన్ను నరకలోకములకు తీసుకొని పోయెదవా?

యము: ఓయీ, నరకలోకమునకు పోవుటకు భయమా, ఇది మృత్యువుయొక్క ప్రథమలక్షణము. శ్రేయస్సు ప్రేయస్సని రెండు పదార్థము లున్నవి. శ్రేయస్సు హితము, ప్రేయస్సు మనోవిహారి. శ్రేయస్సును పొంది పురుషుడు సన్మార్గమును పోవును. రెండవదానిని పొంది యసన్మార్గమున పోవును. రెండును బంధహేతువులు. నీవు దానిని పరిత్యజించితివి.

(విపరీతమైన రోదన ధ్వనులు)

యము: నచికేతా! ఇదొక జీవుడు. హఠయోగము నభ్యసించినవాడు. అల్పములైన శక్తులు గడించినవాని బలమున కామతృప్తి చేసుకొన్నవాడు.

నాచి: ఓయి జీవుడా! నీవెందులకు దుఃఖించుచున్నావు.

జీవుడు: నచికేతా, నిన్ను నే నెరుగుదునయ్యా. నేను తెలియక చేసితిని.

ఒక గొంతు:

అవిద్యలో పడి సువిద్య తెలియక
అవిద్య విద్యల కామడదూరము
అవిద్యలో పడడా నచికేతుడు
సువిద్య కందము చూచెడు మోక్షము
అంధుని చేకొని యంధుడు నడచెడు
మంథానము వలె గిరగిర తిరుగుచు
అంధులు మూర్ఖులు అజ్ఞానమ్మున
బంధుర చక్రభ్రమణము సేయుచు

యముడు: పసిపిల్లవానికి క్రీడావస్తువులే పరమార్థము లయినట్లు మూర్ఖులకు సంపదయే యున్నది. భార్యాపుత్రులేయున్నారు. లోకములోని సౌఖ్యమే యున్నది. ఇది మృత్యువుయొక్క ద్వితీయ దశ.

(మరల రోదన ధ్వని)

యము: ఇతడు మరియొక జీవుడు. వేదవేదాంగములన్నియు తెలిసినవాడు. కాని లోకమునందే బద్ధమైన దృష్టి కలవాడు.

నాచి: ఓయి జీవుడా, ఇట్లయితి వేమయ్యా?

జీవు: మహాగ్నీ, నమస్కారము. చదివినందువలన నేమి లాభము? చదివినది నా కర్థము కాలేదు.

ఒక గొంతు:

చదివిన లాభమేమి, యెద
　　సారము ముట్టక లోకమందు, నే
చదివితినంచు గొప్పకయి
　　సాగుచు దాన ధనార్జనా సమా
స్పదమగు బుద్ధితో చను
　　నసాధువు బుద్ధికి తెల్విగాని లో
నెద పరిపాక మందడు
　　గృహీత జగత్ బహుభోగ లబ్ధుడై.

మరియొక గొంతు:

సద్గురువు కావలయు సన్మార్తి కావలయు
హృద్గతము దోషమ్ము నెలయించుటకునూ,
సద్గురువు దొరకు తన సంస్కార వశమునను
సత్క్రియావశమునను సంస్కార మెసగూ.

యము: నచికేతా! ఎప్పుడూ సత్క్రియల నాచరించవలయును. సత్క్రియాచరణము చదువుకంటె గొప్పది. అసత్కార్యములను చేయుట మృత్యువుయొక్క తృతీయ దశ.

(పెద్దకేకలు వినిపించును.)

నాచి: యమరాజా. ఆ కేకలేమి?

య: నాచికేతా, నాకు నవ్వు వచ్చుచున్నది. వారు కొందరు జీవులు నరకబాధ లనుభవించుచు వాదమాడుచున్నారు. ఆత్మలేదని, యున్నదని. జీవుడున్నాడని, లేడని. ఈశ్వరుడు కనిపించడు, కనుపించునని, యమయాతనలు పడుచున్నారు. వాదించుకొనుచున్నారు.

నా : అయ్యో అజ్ఞానము.

ఒకగొంతు :

అల్పునకు తెలియనిది
యతి రహస్య మ్మిద్ది
ఎంత యోచించినను నిది
సునంపూర్ణముగ తెలియనిది
యెవ్వరును తెలియ జెప్పగరాని
దతి సూక్ష్మ మప్ర
తర్క్యము సత్పదార్థమ్ము.
వాదనతో తేలదు
లో తెలియును తానంతట
సాధువైన గురువు దొరక
సాధువు శిష్యుడు లభింప.

య : నాచికేతా, నీవు సాధువైన శిష్యుడవు, నేను సాధువైన గురువును, ఈ సర్వసంపదలు వ్యర్థములని నాకు తెలియును. అయినను నాచికేతుడా, నిన్ను నే నుపాసించితిని, అందుచేత శాశ్వతుడ నయితిని, నీవు సాక్షాత్పునీతుడవు.

(గాలిలో మధుర సంగీతము వినిపించుచుండును.)

నా : యమరాజా, ఆ మధుర సంగీత మేమి ?

ఒక గొంతు :

కోరికలతుది చూచి
పార మెరిగి సమస్త
సారమ్ము తెలిసికొన
ధీరుడా నచికేతు
డౌర యుద్గాతా

మననశీలము చేత, మదిహర్ష శోకములు
విడలించి కనుచూపు వెక్కసమ్మయినట్టి
పరమ రహస్యమ్ము పారమ్ము తెలిసికొన
ధీరుడౌనచికేతు డౌర యుద్గాతా.

య : నచికేతా ! ముక్తులై యోగులైన పరమహంస లాకాశమార్గమున వీణాతంత్రులమీద నిన్ను స్తోత్రము చేయుచున్నారయ్యా.

నచి : యమరాజా.

ధర్మము కంటె నధర్మము కంటెను
కార్యముకంటె నకార్యము కంటెను
భూతము కంటెను భవ్యము కంటెను
ఏది చూచెదవో నాకది చెప్పుము.

యము :

వేదములన్నియు వాదము లన్నియు
తపములు సర్వము, జపములు సర్వము
దేని చెప్పనో బ్రహ్మచర్య మది
సావధానుడై వినవయ్యా !

(ఓం అని పలుసార్లు దీర్ఘదీర్ఘముగా వినిపించును.
హో, ఉహో, హో, ఉ.)

య : ఓం అను నీ యక్షరమొక్కటియే బ్రహ్మ. ఇది ఉపాస్యము. బ్రహ్మపదార్థముయొక్క అక్షరాకృతి. అది ఆత్మ. నీవు నరకలోకమున నిందరను చూచితివి. వారందరును చనిపోయిన వారేనా. నీవే యడుగుము.

(మరల రోదనధ్వనులు)

నాచి : జీవురాలా, మీరందరూ చనిపోయారా ? మృత్యువును పొందితిరా ?

జీవుడు : మేము మృత్యువును పొందుటయేమి ? ఆ భూలోకమున బ్రతికియున్నప్పుడు మృత్యువునుగూర్చి భయపడితిమి. ఇప్పుడును మృత్యువునుగూర్చి భయపడుచున్నాము.

నాచి : మీరు మరణించియే కదా యిచటికి వచ్చితిరి. ఇచట గూడ మృత్యువున్నదా ?

జీవు : కాదయ్యా, మే మిచ్చటను చచ్చిపోదుము. మరి యెచ్చటకో పోదుమనిపించుచున్నది.

నాచి : మరి మనుష్యలోకమున నున్నప్పుడు భయపడినట్లే యిచటను భయపడుచున్నారా ?

జీవు : అచ్చటను భయపడితిమి. అచ్చటను బాధపడితిమి. ఇచ్చటను భయపడుచున్నాము. ఇచ్చటను బాధపడుచున్నాము.

నాచి : ఇది విచిత్రముగా నున్నది.

యము : నాచికేతా, మరియు విచిత్రమైనది చూపించెదను.

(మధురమైన సంగీతము)

యము : నాచికేతా, ఇది స్వర్గలోకము. ఇక్కడనున్న జీవులందరు సుఖమనుభవించుచున్నారు. సంగీతములు పాడుచున్నారు. వీరి నడుగుము.

నాచి : ఓయీ స్వర్గవాసులారా. మీరందరు సుఖపడుచున్నారా ?

ఒకడు : ఓయీ, సుఖపడుచున్నాము.

నా : మీరేమియు బాధపడుట లేదా ? భయపడుట లేదా ?

ఒకడు : ఎందుకు బాధపడుట లేదు ? రాక్షసులతో బాధపడుచున్నాము. ఎప్పుడో యీ మాభోగము సమాప్తమగునని భయపడుచున్నాము.

నా : మీకు చావు లేదా ?

ఒకడు : అయ్యో, యెందుకు లేదు, మాభోగము సమాప్తమగునపుడా నది మరణమే.

య : తెలిసినదా, నాచికేతా, భూలోకవాసులును భయపడుచున్నారు. వట్టి దుఃఖమయమైన నరకలోకమును వదలిపోవలసి వచ్చునేమోయని యచటి జీవులు భయపడుచున్నారు. దేనినిగూర్చి పడుయభిచున్నారు ? మృత్యువునుగూర్చి భయపడుచున్నారు.

మృత్యువును గూర్చి భయపడుచున్నారు. మృత్యువనగా నేమి?.

నా: యమరాజా, తెలిసినదయ్యా, భూలోకవాసులు మరియొక చోటిని గూర్చి పోవుటను మృత్యువనుకొనుచున్నారు అట్లే యితరలోకవాసులును. తామున్నచోటునుండి యింకొక చోటునకు పోవుట మృత్యువని తెలిసినది.

య: అదియే దుఃఖము. తన యూరు వదలిపెట్టి మరియొక యూరుపోవుటయే దుఃఖము. తానొక దుఃఖములోనుండి యింకొక దుఃఖము లోనికి పోవుట, యింకొక దుఃఖము నీకు ఋజువు చేసెదను. ఇదిగో మరల నరకమునకు వచ్చినాము.

(రోదన ధ్వనులు)

య: జీవులారా, మిమ్ము౦దరను ఇచ్చటనుండి మరియొక చోటికి తీసుకొనిపోదును...అచట మీరు వేరుబాధ లనుభవింపవలయును. ఆ బాధలింతకంటె తక్కువ బాధలు.

(పదిగొంతుకలు) వద్దు వద్దు, మేమీ బాధలే యనుభవించుచుందుము, మాకిదియలవాటయిపోయినది. మరి క్రొత్తబాధ లెట్లుండునో మాకు తెలియదు.

య: చూచితివా? నచికేతా, ఎవరికీ మార్పు ఇష్టములేదు. మార్పునుగూర్చి భయపడుతున్నారు. దీనినే మృత్యువనుకొనుచున్నారు. ఓయి జీవులారా, మిమ్ము మరల మనుష్యులుగా పుట్టించెదను.

పది: ఓయి యమధర్మరాజా మమ్మున్నచోట నుండనిమ్ము. మాకక్కర్లేదు.

య: చూచితివా? నచికేతా, ఏ లోకవాసులైన నిట్లే యుందురు, ఏ దేశవాసులయిన నిట్లేయుందురు.

నా: యమరాజా, వారినట్లే యుండనీయ రాదా?

యము: నే నుండనిచ్చుట యేమున్నది? ఈ లోకములు, ఈ దేశములు, ఈ పరిస్థితులు నిత్యచంచలములు. అవి యుండవు. ఉండుటయన్నది వేరే యున్నది.

నాచి: అది యెటువంటిది?

(ఓం అన్న ధ్వని వినిపించును)

యము: ఉత్తిష్ఠత. లెమ్ము.

(అర నిముసము వీణావాద్యము)

యము: జాగ్రత్త. మేల్కొనుము.

(అర నిముసము సంగీతము)

య: ప్రాప్యవరాన్ నిబోధత. సద్గురువుల నుపాసింపుము.

(అర నిముసము సంగీతము)

య:

క్షురస్యధారా నిశితా దురత్యయా
దుర్గం పథస్తత్కవయో వదంతి

తే. పదనుగల కత్తి వాదరవలె నిశితము
దాటరానిది నడువగా తగనిదైన
ఈ మహా మార్గమును సుకవీంద్రకోటి
'తత్త'నుచు చెప్పెదర అట్టి సత్తుచిత్తు.

అది నిత్యమైన యునికి.—ఈ సర్వ జీవరాసుల హృదయములయందు సత్తు చిత్తు నయిన ఆ తత్ ఉన్నది. అది యీ లోకములయందు దొరకదు. ఈ లోకములు చంచలములు. ఈ చంచలమయిన చోట నా యచంచలమయినదానిని వీరందరు కోరుచున్నారు. అదియె మృత్యువు. ఇదియే మృత్యురహస్యము. ఈ పంపదాదులు, ఈ జన్మలు, ఈ లోకములు ఇవి నిజములు కావని తెలిసికొనుటయే మృత్యువును గెలుచుట. ఇదియే మృత్యురహస్యము.

నాచి: యమధర్మరాజా, నీవు సద్గురువువు దొరికితివి. నేను నీకు సచ్ఛిష్యుడను దొరికితిని. నీవు నాకిచ్చిన మొదటివరము వృథా యయినది. నేనిపుడు తండ్రివద్దకు పోనక్కరలేదు.

య: నచికేతా, ఇంకను కొంచెము మిగిలియున్నది. అక్కడికి పోవుటయేమి? పోకపోవుట మేమి? ఇక్కడనుండి యక్కడకు వెళ్ళినట్లే. అక్కడకు వెళ్ళి యిక్కడ నుండినట్లే.

నచి: అవునయ్యా, వ్యావహారికదశ యెంత భ్రాంతి కల్పించుచున్నది.

ఓం. ఓం. ఓం.

(ఓంకార ధ్వని దీర్ఘముగా వినిపించును.)

సమాప్తి.




## చిఱు సింహమును బోలిన శక్తి నీకు కలదా?




ఏల మీ జీవితములను దుర్బలముగను, నిస్సారముగను గడపెదరు? చిరుసింహమును బోలి సంపూర్ణోత్సాహవంతులుగ నుండ నేల ప్రయత్నింపగూడదు? జీవామృతము మీకు ఆశక్తి నొసంగును. దానిని సేవించుటచేత ఉత్సాహము, శ్రేష్ఠమైన బలము, మంచి కండపుష్టి, నరములకు పటుత్వము, వీర్యవృద్ధి కలుగును. మీలో కలిగెడు మార్పుకు మీరే ఆశ్చర్యమొందుదురు. నేడే తీసి సేవింప ప్రారంభింపుడు.

★

# జీవామృతం

కండపుష్టికి, వీర్యవృద్ధికి, జవసత్త్వములకు,
అన్ని మందుల షాపులలో దొరకును.

**ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్,**
మదరాసు-17.

# జనాభా సమస్య

★

శ్రీ సూర్యంపూడి సీతారామ్

ప్రపంచంలో జనసంఖ్య పెరిగిపోతున్నందువల్ల ఆహార సంపదుత్పత్తి చాలక అశాంతి వ్యాపించగలదని మాల్థస్ ప్రపంచాన్ని హెచ్చరించి అప్పుడే నూటయేభైసంవత్సరాలు కావస్తున్నది. తరువాత ప్రచారంలోనికి వచ్చిన డార్విన్ పరిణామవాదంతో, మానవజాతికూడా పురాతనయుగాల జంతు పక్షి సంతతులవలెనే నాశనం కాగలదనే భీతి పాశ్చాత్య దేశాలలో ఉత్పన్నమయింది. సర్వదేశాలలోనూ వ్యాపించియున్న దారిద్ర్యం అశాంతికి హేతువౌతున్నది. గడచిన ఏభైసంవత్సరాలలో ప్రపంచం మొత్తాన గమనిస్తే పారిశ్రామిక, వ్యావసాయిక వస్తు సంపదుత్పత్తి అపారంగా పెరిగినప్పటికీ ప్రపంచం మొత్తంలో నాలుగింట మూడువంతులు ప్రజలు ఇంకా దారిద్ర్యబాధలో మ్రగ్గుతూనే ఉన్నారు. ఈ దారిద్ర్యపీడిత ప్రజానీకంలో అత్యధిక సంఖ్యాకులు భారత దేశంలోనే ఉన్నారు. (ఆహార సంపద, వ్యవసాయములగురించి ఐక్యరాజ్యసమితి ఆధ్వర్యంక్రింద 1943 లో హాట్ స్ప్రింగ్స్‌లో జరిపిన సమావేశానికి సమర్పించబడిన నివేదిక ఆధారం.)

శాస్త్రజ్ఞుల అంచనా ప్రకారం పందొమ్మిదో శతాబ్దం మొదటి పాతికేళ్లలో ప్రపంచ జనాభా నూరుకోట్లున్నది. ఇరవయ్యో శతాబ్దంలో 1920—30 మధ్య జనసంఖ్య పరిమాణం 200 కోట్లయింది. ఇరవై ఒకటో శతాబ్దం మొదటి పదేళ్ళలోనే (ఈ లోగా పెద్దయెత్తున జనవినాశం సంభవించని పక్షంలో) జనాభా 300 కోట్లు పరిమాణం అందుకుంటుంది.

ప్రస్తుత జనసంఖ్య 220 కోట్లు దరిదాపులలో ఉన్నట్లు అంచనా వెయ్యబడింది. సాలీనా జనాభా నూరింట $1\frac{1}{8}$ వంతున పెరుగుతున్నది. అంటే సాలీనా రెండున్నరకోట్లకు పైగా—రోజుకి (24 గంటలు) 70 వేలమంది చొప్పున పెరుగుతున్నదన్న మాట. ఇక్కడ జనాభా పెరుగుదల అంటే జననాలని అర్థం కాదు; జనన మరణాలు రెంటినీ లెక్కలోకి తీసుకోగా మిగిలే మొత్తం అది. జనాభా పెరగడమే కాదు, పెరుగుదల రేటుకూడా క్రమక్రమంగా పెరుగుతున్నందువల్ల ఇది ప్రపంచానికి తీరని సమస్యగా పరిణమించింది. (ఇక్కడ ఇచ్చిన లెక్కలకు జూలియన్ హక్స్లీ వ్యాసం ఆధారం.)

భారతదేశంలో కూడా జనాధిక్యం, ఆహారసంపద కొరత నేడు ప్రధానసమస్యలైనాయి. సుఖజీవనానికి కనీసావసరాలైన సదుపాయాలు మధ్యతరగతివారికి కూడా అందుబాటులో లేవు. భారతదేశంలో దారిద్ర్యం సామెతప్రాయమయింది.

భారతదేశపు జనాభా 1931 లో (అంటే పాకిస్తాన్‌తో సహా) 35 కోట్ల 30 లక్షలు. ఇది 1941 లో 38 కోట్ల 90 లక్షలకు పెరిగింది. ఇందులో 31 కోట్ల 90 లక్షలు ప్రస్తుత రిపబ్లిక్ ప్రాంతంలోనూ ఏడు కోట్లు పాకిస్తాన్ ప్రాంతంలోనూ ఉంది. 1949 కి అనగా దేశవిభజన అనంతరం రెండేళ్ళకి, ప్రభుత్వ అంచనాల ప్రకారం భారత రిపబ్లిక్ జనాభా 34 కోట్ల 60 లక్షలకు పెరిగింది. 1950—51, 1951—52 ప్రభుత్వ ఆహారశాఖ అంచనాల ప్రకారం భారత రిపబ్లిక్ జనాభా దాదాపు సంవత్సరానికి 40 లక్షల చొప్పున వృద్ధి చెందుతోంది.

1950—51 భారతప్రభుత్వ ఆహారశాఖ అంచనా ప్రకారం దేశంలో ఆహారసంపద నూరింట పదివంతులు కొరవగా ఉంది. 1952—53 అంచనాప్రకారం ప్రభుత్వ సేకరణ, రేషనింగు, అమెరికా సప్లైలమూలంగా ఈ కొరవ 8% కి తగ్గింది.

జనసంఖ్య వృద్ధిచెందుతున్నదనేది నిర్వివాదాంశం. దారిద్ర్యం నానాటికీ అధికమౌతున్నదంటే ముఖ్య కారణాలలో జనాభివృద్ధి ఒకటి అనేది కూడా అందరూ అంగీకరించేవిషయమే. ప్రపంచంలో అశాంతికీ, సామాజిక విప్లవాలకూ దారిద్ర్యంకూడా ముఖ్య కారణమని గుర్తించబడింది. జనాభా పెరుగుదల సమస్యను ప్రభుత్వమూ సమాజమూ సహకరించి పరిష్కరించవలసిన అగత్యం కూడా గుర్తించబడింది. అయితే సమస్య స్వరూపంగురించీ, పరిష్కార విధానాన్ని గురించీ అనేక అభిప్రాయాలు ప్రచారంలో ఉన్నాయి.

మనదేశంలో దారిద్ర్యానికి హేతువైన ఈ అధిక జనసంఖ్య సమస్య యథార్థ స్వరూపాన్ని అవగాహన చేసుకోడానికి, ఎన్నెన్ని రీతుల ఇది సంభవమౌనో గమనించి వాని దృష్ట్యా ప్రస్తుత పరిస్థితుల్ని పరిశీలించడం సులువైన పద్ధతి. ఇందుకుగాను డా॥ క్రిస్టేల్ నిదర్శనాన్ని మనకి అనుకూలంగా మార్చుకుని వినియోగించుకోవచ్చును.

ఆహార సంపదవృద్ధినీ, జనాభా పెరుగుదలనూ ఒకే లైన్‌మీద నడుస్తున్న రెండు రైళ్ళుగా భావించుకోవాలన్నాడు డా॥ క్రిస్టేల్. ఒకే దిక్కుగా ఈ రైళ్లు పయనిస్తున్నాయంటే అర్థం ఆహార వస్తూత్పత్తీ, జనాభాకూడా వృద్ధిచెందుతున్నాయన్న మాట. వృద్ధిగమ

సంలో ఒకరైలు కొంతమేర ముందు మరొకటి వెనుకా ఉంటు న్నాయి. అవసరమైన దానికంటె ఎక్కువగా ఆహారం ఉత్పత్తి చేసే ఉత్తరమెరికా, ఆస్ట్రేలియాల సందర్భంలో ఆహారం అనే రైలు జనభా అనే రైలుకంటె ముందుగా ఎక్కువ వేగంతో పరిగెడుతున్నది. మనదేశంలో జనభా అనే రైలు ముందు పరిగెడుతోంది. ఆహారం అనే రైలు వెనకపడిందనుకోవాలి, స్థూలంగా ఉన్న పరిస్థితినిబట్టి. అయితే దుర్భిక్షానికి హేతువులు అనేక రీతుల ఉండవచ్చు. ఎన్ని రీతుల సంభవమో ఇప్పుడు సులువుగా వివరించుకోవచ్చు.

1. ఆహారం అనే రైలు బొత్తిగా సత్తువచాలక వెనకబడిపోయి మెల్లిగా దేకుతూంటే జనాభా అనే రైలు ముందు వేగంగా పెరుగెట్టుతూ ఉంటుంది. లేదా,

2. ఆహారం అనే రైలు వేగం హెచ్చించ గలిగి ఉండి కూడా భీష్మించి దేకుతూ ఉంటే జనాభా అనేరైలు ఆగకుండా వేగంగా పరుగెట్టుతూ ఉండవచ్చు.

3. ఆహారం వేగంగానే ముందుకు పోగలిగినప్పటికీ ప్రజల కొనుగోలుశక్తి క్షీణించిపోయినందువల్ల ఇంజన్‌లో ఆవిరి వృథాపోయి వేగంగా పోకుండా ఉన్నందువల్ల జనాభాని అందుకోలేకపోతూ ఉండవచ్చు.

ఈ మూడురీతుల హేతువుల్ని వివరించాలంటే ఈక్రింది విధంగా ఉంటుంది.

1. ఆహారవస్తూత్పత్తిని ఎంతగా వృద్ధిచేయడానికి యత్నించినా, సహజసంపదని పూర్తిగా వినియోగించినా జనాభాకి గాని పెరుగుతున్న జనాభాకి గాని చాలని పరిస్థితి ఇది. సహజసంపద మితంగాఉన్నందువల్ల ప్రభుత్వం కాని ప్రజలు కాని పెట్టుబడుదారులు కర్షకులు కలిసి సహకరించి కృషిచేసినప్పటికీ జనాభాకి చాలదని దీని ఆంతర్యం. ఇది భారత దేశంలో ఇదమిత్థమని తేల్చజాలని అంశంగా ఉండిపోయింది.

2. జనాభా అంతనీ పోషించగల ఆహారాన్ని పండించగలది మన దేశం అని అనేకుల అభిప్రాయం. ఇది కాదని నిరూపించడం కష్టమే. అయితే జనాభా పెరిగిపోతున్నందువల్ల పాతికేళ్ళ తరవాత కూడా మన సంపదను భూమినుండి పిండుకోడం చేతనయితే సరిపోతుందని చెప్పగలమా ?

3. దేశంలో యథార్థానికి సరిపడినంత ఆహారం ఉన్నప్పటికీ ఇతర ఆర్థికాభివృద్ధిలేక నిరుద్యోగంవల్ల ప్రజలకు కొనుగోలు శక్తి లేకపోతున్నదనీ, అందువల్లనే దారిద్ర్యం వ్యాపించిందనీ దీని అర్థం-లేదా సరిపడినంత ఆహారాన్ని పండించగల తాహతున్నప్పటికీ, ప్రజలకు పెట్టుబడిలేక ఉత్పత్తి కావడం లేదనీ, ఉత్పత్తి చేయగలిగి ప్రజలకు కొనుగోలుశక్తి అనేవి ఉంటే దారిద్ర్యమనేదే ఉండదని కూడా మరొక విధంగా చెప్పుకోవచ్చు.

ఈ పరిస్థితులలో ప్రస్తుతం భారత దేశం స్థితి దేనికి సరిపోలుతున్నదో తెలుసుకోడానికి ప్రస్తుత స్థితిగతుల్ని పరిశీలించాలి.

జనాభా పెరుగుదలను నిరోధించడమేకాక ప్రస్తుత జన సంఖ్యను కూడా తగ్గిస్తే కాని ఆహారసమస్య తీవ్రరూపం దాల్చి, సంఘజీవనం అరణ్యజీవనప్రాయమైపోగలదనీ, ప్రపంచంలోని వస్తుసంపద ఇంతటి జనాభాకు చాలదనీ ఒక వాదం ఉంది. ప్రకృతి ఇచ్చిన సహజసంపదను సద్వినియోగం చేసుకున్నట్లయితే ఇంతకంటె ఎక్కువ జనాభా సుఖప్రదమైన జీవనం గడపడానికి అవకాశ మున్నదని మరొకవాదం ఉంది. ఈ రెండు వాదాలకూ మధ్యేమార్గాన కల వాదాలు ఇంకా ఉన్నాయి.

కార్నెల్ యూనివర్సిటీకి చెందిన పియర్సన్, హార్పర్ అనే ఇద్దరు ప్రొఫెసర్ల అంచనా ప్రకారం ప్రపంచంలో లభించే వస్తుసంపద మొత్తం 100 కోట్లమంది జనాభాకిమాత్రం సరిపోతుంది. అంటే జనాభా పెరుగుదలని అరికట్టడంతో కాక మొత్తం ఇప్పుడున్న 220 కోట్లమంది అంతరిస్తే కాని ప్రజలకు సుఖజీవనం అసంభవమని వీరి అభిప్రాయమన్నమాట. జనాభా పెరుగుదలకి వైద్యసదుపాయం కూడా ఒక కారణమని విలియమ్ వాఘ్ట్ అభిప్రాయం. వైద్యసదుపాయం లభిస్తున్నందువల్ల మలేరియా మొదలైన వ్యాధులవాతబడి చనిపోవలసిన అనేక లక్షలమంది మిగిలిపోతున్నారట. వ్యాధులూ, కరువులూ మొదలైనవి జనాభా పెరగకుండా కాపాడ్డానికి ప్రకృతిచేసిన సహజసౌకర్యాలని వాఘ్ట్ భావన.

అమెరికన్ విదేశాంగ శాఖవారి (1949) అంచనాలప్రకారం ప్రపంచ జనాభాలో ప్రతి ఒక్కరికీ ఆహారం లభించాలంటే, ప్రతిమనిషికోసమూ కనీసం 2½ ఎకరాల భూమిలో ఆహారంపండించబడాలి. కాని ప్రస్తుతం సాగవుతున్న భూమి తలకు ఎకరంకంటె కొద్దిగా తక్కువుంది. అంటే ఇప్పుడు సాగవుతున్న భూమికంటె రెండున్నర రెట్లు సాగుకావలసిన అవసరం ఉందన్నమాట. ఇది ప్రస్తుతం అసాధ్యమని వేరే చెప్పనక్కరలేదు. కొత్తగా ప్రాజెక్టులవల్ల సాగు కిందికి తీసుకురాబడుతున్న భూమికంటె, వ్యాపారావసరవస్తువులను, పరిశ్రమల కవసరమైన వస్తువులను పండించడం కోసం ఆహారధాన్యాలను మానుకుంటున్నది, భూసారక్షయంవల్ల తగ్గిపోతున్నది, చవుడు బారిపోతున్నది, వ్యవసాయవిధానంలోని దోషాలవల్ల నష్టపడుతున్నది, వరదలు మొదలైనవానివల్ల పంటలకు సంభవిస్తున్న నష్టమూ మొదలైనవి అధికంగా ఉన్నాయని ఆహారవ్యవసాయ విషయక సంస్థ (*Food And Agriculture Organisation*) 1951 లో హెచ్చరించింది. ఎప్పటికప్పుడు అడవులను కొట్టివేస్తున్నందువల్ల అనావృష్టి సంభవిస్తున్నదని ప్రభుత్వాలు గుర్తించాయి. ఆహారవస్తూత్పత్తిని వృదిచెయ్యడానికి వివిధదేశాలలో జరుగుతున్న కృషిని బట్టికాని, ప్రస్తుత సదుపాయాలప్రకారం ఇంకా వృద్ధిచెయ్యడానికి గల అవకాశాలనుబట్టి గాని ఎంతవరకూ ఆహారవస్తువులను ఉత్పత్తి చెయ్యగలమో గమనించినట్లయితే, అది కూడా 1% రేటున వృద్ధి చెందుతున్న జనాభాకి చాలదని అంచనా వెయ్యబడింది. (విలియమ్ వాగ్‌ట్ గ్రంథం ***Road to Survival***).

ప్రపంచంలోని వస్తుసంపదను సక్రమంగా వృద్ధిపరచి, అందరికీ అందుబాటులోకి తెచ్చినట్లయితే చాలకపోదనేవారిలో కమ్యూ

నిష్టులు ముఖ్యులు. వీరి అంచనాల ప్రకారం మొత్తం భూమిలో నూరింట 30 వంతులు సాగుకి అనువుగా ఉన్నప్పటికీ నూరింట పది వంతులే సాగవుతున్నది. ఇందులో కూడా నూరింట నాలుగు వంతులే ఆహారధాన్యాల ఉత్పత్తికి వినియోగించబడుతున్నది. (యమ్. ఇల్విన్ 'వ్యాసం ఆధారం) ఆస్ట్రేలియా, దక్షిణమెరికా లలో మొత్తం నూరింట 1½ వంతుల భూమిమాత్రమే సాగు చెయ్యబడుతున్నది, ఉత్తర అమెరికాలో ఆహారవస్తూత్పత్తి అవసరానికంటె మరీ అధికంగా ఉన్నందువల్ల ప్రభుత్వాలకు అది పెద్ద సమస్యగా పరిణమించింది. ఉత్పత్తి పెరిగినందువల్ల ధరలు పడిపోయి రైతులకు నష్టం సంభవించకుండా కాపాడ్డంకోసం అమెరికన్ ప్రభుత్వం 1950 లో 400 కోట్ల డాలర్లు వెచ్చించి అదనపు ఆహారాన్ని కొని, విదేశాలకు లాభానికి కొంత నష్టానికి కొంత అమ్మగా మిగిలినదానిని ధ్వంసం చేసింది. దీనినిబట్టి ఆహారాన్ని ప్రజలకు సరఫరా చెయ్యడంలోగల లోపాలమూలంగా ఆహారం చాలడం లేదే గాని కొరవౌతున్నదనుకోడం పొరపాటని ఇల్విన్ వాదం.

కమ్యూనిస్టు కార్యక్రమాలవల్ల దారిద్ర్యం తీరిపోదని ఒక వాదం ఉంది. దేశంలో అతి భాగ్యవంతులూ అతి దరిద్రులూ ఉన్నారేకాని అతి భాగ్యవంతులు మనిషికి అవసరమైన దానికంటె అధికంగా ఎవరూ ఆహారాన్ని ఖర్చుచెయ్యరు. అతి భాగ్యవంతుల భాగ్యాతిశయంవల్ల ఉత్పత్తిఅయిన ఆహారం నీళ్ళపాలు కావడంలేదు; వీరి భాగ్యాతిశయం ఇతరుల కొనుగోలు శక్తి క్షీణించడానికి హేతువు కావచ్చును. వీరి ధనవ్యయం ఆహారవస్తూత్పత్తికి వెచ్చించడానికి బదులు విలాసవస్తువుల సేకరణకు వినియోగపడుతూఉండవచ్చును. అందువల్ల భాగ్యవంతుల భాగ్యాలను ప్రభుత్వం ఆక్రమించి దేశసంపదనంతనీ సమానంగా ప్రజలందరికీ పంచిపెట్టినంతమాత్రంచేత ఆహారవస్తువుల కొరత తీరదు.

అయితే ఈ భాగ్యవంతుల భాగ్యాన్ని ప్రభుత్వం లాక్కొని ద్రవ్యాన్నీ ప్రజల కృషినీ వ్యవసాయాభివృద్ధికి నీటిసదుపాయానికి వినియోగించినట్లయితే ఎంతవరకూ ప్రజల ఆహారాన్ని వృద్ధి చేయవచ్చునన్నది వివాదాంశం. భారతదేశంవంటి సహజ సంపన్నమైన దేశంలో ప్రజలకృషినీ ద్రవ్యాన్నీ ప్రాజెక్టుల నిర్మాణానికీ వ్యవసాయానికీ వెచ్చించగలిగినట్లయితే ఇంతగాక మరింత జనాభాను పోషించవచ్చుననే విశ్వాసం అనేకులకున్నది. ఈనాడు ప్రాజెక్టుల నిర్మాణం భారతప్రభుత్వానికి కష్టమౌతున్నదంటే, గోదావరిపైన ప్రాజెక్టు నిర్మాణాన్ని తల్చుకోనైనా లేకపోతున్నారంటే కారణం అర్థికలోపమే.

భారతదేశంలో పరిస్థితిని గమనించినట్లయితే నిరాశకు అంతగా తావు కనపడదు. ఇక్కడ కూడా రెండు విధాలైన అభిప్రాయాలున్నాయి. పరాయి పరిపాలనలో దేశసంపద కొల్లగొట్టబడినందువల్ల దారిద్ర్యం విపరీతంగా వ్యాపించినదే గాని దుర్భిక్షం నివారణ సాధ్యమేనని కొందరి అభిప్రాయం. ప్రజలందరికీ కాకపోయినా కనీసం నూరింట 85 వంతులకు వృత్తి లభించినట్లయితే, వ్యవసాయంపైన ఆధారపడిన వారిలో కొంతమందిని పరిశ్రమల అభివృద్ధికి పారిశ్రామిక వస్తూత్పత్తి వృద్ధికి వినియోగించినట్లయితే చాలినంత ఆహారం, ప్రజలకు కొనుగోలుశక్తి లభించగలదని స్వాతంత్ర్యానికి పూర్వం కాంగ్రెస్‌నాయకులు అభిప్రాయపడ్డారు.

1950 లో ప్రపంచ ఆహారపరిస్థితిని అమెరికన్ ప్రభుత్వ ఆహారశాఖ స్థూలంగా సమీక్షచేస్తూ భారతదేశంలో జనాభా తగ్గనంతవరకూ ఆహారాన్ని దిగుమతి చేసుకోకతప్పదనీ, వ్యవసాయంలో మరింత నైపుణ్యం నేర్పితే గాని దేశ ఆర్థికస్థితి చక్కబడే అవకాశం లేదనీ తెలియపరిచింది.

ప్రొఫెసర్ విశాల్ అంచనాల ప్రకారం 1913–14 మొదలు 1935—36 వరకూ భారతదేశంలో జనాభా సాలీనా 1% వంతున పెరిగింది. వ్యావసాయికసంపద ఈకాలంలో 0.65% మాత్రమే పెరిగింది. అంటే ఆహారసంపదవృద్ధికంటె జనాభా పెరుగుదల చాల అధికమని విశాల్ అభిప్రాయం. 1900 మొదలు 1934 వరకూ అంచనాల ప్రకారం అదనంగా సాగులోకి తీసుకురాబడిన భూమి 11% అయితే జనాభా మొత్తం 21% పెరిగిందని ప్రొఫెసర్ గ్యాన్‌చంద్ వ్రాశాడు. కాని డా॥ థామస్ అంచనాలు ఇందుకు విరుద్ధంగా ఉన్నాయి. 1920–21 నించి 1935–36 వరకూ జనభా మొత్తం 15% పెరిగితే, వ్యావసాయిక సంపద 21% పెరిగిందనీ, పారిశ్రామికసంపద 167% పెరిగిందనీ డా॥ థామస్ అంచనా. అంటే వాస్తవంగా జనాభాకంటె సంపద అధికంగా వృద్ధిచెందిందన్నమాట. దీనినిబట్టి జనాభా పెరుగుదలకు తట్టుకోడానికి తగిన అవకాశాలు భారతదేశంలో ఉన్నాయని వీరి అభిప్రాయం.

భారతప్రభుత్వం నియమించిన క్షామపరిస్థితి విచారణ సంఘం (వుడ్‌హెడ్ కమిటీ) ప్రస్తుత సంపదభివృద్ధి అవకాశాలను గమనించినా పెరుగుతున్న జనాభాకు బొత్తిగా చాలదని అభిప్రాయపడింది.

భారతదేశ పరిస్థితులను గమనించినట్లయితే రెండు ముఖ్య అంశాలు అందరికీ కనపడతాయి. 1. గడిచిన ఇరవై ముప్పైఏళ్లలో పరిస్థితుల్ని చూస్తే జనాభా పెరుగుదలకు తగిన భూమి అదనంగా సాగులోకి రావడంలేదు. ఏడాదికి కనీసం నలభైలక్షలమంది చొప్పున రిపబ్లిక్‌లో జనాభా పెరుగుతోంది. అంటే ప్రతిఏడాదీ 6 లక్షల టన్నుల చొప్పున అవసరం హెచ్చుతున్నదన్నమాట. దేశంలో దాదాపు 12½ కోట్ల ఎకరాల భూమిని అదనంగా తీసుకు రావచ్చునని భారతప్రభుత్వం (1948) అంచనావేసింది. కాని 1948—49 మొదలు 1949—50 వరకూ మూడుసంవత్సరాలలో ఆహారోత్పత్తి వృద్ధికార్యక్రమంక్రింద మొత్తం 1 లక్ష 88 వేల ఎకరాలను మాత్రమే అదనంగా సాగులోకి తీసుకురాగలిగారు.

2, ప్రభుత్వం ప్రత్యేక కార్యక్రమాలు ప్రారంభించి కొన్ని కోట్ల రూపాయలు వెచ్చించినప్పటికీ 1951 లో అంచనాలు చూసేసరికి 1949,1950 సంవత్సరాలలోకంటె ఆహార వస్తువులను పండించే భూమి 87000 ఎకరాలు తగ్గింది. దీనికి కారణం వ్యాపార పారిశ్రామిక వస్తూత్పత్తికోసం భూమిని అధికంగా సాగులోకి తీసుకురావడం.

భారతప్రభుత్వం తయారుచేసిన పంచవర్షప్రణాళికలో పెద్ద ప్రాజెక్టుల ద్వారా అదనంగా భూమిని సాగులోకి తెచ్చి ఆహార వస్తూత్పత్తిని వృద్ధిచేయడానికి నిర్ణయించబడింది. అయితే ప్రణాళిక అయిదేళ్ళ అనంతరంగానిస్వయంసమృద్ధత లభించదని ప్లానింగ్ కమిషన్ ముందుగానే హెచ్చరించింది. ప్రాజెక్టులలో చాలవరకూ 1956 తరవాత చాలకాలానికి కాని పూర్తికావు. కొన్ని ప్రాజెక్టులవల్ల ఈలోగానే అదనంగా భూమిని సాగులోకి తేవడానికీ, రెండో పంటకు అదనంగా నీటిని సప్లై చేయడానికీ వీలున్నప్పటికీ, వీనిమూలంగా వృద్ధి కాగల ఆహారంతో స్వయం సమృద్ధత సిద్ధించదు. 1950—51 లో దేశంలో పంట అంచనా 5 కోట్ల 27 లక్షల టన్నులు. 1955—56 కి, అనగా ప్రణాళిక ఆఖరుకి పంట 6 కోట్ల 16 లక్షలకు పెరుగుతుంది. కాని మొత్తం 75 కోట్ల టన్నులు ఉత్పత్తి అయేవరకూ అవసరాలు తీరవని ప్లానింగ్ కమిషన్ అభిప్రాయం. ఎంతవరకూ ఉత్పత్తిని వృద్ధిపరచడానికి వీలుంటుందో గమనించి, మొత్తం 2%, 3% వరిధాన్యం లోటు గాక తప్పదని ప్లానింగ్ కమిషన్ హెచ్చరించింది. ఈ లోటుమేరకి గోధుమపంటను వృద్ధిచెయ్యడానికి (రెండో పంచవర్ష ప్రణాళిక సమయానికి మాత్రమే) వీలుంటుందని అంచనా వేసినందువల్ల బియ్యంపైన ఆధారపడేవారు కొంత గోధుమవాడకం కూడా అలవరచుకోవలసిన అగత్యం కలుగుతున్నదని ప్లానింగ్ కమిషన్ నివేదించింది.

ప్రభుత్వం తలపెట్టిన పెద్దపెద్ద ప్రాజెక్టులు పూర్తయి అనుకున్న విధంగా ఫలించినట్లయితే 1956 కి కాకపోయినా, తిరువాత కొన్నేళ్లకయినా ఆహారవస్తువుల కరువు తీరిపోగలదని ప్లానింగ్ కమిషన్ అభిప్రాయపడుతున్నది.

అయితే ఈ అంచనాలన్నీ ప్రజలందరికీ చాలీచాలని ఆహారం దామాషాను 8 ఔన్సుల ప్రమాణాన్నిబట్టి గుణించినవి. పాశ్చాత్యుల ప్రమాణాల్నిబట్టి కనీసం 19 ఔన్సుల చొప్పున ఆహారం చేకూర్చాలంటే చాలినంతగా ఉత్పత్తి చేసుకోడం కష్టమే నని పించక మానదు. అందువల్లనే ప్లానింగ్ కమిషన్ నిర్ణయాలలో ప్రజల కొనుగోలుశక్తి దేశీయవస్తుసంపదలను వృద్ధిచేయడం ప్రధానలక్ష్యంగా పరిగణించబడింది.

మొత్తంమీద భారతదేశంలో కనీసం పదేళ్ళవరకైనా జనాభాకి చాలినంత ఆహారం లేదనే పరిస్థితికి సమ్మతించవలసివస్తున్నది.

ప్రపంచ జనాభాసమస్యను వివరిస్తూ ప్రొఫెసర్ ఫ్లాగెల్ ఎప్పుడో భవిష్యత్తులో వస్తూత్పత్తిని వృద్ధిచేసి అందరికీ ఆవస్తుసంపదను అందుబాటులోకి తేగల సామాజిక ఆర్థిక రాజకీయ సంస్కారాలను ప్రవేశపెట్టి, సమస్యను పరిష్కరించవచ్చునని చెప్పడంవల్ల ప్రయోజనం లేదన్నాడు. ఇప్పుడున్న పరిస్థితుల్నిబట్టి ఆహారవస్తు సంపద వృద్ధి కావలసిన అగత్యాన్నీ ప్రజల కొనుగోలు శక్తినీ వృద్ధిపరచవలసిన అగత్యాన్నీ భారతప్రభుత్వం గుర్తించి తత్ప్రకారం పంచవర్షప్రణాళికను నిర్ణయించింది.

అయితే జనాభాసమస్య అనేది అన్ని దేశాలకూ ఒకరీతిగా లేదు. ప్రొఫెసర్ ఫ్లాగెల్ ఈ సందర్భంలో దేశాలను రెండు రకాలుగా విభజనచేశాడు. 1. జనన మరణాల తగ్గుదలవల్ల జనాభా పెరుగుదల సమస్య లేని దేశాలు - ఇవి ఉత్తరమెరికా, బ్రిటన్, జపాన్, పశ్చిమయూరప్, దక్షిణమెరికాలో బ్రెజీల్ మొదలైన కొన్ని దేశాలు. 2. జనన మరణాలు అధికమై జనాభా పెరుగుదలవల్ల కూడా బాధపడే దేశాలు. ఇవి భారతదేశం, చీనా, ఈజిప్టు, ఇండొనీషియా, తూర్పు యూరప్, మొదటి తరగతి దేశాలలో ఫ్రాన్సు, ఆస్ట్రియా, ఆస్ట్రేలియాలలో జనాభా తగ్గుతున్నందువల్ల దేశరక్షణసైన్యాలకోసం కాని పారిశ్రామిక వ్యావసాయిక కృషికి గాని తగినంత బలగం చాలడంలేదు. ఫ్రాన్సులో ముఖ్యంగా సంతాన నిరోధవిధానమే ఇందుకు కారణమని చెప్పబడుతున్నది. ప్రజల జీవన విధానంలోకూడా దాదాపు ఈ రెండురకాల విభజనను బట్టే హెచ్చుతగ్గులు కనబడతాయి. ఉత్తరమెరికా పశ్చిమయూరప్, జపాన్‌లలో ప్రజల జీవన సదుపాయాలు అధికం. మిగిలిన దేశాలలో సర్వత్రా దారిద్ర్యం తాండవిస్తున్నది.

దక్షిణమెరికా, ఆఫ్రికా, ఆస్ట్రేలియాలలో ఇంకా అనేక లక్షలమంది ప్రజలు సుఖజీవనం గడపడానికి అవకాశం వున్నది. కాని ఆయా దేశాలలో వలస లేర్పరుచుకున్న శ్వేతజాతులవారి జాతి తారతమ్య వైఖరివల్ల అధిక జనసంఖ్యవల్ల బాధపడుతున్న దేశాలనుంచి ప్రజలు వలస వెళ్ళడానికి వీలులేకపోతున్నది.

జనాభాసమస్య పరిశీలనలో దేశీయ వస్తూత్పత్తితోపాటు వ్యక్తిగతమైన ఆర్థిక సమస్యనూ, ప్రజారోగ్యం, సామాజిక జీవనంపైగల ప్రభావాలను కూడా ప్రధానమైనవిగా పరిగణించాలి. భారతదేశంలో పరిస్థితుల్ని పరిశీలించినట్లయితే, ఇవెంత ప్రధానమైనవో తేటపడుతుంది. కుటుంబంలోని వ్యక్తులందరూ సంపాదనపరులైనప్పటికీ కావలసిన ఆహారసామగ్రిని సేకరించలేని కార్మిక కర్షక జనులే కాక ఒక్క సంపాదనపరునిపైన కుటుంబమంతా ఆధారపడుతున్న మధ్య తరగతి ప్రజలు కూడా ఆకలికి గురౌతున్నారు. నిత్యజీవనంలో కనీసావసరాలు మధ్య తరగతి ప్రజలకు కూడా కరువౌతున్నాయి. ముఖ్యంగా దుస్తులు, నివాసాలు, విశ్రాంతి మొదలైనవి సుఖజీవనానికి యోగ్యమైన రీతిని సమకూరడం లేదు. ఇదేరీతిగా పైన చెప్పబడిన రెండో తరగతి (పేద) దేశాలలో కూడా జనాభా సమస్య వ్యక్తిగత జీవన సదుపాయాలకు కరువు తెచ్చిపెడుతున్నది.

జనాధిక్య సమస్య పరిష్కారానికి సూచింపబడిన మార్గాలలో ప్రస్తుతం ఆచరణసాధ్యమైన వేవీ కనపడవు. ఇందుకు ముఖ్య కారణం జాతిభేదాలని చెప్పకతప్పదు. ఇది నివారణయిన పక్షంలో, చాలవరకు అధిక జనసంఖ్యగల దేశాలనుండి అల్ప జనసంఖ్యగల దేశాలకు వలస ఏర్పాటుచేయడం ద్వారా అధిక వస్తూత్పత్తికీ, వస్తుసముదాయం అందరికీ అందుబాటులోకి తీసుకరావడానికీ అవకాశం కలుగుతుంది. కాని అల్ప జనసంఖ్య గల దేశాలు పాశ్చాత్యుల అధీనంలో ఉన్నంతవరకూ ఇది సాధ్యపడదు. జాతిభేదాలకు అతీతమైన స్వాతంత్ర్యవ్యవస్థ ఆదేశాలకు చిక్కినప్పుడు కొంతైనా సమస్య పరిష్కరించబడవచ్చును. అప్పుడైనా వలస వెళ్లవలసిన శ్వేతేతరజాతులవారు పెట్టుబడికి అవసరమైన ద్రవ్యబలాన్నీ, యంత్రనిర్మాణ నైపుణ్యాన్నీ, భారీయంత్ర పరిశ్రమ

లను నడుపగల విజ్ఞానాన్నీ అలవరచుకోవలసిన అగత్యం ఉంటుంది. అంటే శ్వేతజాతులకూ శ్వేతేతరజాతులకూ మధ్య సంబంధ బాంధవ్యాలు పూర్తి మారిపోయినప్పుడు కాని ఇది సాధ్యపడదు.

వలస విధానం సాధ్యపడనంతవరకూ ఏ దేశాని కా దేశం ఈ సమస్యను పరిష్కరించుకోడం అవసరమౌతుంది.

జనాభా సమస్యను పరిష్కరించడానికి సమస్య స్వరూపాన్నీ, సంభవించగల ప్రమాదాన్నీ గుర్తించి సంతానోత్పత్తిని తగ్గించడానికి నిగ్రహం అలవరుచుకోడం అవసరమని మాల్తుస్ ఆదేశించాడు. మాల్తుస్ వాదాన్ని అంగీకరించినవారిలో తరువాత చాలమంది నిగ్రహం అనేది మానవులకు సులభసాధ్యం కాదనీ, సాధ్యమైనప్పటికీ వ్యక్తుల మనస్తత్వాలలో విపరీత లక్షణా లుత్పన్నమై సమాజశ్రేయస్సుకు విరోధంగా పరిణమించగలవనీ వాదించారు. అందువల్ల నిగ్రహంతో నిమిత్తంలేకుండా కృత్రిమ సాధనాలవల్ల సంతానోత్పత్తిని నిరోధించాలని వీరు ప్రచారంచేశారు. ఈ వాదాన్ని నియోమాల్తూషియనిజమ్ అన్నారు.

సంతాన నిరోధానికి కృత్రిమ సాధనాల నుపయోగించి జనసంఖ్యలో పెరుగుదలను అరికట్టిన నిదర్శనం ఫ్రాన్స్‌లో కనపడుతుంది. 19 వ శతాబ్దం అంతిమ సంవత్సరాలనుండీ ప్రారంభమైన ఈ సాధనాల ప్రయోగంవల్ల ఫ్రాన్స్‌లో జనాభా పెరుగుదల అరికట్టబడింది. అంతే కాదు. యుద్ధాలవల్ల అపార జననాశనం సంభవించిన కారణంగా జనసంఖ్యలో ఏటేటా తగ్గుదల కనపడింది. రెండో ప్రపంచయుద్ధం అనంతరం ఫ్రాన్స్‌లో సైనిక బలాభివృద్ధికీ, పారిశ్రామిక వ్యావసాయిక వృద్ధికీ అవసరమైన బలగం కొరవడింది. జనాభా పెరగవలసిన అవసరం పెద్దసమస్యగా పరిణమించింది. అయితే ఫ్రాన్స్ సమాజ జీవనంలో స్త్రీ పురుషులకు సంతాననిరోధ పరికరాల వినియోగం అభ్యాసమై స్థిరపడినందువల్ల ఇప్పుడు జనసంఖ్యను వృద్ధిపరచవలసిన అగత్యం వ్యక్తిగతజీవనంలో పరిగణించబడ్డం లేదు. సంతాన నిరోధం అవసరమైన దేశాలలో సమాజజీవన విధానమూ ప్రజల అభిమతమూ సంతాన నిరోధానికి విరుద్ధంగా ఉండగా, సంతానోత్పత్తి వృద్ధి అవసరమైన ఫ్రాన్స్‌లో ప్రజల అభిమతం ఇందుకు విరుద్ధంగా ఉండడం చిత్రంగా కనపడుతుంది.

భారతదేశంలో జనాధిక్యత సమస్యను మూడు అంశాలుగా పరిశీలించవచ్చును.

1. దేశీయార్థిక సమస్య.
2. నైతిక సమస్య
3. వ్యక్తిగతమైన సమస్య.

1. భారతదేశంలో వ్యావసాయిక పారిశ్రామికాభివృద్ధికి అపారమైన అవకాశా లున్నాయని అందరూ అంగీకరించిన విషయమే. నేటి పరిస్థితిలో జాతీయార్థిక సూత్రాలనుబట్టి చూస్తే పారిశ్రామిక రంగము, వ్యవసాయ రంగము పరస్పర విరుద్ధంగా వర్తిస్తున్నాయని డా॥ మామోరియా అన్నారు.

వ్యవసాయంపైన ఆధారపడే జనం అత్యధికంగా ఉన్నారు పట్టణాలలో వృత్తిదొరకక దారిద్ర్యంతో బాధపడేవారు అనేకు లున్నారు. సాగవుతున్న భూమిని అంటిపెట్టుకున్న జనం 1911లో దాదాపు పదికోట్లమంది ఉన్నారని బ్రిటిష్ ఇండియా ప్రభుత్వం అంచనావేసింది. 1931 కి మరొక కోటిమంది అధికమైనారు. దీనివల్ల రైతుల అధీనంలో భూమి అంతా చిన్నచిన్న ఖండాలుగా విడగొట్టబడ్డమూ, వ్యవసాయానికి అవసరమైన పెట్టుబడికి రైతుకి తాహతు తగ్గిపోడమూ జరిగింది.

రైతులకు ఒక్కొక్కరికి కనీసం 7 ఎకరాలైనా లభించేలా చెయ్యాలన్నా కూలీల రద్దీ తగ్గాలన్నా కనీసం సగంమందిని కుటీర పరిశ్రమలకు భారీ పరిశ్రమలకు తరలించాలని ఆర్థిక శాస్త్రవేత్తలు అభిప్రాయపడ్డారు. ముఖ్యంగా పల్లెప్రాంతాలలో పరిశ్రమలు అనేక రెట్లు వృద్ధి చెందవలసిన అవసరం ఉంటుంది. తరవాత వ్యవసాయ విధానాలను ఆధునిక శాస్త్రరీతుల ప్రకారం సంస్కరించినట్లయితే ఆహారోత్పత్తి వృద్ధి చెందగలదు.

పెద్ద పెద్ద ప్రాజెక్టులవల్ల కొత్తగా భూమిని సాగులోకి తెచ్చినా, ప్రస్తుత ఉత్పత్తిని ఉత్తమ విధానాలవల్ల వృద్ధి పరిచినా ప్రజల కొనుగోలుశక్తి వృద్ధిచెందాలంటే పరిశ్రమలు వృద్ధి కావలసిన అవసరం ఉంటుంది.

ఈ విధానాలవల్ల వస్తూత్పత్తి చాలవరకు వృద్ధిచెందవచ్చును. కాని జనాధిక్యత అప్పటికికూడా తీరదని కొందరి అంచనా.

ఎన్ని ఆర్థికాభివృద్ధి కార్యక్రమాలను అమలు జరిపినప్పటికీ జనాభా పెరుగుదలను కొంత నిరోధించడం అవసరమని అందరూ అంగీకరిస్తున్నారు. కమ్యూనిస్టులవాదం వాస్తవమే కావచ్చును. దేశీయ సంపదను వృద్ధిపరిచినట్లయితే దుర్భిక్షాన్ని నివారించడం సాధ్యపడవచ్చును. కాని కమ్యూనిస్టుల కార్యక్రమాలప్రకారం కూడా దుర్భిక్షం పూర్తిగా నివారణ కావడానికి కనీసం మూడు దశాబ్దాలు పట్టగలదు. రష్యాలో ఈ సంవత్సరం ప్రారంభించబడుతున్న పంచవర్ష ప్రణాళిక అనంతరం, ప్రణాళిక ఆశయాలన్నీ సఫలమైనప్పుడే సర్వత్రా సమృద్ధి కనపడుతుందని అంచనా వెయ్యబడింది. అంటే యుద్ధకాలపు నష్టాలను మినహాయించుకుంటే నాలుగు పంచవర్ష ప్రణాళికలలో కాని రష్యా సమృద్ధసంపదను సాధించలేకపోయిందనుకోవాలి. చీనాలో సమృద్ధ వ్యవస్థ సాధించడం ఎప్పుడు సాధ్యపడుతుందో అంచనా వెయ్యడానికి అప్పుడే ఆధారం లేదని చెప్తున్నారు.

ప్రభుత్వ ఆధ్వర్యంకింద వస్తూత్పత్తి కార్యక్రమాలప్రకారం వృద్ధిచెందించగల సోషలిస్టు వ్యవస్థలేని భారతదేశంలో దారిద్ర్య నివారణకు చాలా దశాబ్దులు పట్టవచ్చును. అమెరికాలో చిరకాల కృషిఫలితంగా వస్తూత్పత్తి వృద్ధి చెందింది.

అందువల్ల సమృద్ధివ్యవస్థ సిద్ధించేలోగా నైనా ప్రజలు జనాభా పెరుగుదలను అరికట్టవలసిన అవసరాన్ని గుర్తించాలి.

2. జనాభా పెరుగుదలను అరికట్టాలంటే పాశ్చాత్యనిపుణులు చేసిన సూచనలు హాస్యాస్పదంగా

ఉన్నాయి. నేటి ఆధునిక జీవనంలో వ్యక్తులు సమాజంపట్లనూ, ప్రభుత్వం ప్రజలపట్లనూ బాధ్యతను గుర్తెరిగిన నేటి పరిస్థితిలో మలేరియా క్షయవంటి రోగాలవల్ల క్షామాలవల్ల జనక్షయం జరుగుతుంటే చూస్తూ ఊరుకోడం క్షంతవ్యయం కాదు. జాతి పునరుజ్జీవనానికీ చైతన్యానికీ యుద్ధాలు అవసరమని ఈ శతాబ్దారంభంలో జర్మన్ శాస్త్రవేత్తలు కొందరు చెప్పినమాట కిప్పుడు ఎవ్వరూ విలువకట్టలేరు. మానవుడు సంఘజీవి అని అంగీకరించినప్పుడు క్షామాలకు యుద్ధాలకు జనసమూహాలను బలియివ్వాలనడంలో అర్థం లేదు.

ఇంక మిగిలినమార్గం సంతాన నిరోధం ఒక్కటే. మాల్థుస్ తన వ్యాసంలో నిగ్రహాన్ని మాత్రమే సూచించాడు. క్రైస్తవమత భక్తులు సంతాన నిరోధానికి వ్యతిరేకులు—వారు సర్వం భగవంతునిపై భారం, విడిచిపెట్టి ప్రజలను వారి పాపాలకు ప్రాయశ్చిత్తం అనుభవించాలంటారు. కాని వివిధమతాల అనుయాయులు కర్మసిద్ధాంతంవంటి వానిని బోధించినా మానవుల కృషిపట్లనే విశ్వాసంగల నేటి ప్రజలు పరిష్కారమార్గాలను అనుసరించకతప్పదు.

గాంధిమహాత్ముడుకూడా సహజ నిగ్రహాన్నే బోధించాడు' కాని అందరూ గాంధిమహాత్ములు కాలేరని అంగీకరించక తప్పదు. ఏవిషయంలోనూ నిగ్రహంతో నిమిత్తం లేకుండా జీవించనేర్చిన ప్రజలకు ఈ ఒక్క విషయంలో నిగ్రహం సాధ్యం కాగలదంటే నమ్మడం తరం కాదు. వాస్తవపరిస్థితులు నిగ్రహానికి అనుకూలంగా లేవని అంగీకరించక తప్పదు. జీవనోపాధికీ, సమాజంలో ఉన్నతి సాధించడానికీ స్వయంకృషిపైనే ఆధారపడుతూ, ఇట్టికృషిలో నీతికెంత స్థానమున్నదో అవినీతికి కూడా అంతే స్థానమున్నదన్నట్లు, సమాజజీవనం ఇప్పుడు సాగిపోతున్నది. సమాజశ్రేయస్సు నుపయోగించడానికి వీలులేని స్థితి వచ్చినదనీ, పరిస్థితులే బలీయమైనవనీ, వ్యక్తుల కవి అతీతమైనవనీ, ఏదైనా అకార్యం చేయవలసివస్తే నలుగురితోపాటే చేస్తున్నామనీ, నిరోధించగల శక్తి వ్యక్తులచేతులలో లేదనీ, వీనిని అందువల్ల సమాజంలో ఉన్నతి పొందడం పరమధర్మమైనప్పుడు ఇతర ధర్మాలన్నీ ప్రధానం కాజాలవనీ—ఇట్టి విశ్వాసాలు ప్రబలిన నేటి జీవితంలో నిగ్రహం అసాధ్యం.

సంతాననిరోధానికి కృత్రిమ పరికరాల నుపయోగించక తప్పని స్థితి వచ్చింది. భారతప్రభుత్వం దీనికి సమ్మతి తెలిపింది. సంతాన నిరోధం ప్రోత్సహించడానికి వైద్యాలయాలు కృషి చేస్తున్నాయి. దీన్ని అధికారరీత్యా ప్రోత్సాహపరిచిన దేశం ప్రపంచంలోకెల్ల మొట్టమొదటిది భారతదేశమే.

భారతప్రభుత్వం సంతాన నిరోధానికి సమ్మతించిన దంటే ఇందులో అవినీతి లేదని విశ్వసించడమే కారణం. వివిధ జాతుల మధ్య సంఘర్షణ అనివార్యమైన పురాతన కాలంలో ప్రజోత్పత్తి వృద్ధి మానవుల ధర్మమని బోధించిన పురాణకాలపు సిద్ధాంతాలను బట్టి సంతాన నిరోధం అవినీతికరమైనదని అనడం ఈనాడు అనవసరం. ఈ వాదంలో సారం లేదు.

నీతి, అవినీతి, అనేవి సమాజశ్రేయస్సుదృష్ట్యా నిర్ణయం కావాలి. మానవుడు సంఘజీవిగా ఇరుగుపొరుగుల మధ్యనూ బంధుమిత్రులతోనూ సఖ్యతతో మెలగడానికీ, తనపట్ల జరుగరాదనుకునే అపచారాలను ఇతరులపట్ల జరపకుండా ఉండడానికీ కుటుంబంపట్ల, సమాజంపట్ల దేశంపట్ల కుటుంబంలో, సమాజంలో, దేశంలో ఒకనివలె ప్రవర్తించడంలో నీతి ఉన్నది. సంతాన నిరోధం అవినీతికి దారితీయదు. నియమాలూ నిషేధాలూ వ్యక్తి వికాసానికీ, వ్యష్టిజీవనానికీ నిరోధమై నిలిచినప్పుడు నియమాతిక్రమణ సంభవిస్తుంది. ఈనాడు సమాజంలో అవినీతి ఎక్కడైనా ఉన్నదంటే కారణం విశృంఖలత కాదు; అనుసరించడానికి వీలులేని నియమాలు. అవసరాన్ని బట్టి అవకాశాలు లభించనీయని పరిస్థితులు కారణాలు, సముచితమైన అవకాశాలు లోపించినప్పుడు, పరిస్థితులు సహజమైన కోర్కెలకు ప్రతికూలించినప్పుడు వ్యక్తి వీనినుండి విడివడి విశృంఖలంగా ప్రవర్తించడానికి యత్నిస్తాడు. అంతే కాని సమాజశ్రేయస్సుకోసం నిర్ణయమయ్యే నియమాలవల్ల మానవుడు విశృంఖలంగా ప్రవర్తించి అవినీతిపరుడౌతాడన్నది సత్యం కాదు. సంతాన నిరోధంకోసం కృత్రిమ పరికరాల నుపయోగించి కాని, ఇతర ఉపాయాలవల్ల కాని సహజ వాంఛలను కూడా తీర్చగల అవకాశాన్ని కలిగించినప్పటికంటె, నిగ్రహంవల్ల సహజ ప్రకృతిని బలవంతాన అణచుకోవలసినప్పుడు అవినీతికి ఎక్కువ తావేర్పడుతుంది.

3. సంతాన నిరోధానికి కృత్రిమ సాధనాల నుపయోగించవలసిన అవసరం వ్యక్తిగతావసరాలనుబట్టి మరింత స్ఫుటంగా గోచరిస్తుంది. బలవంతాన అణచుకున్న సహజ వాంఛలు అన్యమార్గాలద్వారా విపరీత పరిణామాలకు దారితియ్యగల ప్రమాదం ఉంది. ఇది నేడు మన సమాజంలో అనేక రూపాలలో ప్రత్యక్షంగా బుజువౌతున్నది. అణచుకున్న వాంఛలవల్ల రాక్షసప్రకృతి వ్యక్తమై అన్యులకు హానికలిగించే నిదర్శనాలు అనేకం. కొద్దిగానో గొప్పగానో ఇట్టి రాక్షసప్రకృతులు మన దురదృష్టంవల్ల ఈనాడు తరుచు కనపడుతూనే ఉన్నాయి. గాఢ పరిశీలన జరిపినట్లయితే అకారణ అకృత్యాలకు చాలవరకు ఇదే కారణంగా కనపడుతుంది.

ఇదిగాక మనదేశంలో స్త్రీలకు ఏభాగ్యం కొరవైనా సంతానభాగ్యానికి ఎన్నడూ లోటులేదు. సంతానవతులు కానివారు అరుదు. అతి సంతానవతులు అత్యధికులు. పధ్నాలుగు సంవత్సరాలకే యువతులు తల్లులు కాగలగడం పాశ్చాత్యులకు వింతగా కనపడవచ్చును కాని, ఇలాంటివారు మనదేశంలో కోకొల్లలుగా ఉన్నారు. ఇరవై సంవత్సరాలకే ఐదారు కాన్పులు కని వృద్ధాప్యం స్థితి తెచ్చుకున్నవారు అరుదు కాదు. స్త్రీలు జీవితానుభవంలో పరిపక్వం చెంది పూర్ణగైహిక సుఖాన్ననుభవించగల వయస్సు రాకముందే తల్లులై దేహదారుఢ్యాన్ని కోల్పోతున్నందువల్ల జీవితసారాన్ని అనుభవించలేక నిరాశ నిస్సత్తువలవల్ల జీవితాలను వ్యర్థపుచ్చుతున్నారు. పూర్వశృంగార కావ్యాలను గమనించినా లేక ప్రస్తుతానుభవాన్ని పురస్కరించుకొని గమనించినా శృంగారసాఫల్యానికిగాని సంసార సౌఖ్యానికిగాని మనోవికాసము, హృదయపరిపక్వత ఎంత అవసరమో బోధపడుతుంది. పుష్పవతులయే వయస్సుకి హృదయ పరిపక్వత చేకూరదు; దేహపుష్టి పూర్తికాదు. మనోవికా

సానికీ, శాంత ప్రణయానికీ, ఆరోగ్యపూర్ణమైన సంసార జీవనానికీ పదహారేళ్లు నిండాలని పూర్వులు నిర్ణయించారు. ఆహార లోపంవల్ల కాని, దైనిక జీవితంలో అలవాట్ల మార్పువల్ల కాని, జన సామాన్యంలో ప్రస్తుత ఆరోగ్యపరిస్థితులవల్ల కాని ఈ మానసిక, దైహిక వికాసాల సమశ్రుతి భగ్నమయింది. దేహపుష్టి చేకూరక ముందే వాంఛ లలవడుతున్నాయి. ఈ పరిస్థితులను మార్చడం ఇప్పుడు కష్టసాధ్యం. కాని, కృత్రిమ సాధనలవల్ల యువతుల ఆరోగ్యాన్ని వారి సంతానం ఆరోగ్యాన్నీ కాపాడవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. వాస్తవ స్థితి గతులను గమనించకుండా నియమాలను విధించినట్లయితే సంభవించే అవినీతికి విచారించి ప్రయోజనం లేదు.

సంతాన నిరోధానికి నేటి వ్యక్తిగత ఆర్థికస్థితికూడా అవసర కారణమాతున్నది. మధ్యతరగతి ప్రజలలో ఆర్జనపరులు తక్కువ. కాగా నేటి మధ్యతరగతి ప్రజల ఆర్జన పెద్ద కుటుంబాల మాట అటుంచి చిన్న కుటుంబాల పోషణకే చాలడం లేదు. కర్షక కార్మికులకు సంతానం అధికమైతే ఆర్జనకు అవకాశమెక్కువని తృప్తిచెందడం న్యాయం కాదు. వయసురాని పసివారు అల్పవయస్సులోనే జీవనభృతికోసం పనిపాటులకు పోవడం సమాజానికి శ్రేయస్సు కాదు. వారిలోకూడా సంతానం పరిమితమైనప్పుడే—అల్పంగానైనా విద్య నేర్పించడానికీ, సమాజంలో వారుకూడా ఉన్నతిపొందడానికీ అవకాశం ఏర్పడుతుంది. సంతతిఅధికమైనప్పుడు బిడ్డలలో పెద్దవారిని వయస్సుకుమీరిన దేహపరిశ్రమకు బలిచెయ్యడం జరుగుతున్నది. దీనివల్ల సమాజంలో అశాంతి, సంఘర్షణలు, అనారోగ్యము వ్యాపించక తప్పదు. అందువల్ల మధ్యతరగతిలోనూ, కర్షక కార్మిక తరగతులలోనూ సంతాన నిరోధం వ్యక్తిగత ఆర్థిక సమస్యలదృష్ట్యా అవసరమని గమనించకతప్పదు. సహజవాంఛల నరికట్టవలసిన అవసరం లేకుండానే స్త్రీల ఆరోగ్యాన్నీ వారి సంతానం ఆరోగ్యాన్నీ కాపాడ్డానికి సంతాననిరోధ సాధనాలు అవసరమని అంగీకరించక తప్పదు.

సంతాన నిరోధం అంటే పరిమిత సంతానం అని మాత్రమే అర్థం. అయితే ఈ పరిమితి ఎలా నిర్ణయించబడాలనే విషయంపైన అనేకాభిప్రాయాలున్నాయి. ఈ సందర్భంలో స్త్రీల సహజమాతృవాంఛను మరిచిపోరాదు. సంతానహీనులై ఉండడం ఎవరో కాని సమ్మతించలేని విషయం. ఇంక బిడ్డలు ఒక్కరొక్కరే ఉండాలా ఇద్దరుండాలా ముగ్గురుండాలా అనే చర్చ అనవసరం. ఎంతమంది ఉండాలనేది ఎవరి పరిస్థితులనుబట్టి వారే నిర్ణయించుకోవలసిన విషయాలు. ఆర్థికబలం కలవారికి ఒకరిద్దరితో తృప్తిచాలనప్పుడు అధికంగా ఉండవచ్చును. అంతగా ఆర్థిక బలం లేనివారు అంతతోనే తృప్తిచెందవలసి రావచ్చును. ఆర్థిక దృష్టికంటె ముఖ్యం స్త్రీల ఆరోగ్యం. కొందరి స్త్రీల ఆరోగ్యాన్నిబట్టి అసలు సంతానం ఉండరాదని నిర్ణయించవలసి ఉంటుంది. అట్టి స్త్రీలసంతానం పుట్టి ప్రపంచంలో శాపహత జీవనం గడపడంకంటె పుట్టకపోతే మేలు. సంతానపరిమితిని ఆరోగ్యవంతులైనవారు ఆర్థికస్థితినిబట్టీ, ఆర్థికసంపదగలవారు ఆరోగ్యాన్నిబట్టీ నిర్ణయించుకోడం ఉత్తమవిధానం.

ఎవరి తాహతునుబట్టి వారు, ఎవరి కొనుగోలు శక్తినిబట్టి వారు తమ సంసారాలలో ఎంతవరకూ సంతతి అనుకూలమో నిర్ణయించుకొని సంతాననిరోధ కార్యక్రమాన్ని అనుసరించినట్లయితే, వ్యష్టి సమస్య, దేశీయార్థికసమస్య, జనాధిక్యసమస్య కొంతవరకు పరిష్కరించబడగలవు.

జనాభా పెరుగుదలవల్ల దుర్భిక్షం మరింత తీవ్రం కాకుండా చెయ్యాలంటే ప్రజలు సంతాననిరోధానికి సమ్మతించాలి. సమ్మతించి ఎవరి ఆర్థికస్థితిని వారు చక్కబరుచుకో గలిగితే తప్పకుండా వ్యక్తుల వ్యష్టిజీవనం సౌఖ్యవంతం కావడంతోపాటు, జాతీయ జనసంఖ్యవృద్ధి సమస్యను కొంతవరకూ తీర్చగలిగినవారౌతారు.



# స్వాగతము

★

శ్రీ చల్లా లక్ష్మీనారాయణశాస్త్రి

శ్రీమన్నందన నామక ప్రభువు వేం - చేసెన్ గదాయంచు నెం
తో మోదమ్మున దీరు బారుగ వసం - తున్ గూడి వాసంతికా
ప్రేమోద్యాన విహారుడై విజయుడే - విచ్చేసె వెండింక లెం
డో మున్ముందు గ స్వాగతం బిడగరం - డో భారతీయ ప్రజల్!

స్వస్త్యస్తు విజయవత్సర ధన్యచారిత్ర - మహితాత్మునకు విశ్వమంగళునకు
భద్రమస్తు స్వరాష్ట్రపదవీ ప్రదానైక - బద్ధకంకణునకు ప్రబుద్ధ మతికి
శుభమస్తు సస్య సంశోభిత సర్వ స - ర్వంసహా చక్ర సంపాదకునకు
గళ్యాణమస్తు దిగ్వలయ పూరిత కీర్తి - విస్తారునకు జగద్వినుత మతికి
ఖ్యాతి సంసిద్ధిరస్తు విద్యా వివేక - వితరణాది ప్రదాన వివేకశాలి
కతులితా నంద మస్తు రాజాధి రాజ - వినుత చరణారవింద దోర్వీర్యఖనికి

మొన మొన్నన్ మననందనాహ్వయమహా - పుణ్యాత్ము పుణ్యమ్మునన్
దన సత్పుత్రుని దెల్గు దల్లి యొకయాం - ధ్రజ్యోతి గోల్పోయె బా
వనచారిత్రుని రాష్ట్ర సాధన తపః - ప్రావీణ్యునిన్ గాంధి శి
ష్యుని శ్రీవిక్రమ సింహపట్టణనివా - సున్, ధీరు, శ్రీరామునిన్

మ్రుక్కడి చావు చావక యపూ - ర్వగతిన్ నిజరాష్ట్ర సిద్ధికై
యొక్కడు జచ్చినన్ బ్రజల - "కొజ్జ" యితండని రూఢి చేసి తా
నక్కట! నందనుం డరిగి - నంత జయమ్ము జయంబి దే జయం
బొక్కట నాంధ్ర రాష్ట్రమున - కొప్పెనన్ విజయుండు దోచెగా!

అదిగో కోకిల పంచమమ్ము నను రా - గాలాపముల్ జేసి నె
మ్మదిగా నామని మావిలేజిగురు జొం - పమ్ముల్ దమిన్ మెక్కి పా
డ దొడంగెన్ గనుగొంటిరే - నెమళు - లాడన్ జొచ్చె బింఛమ్ము లొ
క్కడెసన్ విప్పి-భిరాన స్వాగత మి - డంగా లేచి రండో ప్రజల్!

---

# కాటమరాజు కథ

★

శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య

"రామాండకత లంటె మే మెఱుంగనివనా
కాటమరాజుకు కర్ణుఁ డోడె
భారతకతలోన బాలరా జొక్కఁడు
కుంబకర్ణునిఁ బట్టి గుద్ది జంపె
భాగోతకత కంటపాటమె అందులో
యిగివేశుఁ డర్జును నిరగఁ బొడిచె
కందపురాండంబు కత పిల్లకాశేరి
యీరబద్రుని యిసియించి చంపె."

[1] మూర్ఖ శతకములోని యీ పద్య మే సందర్భమునందుఁ జెప్పఁబడినదో యేమో కాని రామాయణము, భారతము మొదలగు పురాణములను మాత్రమే కాక పలనాటి వీరచరిత్రము, కాటమ రాజు కథ యను వీరపదములను గూడ వినియుండి నామమాత్ర పరిజ్ఞానము మాత్రమే గలిగియుండిన యొకానొక పల్లెటూరి వాని యజ్ఞానమును వెల్లడిసేయుచు నిది మనోహరమై, హాస్యరసజనకమై యున్నది. పలనాటి వీరచరిత్రము, కాటమరాజుకథ యను దేసి కథారచనములు పల్లెటూరివారికిఁ బరమప్రియములు. భారతాదులకు వలె నవి వారికి గౌరవార్హములు.

తెలుఁగు భాషలో వెలసిన రచనములను ప్రధానముగా రెండు దెఱఁగుల విభాగింపవచ్చును. సంస్కృత చ్ఛందోనుసారముగా నక్షర గణములతోఁ జంపకోత్పలాది వృత్తరూపమున సంస్కృత పద జటిలమైన రచన మొకటి. భారతవర్షమున కెల్లను సామాన్యము లయిన భారత రామయణాది గ్రంథార్థములు తెలుఁగున నిట్టి రచనములతో వెలసినవి. మాత్రాగణ ఘటితమై తాళ లయాన్విత మగు ఛందోబంధము గలిగి దేసి పలుకులతో నంధ్రదేశమునకు సహజమై వెలసిన రచన మింకొకటి. ఈ దేసిరచనములయం దంధ్రుల ప్రత్యేక ధర్మము స్పష్టముగాఁ బరిస్ఫుట మగుచుండును. పాటలు, పదాలు, రగడలు, ద్విపదలు, సీసములు, అక్కరలు, తరువోజలు, మొదలగు దేసి వృత్తము లీ జాతిరచనములందు విశేషముగా నుండును. వీని యందలి యితివృత్తములు ప్రాయికముగా నాంధ్రదేశ విషయకములు. కురవంజులు, ఏలలు, జోలలు, పదాలు మొదలగునవి యెన్నియో తెలుఁగు దనము పుక్కిలించు రచనము లున్నవి. ఇట్టి దేసి రచనములలోఁ గూడ జగత్పవిత్రము లయిన భారత రామాయణాది కథాంశములు చేరినవి. కుచ్చెల కథ, లంకాయాగము మొదలగునవి యిట్టివే. అధికారి భేదమునుబట్టి వాని రచనములును భేదించుచుండును.

యాదవరాజుల కథ లని, శక్తి కథ లని, పలనాటి కథ లని ముత్తెఱఁగుల కథలను జెప్పువారు మూఁడు సంప్రదాయములవారు తెలుఁగుదేశమునఁ గలరు. పలనాటి కథలను జెప్పువారు పలనాడు ప్రాంతములయం దున్నారు. ఆ తెగ కాచార్యపురుషులు కారెమపూడి వాస్తవ్యులు. వారు బ్రాహ్మణులు. శక్తి కథలు చెప్పువారికి గూడఁ బలనాటిలోనే యాచార్యపురుషు లున్నారు. వారును బ్రాహ్మణులే. పంబవాండ్రు, బవినీండ్రు మొదలగువా రీ శక్తి కథలను జెప్పుదురు. శక్తి జాతరలు, మ్రొక్కుబడులు మొదలగునవి జరగునప్పు డీ శక్తి కథలను సాధారణముగాఁ జెప్పుట వాడుక. మాత పురాణము, పరశురామరామాయణము, గౌతమ పురాణము, మత్తి చెల్ల కథ, రేణుక యుద్ధము, కాకతమ్మ కథ, అంకమ్మ కథ, గంగానమ్మ కథ, మాతంగి కథ మొదలగునవి వారు చెప్పు శక్తి కథాగ్రంథములు. అవియుఁ బలనాటి వీరచరిత్రమువలెనే ద్విపద మంజరీ నిబద్ధములు. క్రీడాభిరామములోనీ గ్రంథార్థములు మిక్కిలిగాఁ బ్రశంసింపఁబడినవి. చూడుఁడు.

"కక్షనిక్షిప్త వికస్వర స్వరవిలా
సశ్రీ నివాసంబు జవని కందుఁ
గట్టిన తంత్రికిఁ గంఠశ్రుతికిఁ గూడఁ
జొక్కంబుగా నారి సొబగు మీఱ
నాలాపముల శుద్ధ సాళవ సంకీర్ణ
వివిధ రాగంబుల చవులు చూపి
డమడమ ధ్వనులఁ బొటారించి యెడనెడఁ
గత్తెరమార్గంబు బిత్తరిల్ల
వాద్య వైఖరిఁ గడు నెఱవాది యనఁగ
నేకవీరా మహాదేవి యెదుట నిలిచి
పరశురాముని కథ లెల్లఁ బ్రౌఢిఁ బాడెఁ
జారుతరకీర్తి వనసీల చక్రవర్తి."

"అలరుంబోడి జనంగమప్రమద మధ్యానద్ధ ఘంటాధ్వనుల్
చెలఁగం బాడె సమస్తలోక జననిన్ శ్రీ యేకవీరాంబికన్
వలరా జొక్కొక మూర్ఛనాస్వరమునన్ ప్రాణంబు గల్పింపగా
గలకంఠీ కలకంఠ కోమల కుహూకారంబు తోరంబుగన్."

"కోణాగ్ర సంఘర్ష ఘుమఘుమధ్వని తార
కంఠస్వరంబుతో గారవింప

1. మూర్ఖశతకములోని దని యీ పద్యము సి. పి. బ్రౌను దొరగారిచే నొకానొక వ్రాఁతప్రతియందుఁ జేర్కొనఁబడి యున్నది.

*D* 1043 భట్టురాయబారము కడపట నీ పద్యము వ్రాయఁ బడియున్నది. అం దిట్లు కలదు.

'మూర్ఖ శతకంలో చెప్పినది. వేణుగోపాల శతకంలో చూచేది'—

మసిబొట్టు బోనాన నసలు కొల్పిన కన్ను
  కొడుపుచేఁ దాటించు నెడప దడప
శ్రుతికి నుత్కర్షంబుఁ జూపంగ వలయుబోఁ
  జెవిత్రాడు బిగియించు జీవగఱ్ఱ
గిల్కుగిల్కున మ్రోయు కింకిణీ గుచ్ఛంబు
  తాళమానంబుతో మేళవింప
రాగముననుండి, లంఘించు రాగమునకు
నురుమ యూరుద్వయంబుపై నొత్తిగిల్లి
కామవల్లీ మహాలక్ష్మి కైటభారి
వలపు పాడుచు వచ్చె జక్కులపురంధ్రి.

క్రీడాభిరామము 43-45

మూఁడవ తెలుఁగు కథలు యాదవరాజుల కథ లనునవి. ఆంధ్ర దేశమున నూళ్ళవెంటఁ దిరుగులాడుచు, శూద్రుల గోత్ర ప్రవరాదులను దెలుపుచుఁ గాసువీసములు గడించి జీవించు నెఱిగొల్లలు, పిచ్చుగుంటలు మొదలగు జాతులవారు పంటసమయములందుఁ గాపుటిండ్లకడ కరుగుదెంచి యీ కథలను జెప్పుదురు. ఈ కథలకు గొల్లసుద్దులని పేరు. వీనిఁ జెప్పువారు సుద్దులగొల్ల లనియుఁ, గొమ్ముగొల్ల లనియుఁ గూడ వ్యవహరింపబడుచుందురు. తక్కిన కథలు చెప్పువారికివలె వీరి కాచార్యపురుషు లున్నారో లేదో మనకుఁ దెలియరాదు. కాని యీ కథలను జెప్పువారు మాత్రము ఒంగోలు, వినుకొండ, పలనాడు, నరసారావుపేట తాలూకాలలోను, కృష్ణాజిల్లాలోని నందిగామ తాలూకా యందలి గండరాయి యను గ్రామమునందును, నెల్లూరుజిల్లాలోని కనిగిరి సీమయందును, రాయలసీమ జిల్లాలలోను ననేకులు గొల్లజాతులవారు కలరు.

'యాదవశాస్త్రం యొద్దుమోత ప్రమాణ'మని చెప్పుదురు. ఇది నిజమనుటకు హంసవింశతిలోని యీ క్రిందిపద్యము సాక్ష్యము రాఁగలదు.

"కొమ్ములు వీరణాలు జిగి గుల్కెడు వ్రాఁతల కృష్ణలీలలం
గ్రమ్ముగుడార్లు వీరుఁడగు కాటమరాజు కథానులాపముల్
బమ్మిన పుస్తకాలు ముఖపట్టిక కట్టురుమాలలున్ నెతా
సొమ్ములు నామము ల్వెలయు సుద్దులగొల్లలు వచ్చిరంతయున్."

హంస. ద్వితీ.

'కాటమరాజు కథానులాపముల్ బమ్మినపుస్తకాలు' అనేకములు కలవు, వల్లురాజుచరిత్ర, పోలురాజుకథ, కాటమరాజుకథ, ఆగుమంచి కథ, ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట, కోటపాటి తాటివృక్షం తెచ్చేకథ, పెద్దిరాజుచరిత్ర, బొల్లావు యుద్ధము, ఆవుల పరువు, ఉత్తరకొండము, దక్షిణకొండము, కరియావులరాజుకథ, కాటమరాజుకథ, భక్తిరన్నకథ యిత్యాది విభాగములతో యాదవశాస్త్రము నిజమున కెద్దుమోత ప్రమాణము కాఁగల దనుటకు సందేహము లేదు.

ఈ యాదవకథలను దేశములో వర్షాభావ మేర్పడినప్పుడు సుద్దుల గొల్లలచేతఁ జెప్పించుచుండుటయు, నాకథలను జెప్పిన పిదప వర్షములు పడుచుండుటయు నేటికిని జరుగుచున్న విషయమే. ప్రత్యక్షముగా నావింత చూచినపెద్దలుకూడ నట్లే చెప్పుదురు. ఇది గాక సంతానార్థ మీకథలను జెప్పించుటయుఁ గాటమరాజులను గొలుచుటయుఁ గూడఁ గలదు. కాటమరాజును గొలిచిన సంతానప్రాప్తి కలుగునని మనవారి నమ్మకము. హంసవింశతిలో ద్వితీయాశ్వాసమున నైదవరాత్రి కథయం దీవిషయ మిట్లు పేర్కొనబడినది.

"తిరుమల కంచి పుష్పగిరి తీర్థములుం జని కొంగుముళ్ళతో
వరములు దంపతు ల్వడయ వారిగఁ గానుకలు న్వైచి యంతటన్
బరికలు దృష్టిదీపములుఁ బన్నినగద్దెలు పెట్టి యేమిటన్
గరమగుపుత్రవాంఛ కడఁ గానఁగలేక విచారఖిన్నులై"

వ. ఉన్న సమయంబున.

"కొమ్ములు వీరణాలు జిగి గుల్కెడు వ్రాఁతల కృష్ణలీలలం
గ్రమ్ముగుడార్లు వీరుఁ డగు కాటమరాజు కథానులాపమున్
బమ్మినపుస్తకాలు ముఖపట్టిక కట్టు రుమాలలు న్నెలా
సొమ్ములు నామము ల్వెలయుసుద్దుల గొల్లలువచ్చి రంతయున్.

వ. ఇట్లు వచ్చి.

"పెళఫెళ వీరణాల్ ఖళిఫెళీ వాయించి
  పోటుబో కొమ్ములు నాట నూఁది
దొనకొండ గంగను దొలుత సన్నుతి చేసి
  కృష్ణున కతిభక్తిఁ గేలు మోడ్చి
యాదికాలపు గొంద్ర నందఱఁ గొనియాడి
  తాతతండ్రులపేళ్లు దలఁచి పొగడి
బిరుదుల నరుదుగాఁ బేర్కొని నొఱయించి
  దీవించి వీరులత్రోవ లెన్ని
కులముపెద్దలకథ లామికొనఁగఁ జెప్పి
సివము పుట్టించి పుత్రులఁ జెందఁగలరు
వీరులను గొల్వఁ డని చెప్పి వీడుకొల్పఁ
జనిరి సుద్దులగొల్లలు సంతసిల్లి"

వ. ఇట్లు వారలు సెప్పిపోయిన నత్యంతభక్తి ప్రియపూర్వకంబుగా నంతట.

"కొలిచెం గాటమరాజులన్ నతులు సేకూర్చెన్ మహావీర్లకుం
బొలముం రాజులకెంత భక్తిపరతం బూజించె నాగంగకున్
వెలయన్ వేఁటలు బోనమున్ సిడులు గావించెన్ సుతోత్పత్తికై
చెలి యాలాగున సల్ప దైవము కృపన్ సిద్ధించెఁ దద్వాంఛయున్.

ద్వితీ - 85-91 ప.

పయిపద్యములు యాదవకథలు చెప్పుసుద్దులగొల్లల వేషాదికమును దెలియఁజేయుటయే కాక వారాకథలను జెప్పువిధానమును గూడఁ దెలుపుప్రామాణికాధారములుగా నున్నవి. వెనుక నలుగురితోఁగూడిన తతంగముతోఁ బ్రధానకథకుఁడు కథను వినిపించును. వీరావేశముతో నాయాయిఘట్టముల వినిపించునపు డాతఁడు శివమెత్తిపోవును. శివమెత్తి పాడుపాటలు గనుక వానికి 'గొల్లసివా' లలియుఁ బేరు కలిగెను. కువలయాశ్వ విజయమునం దిట్లు కలదు.

"ఒక్కండు పట్టుగా నూఁకొనఁ దబ్బిబ్బు
  పాటు 'గొల్లసివాలు' పాడుకొనుచు

ద్వితీ—౧౧౮ ప.

## కాటమరాజుకథ - శ్రీనాథుడు

మార్గకవితా సంప్రదాయమువడి మహాకావ్యములు రచించిన శ్రీనాథకవి సార్వభౌముఁడు దేశికథలమీఁది యాదరముతోఁ దత్కథలతోడి దేశిరచనములఁగూడ వెలయించుట యతని యుదారదృక్పథమున కొక నిదర్శనము! పలనాటివీరుల కథలతోఁ బలనాటివీరచరిత్రమును జెప్పినట్లే యాతఁడు కాటమరాజుకథను గూడఁ జెప్పినాఁడు. శ్రీనాథుని గ్రంథము నాధారముగాఁ గొని తదనుసారముగా మఱికొందఱాకథను బెంచి రచించిరి. గంగుల పినయెల్లయ యనువాఁడు కాటమరాజుకథనుమంజరీ వికారరచనగా రచియించినాఁడు. అతని గ్రంథారంభ మిట్లున్నది.

'గుఱుతైన కొమనాలగోత్రాబ్ధి చంద్రుఁ
డరయంగ గంగుల యల్లయ కూర్మి
తనయుండు సర్వన తగు సహోదరుఁడు
పినయెల్ల యనువాఁడు ప్రియముతో జను●
వలనొప్ప శ్రీనాథు వచనపద్ధతిని
సలిపెను యదుశాస్త్ర చరితమంతయును
వినిపింతు యాదవవీరుల చరిత'—

'శ్రీనాథువచనపద్ధతిని' తా—నా యాదవశాస్త్రమును రచించినట్లాతఁడు చెప్పుకొనినాఁడు. ఇచట 'శ్రీనాథువచనపద్ధతి' యనగా శ్రీనాథుఁడు చెప్పినవిధము" ననుసరించి యనియే యర్థము చేసికొనవలసియున్నది. అంతియేకాని దీనిఁబట్టి శ్రీనాథుఁడు కాటమరాజు కథను వచనములో వ్రాసినాఁడనియు, దానిఁబట్టి యీతఁడు ద్విపదగా దీని రచించె నని యుఁ జెప్పఁ గుదురదు. 'కాటమరాజుకథ' యని యొకపద్య ప్రబంధముగూడ నున్నది. అది ముద్రితము. ఆపద్య ప్రబంధకర్తకూడ శ్రీనాథుఁడు కాటమ రాజుకథను రచించెనని పేర్కొనినాఁడు. అందిట్లు కలదు.

"ఒక శుభదినమున నొగి శుభ్రమతి శౌరి
పూజావిధానంబు పొందుపఱిచి
హరికథ విని విని యారాత్రి నిద్రింప
శ్రీనివాసుం డిట్లు చెప్పెఁ గలను
శ్రీనాథుఁ డను కవిశ్రేష్ఠుండు ద్విపదగా
రచియించెఁ గాటమరాజు చరిత
మది నీవు నాపేర నంకితంబుగఁ బద్య
గద్యాత్మకంబుగా ఘనత నుడువు
మని వచించి తిరోహితుఁ డయ్యె నంత
నేను మేల్కాంచి యాస్వామి నెంచి మదిని
గాల్యకృత్యంబులను దీర్చి కడుఁ దలిర్చి
పండితావళిఁ గనుఁగొని భక్తిమెయిని."

దీనిఁబట్టి శ్రీనాథుఁడు కాటమరాజు కథను బలనాటి వీరచరిత్రము వలెనే ద్విపదగా రచించినాఁడని నిశ్చయముగా నిరూపింప వీలగుచున్నది. కాని యిదియుఁ బలనాటి చరిత్రమువలెనే యితరుల రచనములతోఁ గలసిపోయి శ్రీనాథుని రచన యిదియని వేర్పఱుప శక్యము గాకున్నది.

మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో కాటమ రాజు కథా సంబంధి రచనలు కొన్ని కలవు. అవి కాటమరాజు

కథ, భట్టురాయబారము, కోటపాటి తాటివృక్షం తెచ్చే కథ, ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట, అగుమంచికథ, వల్లురాజు యుద్ధము అనునవి.*

గంగుల యెల్లయ యితని తండ్రి. సర్వన యితని సోదరుఁడు. ఇంతకుమించి యితనిఁ గూర్చిన విశేషము లేవియుఁ దెలియరావు. అతని కాలమేదో గుర్తించుటకు దగిన యాధారములు గానవచ్చుట లేదు. రచనమును బట్టి చూడఁగా నతఁడించుమించు పదునేడవ శతాబ్దివాఁడు కాదఁగు నని తోఁచుచున్నది. కాటమరాజు నెల్లూరి నల్లసిద్ధిరాజునకుఁ బుల్లరి యొడఁబడుట, పుల్లరి నాతఁ డెగఁగొట్టుట, భట్టు రాయబారము, యుద్ధసన్నాహము, ఖడ్గతిక్కన విలుగు, బ్రహ్మరుద్రయ్యయుద్ధము, చల్లవారి పోరు, బొల్లావు యుద్ధము, బీరినేని యుద్ధము, కాటమరాజు పద్మనాయుల యుద్ధము, నల్లసిద్ధి కాటమరాజుల ద్వంద్వ యుద్ధము, వారు వీరశయన మందుట యను ప్రధాన కథావిభాగములతో నీ గ్రంథము వెలయుచున్నది.†

కాటమరాజు కథలోని కథావృత్తాంతము లోకలు రికార్డులయందిట్లు కలదు.‡

"నల్లసిద్ధి దేవచోళమహారాజు నెల్లూరి పట్టణమందు సింహాసనారూఢుడై పృథివి సాంబ్రాజ్యము సేయుచుండగాను వారివద్ద రణతిక్కన అనే బ్రాహ్మడు సేనాధిపతి. యితనికే ఖడ్గతిక్కన అని పేరు కలదు. అప్పుడు యాదవవంశోద్భవుండైన కాటమరాజు యితని పినతండ్రి పోలమరాజు, యీ పోలమరాజు కొమారుడు కరియావులరాజు వీరు లంకమల—పాలకొండ—నల్లమల మొదలయిన పర్వత ప్రదేశమందు అరణ్యములో పచ్చికపట్లను తమయొక్క విస్తారమైన గోగణమును సంరక్షణ చేసుకుంటూ నల్లశిద్ధ చోళమహారాజుకు పుల్లరికిగాను తమ మందలలో ఆవులకు పుట్టే కోడెదూడలు కొన్ని యిచ్చేటట్టున్ను, వారిదేశమందు వుండే కసువు పచ్చికెపట్లు తమ గోగ్రాసముగా యిచ్చేటట్టుగాను నిర్ణయించుకొని కొంత సైన్యం అందలాలు యేనుగులతో ప్రసిద్ధిగా వుండేవారు. మరికొన్ని దినములకు క్షామం దశవల్లను గోవులు గ్రామములో యెక్కడ యెక్కడ వున్న సస్యాదులను మనుషుల అంకిలో నిల్వక మేసేది గనుక ప్రజలు రాజుతో యీసంగతి విజ్ఞాపన చేసుకున్న యడల బీడుపచ్చికపట్లు యావత్తు కాటమరాజుగారి గోవులు మేపుకొనేలాగున మాట యిచ్చినాము. పైలుజ వారు మేపుకోవలసినది కాదు. అయినా గాని మీరు పైలుజ జాగ్రత్త చేసుకొనేది అని పైలుజ మేపవద్దు. బీడు పచ్చికె మేపుకొనేది అని కాటమరాజుగారికిన్ని వ్రాసి పంపించిరి. యిదిగాక అరణ్య ప్రదేశమందుల కాటమరాజుగారి విస్తారమైన గోగణం తిరిగి మేస్తూ వుండేది మొదలుకొని గోసంరక్షణార్థమై కాటమరాజు వారు అగపడ్డచోట క్రూరమృగములను వారే వధచేస్తూ వచ్చేవారు గనుకనున్ను అరణ్యమందు గోగణ గోపాలకులయొక్క సమదణము విస్తారమైనందున సాధారణముగా మృగములు అరణ్యమందు నిలవకపోతూ వచ్చినందునన్ను మృగవధ చేసుకొని తత్సామాన్య వృత్తివల్లను జీవనోపాయం కని వుండే కిరాతకులకు జీవనహాని అయినందునన్ను ఆ కిరాతకులు కాటమరాజుయందు ద్వేషులైయుండిరి.

యిదిగాక నల్లసిద్ధరాజుగారు వుంచుకొన్న భోగము దాని వద్ద వక పెంపుడు చిలుక వకనాటికాలమందు మ్యాడలోనుంచి తప్పించుకుని వెలపటికివచ్చి అరణ్యశుకములను కూడి కాటమరాజు ఆవులమందలకు సామీప్యములకు సమూహముగా వచ్చి ధ్వనులు శాయగా కొన్ని గోవులు బెదరి ల్యాగలను కలగతొక్కకుని పారిపోయినవి. అప్పుడు కాటమరాజు పిన తండ్రి అయిన పోలమరాజు చూచి బాణము సంధానంచేసి వేసినందున ఆబాణము సమూహములో వుండే పెంపుడు చిలుకకు తగిలి ప్రాణం విడిచెను. ఆచిలుక కాళ్లలో గజ్జలు అందెలు వుండేది పోలమరాజు చూచి యిది పెంపుడు-చిలుక అని నిశ్చయం చేశెను. అంతట ఆసామీప్యమందున వున్న కిరాతకులు ఆచిలుకను తీసుకుని నల్ల శిద్దరాజుగారు వుంచుకొని వున్న భోగముదానివద్దకి తీసుకొనిపోయి అగపరిచి నీచిలుక తప్పి వచ్చినంతట అన్యాయముగా కాటమరాజు పినతండ్రి అయిన పోలమరాజు బాణప్రయోగంచేసి చంపినాడని చెప్పినంతట అది చాలా దుఃఖస్తురాలై అరణ్యములో వుండే క్రూర మృగాదులను వధ చేసేటట్టుగాను వ్యాటలాడుతూ వుండి కాటమరాజుగారి గోవులనున్ను వధియించమని వుపదేసించెను. గనుక ఆ కిరాతకులు కాటమరాజునద్దకి వచ్చి మేము సామాన్యమృగములను వధ చేసుక జీవనంచేస్తున్నామని మనవి చేసినంతట కాటమరాజు అనుమానించి సెలవుయిచ్చినందున ఆ కిరాతకులు అరణ్య

---

* ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారములో నున్న కాటమరాజు కథ వ్రాఁతప్రతుల సంఖ్యావివరము.

| | | |
|---|---|---|
| 13- 3-21 | D 1040 | కాగితప్రతి |
| 11-11-2 | D 1899 | ,, |
| 11- 4-3 | D 1044 | తాళపత్రప్రతి |
| 13- 2-6 | D 1043 | కాగితప్రతి |
| 12- 2-28 | — | ,, |
| 14- 3-9 | D 1041 | ,, |
| ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట | | |
| 13- 5-25 | D 1033 | కాగితప్రతి |
| 12- 2-28 | D 1032 | ,, |
| 18- 2-28 | D 1031 | ,, |

## కాటమరాజు కథ

వీనిలోఁ గాటమరాజు కథ యనునది కాటమరాజు చరిత్రమును సంపూర్ణముగా నభివర్ణించు గ్రంథము. మంజరీ విశారమయిన రచనము. శ్రీనాథుఁడు ద్విపదగా రచించిన కాటమరాజు కథ నాధారముగాఁ జేసికొని యిది రచింపబడినది. రుచిగల తెలుఁగు పలుకుబళ్ళతో, నానుడులతోఁ జవు లూరించుచుఁ దెలుఁగు తనమును జుక్కిలించు నీ గ్రంథమును గంగుల పినయెల్లయ యను కవీశ్వరుఁడు రచించెను. అతఁడు కౌమనాల గోత్రజుఁడు.

† ఈ గ్రంథము నందలి కొన్ని భాగముల నుద్ధరించి శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 1943 వ సంవత్సరమున నాంధ్ర పత్రిక ఆదివారపు సంచికలయందుఁ బ్రకటించిరి.

‡. చూడుఁడు. లోకలు రికార్డులు 18 వ వాల్యూము.

ముఖ్యమంగను మృగాదులను చంపినట్టుగా వుండి కొన్ని గోవులను సంకుతో వధచేసిరి.

యీ సమాచారములు కాటమరాజు విని చాలా ఆక్రోశముతో ఆ కిరాతకులను చంపించి తదారభ్యం నల్లశిద్ధరాజుగారికి యిచ్చేపుల్లరి యివ్వమని అందుకు ఆవుల మందలో వుండే కోడె దూడలు తమకు తోలి అంపించమని వర్తమానం అంపించగా, అందుకు కాటమరాజుగారు మీ శీమలో మా ఆవులమందలకు నిరోపాధిగా వుండినట్టు అయితే మీకు పుల్లరి యివ్వవలసిన కర్తవ్యం. అటుగాక మీదేశములో వుండే కిరాతకులు మా ఆవులమందలకు వుపద్రవంచేసి కొన్ని ఆవులను నిష్కారణముగా వధించినారు. గనుక మేము పుల్లరి యివ్వవలసిన నిమిత్యం లేదని ఖండనగా వ్రాసి పంపించినందున అదివరకు మందలలో వున్న కోడెదూడలనుతోలుక రమ్మని కొంతసైన్యమును నల్లశిద్ధరాజు పంపించినందున వారు వచ్చికోడెలను. తోలుక పోవచ్చినంతట కాటమరాజువారు వచ్చిన సైన్యమును లక్ష్యం శాయక తిరుగగొట్టినారు. గనుక వారు తిరుగా నల్లశిద్ధిరాజువద్దికి పోయి యీవర్తమానములు యెరుకచేసినంతట నల్లసిద్ధచోళ మహారాజులుంగారు ముఖ్యసేనాదిపతి అయిన రణతిక్కనతో కూడా కొంతసైన్యమును కూర్చి కాటమరాజువారు సమాధానముగా కోడెలు యిచ్చినట్టైతే వుత్తమం. అటు కాని పక్షమందు వారిమీద కార్యపెట్టి వున్నకోడెలు యావత్తు మళ్లించుక రమ్మని పంపించిరి. అదేప్రకారం సేనాపతి రణతిక్కన్న వచ్చి సమాధానంగానే విహితములో—యప్పుడు యిచ్చేప్రకారం మందలలో కోడెలను యిప్పించమని కాటమ రాజువద్ద వర్తమానం అంపించగా వారు అనుకూలించక ప్రతిఘటించి వుత్తరువు యిచ్చినందున కార్యతిక్కన్న యుద్ధసన్నద్ధుడాయెను. యీ యత్నము విని కాటమరాజువారున్ను వారికి విహితులైనవారిన్ని కొందరిని సహాయముగా కూర్చుకొని బలిమిగల ఆవులు, కోడెలు సహా వెంట కూర్చుకొని యుద్ధసన్నాహమై నిలిచిరి గనుక వుభయపక్షములవారికి అఘోరమైన యుద్ధమాయను. ఆ యుద్ధసమయమందు కాటమరాజు వారి గోవులు యుద్ధభూమిని వచ్చి నిలిచి—యెదిరిసైన్యములో కొంతమందిని హతం చేసినవి. అంతట రణతిక్కన కార్యం నిర్వహించలేక తిరిగి తన యింటి స్థలములోకి లేచిపోయెను. ఇంటివద్ద భోజనసమయమందు తిక్కన్న భార్య తాను స్నానముచేసి రహస్యస్థలమందు రణతిక్కనకు స్నానానికి నీళ్ళువుంచి, స్నానం చేయమని చెప్పినంతట అతడాస్థలానకు పోయి చూచి ఆడంగులు స్నానంచేసే రహస్యస్థలమందు నాకు నీళ్ళువుంచిన కారణం యేమి అని అడిగినంతట తిక్కనభార్య ప్రత్యుత్తరం యిచ్చిన క్రమము 'యేస్థలమం దైతే నేమి ? రూపభేదమువల్ల విశేషంలేదు గనుక యిక్కడనే స్నానము చేయవచ్చునని చెప్పినంతట తాను కార్యములోనుంచి తిరిగి వచ్చినందున భార్య యీమాట చెప్పెనుకదా అని తెలిసికొని స్నానానంతరం భోజనసమయమందు తిక్కనకు తల్లి విరిగినపాలు వడ్డించినందున కారణమేమని యడుగగా' ఈ దినమున గోవులున్ను నీవు పోయినస్థలానికే పోయి విఱిగి వచ్చినవి.' అని చెప్పెను. కనుక తాను కార్యములోనుండి తిరిగివచ్చినందున యిందుకు దృష్టాంతముగ తల్లి ఆ మాట చెప్పినదని గ్రహించినవాడై భోజనోత్తరమందు తిరుగ కొంత సైన్యమును సమకూర్చుకొని యుద్ధానికి పొయ్యేటప్పుడు తల్లిని, తన భార్యను పిలిచి పూర్వము ఒక భట్రాజు నామీద కృతిగా వక పద్యం చెప్పవలెనని ఉద్దేశించి నాల్గు చరణములు చెప్పినాడు. అది యేమంటే—

> "ధైర్యంబు నీమేనఁ దగిలియుండుటఁజేసి
> చలియించు మందరాచలము దిరిగె
> గాంభీర్యమెల్ల నీకడన యుండుటఁ జేసి
> కౌస్తుభ్నచే వార్ధి గట్టఁబడియె
> వల లక్ష్మి నీయందు నలరియుండుటఁ జేసి
> హరి పోయి బలిదాన మడుగుకొనియె
> నాకారమెల్ల నీయందు నుండుటఁజేసి
> మరుఁడు ధూర్జటి కంటిమంటఁ గ్రాఁగె."

యీ ప్రకారం భట్రాజు నాల్గుచరణములు చెప్పినందున అతనికి యెనిమిదివేల వరహాలు యిచ్చినాము. ఈ పద్యానికి యింకా నాలుగు యెత్తుగీతలు చెప్పవలసియున్నది. అవి నేను సజీవుణ్ణాయి వుండగా చెప్పరాదు గనుక నిల్పినాడు. తరువాత నాల్గు యెత్తుగీతలు పూర్వముగా జెప్పి తీసుకవస్తున్నాడు. అప్పుడు ఆ భట్రాజుకు మరిన్ని నాలుగువేల వరహాలు యిప్పించుమని చెప్పినంతట ఆప్రకారం అంగీకరించిరి. అంత తిక్కన్న భార్య పెనిమిటిగూర్చి చెప్పినమాట. 'యుద్ధరంగములో నుంచి తిరిగి రావడము లేదని ఆజ్ఞాపిస్తిరి కదా! తమ్మును విడిచి దేహము వుంచే బుద్ధి లేదు గనుక యిప్పుడే శెలవు యిమ్మని అడిగినందున 'నీకు అనుకూలం అయితే ఉత్తమపక్షము' అని సమాధానము చెప్పి తాను యుద్ధమునకు తిరిగివెళ్ళి వచ్చి కాటమరాజువారి సైన్యముకు సమ్ముఖుడై కార్యపెట్టి అఘోరమైన యుద్ధము చేసి అనేకమందిని హతం చేసెను. భట్రాజు రణతిక్కనకు కృతిగా అటు పై పద్యం పూర్ణముగా చెప్పిన నాలుగు యెత్తు గీతలు—

> తిక్కదండనాథ ! దేవేంద్రపురము నీ
> వరుగు డెఱిఁగి నగము దిరుగుటుడిగె
> అబ్ధి కట్టుబాసె నచ్యుతు కొఱ దీఱె
> మరుఁడు మళ్ళి బుట్టె మగలరాజ !

ఈ ప్రకారమున భట్రాజు పద్యము పూర్ణంగా నాలుగు యెత్తుగీతలు రణతిక్కన తల్లివద్దకు పోయి చెప్పగా ఆమె బహు సంతోషురాలై 'నా గర్భవాసంబున పుట్టిన పుత్రుండు సుపుత్రుం' డని రణతిక్కన్న పూర్వమందు చెప్పిన ప్రకారంగానే నాల్గువేలు వరహాలు భట్రాజుకు యిచ్చి మరిన్ని తగిన బహుమతులున్ను చేసెను. అంతట రణతిక్కనయొక్క భార్య తన పతియైన రణతిక్కనతో సహగమనము చేసేనిమిత్తమై సచేలస్నానం చేసి అనేక దానములున్ను బ్రాహ్మలకిచ్చి రణభూమిని ప్రదక్షిణనమస్కారం చేసి తన పతియొక్క కళేబరము గుఱుతు కనబడకయున్నందున స్వామిని ప్రార్థించి నేను పతివ్రతనైతే పతియొక్క శిరస్సు కనపడు నని నిశ్చయం చేసికొని 'రణతిక్క' అనినంతట ఆ రణతిక్కన శిరస్సు యుద్ధభూమిని పడియున్న కళేబరములమధ్యనుంచి

పైకి యెగసినది గనుక ఆ శిరస్సును గుర్తుపెట్టి తీసుకవచ్చి అందుతో గూడా అనుగమనము చేసినది. కాటమరాజువారి సైన్యములు హత శేషమైన యాదవులు యుద్ధరంగంబునందు తమతో కూడా నిలిచిన శత్రువులను హతం చేసినవారియొక్క రూపము శిలలపై చెక్కించి వీరులు అనే ప్రతిమలు తాలూకు మజుకూరు సగిలి పాయకట్టు మాజే, కుంభగిరి అనే గ్రామములలో నున్నవి. ఇది గాక యుద్ధ రంగంబున ప్రాణములు వదలి సద్గతి పొందిన గోగణములయొక్క శిరస్సులు శృంగములతో కూడా తీసుకవచ్చి వాటికి పసుపు రాచి నిత్య సాంబ్రాణిధూపము లిచ్చి యిండ్లలో వుంచుకొని, యిదిగాక గోవు ఆకృతిగా శిలలపైన చెక్కించి అవిన్ని ఒక స్థలమందు పూజలు చేస్తున్నారు. ఆ శిలలు వుంచిన స్థళానకు జనులు 'ఆవుల మాలె' అని చెప్పుకుంటున్నారు. ఆ ఆవుల మాలె యొద్ద పైన చెప్పిన యాదవులు ప్రతి సంవత్సరమున్ను తాళమేళములు, పంబ జోళ్లు, వీరతాళ్ళు, జమిడికెలు, పురవన మద్దెళలు, యీ వాద్యములతో సంభ్రమం చేస్తున్నారు. యీ సంభ్రమానకు వారి సంబంధికులైనవారున్ను, వారు కట్టించిన ఆవులమాలెయందు అభిమానంగలవారు యెంతదూరములో నున్నాగాని వార్ని కాటమ రాజుగారి 'పాంగ్యస్తులు' అని వాడుతున్నారు. అలాగంటే 'పాంగ్యస్తులు' అయినవారికి పసుపుగుడ్డను అక్షతలు గట్టి సంభ్రమంచేసేదినం నిర్ణయం చెప్పి పంపించి వారిని పిలువనంపించి అందరు గుంపుకూడి' ఆవులమాలెవద్ద సంభ్రమము చేసేటప్పుడు పాంగ్యస్తులైనవారిలో వారివారికి తానకములు అనే నిర్ణయం కలవు. తానకమంటే యేమంటే యల్లెద్దుతానకం, బొల్లెద్దుతానకం, బోడియెద్దుతానకం, కర్రెద్దుతానకం, పై యెద్దు తానకం యీ ప్రకారం అనేక తానకములు నిర్ణయం కలవు. తానకసంజ్ఞ యేమంటే యెల్లెద్దుతానకం వాడు ఆవులమాలె వద్దికి వచ్చి నిలిచి ఉన్నప్పుడు పంబవాడు అంటే 'పంబజోడు' వాయించేవాడు యెల్లెద్దు పరాక్రమం తలచి ఆ ఆవు మేసుట, నీరు త్రాగుట, గంతులు వేసుట, యక్కడ యక్కడ తిరుగుట, తుదను యుద్ధరంగంబులో చేసిన పరాక్రమం సహాగా పొగడితే ఆతానకం అనుసరించి వుండేవానికి శివం వచ్చేది కలదు. ఈ ప్రకారం కొంతసేపు తానకములు పాడినతర్వాత కాటమరాజుగారి పరాక్రమమును 'సుద్దులు' అని పాడేది కలదు. ఈ సంభ్రమములోను ఇండ్లవద్ద వుండే శృంగసహితములైనగోశిరస్సులు తెచ్చి మాలెలో ఉంచేది కద్దు. అందుకు శనగలు, పెసలు నానవేసి శిలలపైన వుండే ఆవులప్రతిమలకున్ను, దేవరావులు అనే గోశిరస్సులకున్ను నైవేద్యం చెల్లించి ఆ పణ్యారం బ్రతికివున్న గోవులకు తినిపించేది కలదు. ఈ సంభ్రమము పేరు 'ఆవులపరువు' అని వాడుకొనేవారు.

యీ కాటమరాజుల కైఫియతు తాలూకు మజుకూరు కొత్తూరు పాయకట్టు మాజే పట్టపురావి కైఫియతులోనున్ను, వోబళం పాయకట్టు మాజే యెట్టిరాళ్ళ కైఫియతులోనున్ను, సగిలి పాయకట్టు మాజే కుంభగిరి అనే గ్రామం కైఫియతులోనున్ను వ్రాశి వున్నది."

లోకలు రికార్డులయందలి పయి యుద్ధరణమున నల్లసిద్ది మహారాజు ఉంపుడుకత్తె పెంపుడు చిలుక యరణ్యములో సంచరించుచు కాటమరాజు ఆలమందలోఁ గలకలము పుట్టింపఁగాఁ గాటమరాజు పినతండ్రి యగు పోలమరాజు దానిని బాణముతో గొట్టెననియు, నా విషయము తెలిసి యానేశ్య కిరాతకులను బిలిపించి కాటమ రాజు గోవులకు నష్టము కలుగజేయవలసినదని యాజ్ఞాపించెననియు, వారట్లు చేయుచుండగా కాటమరాజు మిక్కిలి కుపితుడై వారిని జంపించెననియు, నల్లసిద్ది మితి గడచుటచేఁ బుల్లరి పంపమని యడుగఁ బంపఁగా కాటమరాజు తన కావులమందలో గలిగిన నష్టమునకును, నాతని కీయవలసిన పుల్లరికిని సరిపోయెనని చెప్పి పుల్లరి నీయకుండెననియుఁ దెలుపఁబడి యుండఁగా కాటమరాజు పుల్లరి యెగఁగొట్టుటకు మఱొక కారణమును సంప్రదాయముగా యాదవ కథలను జెప్పువారు చెప్పుదురు. అది యిట్లున్నది.

మనుమసిద్ధిరాజు నల్లమల ప్రాంతారణ్యములలో గొంత భూమిని దన సోదరికి నరణముగా నొసగియుండెను. అతని సోదరి పేరు కుందమాదేవి. కాటమరాజు వర్షాభావమువలనఁ గరవేర్పడఁగాఁ దన గోవులకుఁ బూరియు నీరును లేక పద్మనాయుని ప్రోత్సాహమున మనుమసిద్ది యాస్థానమునకు వచ్చి యతని బీడులలోఁ దన పశువులను మేపుకొనుట కనుమతి నీయవలసిన దని ప్రార్థించెను. అందులకుగా సంవత్సరమున కింత యని పుల్లరి యిత్తునని యాతఁ డొడఁబడెను. కార్యావసరమునుబట్టి తన సోదరికిఁ దరువాతఁ దెలుపుకొనవచ్చునని యామె పక్షమునఁ దానే కాటమ రాజుకడఁ గవులు పత్రము వ్రాయించి పుచ్చుకొనెను. మనుమసిద్ది సోదరి కీ విషయము తెలియదు. కాటమరాజు నాఁటినుండి నల్లమల ప్రాంత భూములలోఁ దన పశువులను మేపుకొనఁ దొడఁగెను. తన యనుమతి లేకుండఁగనే తన భూములలోఁ గాటమరాజు పశువుల మేపుకొనుచున్నాఁ డని తెలిసి మనుమసిద్ది సోదరి మిక్కిలి కోపించి యాతని పశువులకు నష్టముఁ గలిగింపవలసిన దని యచటి బోయల కాజ్ఞాపించెను. వారు నట్లు సేయుచుండగా కాటమరాజు మనుమసిద్ధియే యిట్లు తన పశువులను నష్టముఁ గలిగించుచుండె నని భావించి యాతనియెడ మిక్కిలి కుపితుఁడై యుండెను. ఇంతలో సంవత్సరము మితి గడచినది. కాటమరాజు కడనుండి పుల్లరి వచ్చునేమో యని మనుమసిద్ది యెదురుచూచుండెను. అతఁడు పుల్లరి చెల్లించు ప్రయత్నమున నే లేఁడని తెలిసి మనుమసిద్ది యాతనికడకు రాయశృంగావళి యను నొక [illegible] బంపెను. కాని కాటమరాజు, మనుమసిద్ది యనుమతి నిచ్చి యడవులలో మేయుచుండిన తన పశువుల ద్రేయించెననియు నతనికిఁ దా నీయవలసిన పుల్లరికిని, దమకుఁ గలిగిన పశునష్టమునకును సరిపోయినదనియు, నందుచే నాతనికిఁ జెల్లింపవలసిన దేదియు లేదనియు భట్టునకుఁ దెలిపెను. రాయబారము విఫలము కాఁగా భట్టు నెల్లూరికి తిరిగివచ్చెను. కాటమరాజు గోవుల మందలో నష్ట మేర్పడిన విషయము తనకుఁ దెలియకపోవుటచే— మనుమసిద్ది—పుల్లరి యెగవేయుటకే కాటమరాజు యెత్తు వేసినాఁడని తలఁచి యాతనిమీదికి యుద్ధమునకుఁబోవ నిశ్చయించెను.

వ్యవహారముననున్న యీకథ యెంతవఱకు సత్యమో తెలియదు. కాని కాటమరాజు కథకు సంబంధించిన గ్రంథములలో 'చిలుక ద్రేయించినందుకు' యిత్యాదిగాఁ బలుతావులఁ దొలి కథా

నేడే శాంపిల్ చూడండి.

# మీ శిరోజములకు గొప్ప వరప్రసాదము

# కామినియా ఆయిల్ రిజిష్టర్డు

కేశపోషణకు కావలసిన ప్రకృతి సిద్ధమైన దినుసులు కలిగిన తలనూనెను శ్రద్ధగా ఎంచుకొనటంలోనే ముఖ్యంగా మీ కేశసౌందర్యమాధారపడి యుంటుంది. వెంట్రుకల ముస్తాబుకు సొంపైన **కామినియా ఆయిల్** సాటిలేనిది వెంట్రుకలు రాలిపోవటం, నెరవటం, బిరుసెక్కటం, చుండు మొదలైన తల, చర్మము, కేశముల సంబంధమైన అన్ని అనారోగ్యములనునివారించును. మెదడును చల్లబరిచి ఆరోగ్యవంతమైన నల్లని కేశముల వృద్ధిపొందించుటకు తోడ్పడును. దీని—మనోహర పరిమళము ఈ రోజున కూడా అపూర్వమైనది.



పోస్టేజికి ఒకటిన్నర అణాబిళ్లె పంపి ఒక శాంపిల్ ఉచితముగ వాడిమూడండి.

# పరిమళముల రాజు ఆటో దిల్బహార్

(రిజిష్టర్డు)

మజాగాఉండే ఈ ప్రాచ్యదేశపు అత్తరుయొక్క ముగ్ధ పరిమళం జగత్ప్రసిద్ధము. ఇది ప్రశస్తమైన జాజి, మల్లెపూలసారము. "అత్తరులరాజు"గా ప్రజానీకంలో ప్రసిద్ధమైనది. ప్రతివారికి అందుబాటులోనుండు ధరలకు అనేక సైజులలో దొరకును. అన్నిచోట్లను అమ్మబడుచున్నది.

పోస్టేజికి నాల్గణాల బిళ్లలు పంపి శాంపిలు ఉచితముగ వాడిమూడండి.

# కేటి వైట్ రోజ్ ఆయిల్

(రిజిష్టర్డు నం. 777)




ఇది లావణ్యమగు (తాజా) గులాబిపూల అద్భుత పరిమళము కలది. మెదడుకు చలవ చేయును. కేశపోషణకు ఆదర్శప్రాయమైన నూనె.

మీరు అంగడికి వెళ్లినప్పుడు కేటి వైట్ రోజ్ హెయిరాయిల్ నెం. 777 ను మాత్రమే కోరండి. ప్రత్యామ్నాయ మేదీ అంగీకరించకండి. అదే విధముగా పేరొందిన దిగువ నూనెలుగూడ ఒకసారి వాడండి.

## కేటి పుష్ప సేన తలనూనె నెం.777

## కేటి పుష్పమాలతి తలనూనె నెం. 777

# కేటి ఆటోరోజ్ (రిజిష్టర్డు నం. 777)

మనోహరమైన నవ గులాబిపూల కమ్మటి సువాసనను స్వచ్ఛముగా నిరూపించును. మిక్కిలి నిగ్గుదేర్చినది గనుక విశేషకాలము నిలుచును. అత్తరుల ప్రేమించేవారి కతి ప్రియమైన యీ సెంటు ఒక్కమారు వాడితే చాలు. మిమ్మును ముగ్ధపరచును.




# ఆటో మధుకర్ (రిజిష్టర్డు)

అపదృశమైన యీ క్రొత్త అత్తరును ఒకసారి వాడిమూడండి.

పోస్టేజి మొదలగు వాటికి నాలుగణాల బిళ్లలు పంపి ఉచితముగు శాంపిలుకు వ్రాయండి.

**Sole Agents:**

**ANGLO INDIAN DRUG & CHEMICAL CO., BOMBAY, 2.**

# హిందుస్తాన్ డైరీ

మదరాసు, హైదరాబాదు రాష్ట్రములకు సంబంధించిన వివరములతో 3 సైజుల్లో చక్కని బైండుతో తయారై చాల ఉపయోగకరముగా వుండి మీ ఆదరణ పొందుచున్న డైరీ యిదియే. ఇంతవరకు చూపుచున్న అభిమానమును యీ నూతన సంవత్సరమునందు కూడ చూపెదరని మా ఆశ.

*** మా నూతన వ్యాపారశాఖ ***

సికింద్రాబాదులో పుస్తక విక్రయ శాఖను ఏర్పాటుచేసియున్నాము. ఇందు అన్నిరకముల పుస్తకములు, స్టేషనరీ సామానులు, గవర్నమెంటు పబ్లికేషన్సు లభించును.

**★ హిందుస్తాన్ డైరీ పబ్లిషర్సు ★**

H. O. సికింద్రాబాదు

బ్రాంచీలు:

సామారంగంచౌకు విజయవాడ 1. ★ నెం. 3997, మార్కెటు వీధి సికింద్రాబాదు.

---

# జనసమ్మతమే మా భాగ్యం!



సర్వీసింగు
రిపేరింగు
మా
ప్రత్యేకత

పురజనుల మన్ననలు బడసిన పురాతన సంస్థ

## మోడరన్ రేడియో & ఎలక్ట్రిక్ హౌస్ లిమిటెడ్

సుల్తాన్ బజారు : : హైదరాబాదు

★ నేషనల్ ఎకో ★ ఫిల్ కో

★ జి. ఇ. సి. ★ సైకో

మరియు అన్నిరకముల రేడియోలు మా వద్ద అమ్మకమునకు గలవు.

---

# ఆంధ్ర బ్యాంకు లిమిటెడ్

(స్థాపితము : 1923)

## ప్రధాన కార్యాలయము-మచిలీపట్టణము

(షెడ్యూల్డు బ్యాంకు)

| | |
|---|---|
| అనుమతి పొందిన మూలధనము రు. | 1,00,00,000 |
| జారీచేసిన మూలధనము | 50,00,000 |
| చందా వేసిన మూలధనము | 48,99,000 |
| చెల్లింపబడిన మూలధనము | 25,00,000 |
| రిజర్వుఫండు మరియు ఇతర రిజర్వులు | 11,73,500 |
| అమలులోనున్న వ్యాపార మొత్తము | 6,00,00 000 |

మద్రాసు బ్రాంచీలు (మించినది)

(1) 322-23 లింగిచెట్టి వీధి, మద్రాసు-1.
(2) 77, కచ్చేరిరోడ్డు, మైలాపూరు, మద్రాసు-4.
(3) 87, పాండిబజారు, టి. నగర్, మద్రాసు17.

ఇతర బ్రాంచీలు, సబ్ ఆఫీసులు

అమలాపురం, అనకాపల్లి, బాపట్ల, భీమవరం, చీరాల, ఏలూరు, గుడివాడ, గూడూరు (నెల్లూరుజిల్లా), గుంటూరు, అరండల్ పేట (గుంటూరు), కాకినాడ, రామారావుపేట (కాకినాడ), మచిలీపట్టణము, నరసారావుపేట, నెల్లూరు, ఒంగోలు, పాలకొల్లు, రాజమండ్రి, శ్రీకాకుళం, తెనాలి, తుని, విజయవాడ, గవర్నరుపేట (విజయవాడ), గాంధీనగర్ (విజయవాడ), విశాఖపట్టణము మహారాణిపేట (విశాఖపట్టణము), విజయనగరం సిటీ, ఆమదాలవలస (శ్రీకాకుళం జిల్లా), అనంతపురము, బళ్లారి, చల్లపల్లి (కృష్ణా జిల్లా), కడప, దుగ్గిరాల, గొల్లప్రోలు, ఇచ్ఛాపురం (శ్రీకాకుళం జిల్లా) జగ్గయ్యపేట (కృష్ణాజిల్లా), కర్నూలు, నరసన్నపేట (శ్రీకాకుళం జిల్లా), నిడదవోలు, పార్వతీపురం, పెడన (కృష్ణాజిల్లా), పెద్దాపురం, పిఠాపురం, సాలూరు, సామర్లకోట, తిరుపతి, వినుకొండ. ఫారిన్ ఎక్స్ఛేంజి సహా అన్ని రకములైన బ్యాంకింగు వ్యాపారములు చేయబడును.

తాడేపల్లి శ్రీరాములు,
మేనేజింగు డైరెక్టరు.

ఏలేశ్వరపు రామచంద్రమూర్తి,
ఎం. ఏ., సి. ఏ. ఐ. ఐ. బి.,
జనరల్ మేనేజరు.

వృత్తమునకే నిర్ణాయకముగా రచనము గలదు. కనుక తొలి కథా వృత్తమే సత్యమయినదని మనము విశ్వసింపవలసియున్నది. కాఁగా మనుమసిద్ధి యుంపుడుగత్తె విషయము కథా గౌరవమునకుఁ గొంత భంజకముగా నుండునని తలఁచి యెవరో యీ రెండవ కథను గల్పించియుండెదరు ననుట సంభావ్యమే కాఁగలదు. మనుమసిద్ధి యప్పుడు వీలుగాకపోయినను నా తరువాత నయినను దాను కాటమ రాజు కడఁ గవులు వ్రాయించుకొనిన విషయము తన సోదరికిఁ దెలుపకపోవుటయు, నామె యయినను బరిస్థితియుద్ధముదాక వచ్చినను దాను బసువుల వ్రేయించిన విషయము తనసోదరుఁడగు మనుమసిద్ధికిఁ దెలుపకుండుటయు నీరెండవ కథయందసందర్భములుగా నున్నవి. అందుచే నీవృత్తాంతము యొక్క యాథార్థ్య మనుమానింపదగియున్నదనుటలో సందేహము లేదు.

## కాటమరాజుకథ చరిత్ర మగునా?

మనుమసిద్ధి మహారాజునకును, కాటమరాజునకును నెఱగడ్డ పాటియందు--జరిగినయుద్ధ మింత ప్రఖ్యాతమైయుండగా నీయుద్ధ విషయ మాకాలమున వెలసినగ్రంథములలో దేనియందును చేర్కొనఁబడకుండుట యాశ్చర్యముగా నున్నది. నిర్వచనోత్తర రామాయణమున మనమసిద్ధిప్రశంసలో నితరవిషయము లెన్నో పేర్కొనబడినవి. కాని యీ యుద్ధప్రస్తావ మందుఁ గానరాదు. దశకుమారచరిత్రమున ఖడ్గతిక్కన ప్రశంసగాఁ బద్య మిట్లు కలదు.

"వేడిన నర్థార్థి వృథపుచ్చ నేరని
 దానంబు తనకు బాంధవుఁడు గాఁగ
నెదిరిన జముసైనఁ బిదిలిపోవఁగనీని
 శౌర్యంబు దన కిష్టసఖుఁడు గాఁగ
శరణుసొచ్చిన శత్రువరునైన రక్షించు
 కరుణయ తనకు సంగరముగాఁగ
బలికిన పాండవ ప్రభునైన మెచ్చని
 సత్యంబు దనకు రక్షకుఁడు గాఁగ
జగతి నుతి కెక్కె రాయవేశ్యాభుజంగ
రాజ్యరత్నాకరస్ఫూర్తి రాజమూర్తి
గంధవారణ బిరుద విఖ్యాతకీర్తి
దినపతేజుండు సిద్ధయ తిక్కశౌరి."

దశ—౧ ఆ ౬౬ ప.

ఈ పద్యమునందును కాటమరాజు ప్రస్తావము కానరాదు. కాటమరాజు కథలో ఖడ్గతిక్కన బ్రహ్మరుద్రయ్యతో సలిపిన పోరు విశేషముగా వర్ణింపఁబడినది. ఖడ్గతిక్కనతో బాహాబాహిఁ బోరిన బ్రహ్మరుద్రయ్య విషయ మేనియు నిందుఁ బ్రస్తావింపఁ బడకుండుట విచార్యము. సమకాలిక గ్రంథములలో దేనిలోను చేర్కొనఁబడక, జనవ్యవహారములోను, జానపద గ్రంథరూపము నను నున్న యీ కాటమరాజు కథావృత్తాంతము చారిత్రిక సత్య మగునా కాదా యని సందేహించుటలో న్యాయము లేకపోలేదు. కేవలము జనపద వ్యవహారమున నున్నంత మాత్రమున నది చారిత్రక ముగా జరిగిన విషయ మని నిర్ణయించి చెప్పుటకు వీలులేదు. అదియును గాక కాటమరాజు కథలో నభివర్ణింపఁబడిన మనుమసిద్ధి వంశవృత్తాంతము సమకాలిక గ్రంథములలోనిదానితో విశేషముగా భేదించుచున్నది. చారిత్రకముగా నిర్వచనోత్తర రామాయణ దశకుమారచరిత్రములయందలి వంశవృత్తాంతమే సత్యముఁ బ్రామాణికము ననుట యెల్లరు నంగీకరించు విషయము. ఈ విషయములనెల్లఁ బర్యాలోచించి చూడఁగా 'కాటమరాజు కథా వృత్తాంతము' సత్య మగునా కాదా యని సందేహము కలుగకమానదు. కాని జనవ్యవహారమున నింత ప్రసిద్ధిగా నున్న యీ కథ సత్యముకాదనియుఁ గేవలము కల్పింపబడిన కథయే యనియుఁ ద్రోసిపుచ్చుటకును వీలులేదు. అయితే యిది సత్యమనుటకుఁ బ్రామాణికాధారము లభింపవలసియున్నది. అట్టిది లభ్యమగువఱకు నిది సత్యమనుటకు వీలులేదుకదా!

## శాసనప్రమాణము

నెల్లూరు మండలమున లభించిన యొకానొక శాసనమున కాటమరాజునకును మనుమసిద్ధికిని జరిగిన యీ యుద్ధవిషయము కానవచ్చుచున్నది. క్రీ. శ. 1258 నాఁటిదగు నా శాసనమున యాదవ వంశాభివర్ణనమును, కాటమరాజునకు మనుమసిద్ధితోఁ దగవు గలుగుటకుఁ గారణమును, యుద్ధముఁ బ్రారంభింపఁబడిన దినము మొదలగు వివరములును గలవు. ఆ శాసన మిట నుద్ధరించి ప్రకటింపబడుచున్నది.

నెల్లూరుమండల శాసన సంచయము—
రెండవ సంపుటము
బటర్వర్తు అండ్ వేణుగోపాలస్వామి వారిచే సంపాదితము.

*Kandukur (26) (A. D. 1258—59 ?)*

*(Gundlapalem. Telugu. From fallen stone in Brahmeswara Temple.)*

1. యాదవ1జల్మం వైశంపా
2. యిందు పరిక్షిత్తుకు యి
3. ట్లనిఎ అధితికి కశ్యపునకు పుట్టి
4. న వైవస్వతుం డనుమనువునకు
5. యెముండును శనెశ్వరుం
6. డును యెమునయం దపతియుం
7. బుట్టిరందు వైవస్వతుం డనుమను
8. వు వలన బ్రహ్మక్షత్రియ వైశ్యసూ
9. ద్రులైనమానవులు అనేకులు పు
10. ట్టిరి. వారికి 2శేనప్రముఖులైనరాజులు
11. యనమండ్రు పుట్టిరి, ఆమునిపుత్రి ఐ
12. న యిలగన్య సోమపుత్రుండైన బుధు
13. నకు పురురవ చక్రవర్తిఞ పుట్టె పురూరవు
14. నకు వూర్వశికి నాయువుండు పుట్టె నా
15. యువునకుఞ స్వభాఞ యుకుఞ నభిషుండు పు
16. ట్టె రాజ్యంబు సేశె నభిషునకుఞ ప్రియమానుసు3
19. నకుఞ యయాది పుట్టి యనాకయాగంబులు సేశి
18. ను యయాదికిని శుక్రునిపుత్రి యైన దేవయాన

1. 'జన్మం' 2. 'వేన' 3. 'మను'

19. కుణ్ యనువు జన్మించెను, శీలము గల యదుకులాత్మ
20. జుండు యాత్రియగోత్రజుండు ఆనూరూను
21, ండనువాండు మధురాపురంబ్బుం దనకు రాజధాని
22. గా మాధురంబులు నూరసేనంబు లనియెడి దేశంలేలే పూ
23, ర్వకాలమున ఆనూరునునికి పుత్త్రుం వసుదేవుండు అచట
24. రాజేంద్ర విను తొల్లి రాజలాంచ్చనంతో వేల
25. సంఖ్యలు దైత్యవిభులుండన్ను, ఆక్రమించిన భూమిభా
26. ర మానం జాలక గోరూపుయై బ్రహ్మం చేరంబోయి క
27. న్నీరు మున్నీరు రోధనం శాయ కరుణతో భావించి, కమ
28. లభవుండు ధరణి నూరడం బల్కి ధాత్రియును వేల్పులు క
29. దిలిరా విష్ణునిం గాన నెంగి పురుషసూక్తంబు చదివి య
30. ద్భుద సమాధినుండి యొకమాంట విని వారిజోద్భవు
31. ండు విసుండు వేల్పులు ధరయును నే విన్న యెట్టి పలుకు వివరించెద
32. నని ప్రీతిం బలికెం దెలియ యాదవకులమున నమరులు మెదిని
33. పైం బుట్టం జనుండు మీయంశమునన్, శ్రీదైత్యుండు వసుదేవు
34. న కొదరమునం బుట్టె భార మం త్రియుం భాపునుహరి పూజాతర్ణం
35. పుట్టుండు సురకన్యలు భూమియందు సుందరతనులై హరి కగ్రజు
36. ండై శేషుండు హరికళతోం బుట్టి భార మంతయుం బాపును అవనీ
37. శ విను ద్రోణుం డనువాండు వసువులయందు ముఖ్యుండు ధర అ
38. తని భార్య ఆ వేల్పులపెద్ద ఆ ద్రోణుండు యీ నంద్ధ గోపాలకుండై జన్మి
39. ంచె ధర యియ్య హరి యోగమాయ యశోద నంద్దుకు గాయై జె
40. న్మించె యల్లధేనవ లెల్ల రుషుల అంశమున జన్మించె సురలెల్ల గోరక్ష
41. పాలకులై 1 జన్మించె దేవకీయెను తొల్లి స్వాయంభు మను నంతరంబు
42. న పు స్త్రియును ప్రతివ్రత వసుదేవుండ్డను 2 సుతుపుణ్యుం డను ప్రజాప
43. తి రెండవ జన్మమున అధితియుం గస్యపుండును మూండువ జన్మమున
44. వసుదేవ దేవకి రామక్రిష్ణులు వుద్భవించిరి. అక్రూరాం గనలు గోపకన్యలైవు
45. దయించిరి రామక్రిష్ణులు మొదలైన సర్వయాద గోవులు గోపాలల్కు ద్వాపార ఆ
46. ంత్యమున కూడ వతిరాంచ్చి అచటం గొన్నాళ్ళు। దుర్యోదనాదులం ద్రుంచ్చి పాండ్డ
47. వుల పరగ బట్టంబు గట్టి సంతోషమ్ము వచ్చె ద్వార కాపురికి కణ్వమహా ము
48. నుల గాంధారి శావం వంకను మునుకొని యన్నంగ ముప్పదియారు వర్షములు
49. శ్రీక్రిష్ణ మొదలైన సర్వయాదవులు రాజ్యంబు సేసిరి। శయ్యంగ నొక్కనాండు
50. వుత్పాతములు వొడిమె వుర్వీతుపంపున। జాతరలు శయ్యను ద్వారవతి
51. కదిలిరి శ్రీక్రిష్ణ యాదవులు సముద్రనికడకు జలధితీర మున నవపా
52. నమత్తులై విష్ణుభోజాం త్రక వీరు లెల్ల మునివరనిర్ధిష్ట మున నిర్ధిష్టము స
53. లాంత్మకృతము లైన 3 ముయ్యంచ్చు తుంగ్గల మోందు లాడి మృ
54. తు లైరి అంత తారకుండు చని పాండవుల కెరింగి
55. ంచె॥

*Second Side*

1. అర్జునుండు ద్వారావతికి వచ్చి
2. వసుదేవు గని శ్రీకృష్ణ పరమ మూ
3. ర్తిశాం గలసె 4ఆదవులు దేవగణానం గ
4. లసిరి ద్వారావతి వనధి ముంచ్చు వని ఆ
5. క్రుణమె బాలవ్రిద్దులాను 5 అక్రూరాం
6. గ్గనలాను గోపాంగ్గనలాను గొంచ్చు
7. అర్జునుండు యింద్రప్రస్థకుం దె
8. చ్చెను। ఆదవ కులకరుండైన వజ్రధరుని
9. ం బట్టంబు గట్టెను। యాదవ గోపికా పౌత్ర
10. ని నేమించ్చి గోవులకు గోరక్షపాలకునిం జె
11. సి గోవులం గాపాడుమని ఘనవిర పురంబ్బు
12. న అమృత గోవిందుని అభిషిక్తు జేసెను యా
13. దవుల అందరిని అక్కడ అక్కడ నిలిపి అర్జును
14. ండు ఆ స్తనాపురికి బోయి దర్మరాజుకు యెరింగి
15. ంచ్చెను యాదవులు పాండువలున్ స్వర్గాది
16. బోగానకు బోయిన వెనక నన్నూరుయేండ్లకు
17. కలియుగం చొచ్చెను। వజ్రదేవుని పుత్త్రుండు దధి
18. నంగ్గుం డనంగ గోపికల పౌత్రకుల వంశకరులు
19. బ్రుంద్దావనమునం బ్రిధివి సొంపొంద్ది నంద్దవ్రజ
20. ంబ్బుకు వలి నొప్పుచుండు। ఆవుల మేపుత నలరి
21. గోపకులు దైవతాచలమున రంజిలుచున యా
22. దవులకు దైవ మెంతయు నొప్పు అమృత బా
23. గేశ్వరుండంద్దు। వెలి సున్న వసుదేవనందములు తొ
24. ల్లి క్రిష్ణుముందరం గోకర్ణలు మీర ప్రతిష్టలు శేశి
25. రి ప్రథమీరి వెలయ గోవిందు మనమందు పుపనంద్దు
26. పుత్త్రుండ్డు అమృతాంబోజుండని ఆదేవుపేర వెలయ
27. ంగ బెట్టెను విచిదంబుగాను. అతని పుత్త్రుండు విరయా
28. ంభోజుండు। సంతోషమున నుండ్డ జనమేజయు
29. ండు యజ్ఞంబుసేయ నెల్లరాజులను రప్పించి య
30. జ్ఞ ముండగంజేసె విజయాంబోజుని మెచ్చి వారణా

---

1. 'జన్మించె' 2. 'కు'.
3. ముసలాత్మకము లైన.
4. 'యాదవులు' 5. 'అక్రూరా'

31. పురంబ్బున పట్న స్వామిగా జేసి కొంత్తగాలంరాజ్య
32. ంబ్బు సెసిరి। కలియుగాబ్దాః నూ౹ద్రికి రాజకాల
33. మున విజయాంబో జాబ్దాః । ౫౩౦ । కనకాం బోజాబ్దాః
34. ।౪౯౦ । వి౹క్రమార్కుని కాలమున గజయాంబోః జాబ్దా
35. । ౪౩౦ । రాయాంబోజాబ్దాః । ౪౨౦ । రత్నాంబో జాబ్దాః
36. । ౪౦౨ । వీరవిజయః రాజాబ్దాః । ౩౯౦ । శాలి వాహనుని కా
37. లమున పద్మనరాజాబ్దాః । ౩౫౪। శ్రీ కూర్మిణ రా జాబ్దాః । ౩౪౦ ।
38. భోజరాజు కాలమున సిహాౕద్రి రాజాబ్దాః । ౩౦౦ ।
39. చోడాని కాలమున వల్లురాజాబ్దాః । ౧౯౫ । పోలురా (౩౩)
40. బాబ్దాః । ౭౨ । వోరుగంట ౹ప్రతాపుని కాలమున కా
41. టమరాజు । ౩౨ । రాజ్యం సెసి లింగాలకొండ యర గడ పాట
42. ను నలసిద్ధిరాజుం గూడి యుద్ధంబు సేశి బడుగులవారు
43. చనిపొయ్యెనాంటికి కలియుగం చొచ్చి । ౩౯౬౫ । యెంత్లా
44. యను। విరుల మహత్వం ఆదిపర్వ సకలభూతసంభవ అను
45. శాసనీక భాగవత దశమస్కంద మవుసలాన వెల్లిన శాస్త్రసమ్మత
46. మిది త్రిమూర్తులు కారణమున గోస్ఋంగ పర్వతానతొల్లి
47. యాంబోజరుటి మెదలైన రుషుల సంతతిని దేనువులు౯ క్రిష్టావ
48. తారం న గూడి దేవతులు గూడ వతి౯ంచిరి. ద్వాపార అంత్యము
49. న జన్మించిరి ఆధవు కులమున చంద్రనందను పురూరవ చక్రవతి౯
50. యయాధి యెదుకులోమ్మజు నూరి శేను వసుదేవు పుత్ర్యం శ్రీ
51. క్రిష్ణు దుగ౯ క్రిష్ణు దుగ౯ వీరికి నడిచి దబై రెండు నియోగాలు బడుగుల
52. వారికి శెల్లును వీరు యయాదివంశం శాపకారణమున
53. గోవుల రక్షింప గోరక్షపాలకులం జేసిరి వెలసిరి గోప
54. కులు వేయి వేల సంఖ్య ॥ శ్రీ శ్రీం జేయునూ॥

*Third Side*

1. అత్రియె ముని సంతతిరాజులు యె
2. లిన పట్టణభూములు అత్రియ నెత్ర పుత్రుడు
3. భూలోక మెల్లాడిపించెను ఆ చంద్ర నంద
4. ను పుత్ర పురూరవుండు భూచక్ర మెల యే
5. లెను ఆ పురూరవ పుత్ర పౌత్రుండు యయా
6. ది రాజుగ్గై నవఖండ ప్రుధివి యేలె యయా
7. ది పుత్రుండు యధువు యేనాక భూములు
8. యెలెను యెధుకులోంత్మజు నూరి శేను మధు

* *Date uncertain : Probably 1180.*

9. ర మాధురంబులు నూరసేనంబు లనియెడి దేశ
10. ంబులు యేలెను అతని ఆంత్మజుండు వసుదేవు
11. మధురాపురంబు యేలె అతని బంధువు
12. నంద గోపకుండు రేవుపల్లె యేలె వసు
13. దేవు పుత్ర శ్రీ క్రిష్ణ ద్వారవతి యేలే నో
14. క్రిష్ణ గోపికాప పుత్రులు వజ్రధరు అ
15. మృత గోవిందు అంభోజు లాగుర౯రు
16. యింద్రప్రస్థ ఘనవీర పురి రాజ్యంబు
17. సేసిరి పద్మనాభుండు యెలె యంద్దలి
18. రాజ్యంబు కొంత యెలె। వీర విజయు
19. ండు యేలెను న। శ్రీ కూమ్మ౯ం డేలెను ●
20. రుంటల కోన అమరవతి। సింహాద్రి యె
21. ల మంచ్చి యేలెను వల్లురాజు లె ఆలవల్ల
22. పురము అచట కొన్నాళ్ళు అడిడవి లేలె
23. ను ఆలుపోలురాజు ప్రతాపుని కాలము
24. న యెదుకులాత్మజులు దనుముకొండ్డ
25. మందలుడ, పినయెర్ర పెదయెర్ర యేలంగ
26. గ యెర్రలకు అనావ్రిష్టి డాంకి ధేనువు
27. లకు మేంత లేదని రాజు౯ పద్మనాయుం
28. డు౯ వివరించ్చుకొని ధేనువులు౯ దారు
29. కదిలిరి పాంకనాడు సిద్దిరాజుకు పు
30. ల్లరి వొడంబడి భూమి చొచ్చి మేపిరి మె।
31. పుత నలనన్న ధేనువులుం దాను దక్షణాదను
32. కోటికి కదలిపోఇ దనువుకోవల్లభుని
33. ంచ్చి నలనన్న ఢెనువులుందాను మరిలి దినవిధుల [దశి
34. మీందం గదలి వచ్చి పెన్న వెంట విడిసిరి నలసి
35. ద్దివారు యెద్దుల దెుసిరి ఆదవుల వందను ఆండ●
36. తరుచాయ అడవులవంక్కు రంతువదె
37. నెల్లూర ధేనువులుందారు వదిలి య
38. అగడ్డపాట నిలిచెను నలసిద్దిరాయ
39. భారి పుల్లరికి వచ్చెను వట్టించిరాయ
40. భారిని పుల్లరి లేదు పొమ్మనిరి లేదు పొ
41. మ్మంటేను నెల్లూరి నలసిద్దిరాజు యగ
42. గడ్డపాటికి యెత్తివచ్చెను

*Fourth Side*

1. స్వస్తిశ్రీ శాలివాహన శక వ
2. ష౯ంబ్బులు *౧౧౮౦ అగు నేం
3. టి కాళయుక్తిసంవత్సర కార్తిక
4. శు ౫ గు నెల్లూరి నలసిద్ధిరాజు సవ౯
5. సెన్నాహం మెరసి। లింగాలకొండ యఅగ
6. డ్డపాటి కూడలి సోమేశ్వరుని సందలిన
7. నాన అత్రియగోత్ర యాదవక్షత్రి
8. య మధురాపురమం దీశ్వర శ్రీ
9. విష్ణుయోగమాయ దివ్యశ్రీపా
10. దకబ్రకట శాత్రవభంజన నచ్చెర వుంచి

11. పౌత్రి లాయత్తవం గౌరవ పౌరవు
12. ంకు ద్వారకాపురి గోపికావల్లభు
13. ని పౌత్రుండు వల్లురాజు లతని సు
14. తులు పోలురాజు పెద్దురాజు వా
15. రి పుత్రులు మొదలైన యాదవులు
16. నలసిద్ధింగూడి యుద్ధము
17. సేసి మృతులైరి । యదువంశ
18. మునకు భయంబ్బు దొలుగునని త్రిమూ
19. ర్తుల్ లున్ యోగమాయాదేవిని యిట్ల
20. నిరి గోపికాజనములు గోపాలకు
21. లున్న పసలమందకు నేంగు భద్ర
22. నీవు వసుదేవనందనులకు గర్భ పు
23. త్రికవై నానావిధ సంపదలకు స్థా
24. నకమై మానవులు భక్తిం గొలుతు
25. రు కానుకలును బలులు నిచ్చి పెద్ది
26. నిమిది నామంబ్బుల గొనియాడు
27. దురు ఇయ్యాస్థానంబులు యె
28. రింగించ్చ వుమి పిఠాపురి హేంకృతి ద
29. సువుకొండం బ్రత్యక్షమై । పాలెటి
30. తీరంమున భాగిరతై నిలిచి భక్తునికి
31. ప్రత్యక్షమై త్రిమూర్తుల మెప్పించి వీ
32. రమహాత్తు ఇప్పించెను భాగిరతి ధుగన్
33. స్తానం కొండయ్య కొడుకు రా
34. మయ్య వుద్ధరించిన శాసనం

*  *  *  *

నెల్లూరుమండల శాసన సంచయములోని యీ శాసనము కాటమరాజునకును, మనుమసిద్ధికిని జరిగిన యుద్ధమును, యుద్ధకాలమును జేర్కొనుచుఁ బ్రామాణికాధారమగుచున్నది. శాలివాహన శకము ౧౧౮౦ ప్రాంతముల కాటమరాజు నెల్లూరు నలసిద్ధిరాజుమీఁదికి సర్వసన్నాహముతో దండెత్తిపోయిన ట్లిందు గలదు. యుద్ధము ప్రారంభమయిన దినము, యుద్ధ మెన్నిదినములపాటు జరగినది, యేయే దినముల నెవరెవరు యుద్ధము సలిపిరి యను విషయములనుగూర్చి తరువాతఁ దెలిసికొందము. ఈ శాసనమున మఱొక్క విశేషము కలదు. ఇది గద్యశాసనముగాఁ బయికిఁ గానవచ్చుచున్నను నిందు నచ్చటచ్చటఁ బద్యములును గలవు.* కనుక నిది గద్యపద్యమయ శాసనమని చెప్పఁదగును. ఈ శాసనమునఁ బద్యములుగా గుర్తింపఁబడినవాని నీదిగువఁ జేర్కొనుచున్నాను.

"రాజేంద్ర! విను తొల్లి రాజలాంఛనముతో
 వేలసంఖ్యలు దైత్యవిభులు దన్ను
నాక్రమించిన భార మానంగఁ జాలక
 గోరూపమై బ్రహ్మఁ జేరబోయి
కన్నీరు మున్నీరుగా రోదనముసేయఁ
 గరుణతో భావించి కమలభవుఁడు
ధరణి నూఱడఁ బల్కి ధాత్రియు వేల్పులుఁ
 గదలిరా విష్ణునిఁ గాననేగి
పురుషసూక్తంబు చదివి యద్భుతసమాధి
నుండి యొకమాట విని వారిజోద్భవుండు
వినుఁడు వేల్పులు ధరయు నే విన్న యట్టి
పలుకు వివరింతు నని ప్రీతిఁ బలికెఁ దెలియ
"యాదవకులమున నమరులు
మేదినిపైఁ బుట్టఁ జనుఁడు మీయంశమునన్
శ్రీదైత్యుఁడు వసుదేవున
కాదరమునఁ బుట్టి భారమంతయుఁ బాపున్"
"హరి పూజార్థము పుట్టుఁడు
సురకన్యలు భూమియందు సుందరతనులై
హరికగ్రజుఁడై శేషుఁడు
హరికళతోఁ బుట్టి భారమంతయుఁ బాపున్"
*"శ్రీకృష్ణ మొదలైన సర్వ యాదవులు రా
 జ్యంబు సేసిరి - సేయంగ నొక్కనాఁడు?
ఉత్పాతముల్ వొడమె నుర్వీశుపంపున
 జాతరల్ సేయను ద్వారవతిని
కదలిరి శ్రీకృష్ణ యాదవుల్......
 .............ముద్రు కడకు
జలధితీరంబున సవపానమత్తులై
 విష్ణు భోజాంధక వీరు లెల్ల
మునివర నిర్దిష్ట ముసలాత్మకము లైన
 ముయ్యంచు తుంగల మోఁదు లాడి
మృతులైరి.....................

*  *  *  *

గోవుల రక్షింప గోపాలకులఁ జేసి
వెలసిరి గోపకుల్ వెయి వేలసంఖ్య

*  *  *  *

"గోపికా జనములు గోపాలకులు నున్న
 పసుల మందకు నేఁగు భద్ర! నీవు
వసుదేవనంద గర్భంపుఁ బుత్రిక వయి
 నానావిధశ్రీల తానకంబు?

ఇంకను నిట్లు పద్యచ్ఛాయ గల వాక్యము లీ శాసనమున గలవు. స్పష్టముగా గుఱుతింపఁ గలిగినంతవఱకు నిట్టి నొసంగఁబడినవి. ఈ శాసనము ఎఱగడ్డపాటి పొట్లాట పుక్కిట పురాణము కాదనియు, చారిత్రక సత్యమే యనియు ఋజువు పఱుపఁ జాలియున్న దనుటకు సందేహము లేదు.

## భట్టు రాయబారము

గంగుల పినయెల్లయ రచించిన కాటమరాజు కథ, కథావృత్తాంతమును దొలినుండి తుదిదాఁక నభివర్ణించుచుండఁగా, భారతమంత యీ కథలో భట్టు రాయబారమను ఘట్టమును మాత్రము పురస్కరించుకొని రసవంతముగా రచియింపఁబడిన రచన మిది.

---

* శ్రీ జయంతి రామయ్యపంతులగారి సంపాదకత్వమునఁ బ్రకటింపఁబడిన శాసనపద్య మంజరియం దీ పద్యము లుదాహృతములు కాలేదు.

* ఈ పద్యమున యతిగణభంగదోషములు గలవు.

ఇదియు మంజరీ ద్విపదలోనే రచింపఁబడినది. కర్త యెవ్వరో తెలియదు. బ్రౌనుదొర యీ భట్టు రాయబారము వ్రాతప్రతిలో నచ్చటచ్చట నాంగ్లభాషయందు 'నోట్సు' వ్రాసికొనియున్నాడు. అందు 'రాయశృంగావళి' యను నాతఁడు దీని కర్త యయినట్లు వ్రాయఁబడియున్నది. కాని యది సత్యము కాదు. రాయశృంగావళి మనుమసిద్ధిచే గాటమరాజుకడకుఁ బంపఁబడిన భట్టు. బ్రాహ్మణుఁడు. కొమార బంగారము కాటమరాజు భట్టు. ఈ యిరువురును దమతమ యేలికల తరఫున కాటమరాజు కొలువులో సంభాషించుకొనుట యీగ్రంథమున సంవాదరూపమున రచింపబడియున్నది. ఒక భట్టు సంభాషించినపిదప మరొకభట్టు భాషించుటగా నీరచనముగలదు. రాయభట్టు తనవాద మంతయు వినిపించి కడపట.

'బుద్ధి మాలియు వెఱ్ఱి బుద్ధులు పోక
పెద్దఱికాల్ మాని పెట్టు పుల్లరిని' అనును. అతనివాదమునకు సమాధానము చెప్పి కాటమరాజుపక్షము వాఁడగు కొమారబంగారమనుభట్టు.

'వదరక పలుమాలు వసుధేశు నెదుటఁ
గదలి రమ్మనుమి మీ కలవారి నెల్ల' అనును. ఒక్కొక్కఁడును దనయేలికనుగూర్చి, తమబలసంపదనుగూర్చి వీరావేశముతో గొప్పలు చెప్పుకొనును. ఒకఁడు చెప్పుకొనిన గొప్ప మరొకనికిఁ గోపకారణ మగును. అతఁడడుగ త్రిప్పోవును. తమ యేలికను శత్రుపక్షమువాఁడు దూషించుచుండఁగా నింకొకఁడు సహింపజాలఁడు, ఆ కోపములో వా రాడుకొనిన పలుకులయం దెన్నో సామెతలు, పలుకుబళ్లు, దేశీయోపమలు కొల్లలుగా దొరలును. దేసి సాహిత్య సంపద కీగ్రంథము కొవలెను. కొన్నికొన్ని చోట్ల నర్థము దుర్గ్రాహ్యముగా నుండి కథాభాగ మర్థము కాకున్నను మొత్తముమీఁద నెవఁడు వ్రాసెనో కాని యిది దేసి సాహితిదృష్టితోఁ బ్రశస్తమయిన రచనము; పండితులదృష్టితో నిట్టి గ్రంథములఁ బరికింపరాదనుట విజ్ఞులెఱింగినవిషయమే.

మచ్చున కొందు రెండు పట్టులు చేర్కొందును.

"భట్టయ్యగారు! సెబాసు లెస్సాయె
భట్టదేవర వైతె భాగ్యంబు పండె
యాచకలక్షణాన నేతెంచి రాజు
ననుసరించితి వైన నవనిలోపలను
దానధర్మాత్ముండు ధర గుణశాలి
యితని వేఁడిన నిచ్చు నిష్టభోగములు
అన్నదానము కోరి యాచింపవస్తే
పరఁగంగఁ బెట్టించు బాయసాన్నములు
వస్త్రదానము కోరి వస్తినం తేనిఁ
బ్రస్తుతించియు నిచ్చుఁ బట్టువస్త్రములు
భూషణాల్ లేవని పాడగనవస్తే
రసికుఁ డెన్నఁగ నిచ్చు రత్నాంబరములు
కనకంబు లేదని ఘను నిపుడు గంటే
యిప్పుడే యిప్పించు నెన్ని వలసినను
పరిమళద్రవ్యాలఁ బడయంగ వస్తే
పొలుపుగా నిప్పించుఁ బునుఁగు జవ్వాది
గ్రాసంబు లేదని ఘనుఁ బొడగంటే
రాశిగాఁ బోయించు రాజాన్నములను
నేరు సాఁగఁగ దున్న నెప్ప వడిగితేఁ
గోర్కెతో నిప్పించుఁ గోడెయెద్దులను
గోదాన మిచ్చిన గొంపోదు నంటే
అడిగితే యిచ్చు మా అయితమరాజు
ఏమి నీ మనసున నేమి కోరినను
కామితార్థము లిచ్చు కాటమరాజు
దాసివేశ్యలు రెండు తప్పక విడిచి
యెంతైన నాసించి యేమి యడిగెదవు?"—

* * *

"మాటమాటకు గొల్ల గొల్లఁ డనియేవు
మరమముగా నీ భూమి మోసెను గొల్ల
తరికొండ లాగంగఁ ద్రాడాయె గొల్ల
సాగరము తెక్కలఁ జల్లెను గొల్ల
వేడుక వ్రేపల్లె వెలఁదులఁ గూడి
కొల్ల లాడినవాఁడు గొల్లతఁడు కాఁడ
కన్నులు తెఱవని చిన్నబాలుండై
కోపించి శకటంబు గూల్చెను గొల్ల
ముద్దుల బాలుఁడై మూఁడవనెలను
దానవి చనుఁబాలు ద్రాగెను గొల్ల
యేడాది కుఱ్ఱఁడై యిలఁ దృణావర్తు
మెడఁ బట్టుకొని వాని మృతిఁ జేసె గొల్ల
తల్లి వెన్నలకునై తను రోలఁ గట్టఁ
గొమరుఁడై మద్దులు గూలంగ నీడ్చె
ముద్దు గోపాలుండు మారితి గొల్ల
వక్కుని జంపినవాఁడును గొల్ల
శబలుఁడై ఖరదైత్యుఁ జంపెను గొల్ల
యితఁడు సామాన్యుఁడే యెంచి చూడంగ
బ్రహ్మదేవుఁడు గొల్ల పశుపతి గొల్ల
బ్రహ్మను గన్న శ్రీపతియును గొల్ల
పావనరుద్రుఁ డేర్పాటైన గొల్ల
దేవేంద్రుఁడును గొల్ల దివిజులు గొల్ల
భావింప రుద్రుండు పరఁగంగ గొల్ల
మా కులంబునఁ బుట్టె మదనగురుండు
మా కులంబునఁ బుట్టె మఱియు సూర్యుండు
మా కులంబునఁ బుట్టె మఱియుఁ జంద్రుండు
మా కులంబునఁ బుట్టె మఱి యొక్క వేద
అవునోయి! భట్ట! నీ వాడుకోఁ దగును
గొప్పమాటల నెంత కొప్పరించేవు
భట్టనంచును వచ్చి బయిసి పోవుటకుఁ
గాటమేశ్వరు నిట్లు గాలు లాడితివి
దేవేంద్రుఁ డెక్కిన దివ్యరథంబు
భావజ హారవరభక్తుండు నెక్కఁ

బరుల కెన్నీ యని బాహుబలుండు
పరకాంతఁ దల్లిగా భావించినాఁడు
ఇటువంటిరాజు కనుగొనుటను నిలిచి
తాటోటు మాటలు తప్పఁ బల్కితివి."

*　　*　　*　　*

ఇట్టి రసవత్తర ఘట్టము లీ గ్రంథమున నెన్నేనిఁ గలవు. విస్తరభీతిఁ నుదాహరింపక విడుచుచున్నాఁడను. వ్యావహారిక భాషలో నున్నప్పడే పటుత్వముతో భాసించుచు గ్రాంథికము చేసినఁ జప్పపడిపోవు సంభాషణ చమత్కారము లిందుఁ గలవు. వ్యావహారిక భాషలో రుచి, పటుత్వము నెఱుఁగఁగోరువారి కిది కల్పవృక్షము!

## 3. కోటపాటి తాటివృక్షం తెచ్చే కథ

ఇదియు కొటమరాజు కథా సంబంధియగు రచనమే. భట్టు రాయబారమువలెనే దీని రచించిన కవియు నజ్ఞాతుఁడుగా నే యున్నాఁడు. కాని దీని రచనము విశేషముగా భట్టు రాయ బార రచనమునుకంటె కొటమరాజు కథ రచనమును బోలి యున్నది. దీని ప్రతులు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము నందుఁ గలవు.

రాయభట్టు రాయబారము విఫలమయినది. పగలు చాటుచు నతఁడు నెల్లూరుత్రోవఁ బట్టినాఁడు. అప్పుడు కొటమరాజు మనుమసిద్ధితో నిఁక యుద్ధము నిశ్చయమని, యుద్ధములోఁ దనకు సహాయము రావలసినదిగా దొనకొండలోనున్న తన తమ్ముఁడు అయితమ రాజునకుఁ గమ్మ వ్రాయుమని పద్మనాయునితోఁ జెప్పను. అందుకు వ్రాలాకులు గావలసియున్నదని పద్మ నాయుఁడు పలుకఁగా కొటమరాజు కోటపాడు అనుచోట మంచి వ్రాలాకులు గల తాటిచెట్టున్నదని విని చట్టువారి యెఱ్ఱయ్య యను వానిని దానిఁ దెమ్మని పంపును. అతఁడు బహు కష్టముతో నెన్నో బాలారిష్టములు గడచి యాచోటుఁ జేరి వ్రాలాకుల మంచిచెట్టులు తనకుఁ దెలియరాని వగుట నా తాటిచెట్టునే పెల్లగించి తీసికొని వచ్చును. పద్మనాయుఁడు కొటమరాజు నాజ్ఞమేరకు వక్కాణ చెప్పి కరణములచేఁ గమ్మ వ్రాయించి కొలారిచేతి కిచ్చి దొన కొండలో నున్న యయితమరాజు కడకుఁ బంపును. కొలారి దొనకొండకుఁ బోయి యయితమరాజును దర్శించి కమ్మ యందిం చును. ఆ కమ్మ చదివి వినిపింపఁగలవా రచట నెవరు లేనందున— సిరిదేవి చప్పన్న భాషలు తెలిసినది గనుక యామెచేఁ జదివింపఁ దలఁతురు. ఆ యుత్తరము కీడు తెలుపునో, మేలు తెలుపునో యని యెఱుఁగఁగోరి ఫలములు నింపిన యొక పళ్లెరములో నా కమ్మ నుంచి సిరిదేవిముందు దానిఁ బెట్టినపు డామె కమ్మను దాఁకక తొలుత ఫలములను ముట్టినచో శుభమనియు, నటుగాకున్న నశుభ మనియు నిశ్చయించుకొందురు. సిరిదేవి వ్రాలాకునే ముట్టినది. కమ్మ చదివి వినిపించినది. కొటమరాజునకు సహాయము చేయు టకై యెఱగడ్డపాటికిఁ బోవలయునని యెల్లరు నిశ్చయింతురు. బాలరాజులను మాత్రము దొనకొండ రక్షణమునకై యచటనే నిలిపి యందఱు నెఱగడ్డపాటికిఁ దరలిపోవుదురు.

ఇది కథ. ముఖ్యముగా నెఱగడ్డ పాటి పోట్లాటకుఁ బూర్వము దొనకొండలో గడచిన వృత్తాంతము నిది వివరముగాఁ దెలుపుచున్నది. మచ్చుకు నొక్కపట్టు నిక్కడ నుదాహరింతును.

"............అయితమరాజు
మనవిగాఁ దల్లికి మఱియు నిట్లనియెఁ
'తల్లిరో! మామీఁద దయచేత నీవు
పల్లవరాజుల బలముల విడిచి
తల్లి మము దీవించ తగు నటో యమ్మ!
యెల్లలోకము లెల్ల నెన్నఁగాఁ దల్లి
యిరుబయిజ్వలమీఁద నెక్కె కైవడిని
జరఁగంగ దయ యుంచు ప్రఖ్యాతిగాను
దూషింపవల దమ్మ! దుర్జనుల నైన
భూషింపవలెఁ దగఁ బుత్రులవలెను
సత్యంబు నిలిపిన సమకూరు శుభము
నిత్యమా దేహంబు నీటిపై బుగ్గ
సత్యంబు నిలిపిన సకల పుణ్యములు
సత్యంబు నిలిపితే సాశివ నెక్క
సత్యమే జయమని చాటు వేదములు
సత్యసంధునిఁ బోలి చరియించువారు
సత్యలోకానను సన్నుతింతెదరు
సత్యవ్రతముఁ బోల సాటిలే దెందు
నటు గన్క వారిపై నతిభక్తి నిల్పి
తటుకున నిటు మాకు దగశాసరి గనక ?
పాలేటి జగడ మాపాలి గాకుండఁ
బాలిపంతంబు లేర్పఱచి పోరాడ
వీరకథ లోకమున విరివి గమ్మనుచు
నారూఢి దీవించి యంపవే తల్లి!"

*　　*　　*　　*

ఇది యసంపూర్ణముగా మాత్రమే యుపలబ్ధ మగుచున్నది. తక్కిన గ్రంథభాగము దొరకునేమో పరిశోధింపవలసిన యవ సరము కలదు.

## 4. ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట

ఇదియుఁ బయి మూఁడింటివలెనే కొటమరాజు కథా సంబంధియగు నితివృత్తము గలిగియున్నది. కొటమరాజునకును, మనుమసిద్ధి మహారాజునకును నెఱ్ఱగడ్డపా డనుచోట జరిగిన ప్రఖ్యాత మయిన యుద్ధము నీ గ్రంథ మభివర్ణించుచున్నది. ఇందలి రచనము పయి మూఁడు రచనములకంటెను మేలయినదని చెప్పవచ్చును. ఇందుఁ బ్రాస నియమమునుగూడఁ బాటించినట్లు రచనమునుబట్టి తెలియవచ్చుచున్నది. కవిత్వము రసవంతముగా నుండి రచనము మేలయినదిగా నుండుటచే నిది శ్రీనాథ రచన మేమోయని కూడ ననుమానింపదగియున్నది. ఇందలి రచనము పలనాటి వీరచరిత్ర రచనము ననేకవిధముల బోలియుండుటయే యీ యనుమానమునకుఁ గారణము.

మాతంగివీరుఁ డగు బీరినాయఁడు నలనన్న తక్కిన వీరుల కందఱకును రాణ్యము లేర్పఱచి తాను నిలిచి యుద్ధము సేయుటకు

సేనాన్యము సేర్పబుపకుండుటచే నలవన్న నిట్లు వేడు చున్నాడు.

> నలవన్నతో బీరినాయఁ డిట్లనియెఁ
> "తెలియఁజెప్పెద రాజ! తేటగా వినుమ
> మున్నుఁగా శత్రువు లెదిరినవేళ
> వెన్నిచ్చి వచ్చుట విహితంబు గాదు
> పట్టఁగా వచ్చిన పగవానిఁ గన్న
> నట్టిట్టు జుణుగక యటు తాళు మనక
> గట్టిగా సత్కీర్తి గైకొనవలెను
> నెట్టివారికి భువి నిదియె పద్ధతియుఁ
> బగవారిఁ బొడగని పాఱిపోయ్యెది
> తగవు గాదది వీరధర్మంబు గాదు
> పంతగించిన రిపులఁ బరిమార్పకున్న
> వింతగా శత్రువు లెన్నుదురవనిఁ
> జిన్ననాఁటనునుండి సిరిదేవి మము
> మన్నించి పెంచిన మన్ననబంటఁ
> బగవారు వినినను బనికి రాఁ డనుచు
> నగియేరు పురజనుల్ ననుఁ జూచి చాల
> మునుపు మీరెన్నఁడు ముద మొప్పనన్న"
> ఘనముగా నేఁ జూడఁ గలహంబు గలిగె
> నేడు తరముల పగలు నిటరాకమున్నె
> నేఁడు రాణ్యము మాకు నేర్పడఁ దెలిపి
> కరుణతో సెలవిచ్చి కడు ప్రియంబునను
> బరదళముపై నీవు పంపుట లెస్స
> యెప్పుడావుకు రాణ్య మేర్పడనిలిపి
> తప్పదె నారాణ్య మమరకుండినను
> దక్షిణాధీశులు తరలి వచ్చేరు
> ఈక్షణంబున మమ్ము నిప్పుడే పంపు
> బ్రహ్మాదివిష్ణువు పరమేశ్వరాన!
> బ్రహ్మప్రభావంబు బసవేశ్వరాన!
> నమ్మినబొల్లావు నరహరియాన!
> అమ్మ నూకాంబిక అగుమంచి యాన!
> అనుపమగుణశాలి యగుపాపయాన!"—

* * * *

## 5. వల్లురాజు యుద్ధము*

ఇది పయినాల్గింటి కథావృత్తమునకుఁ బూర్వమెప్పుడో జరగిన యితివృత్తముతో రచింపఁబడిన గ్రంథము. వల్లురాజు కాటమరాజునకు తాత. కాటమరాజు అవుల వల్లురాజునకు రెండవ కుమారుఁ డగు పెద్దిరాజు కుమారుఁడు. వల్లురాజు యుద్ధమని దీనిపే రున్నను నిది నిజమునకుఁ బోలురాజుచరిత్రము. పోలురాజు వలురాజు కడుగొట్టు కుమారుఁడు. కాటమరాజు సోదరుఁడు. చెఱకువాడ జంగాలు చోడానికి భయపడి తన్ను శరణు వేఁడఁగా వారిని శ్రీశైలమున దాఁచియుంచి, వారిని దన కప్పగింపవలసిన దని చోడాని పక్షమున వచ్చిన ముక్కంటితో చిలకల మఱ్ఱి రాణ్యాన యుద్ధము చేసి యొక మఱ్ఱిచెట్టు క్రింద వ్రాలి పోలురాజు తన యసువులఁ బాయును. ఈతఁడు గావించిన యీ యుద్ధవృత్తాంత మీ గ్రంథమునఁ గలదు.

గ్రంథాద్యంత భాగము లీ దిగువ నొసఁగఁబడుచున్నవి.

గ్రంథ ప్రారంభము—

> చంపుదుము చత్తుము సర్వథా మేము
> మిమ్ము నప్పగించి పోలేము ఓ పోలురాజ!
> పోలేము రణములో పాలియుదు మనిరి
> శీలవంతుల మాటలకు చిఱునవ్వు నవ్వి

---

* మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము సంఖ్య *R* 642. కాగిత ప్రతి. డిస్క్రిప్టివు కేటలాగునం దీ గ్రంథమును గూర్చి యిట్లు కలదు.

"This is a porticn of 'Vall-raju yuddhamu' mentioned in yadav rayalu Kathalu which contians 'KatamaRaju Katha, V lluraiu yuddhamu' etc. As the work is fragmentary it is not possible to bring out the historical importance of the wcrk. This work contains many proverbial sentences now in use. The name of the author is not given. Wants the begining and the end.

అసమగ్రము—అద్యంతములు సరిగా నున్నట్లు దోఁపదు. గ్రంథపాతములు లేవు గాని తప్పులు మెండు. శైథిల్యము లేదు.

యాదవరాజుల కథ లనఁబడు కాటమరాజు కథ మొదలగు కథలలో 'వల్లురాజు యుద్ధ' మని పేరు గల యీ గ్రంథ మొక భాగము. ఇందలి కథ చరిత్రమునకు సంబంధించి యుండునట్లున్నది. పూర్వోత్తర సందర్భములు తెలియక యిందలి కథను వివరింపరాదు.

శ్రీశైలము, పొట్లపల్లికొండ, అచ్యుతగోత్రుడు ఆ పోలురాజు, పట్టిన జంగాల బలిమి నడపింప—కోపాన తో (చో?)డని కొలువులో నిలిచి—నందికోసు నందిముద్ర నాపట్నమందు—అందముగ చెల్లి స్తిమి అరమర లేక—

> చోడకోసు చోడముద్ర చూడ వేగముగ
> పోలురాజు మందలో పొగిడించినాడు
> శ్రీరంగ మతనిది శివమంద వాది
> నెల్లూరు విలుచు నేను ఉండంగ
> రమ్మని యేటికి రాజ పిల్చితివి
> పరగంగ శ్రీరంగపట్నమంతయును
> పల్లికొండ పోలురాజు పరగ కొలువుండి
> చెఱకూరు ఇది పుణ్యక్షేత్రంబు మనకు
> శ్రీరామ మాడలు శివకొల్లగాను ॥

ఇత్యాది వాక్యములు చరిత్రార్థవాచకము లిం దున్నవి. కర్త పేరు తెలియదు.

# జమ్మివారి లివర్‌క్యూర్

బిడ్డల లివర్, & స్ప్లీను వ్యాధులకు




ఇప్పుడు టాబ్లెట్లుగా ఈయబడుచున్నది

మోతాదు ఒకేసరిగా ఉండుటకు, ఉపయోగించుట అతిసులభముగా నుండుట కొరకు వ్యర్థముగా మందు పోకుండుటకు, అతిశుభ్రముగా మందునుంచుటకు జమ్మివారి 'లివర్‌క్యూర్', 'సింపుల్', 'కాంప్లెక్సు' లను టాబ్లెట్లుగా గాజు ట్యూబులలో ప్యాకుచేయబడి ఇప్పుడు ఈయబడుచున్నది.

## జమ్మి వెంకటరమణయ్యా అండ్ సన్స్

రాయపేట హైరోడ్డు : : మైలాపూర్, మద్రాసు.

---

# రూబీ జనరల్

## ఇన్సూరెన్సు కంపెని లిమిటెడ్,

హెడ్డాఫీసు: కలకత్తా.

★

చైర్మన్: శ్రీ బి. యం. బిర్లా

★

జీవిత, అగ్ని, ప్రమాద, నౌకా మొదలగు అన్ని రకముల భీమా అవసరములకు దినదినాభి వృద్ధి జెందుచున్న దేశీయసంస్థ.

★

వివరములకు:

| సదరన్ సర్కిల్ ఆఫీసు | ఆంధ్ర బ్రాంచి ఆఫీసు |
|---|---|
| "ఫిరోజ్ మహల్" | (జనరల్) |
| 82/83, లింగిచెట్టి వీధి, | N. B. 34, కాశీశ్వరరావు |
| జి. టి. మద్రాసు. | మార్కెటు, విజయవాడ 1. |
| ఫోను నెం: 2337 | ఫోను నెం: 249 |

---

# ధాతువర్ధని

శుక్లనష్టమునకు ప్రశస్తమైనది. కాళ్లునొప్పులు బలహీనత, గుండెదడ, మేహములు, నిర్వీర్యత, అతిమూత్రము మొ॥ ఖండించి ఇంద్రియమును వృద్ధిపరచి అధిక సంభోగ శక్తి నిచ్చును. సీసా రు. 4-12-0. వి. పి. రు. 0-14-0.

# అబలసుధ

స్త్రీల కుసుమ వ్యాధులు, అకాల బహిష్టు, బుతు బద్ధము, బుతుశూల, ఒడలునొప్పులు, తలనొప్పి, గుండెదడ, కాళ్లులాగుట, మనస్థిమితము లేకపోవుట, నిద్రపట్టకుండుట, నడుమునొప్పులు, బలహీనత, మలబద్ధము, హిస్టీరియా మొదలగునవి హరించును.

సీసా రు. 3-0-0. వి. పి. రు. 0-14-0

# అమృతప్రాస

సవామేహములు, మేహపొడలు, జలకీళ్ళనొప్పులు, నడుము నొప్పులు, కాళ్ళుచేతులు మంటలు, తిమ్మెరలు మొదలగునవి హరించి, రక్తశుద్ధిచేసి వృద్ధిచేయును.

డబ్బా రు. 3-8-0, వి. పి. రు. 0-14-0.

## ఇండియన్ మెడిసన్స్ హౌస్

లక్ష్మీటాకీసు రోడ్డు : : విజయవాడ - 2.

ఏలయ్య కోపంబు మేము ఉండంగ
గ్రంథాంత్యమం దిట్లు కలదు.

"గర్భగృహము తలుపులు గడగడ వడఁకె
గుభగుభ మల్లప్పగుడి తల్లడింప
పర్వతాల మల్లప్ప ప్రత్యక్షు మాయె
ఒరుగ మీకేల ఉగ్రంబు నేల
శీలవంతులార చెల్ల మీ కేల
నడలింగ మూర్తులు నామారు మీరు
ఒడయలకు మీ కేల ఒరుగ నిచ్చోట
నేనె మీరైయున్న నేరంబు ఏమి
స్వామిని కనుగొని సాష్టాంగ మొసగి
మా యీశ్వర మా మనవి వినుమ
చెఱకువాడ యేలు క్షేమాన ఉంటిమి."

సంప్రదాయముగా నీ కథలను చెప్పువారి కడనుండి దీని ప్రత్యంతరములు సంపాదించి పరిపోల్చి సరిపఱచి దీనిఁ బ్రకటింప వలసి యున్నది.

---

* ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము సంఖ్య *R* 664.

డిస్క్రిప్టివ్ కేటలాగునం దీ గ్రంథవిషయ మిట్లు పేర్కొనఁబడి యున్నది.

A portion of AgumanchiKatha in Yadavarajula Kathalu. The story of Agumanchi seems to be connected with the stoty of Katamaraju. It is not possible to give substance of the story as the Ms wants the begining and end. The names of certain persons and certain places of historical importance are frequently referred to here in. Viz., Siddhiraju, Katamaraju, (Names of persons) Donakonda, Gurramukonda, Ahobalam (Names of places). The name of the author is not given but the composition seems to be ancient.

అసమగ్రము. ఆద్యంతములు లేవు. వ్రాఁత తిన్ననిదే. తప్పులు మెండు. శైథిల్యము కలదు. గ్రంథపాతము లల్పముగాఁ గలవు.

యాదవరాజులకథ లనఁబడువానిలో (కాటమరాజు కథ మొదలయినవి) నిది యొకటి. ఇందు సిద్ధిరాజు, దొనకొండ, పెన్నానది, నెల్లూరుపురము, గండికోట, గుఱ్ఱము కొండ, కాటమరాజు మొదలగు పేళ్ళు తఱచుగాఁ గానవచ్చుచున్నవి. అగు మంచియను స్త్రీకథ యిందుఁ గలదు. కాటమరాజుకథతో నీ కథకు సంబంధమున్నది. ఎఱ్ఱగొల్లలు మొదలగువారు పాడుచుండు తీరునుబట్టి వ్రాయఁబడిన దగుటచేఁ గాబోలును ఇదీ మంజరీవికార మనఁదగిన మాత్రాగణవృత్తమున వికృతిని బొందినది. చరిత్రపరిశోధకుల కిది పనికివచ్చును. ఆద్యంతములు లేకపోవుటచేఁ గథాసారము చెప్పఁ గుదురకున్నది. కర్త పేరు తెలియరాదు కాని రచనము ప్రాచీనమయినదే.



## 6. అగుమంచి కథ

ఇదియు కాటమరాజు కథా సంబంధియగు నితివృత్తము గల్గిన రచనము. దీని కర్త యెవరో యెఱుఁగరాదు. దీని ప్రతి యొకటి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునందుఁ గలదు.*

అగుమంచి పోలురాజు కుమార్తె, అయితమరాజునకు చెల్లెలు. 'అన్నలచెల్లెల అగుమంచి నీవు' అని యీమె ప్రస్తుతింపఁబడినది. ఉత్తమరాజు ఈమెభర్త. పోచయ్య యీమె కుమారుఁడు. అయితమరాజు మొదలగువా రీమెను మిక్కిలి యాదరముతోఁ జూచుచుండిరి. ఆమెకు సంబంధించినకథ యీగ్రంథమున నభివర్ణింపఁబడినది.

ఎఱ్ఱగడ్డ పాటిలో పోరు ఘోరముగా సాగుచుండినది. అయితమ రాజాదులు కాటమరాజు సహాయార్థము దొనకొండనుండి యెఱ్ఱగడ్డపాటికిఁ బోయి యుండిరి. అగుమంచి దొనకొండయందే యుండెను. ఒకనాఁ డామె తలంటి నీరు పోసికొనఁ దలఁచును. ఆమె వదినయగు గంగ యామెకుఁ దలంటి నీరు పోయును. ఆనీరు కాలువలయి కాకరపాదులోనికిఁ జాఱినవి. అది యశుభముగాఁ దోఁచి యగుమంచి విచార మందును. నూతనవస్త్రములు ధరించి, నగలు తొడిగి యామె రాత్రి నిదురించును. ఆమె కొక కల వచ్చును. అందుఁ దనసోదరులకు నెఱ్ఱగడ్డపాట విపత్తురానుండుట తెలిసి యామె నిదురలో బిగ్గఱగాఁ గేకలు వేయును. బంధువర్గమంతయు నామెచుట్టుఁ జేరుదురు. అగుమంచి తన స్వప్నవృత్తాంతము వారికి వినిపించును. వారు మిక్కిలి విచారింతురు. ఉదయ మయ్యెను. ఎఱ్ఱగడ్డపాటిలో నామె సోదరులు మృతినందిన ట్లామె యంతకుఁ బూర్వము వారు చెప్పిపోయి యుండిన యానవాళ్ల మూలముగ నెఱుఁగఁ గల్గును. అన్నలకై బిట్టు దుఃఖించి పెద్దల యనుమతిఁ బొంది చితి పేర్పించుకొని యం దామె సహగమనముఁ గావించును.

ఈ కథావృత్తమే యగుమంచి కథలో నభివర్ణింపఁ బడినది. ముందువెనుక కథలు సరిగాఁ దెలియనివారి కీ కథ దుర్గ్రాహము గానే యుండును. గ్రంథప్రారంభ మిట్లు కలదు.

"బ్రహ్మయు వగు నోయి! బడుగుల రాజ!
ధర్మంబుగా నేలి ధాత్రి వర్థిల్లు
భూపాల తిలకుండు బుధబృందనుతుఁడు
భావజాకారుండు భాగ్యవంతుండు
సరసుఁడు సుజనుండు సత్యవాక్యుండు
కరుణాంతరంగుండు ఘనకర్మపరుఁడు
కుజన గర్వహరుండు గురుభక్తియుతుఁడు
దానరాధేయుండు ధర్మవర్తనుఁడు."

* * * *

ప్రత్యంతరముల సంపాదించి వాని సహాయముతో దీనిఁ గూడఁ బ్రకటింపవలసియున్నది.

## యాదవులవంశము




## వంశవృత్తము

కాటమరాజు కథలోను, దానికి సంబంధించిన యితర రచనములయందును దఱుచుగాఁ జేర్కొనఁబడు వ్యక్తులకుఁ గల పరస్పర సంబంధ బాంధవ్యము లెట్టివో తెలియనిది యందలి కథావృత్తాంతములు మనకు సరిగా బోధపడవు. అందుచే వారివారి సంబంధ బాంధవ్యములను దెలుపు నీ వంశవృక్షము ప్రత్యేకముగా నీ పుటలోఁ బ్రకటింపఁబడుచున్నది. కాటమరాజు కథఁ జదువఁగోరువారి కిది యత్యంతము సహాయకారి కాఁగల దనుటలో సందేహము లేదు.

## గండరాయి గురవయ్య

నందిగామా తాలూకా 'గండరాయి' గ్రామములో కొమ్ముల మార్కపూడి రంగయ్య కుమారుఁడు గురవయ్య యనునాతఁడు యాదవకథలను సంప్రదాయ పద్ధతిని జెప్పుచుండునని ప్రతీతి. ఇది విని ముక్త్యాలలో ఆర్షరసాయనశాల ప్రధాన చికిత్సకులు, శ్రీ గురువర్యులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారి సోదరులు నగు శ్రీ వేటూరి శంకరశాస్త్రిగారు పయిని బేర్కొనఁబడిన గురవయ్య జట్టువారిని నిటీవల—ననఁగా గత వేసంగి సెలవులలో—ముక్త్యాలకుఁ బిలిపించి వారిచే నా యాదవకథలను జెప్పించిరి. ఆ గురవయ్య యనునాతఁ డా గొల్లసుద్దులను వెనుక నలుగురితోఁ గూడిన తతంగముతో నొకరాత్రి యంతయుఁ బాడి వినిపించెను. ఈ గురవయ్య సాంప్రదాయకముగా నీ గొల్లసుద్దులను బాడి జీవనము జరుపుకొను కొమ్ము గొల్లల తెగకుఁ జెందినవాఁడు. సంప్రదాయ సిద్ధముగా వచ్చుచున్న యీ యాచారమును బరిరక్షించుకొనుచు జీవనము చేయుచున్నవాఁడు. తనయింట యాదవశాస్త్రమునకు సంబంధించిన కథ లన్నియుఁ దాళపత్ర గ్రంథములలో నున్నవని యాతఁడు చెప్పుచున్నాఁడు. ప్రకటనార్థము వానిని గోరఁగా నట్లే యిత్తునని యతఁడు వాగ్దానముగూడఁ జేసినాఁడు. ఈ యాదవకథలకు సంబంధించిన చిత్రములు కూడ నాతనికడ నున్నవి. అతఁ డా కథలను బాడి వినిపింపఁగా విన్నియుఁ గొన్నికొన్ని స్థలముల సందేహ నివారణార్థమై యాతని నడిగి తెలిసికొనియు శ్రీ వేటూరి శంకరశాస్త్రిగారును, మిత్రులు శ్రీ వేటూరి ఆనందమూర్తిగారును సేకరించిన విషయముల నిందు వారి యనుమతితో వెల్లడించుచున్నాఁడను.

కాటమరాజు కథంలోఁ బ్రసక్తులగు ముఖ్య వ్యక్తులును, వారిని గూర్చిన కథా వివరములును నీ దిగువ నొసఁగఁబడుచున్నవి.

ఆవుల వలురాజు—

ఈతఁడు చంద్రవంశజుఁడు. కవులావుల గంగురాజునకును, గంగమ్మకును జన్మించినవాఁడు. ఎలమంచి పట్టణ మితని రాజధాని. తన నగరములో నేదో కరణాలవిషయమై తగవు రాఁగా నీతఁడు ఎలమంచికి నుత్తరమునసున్న 'కండమొండముల కోట'కు నధిపతి యయిన కలుభూతి గంగురాజుతో యుద్ధముఁ జేసి యందు జయమందును. చివరకుఁ దన కుమారులకు రాజ్యము నప్పగించి తాను చనిపోవును.

(వల్లురాజు చరిత్రమునుండి)

సింహాద్రిరాజు—

ఈతఁడు ఆవుల వలురాజు పెద్దకుమారుఁడు. సింహాద్రి సీత యితని భార్య. కరియావులరా జితనికిఁ గుమారుఁడు.

> శ్రీ కూర్మమునకును జేరెను దండు
> శ్రీ వైష్ణవులను దాఁ జేరఁ దీసికొని
> సింధు దేశము నేలు క్షితిపాలకులను
> సింహబలముతోడ శిరములు నఱికె
> పై నుండె చంద్రగిరి బల్లాలు నాఁటె
> సింహాద్రి చెల్లెను శ్రీకూర్మమందు.

పెద్దిరాజు—

ఈతఁడు ఆవుల వలురాజు రెండవ కుమారుఁడు. సింహాద్రికిఁ దమ్ముఁడు. భార్య పెద్దిమాదేవి. కాటమరాజు కుమారుఁడు. పాపనూకమ్మ కుమార్త. ఈతనికిఁ జాలకాలమువఱకు సంతానము లేకుండెను. సంతానముకొఱకై యితఁడు తమ కులదైవ మయిన బసవనికి మ్రొక్కుకొనెను. తన సహోదరులు నలుగురికిని సంతాన మున్నదనియు వారి పూజల నందిన బసవన్న తమకును సంతాన మనుగ్రహింపవలయు ననియు వేఁడ పెద్దిరాజును, నాతని భార్య యగు పెద్దిమాదేవియుఁ బూజకు రాఁగా బసవన్న పెడమోము పెట్టెనఁట! అతనికి సంతానము లేదయ్యెను. దంపతులు కడు దుఃఖితు లయిరి. అసలు పెద్దిరాజున కొక శాప మున్నది. ఈతని బిడ్డలు సన్యాసులై పుత్రసంతతి లేక యుందురు—అని యా శాపము. ఒకనాఁడు స్వప్నమునఁ బెద్దిమాదేవికిఁ గల్యాణములోని సోమప్ప 'సంతాన మనుగ్రహింతును. నన్నుఁ గొల్వ ర' మ్మనినట్లు తోఁచెనట! ఆ విషయమును భర్త కెఱింగింపఁగా పెద్దిరాజు నాఁడే ప్రయాణము గాఁదలచి పితృసంపాదిత మయిన యాస్తిని దన సోదరులతోఁ బంచుకొనెను. ఆ పంపకమున వారి కడగొట్టు సోదరి యయిన కొనుకమ్మకు వచ్చిన పెట్టెలలో వారి కులదైవతము గంగమ్మ యుండె నఁట! అది యామె యదృష్ట మని యెల్లరు నామెను బ్రశంసించిరి. ఆస్తి పంచుకొని పెద్దిరాజును, నాతని భార్య యగు పెద్దిమాదేవియు నాప్రాంతమును వదలి కల్యాణమును జేరుకొందురు. దంపతు లిరువురును సోమేశ్వరునిఁ బ్రార్థింపఁగా నతని కటాక్షమునఁ గాటమరాజనువాఁడు జన్మించి యా దంపతుల కానందముఁ గొల్పినాఁడు. ఆవయి నేడేండ్లకు వారికిఁ బాపనూకమ్మ యను పుత్రిక పుట్టినది. ఈమె పుట్టిన యేడవనాఁటికే 'యార్లపెంట' రణమునఁ బెద్దిరాజు నిహతుఁ డయ్యెను.

> 'చిత్రభానునఁ దాను చిట్టె పాపమ్మ
> ఫాల్గుణ మాసాన పాపనూకమ్మ
> బుధవారమునఁ దాను పుట్టిన దమ్మ
> మధ్యాహ్న వేళను మగువ జన్మించె
> తల్లిగండానను తండ్రి గండాన
> ధనముగండానను ధాన్యగండాన
> ఆవులగండాన............
> పుట్టినవారిల్లు బూడిదైపోవు
> పుచ్చుకొనువారిల్లు భువియందు నిలుచు'

అందుచేతనే యీనాటికిని యాదవులయింట బుధవారము నాఁడాడుపిల్ల పుట్టుచో నిఁక వారుదానిని బెంచరు. మ్రత్తాసులకు సప్పగింతురు. లేదా యామె నింటనే యుంచుకొని యిల్లటికమిత్తురు. ఇది వా రానాఁటినుండి యవలంబించుచున్న యాచారము.

> 'పోవల దన్నను పోయె పెద్దన్న
> అయినవారికి జయమయి వచ్చు ననిరి
> అయిరానివారికి నపజయ మ్మనిరి
> మ్రత్తాసునాఁటిని యచ్చట చేసికొని
> కదనకుంభినిఁ జేరె ఘనపెద్దిరాజు
> జనపతి వాలికేతునికోట చేరె
> కనకదుందుభికోట కరదుర్గకోట
> వాలికేతునిమీఁద వైరంబుచేసి
> యార్లపెంట రణమున హత మాయె రాజు

వాలి సంతతివాఁడయిన వాలికేతువుచే పెద్దిరాజు నిహతుఁడయినాఁడు. అతనిభార్యయగు పెద్దిమాదేవి యాపై సహగమనము చేసినది. తండ్రియనంతరము కాటమరాజు సింహాసనమెక్కెను.

(పెద్దిరాజుచరిత్రనుండి)

ఎఱనూకరాజు—ఈతఁడు ఆవుల వలురాజునకు మూఁడవ కుమారుఁడు. ఇతని భార్యపేరు ఎఱనూక సీత. కుమారుఁడు భట్టావులరాజు. ఇతఁ డెఱ్ఱభూపతితో యుద్ధముచేసి చనిపోయెను.

> 'ఏన్గురాజులకొండ కెఱనూకరాజు
> యేగి యుద్ధముఁ జేసె నెఱ్ఱభూపతితో
> ఎఱుకలు సేనాడు లేతేర వెంట
> ఎదురొమ్ము పోట్లతో సెదిరించితండ్రి!
> అక్కడ రణములో హతమయిపోతి.'—

నలనూకరాజు—ఈతఁడు ఎఱనూకరాజు తమ్ముఁడు. భార్యపేరు నలనూకసీత. కుమారుఁడు చుట్టువారి యెఱ్ఱయ్య ఒండె—పయ్యావుల యెఱ్ఱయ. ఈతఁ డొకతూరి బెజవాడ కనకదుర్గాంబను జూడఁబోఁగా 'సున్నభూపతి' యీతని సుంకము చెల్లించ మనెనంట; ఆనాళ్లలో నున్న భూపతులు దేవీదర్శనార్థము వచ్చువారి నుండి సుంకములు గ్రహించుచుండిరి గాఁబోలును! కాని నలనూకరాజు దాని కొడంబడక నున్న భూపతితో యుద్ధముఁజేసెను. ఆకనకదుర్గ వరప్రసాదమున నలనూకరాజునకుఁ గలిగినకుమారుఁడే పయ్యావులయెఱ్ఱయ.

> 'సున్న బెజవాడ నలనూకరా జేగ
> శంబును జూడ సుంకం బడ్గె రాజు
> సుంకంబు విలమీఁద సున్న పేయంగ
> సున్న భూపతులను సుగ్గుగాఁ జంపె'

ఆ పై సుంకముమాట లేకనే దేవిని జూచి నలనూక యా దేవి వలన వరములఁ బడసినాఁడు.

పోలురాజు—

ఈతఁడు ఆవుల వలురాజు కడగొట్టు కుమారుఁడు. సిరిదేవి యితని భార్య. వీరికి ముగ్గురు కుమారులు నొక కుమార్తయుఁ గలరు.

భక్తిరన్న, అయితమరాజు, ముమ్మయ్య, అగుమంచి - వారి సంతానము. ఈతని జననమును గూర్చి యొక వింతకథ కలదు. తదుపరి చేర్కొందును.

ఈతని మేనల్లుఁడు పల్లికొండ (అనఁగా పోలురాజు సోదరి యగు కొమరమ్మ కుమారుఁడు) యిట్లుగాఁ దన మామను స్మరించుచున్నాఁడు.

'ప్రార్థించు జంగాల ప్రాణమ్ము కొఱకు
సమరంబు చేస్తివి... .....
భక్తుల కొఱకునై పర్వతముఁ బంపి
చోడరాజులతోడ.........
కత్తులపాలైతి గద పోలు రాజ!
భక్తులకై నీవు ప్రాణ మిచ్చితివి
ఒరులకై మన మంద ఒరగ నోమామ'

పూర్వము చోడరాజగు సోడాణి (చోడాని) శ్రీరంగము రాజధానిగా నేలుచుండెను. కావేరినదిలో వెల్లువవచ్చినది. దాని యుద్ధృతము నాప నెవరితరము గాకపోయెను. దానిని కట్టుటకు వెట్టిచేయువా రెవరని రాజు ఆలోచించెను. చుట్టుపట్టులవారిని వెట్టిచేయమని సోడాణి ఆజ్ఞాపించెను. వెట్టికి వచ్చిరా సరి లేదా యుద్ధము తప్పదాయె! ఆ సమయమునఁ గావేరీ సమీపదేశమున చెఱకువాడలో కొందఱు జంగాలు వసించుచుండిరి. వారిని వెంటనే వచ్చి వెట్టి చేయవలసినదిగా నాజ్ఞాపించుచు సోడాణి పురహరుఁడను యోధునితోఁ గబురు పంపును. జంగాలకు నాచాకిరి యిష్టములేదు. ఆ రాత్రికి వేచియుండమని పురహరునికి లక్షరూప్యములు లంచమిచ్చి జంగాలు ప్రార్థింతురు. ఆ రాత్రికి రాత్రే శయనమై పోలురాజును సమీపించి వివరములుచెప్పి తమకు సోడాణివలనఁ గలుగఁబోవు నాపదనుండి తమ్ము రక్షింపవలసినదని ప్రార్థించిరి. అప్పుడు పోలురాజు వారి కభయమిచ్చును. 'నాయనలారా! వెఱవకుఁడు. మీ ప్రాణములకు మా ప్రాణముల నిత్తుము. మా యాదవకులము నాశనమయినను సరియే. మిమ్ముఁ గాపాడి తీరుదుము. వెంటనే మీరు శ్రీశైలమునకుఁ దరలిపొండు.' అనును. తెల్లవాఱినంతనే పురహరునకు సమాధానము చెప్పకొనవలయును. పోలురాజు వారికి ధైర్యము చెప్పును.

"ఏడెద్దుల మసిలినాయుడు ఎన్నగల బలము
కల్లందుల మారినీడు ఘనుఁడు బొల్లావు
శ్రీశైలపర్వతము చేరంగఁ బంపె
అప్పుడు యుద్ధంబు ఆరంభ మాయె

పోలురాజు పైతీరుగా జంగాలకు సాయమిచ్చి పంపి తాను గూడ యుద్ధమునకు సిద్ధమగుమ.

చిలకలమఱ్ఱి రాణ్యమున పోలురాజు మూఁడుకన్నులవాఁడు ముక్కంటిమీఁద యుద్ధమునకు దిగును. కొంత యుద్ధము జరగును. పోలురా జొకమఱ్ఱిచెట్టుక్రింద నేల వ్రాలును.

అప్పుడతని మేనల్లుఁ డయిన పల్లికొండ యచ్చటికి వచ్చును. పోలురా జతనితో నిట్లనును. "నాయనా! యింక నేను పంచలింగాల కొండమీఁదఁ వేపకాయంత లింగమై వెలసెదను. మఱి యఱువదియేండ్లకు నేను వత్తును. మీ రెప్పుడు పిలిచిన నప్పుడే పలుకుచుందును. నాయనా! నా కుమారులు బాలురు. నీవు వరప్రసాదివి. ఆ కుఱ్ఱవాండ్రను కాచి పెద్దవారిని చేసి రాజ్యము కట్టించుము. ఈ తూరివచ్చు చిత్రభానుసంవత్సరమునందుఁ బగ తప్పక వచ్చును. అప్పుడు నేను వచ్చెదను. అందాక మీ మేనత్త యగు సిరిదేవిని వైధవ్యము చెందనీయక యైదువతనముతో నుండమని చెప్పుము. జాగ్రత్త! నాయనా!"

ఆపై పోలురాజు కుమారులు పల్లికొండ పెంపుడులో నుందురు. పెద్దిరాజు కుమారుఁడయిన కాటమరాజు రాజ్యము వహించును.

ఈ సోడాణిరాజు పంపిన ముక్కంటితోఁ బోలురాజు యుద్ధముచేయుటకుఁ బూర్వము కొంతకథ వారిద్దఱి మధ్య జరగును.

కావేరి వెట్టి చేయుటకు సోడాణి యీ పోలురాజును గూడ రమ్మనెను. ఆతని యాజ్ఞను కాలఁ దన్నిఁ పోలురా జావచ్చిన వానిని తూలనాడి పంపును. సోడాణి కోపముతోఁ గావేరియొడ్డున హోమాగ్నులు వ్రేల్చి పోలురాజుమీఁద మంత్ర ప్రయోగము చేయును. యాదవులకు దానిమూలమున నపార మయిన నష్టము సంభవించెను. వేనకువేలావులు చనిపోవును. పోలురాజీ కుతంత్రము సోడాణి దని యెఱిఁగి తిరుగమంత్రము ప్రయోగించును. దానితో సోడాణి రాజధాని యగు శ్రీరంగ మంతయు దహించుకొనిపోవును. సోడాణి భయభ్రాంతుఁ డయ్యెను. అప్పుడు సోడాణి తన మంత్రి యయిన సుమంత్రునిఁ బిలిచి యతని నిట్లడుగును 'ఏమి టీ ప్రజ్ఞ! ఎవ రా పోలురాజు?' అని.

మంత్రి సుమంత్రుఁ డప్పుడు పోలురాజు సామాన్యుఁడు కాఁడనియు, నతఁడు దేవతాంశసంభూతుఁ డనియుఁ జెప్పును. ఇంకను నిట్లు చెప్పును.

'కొంతకాలముక్రితము చంద్రగుప్తుఁ డనురాజు మనదేశమును బరిపాలించుచుండెను. ఆరాజు కొక కుమార్తెయుండెను. ఆమె పేరు మల్లికాదేవి. ఆమె మిక్కిలి భక్తురాలు.

ఆరాజుగారి పశువులశాలలో దివాణము క్రింద వినియోగించుట కని యయిదావు లుండెడివి. ఆ యయిదావుల పాలను రాజుగారు తమ క్రింద వినియోగించుకొనుచుండెడివారు. కొంతకాలమునకు రాజుగారి కొకవార్త వచ్చెను. కొట్టములో నాలుగావులే పాలిచ్చుచున్నవనియు, నయిదవ యావొక చుక్క పాలు గూడ నిచ్చుటలేదనియు వారు చెప్పిరి. ప్రతి దినమును నాయావు వెందుచేతనోకాని యాలస్యముగాఁ గొట్టములోనికి వచ్చుచుండెను. రాజుగా రామాటలు విని తగిన కట్టుదిట్టములు చేసెను. ఆ యయిదావులను గాచియుండుట కయిదుగురు గొల్లల నేర్పాటు గావించెను. 'కాచి యుండి యా యావుపాలు పిదుకుకొని పోవు నా దొంగ యెవరో యాతనిఁ బట్టుకొని రండు' అని యాతఁడు వారి కాజ్ఞాపించెను.

ఆవును పొలము తోలినవెంటనే గొల్లలుకూడ నావువెంటఁ బోవుచుండిరి. అవ్వను సెల్లపాలు, నల్లమల కొండలను దాటి యింకను

ముందునకుఁ బోవుచునే యుండెను. ఊపిరి బిగియఁబట్టి యా గొల్లలును దానివెంటఁ బోవుచునే యుండిరి. పోయిపోయి యా యావొకచోట చాటయ్యెను. గొల్లలు కొంతదూరముననుండి చూచుచుండిరి. ఆ యావొకచెట్టుక్రింద నున్న యొక పెద్ద పుట్ట దగ్గఱకు వెళ్లెను. వెళ్ళి 'అంబా' యనుసరికి నా పుట్టలోనుండి యొక పెద్దనాగు పడగ విప్పుకొని నాట్యమాడుచు వెలికి వచ్చెను. ఆవు పాలు పితుకఁగా నాగు త్రాగుచుండెను. గొల్ల లీ వింతను చూచుచునే యుండిరి. నాగు పుట్టలోనికిఁ బోయెను. అది యట్లు పోవుచుండఁగా గొల్లలు తమచేతనున్న గొడ్డలి నా నాగుమీదికి విసిరిరి. నాగు వెళ్ళిపోయెను. గొల్ల లాచోటునకుఁ బోయి చూచిరి. గొడ్డలిలోని యినుము బంగారయ్యెను. కొయ్య వెండి యయ్యెను. ఆవు వెనుకకు మళ్ళెను. ఆదృశ్యము నాయయిదుగురు గొల్లలును నయిదుతీరులుగాఁ జూచిరి. 'నే నీరూపములోఁ జూచితిని' అని యొకఁడు చెప్పఁగా 'అబ్బే! అది కాదు నే నీరూపములోఁ చూచితి'నని మఱియొకఁడు చెప్పుచు వారు తమలోఁదాము వాదులాడుకొనిరి.

వారయిదుగురును వెంటనే రాజుకడకు వచ్చి తా మాదిన మడవిలోఁ జూచినవింతను నాతనితోఁ జెప్పిరి. చంద్రగుప్త మహారాజాశ్చర్య మందెను. 'మీరు పుణ్యాత్ములు కనుకనే మీ కీనాఁడు దేవదర్శనము లభించినది. పదండి రేపటిదిన మాయావు పోవుసమయమునకు నన్నును బిలువుఁడు. నేనును వచ్చెదను' అని యాతఁడనెను.

ఆమఱునాఁడు రాజుగారును, నాతని కుమార్తె మల్లికాదేవియుఁ బల్లకీల నెక్కి ముందు ఆవు, వెనుక తామునుగా దానికిఁ దమరాక తెలియరానీయకుండఁ బోవుచుండిరి. ఆవు యథాస్థానమునకు వచ్చెను. చంద్రగుప్తుఁడు చూచుచుండెను. నాగు పుట్టలోనుండి వెలికి వచ్చెను. దాని నిశ్వాసమునుండి పొగ భూమ్యాకాశములు గప్పుచు వచ్చెను. ఆ ప్రదేశ మంతయుఁ బొగతోఁ గప్పబడిపోయెను. ఆ తరువాత నే మయ్యెనో యెవ్వరికిని దెలియదు. చంద్రగుప్తుఁడు హతాశుఁ డయ్యెను.

కొద్దిసేపటికి నా వింటికి మళ్ళెను. పొగ యడఁగెను. పుట్ట స్పష్టముగా గానవయ్యెను. కాని నాగు ఏదీ? ఆ పుట్టను త్రవ్వించి నాగును చూడవలె నని చంద్రగుప్తునికిఁ గోరిక గలిగెను. సేవకుల కట్లా జ్ఞాపించెను. వారు పుట్టను త్రవ్వుచుండిరి. ఎంత త్రవ్వినను పుట్ట తఱుగకుండెను. నాగు కానరాదయ్యెను. త్రవ్వఁగా త్రవ్వఁగా నొక పెద్దబండ యడ్డమయ్యెను. ఆ బండయే శ్రీశైలము. చంద్రగుప్తుఁ డంతటితో నాగలేదు. ఆ బండను బగులఁ గొట్ట నాజ్ఞాపించెను. దానిక్రింద నాగున్న దేమో యని! బండను బగులఁ గొట్టిరి. ఆ కొట్టుటలో గడ్డపారపోటు నాగు శిరస్సునఁ దగిలెను. మునుపటికివలెనే బ్రహ్మాండముగాఁ బొగ నలుదెసల నావరించెను. ఆ ధూమములో రాజుగారును, బరివారమును జిక్కువడిరి. వారు మూర్ఛనొంది చనిపోయిరి. పొగ వచ్చుట, అచ్చటి గల్లంతు అంతయు మల్లికాదేవి యవతల పల్లకీలోఁ గూర్చుండి చూచుచుండెను. కొంచెసేపటికిఁ బొగ యడఁగిపోయెను. తన తండ్రి యగు చంద్రగుప్తుఁడును, నతని పరివారమును నేల కొరగిన వైనమును మల్లికాదేవి చూచెను. వెంటనే యామె పుట్టదగ్గరకు వెళ్ళి తన తండ్రికొఱకై మిక్కిలి దుఃఖించెను. తనపైఁ గనికర ముంచి తనకు దర్శన మిమ్మని యామె పరమేశ్వరునిఁ బ్రార్థించెను. అతఁడు తనకు దర్శన మీయకున్న నక్కడఁ బుట్టిన బండకుఁ దన తలఁ బగులఁగొట్టుకొందు నని యార్భాటము చేసెను. ఈశ్వరుఁ డామెపైఁ గరుణించి యామెకుఁ బ్రత్యక్ష మయ్యెను. మల్లిక తన బరివారమును బ్రదికించుకొనెను. చివర కామె యొకవరముఁ గోరుకొనెను. "స్వామీ! మిమ్ము దర్శింపఁ గలుగుటచే నా జన్మ తరించినది. నా దొక్క కోరిక. మఱుజన్మమున నేను, మీరు, మీకుఁ బాలిచ్చిన యీ యావు—మనము ముగ్గురమును గలసి యొక కుటుంబముగా వెలయవలయును' అని. పరమేశ్వరుఁడును నామె కావరము ననుగ్రహించెను.

ఆ మల్లికాదేవియే సిరిదేవిగా జన్మించెను. ఆ యావే యావుల పోలురాజుగా జన్మించి సిరిదేవిని వివాహమాడెను. వారికి సంతానమై పరమేశ్వరుఁడు భక్తిరన్నగా జన్మించెను. ఇట్లు వారి పవిత్రజన్మము లున్నవి."—అని సుమంత్రుఁడు సోడానికిఁ బోలురాజు పూర్వజన్మ వివరము తెలిపెను. సోడాణి యాశ్చర్యచకితుడై యట్టి మహనీయుఁడగు పోలురాజుతో బాంధవ్యము నభిలషించెను. 'మార్గ మేమిటి?' యని యాతఁ డాలోచెంచెను. పూర్వము పోలురాజు కంచి మొదలగు పుణ్యక్షేత్రములలో దేవాలయముల నెత్తించియుండెను—కాని వానిమీద నింకను శిఖరములు వెలయకుండెను. ఆ విధముగా సంబంధము చేయుదమని యనుకొని సోడాణి గంధమాధవనేఁడు అను భట్టును బిలిచి పోలురాజు దగ్గరకుఁ గబురు పంపును. దాని సారాంశ మిది!

'పోలురాజా! నీవు పలుస్థలములయందు దేవాలయములు నిర్మించితివి. కాని వానిమీద శిఖరము లింకను వెలయలేదు. ఆ శిఖరముల నెత్తించి పుణ్యాశేషమును నేనును బంచుకొందును. గుడిలో లింగము నీది. గుడిమీఁది శిఖరము నాఁది. పాలగచ్చుతో నాపని చేయింపవలయునని నాకున్నది. దయచేసి నాకు మీయావులపాలు పంపుము'—అని.

గంధమాధవనేఁ డావిషయమును పోలురాజున కెఱింగించెను. 'చంకలో గుదియఁబెట్టుకొని శరణార్థి నన్నట్లు ఏమిటీ రాయబారము? నే నెట్లు పాలు పితికి యవి యన్నియుఁ బంపు నేర్పాటు చేయఁగలను? అంత యవసరమే యయినచో మీరాజుతో నిక్కడనుండి శ్రీరంగము దాఁకఁ గాలువలు తీయించు కొమ్మనుము. పాలు పితికించి యందుఁ బోయింతును' అని పోలురా జనెను.

ఆవిషయము తెలిసి సోడాణి యాశ్చర్యమందెను. 'ఇదేమిటి? పాల నడుగఁగా బిందెలో గంగాళాలోఁ బంపు ననుకొంటిని. కాలువలు తీయించు మనుచున్నాఁడే? చూత' మనుకొని సోడాణి గచ్చుకాలువలు తీయించెను. రెండుదినములు గడచి మూఁడవదిన మగుసరికి నాకాలువలు పాలతోఁ బొంగి పోవుచుండెను. కాలువలలోఁ బాలు గట్టుల కెగఁదట్టుచుండెను. ఇంకను నొక్కరోజట్లే పాఱుచుండినయెడల శ్రీరంగ మంతయుఁ బాలమఱు మగున ట్లుండెను. సోడాణి దిగ్భ్రాంతుఁడై

పోలురాజునకుఁ బాలు పంపుట చాలింపు మనికబురు పంపెను. ఈ వార్త తీసికొని భట్టు పోవుచుండఁగా పోలురాజు పంపిన ఎజ్జయ్య యతనికిఁ దారసిల్లెను. పంపిన పాలు సరిగా శ్రీరంగము చేరుచున్నవో లేదో చూచి రమ్మని పోలురా జాతనిని బంపియుండెను. ఎజ్జయ్య యావార్తతో నచ్చటికి వచ్చుచుండెను. అప్పటి కప్పుడే పాలకాలువ తెగి పాలు నవస్థలో నుండెను. ఎజ్జయ్య శ్రీరంగమును సమీపించెను. సోడాణి కాలు గాలిన పిల్లి వలెఁ గాలువయొడ్డునఁ దండనా లాడుచుండెను. గట్టు కొద్దిగా దిగెను. వెంటనే సోడాణి యొక పార తీసికొని యింత మన్ను పోసి గట్టు తెగకుండఁ గాపాడెను. ఇది చూచుచున్న యెజ్జయ్య "నెట్టికి మన్ను రమ్మన్న ఓ వెజ్జి సోడాణీ! ఇప్పు డేమిటయ్యా నీకు నువ్వే నెట్టి చేసుకుంటున్నావు?" అనెను. సోడాణి యా మాటలకుఁ జిదికిపోయెను. తన జులుమునకు, నహంకారమునకు సిగ్గుపడి యెజ్జయ్యను సత్కరించి పంపెను. అప్పటి నుండియు సోడాణియుఁ బోలురాజును బరస్పర సఖ్యముతో వర్తిల్లుచుండిరి.

(పోలురాజు చరిత్ర నుండి)

కొమరమ్మ—

ఈమె యావుల వలురాజు కుమార్త. పందుమల పాపినాయని భార్య. పల్లికొండ యీమె కుమారుఁడు. ఆతఁడు వరప్రసాది. యాదవుల కులగురువు.

కరియావులరాజు—

ఈతఁడు సింహాద్రిరాజు కుమారుఁడు. 'కాశిలో కత్తి కడిగె కరియావులరాజు'. ఈతఁడు సోదరుఁడగు కాటమరాజు తరఫున నెఱగడ్డపాటి పోట్లాటలోఁ బాల్గొనెను. ఈతని చెల్లెలు చిట్టినూక.

కాటమరాజు—

ఈతఁడే యాదవకథా నాయకుఁడు. ఇతనికే మఱి యైదు నామాంతరము లున్నవి.

"నరజన్మ మెత్తుటచే నలనన్న
ఆవుల గాచుటచే ఆవులన్న
పశువులకు పట్టము గట్ట పశువులన్న
కాట కోటేశ్వరుడు కాటమరాజు
క్రతేయుడు." ఇవి!

ఈతని జననము ధాతనామ సం॥ ఫాల్గున శుద్ధపంచమి గురువారము. ఆనాఁడు యాదవులకుఁ బర్వదినము. ఈతని నాధారముగాఁ గొనియే యాదవశాస్త్ర మంత పెరిఁగినది.

తండ్రి పెద్దిరాజునకు సంతానము లేకపోఁగా కల్యాణము సోమప్ప వరప్రసాదమున కాటమరాజును, పాపనూకమ్మయు జన్మించిరి. పెద్దిరాజు ఆర్లపెంట రణములో చనిపోఁగా కుమారుఁడు కాటమరాజు కొంతకాలము ముత్రాసుల యిండ్లలోఁ బెరుగును. ఆపై రాజ్యము చేయును. నాఁ డీతఁడు తన పశువులమందను ఉత్తరదక్షిణభూములలో మేపుకొనుచు కాశినుండి కంచివఱకు వచ్చును. నెల్లూరిలో నలసిద్ధి రాజునొద్ద పుల్లరి యొడంబడిక వ్రాయించుకొని పశువుల మేపుకొనును. ఆనల్లసిద్ధి చెల్లెలు కుందమాదేవి భూములలో వీరు పశువులను మేపఁగా నామె యీతని పశువులకు నష్టము గలిగించినది. అది కారణముగా కాటమరాజునకును, నల్లసిద్ధికిని నెఱగడ్డ పాడులో ఘోరయుద్ధము జరగెను. రణమున నలసిద్ధియుఁ గాటమరాజును మరణింతురు.

యాదవులమతమున విష్ణువే కృష్ణుఁడు. కృష్ణుఁడే కాటమరాజు. ఇతనిది ఆదినానారాయణవంశము. అచ్యుతానంద గోత్రము. సురలు యాదవులుగా, సురకాంతలు గోపికలుగాఁ బుట్టిరని వారి విశ్వాసము.

ఈతనికి డెబ్బదియేడు బిరుదులున్నవి. అంభోజ బిరుదు, ప్రళయకాలబిరుదు, సింగిణీతోరణాలు, కనకసింగిణీలు. విష్ణుబిరుదు, చంద్రబిరుదు, గరుడ శార్దూల కనక పడగలు, పిగిలి తలాటము, పిగిలి కుచ్చులు, పంచలోహతలాట, భస్మ శంకర—యిత్యాది బిరుదులు గలవాఁడు కాటకోటేశ్వరుఁడు.

కాటమరాజు భార్య పేరు మర్లవారి గంగ. ఆర్లపెంట రణమున నాతని తండ్రి చనిపోయినపు డామె యాతని వివాహమాడఁ గోరెను. అప్పు డాతఁడు 'ఇప్పుడు కాదు. నీవు పోయి మర్లవారింటఁ బుట్టుము. నేను ఉత్తరభూములకుఁ బోయి దక్షిణ భూములకు మరలు నప్పుడు నిన్ను వివాహమాడుదు.' ననెను. దక్షిణభూములకు వచ్చినపుడు పాలేటిలో గంగ యాతనిని దాటనీయదయ్యెను. అప్పు డాతఁడు గంగను ప్రార్థించును. మర్లవారు వచ్చి కాటమరాజును ప్రార్థింపఁగా కాటమరాజొక కత్తికిఁ బుస్తె కట్టి యా యింటిపడుచును వివాహమాడును. ఇతని తండ్రి యగు పెద్దిరాజునకుఁ గల శాపముచే నితనికిఁ బుత్రసంతతియే లేదయ్యెను.

పాపనూకమ్మ—

ఈమె కాటమరాజు సోదరి. చిత్రభాను సంవత్సరమున ఫాల్గున మాసమునందు బుధవారమునాఁ డీమె పెద్దిరాజునకును, పెద్దిమాదేవికిని జన్మించెను. ఈమె పుట్టిన యేడవనాఁడు పెద్దిరాజు గతించెను. అందుచేతనే బుధవారమునాఁడు పుట్టుట యాదవులకు నశుభసూచకము. (వివరములు పెద్దిరాజునుగూర్చిన వృత్తాంతమునం దొసఁగఁబడినవి.)

ఈమె తనం తండ్రియయిన పెద్దిరాజు మరణానంతరము ముత్రాసుల యిండ్లలోఁ బెరిఁగెను. పెద్దిరాజు చనిపోవుచు ముత్రాసులతో నిట్లనెను. "నాయనలారా! ఈ పాపనూకను మీరు పోషింపుఁడు. భక్తిరన్న యని యీమె సోదరుఁడు వచ్చి యీమెను తీసికొనిపోవును. అప్పు డతని కీమె నప్పగింతురు గాని" అని. ఆ బిడ్డను తమ బిడ్డయని తెల్పినపుడు ముత్రాసులు మంత్రప్రయోగము చేయుదురు. అప్పుడు పెద్దిరాజు ప్రత్యక్షమై యది సత్యమే యనును. ఇదియే భక్తిరన్న యామెను గ్రహించుటకు నిదర్శనము.

కొంతకాల మయినపిదప ముత్రాసులకుఁ బేరాస కలిగెను. ఆమెను హరించినచో నామె తాలూకు ఆస్తియంతయుఁ దమదే. యని! పాపనూకమ్మను నొకగదిలో వారు దాచియుంచిరి. కొంతకాలమునకుఁ బిదప భక్తిరన్న పెద్దిరాజు సంతానమునకై వెదకుచు నా ముత్రాసులుండు నగరికి వచ్చెను. వారి నడుగ నెవరును నా విషయమై యేమియుఁ జెప్పరయిరి. రెన్నాళ్లుండెను గాని లాభము

లేదయ్యెను. మూఁడవనాఁడు ముత్రాసు లిండ్లలో వడ్లు దంచుకొను చున్న యమ్మలక్కలు భక్తిరన్న యూరువదలి వెడలిపోయియుండు నని యెంచి దంపుటకు రమ్మని పాపనూకను బిలిచిరి. పాపనూకయు వచ్చి వడ్లుదంచుచు నొక సువ్విపాట పాడును. అప్పుడు భక్తిరన్న యాదారిని బోవుచు నది విని వచ్చి పాపనూకను దనవెంటదీసికొని పోవును. సువ్వి యిది!

సువ్వి! సువ్వి! దేవ సువ్వి! సువ్వెన్నలార
సువ్వాలె పాడితే యే యన్న రాఁడు?
పచ్చవడ్లు నే దంచి పాలెసరబోసి
పాయక నే జూతు పాలేట దారి
సువ్వాలె నే నొక్క పోటు వేసేను
తఱిగే నమ్మ ధనమకొండ ధాన్యరాసుల్లు
పవిడేడుమందిలో సంపదగలరాజు
అవులపోలురాజు అన్న కూతురిని
కాశికి పడమర గంట మ్రోగింది
కాశి పోయినభక్తిరన్న కల నన్న రాడు
శిరసున్న లింగాల శివభక్తురాలు
వరుసతో 'నల్లమేడ' వదినమ్మ మాకు
అవపూ తీరమ్మ అద్దములో తీరు - మా
ఆడవారిలో నెల్లా అగుమంచి తీరు
మొగలిపూ తీరమ్మ మొగసాల తీరు
మొగవారిలో కెల్లా ముమ్మయ్యతీరు
కాకర చెట్టుకి కాయ లందమ్మ
కన్నతల్లి పెద్దమ్మకు కమ్మ లందమ్మ
గుమ్మడిచెట్టుమీద గువ్వ ప్రాలంగ
గుండములో పెద్దిరాజు కూలె గామాలు
సింహము భేతాళ శిర సుత్తరించి
కాశిలో కత్తి గడిగె కరియావులరాజు
ఏకూరు సన్నాలు ఎం దుంగరాలు?
ఎద్దావుల చెలికాఁడు మా ఎల్లయ్య రాను

ఇట్లుగా నామె
తిరుమందుల గోత్రాలు తీర్చి పాడింది
మర్లవారి గోత్రాలు మగువ పాడింది
చల్లవారి గోత్రాలు చక్కగ పాడింది
పందుమల గోత్రాలు పరగ పాడింది

అప్పుడు భక్తిరన్న యామెను తీసికొని పోయినాఁడు. నిదర్శనమును గూడ నాతఁడాసందర్భమునఁ జూపెను.

భట్టావుల రాజు—

ఈతఁడు ఎఱనూకరాజు కొడుకు. కాటమరాజు తరపున నెఱగడ్డ పాటి యుద్ధములో సిద్ధిరాజుతో నితఁడు యుద్ధము చేయును.

పయ్యావుల యెల్లయ్య—

ఈతనికే చట్టావుల యెల్లయ యని నామాంతరము కలదు. ఇతఁడు నలనూకరాజుయొక్క కుమారుఁడు. ఇతని తండ్రి యగు నలనూకరాజు నున్న భూపతులపై యుద్ధము చేసినపు డీతఁడును నతనికి సహాయుఁడుగా నుండెను. ఆ యుద్ధమున నీతఁడు జయించుటచే బెజవాడ బెబ్బులి పెయ్యావుల యెల్లయ్య యని యీతఁడనిపించుకొనెను. ఇతఁడు బెజవాడ కనకదుర్గ వరప్రసాది.

ఎద్దులభాషలు ఎల్లయ్య కెఱుక
యెల్లయ్యభాషలు ఎద్దుల కెఱుక
ఆవుకి హరిమంత్రం, ఎద్దుకి గురుమంత్రం
నూటికి నెలగ ఎల్లయ్యకు—

కాటమరాజు సైన్యము ఎఱగడ్డపాడులో యుద్ధము సేయఁబోఁగా నాతని మందలోని పశువులు కొన్ని శకునములు తెలిపినవి. ఆ వాని వివరములేవో తెలియఁగోరి కాటమరాజు ఎల్లయ్యను బిలిచి యడుగును. 'గోభాషామంత్రములు' కొంత తెలిసినవాఁడగు ఎల్లయ్య వాని వివరములను రాజున కెఱిఁగించును.

భక్తిరన్న—

ఈతఁడు పోలురాజునకును సిరిదేవికిని జన్మించినవాఁడు. ఈశ్వరావతారము. ఈతఁడు పరలోకగతు లయిన తన పూర్వులకుఁ బుణ్యలోకములు కలుగవలయునని వారివారి పిండములఁ గొని కాశి కేగి యందు గంగలో నిమజ్జనముచేసి వచ్చెను. ఈతనిగూర్చి యొక కథ విస్తరభీతి నిట నుదాహరింప మానితిని.

అయితమరాజు—

ఈతఁడు పోలురాజునకు రెండవ కుమారుఁడు. కాటమరాజునకు సోదరుని వరుస. నలసిద్ధిమీఁద యుద్ధమున నీతఁడు చూపిన పరాక్రమము ప్రశంసనీయము. అల్లుదాడెన్న ఈతని కుమారుఁడు.

ముమ్మయ్య—

ఈతఁడు పోలురాజునకు మూఁడవ కుమారుఁడు. ఈతఁడును యుద్ధమునఁ బాలుగొనును. ఇతనిది చక్కని విగ్రహము. అందుచేత నే,

"ఆడవారిలో కెల్లా అగుమంచి తీరు
మొగవారిలో కెల్లా ముమ్మయ్యతీరు." అని ప్రశస్తి యేర్పడినది.

అగుమంచి—

ఈమె పోలురాజునకుఁ గడగొట్టు బిడ్డ. భర్త ఉత్తమరాజు. వీరి బిడ్డఁడే పోచయ్య. 'అగుమంచి కథ' యని యీమెను గూర్చిన కథయే గ్రంథరూపమున నున్నది.

దానిఁ గూర్చినవివరము లింతకుఁ బూర్వమే యొసఁగఁబడినవి. ఎఱగడ్డపాటిలోఁ దనభర్తయు, సోదరులలోఁ గొందఱును నిహతులగుట విని యాభరణాదికముల విసర్జించి యీమె సహగమనము చేయును.

గోసంగులు—వీరు ఆరువేలమంది. మంగళ్లి పాడు వీరి శాణ్యము. కొంగవాలుకత్తి వీరి యాయుధము.

చినగబ్బి పెదగబ్బి చిన్నయ్యతమ్ములు
పినరంతు పెదరండు బీరన్నతమ్ములు

అశనిపాక కుమారుఁడు మసిలినాయఁడు. మసిలినాయనికుమారుఁడు బీరినాయఁడు. ఈతఁడు మాతంగిపీరుఁడు. గోసంగుల కధిపతి. కాటమరా జెల్లవారికిని శాణ్యము లేర్పఱచి తనకు శాణ్యము

నేర్పులుపక పోఁగా నితఁడు కొటమరాజును ప్రార్థించి నిష్ఠురము లాడి మంగల్లిపాడు ఠాణ్యము నిప్పించుకొనెను.

చల్లవారు—చల్లభూపతికి నేడుగురుకుమారులు కలరు. పిన్నయ్య, వేంకటాద్రి, కోనేరు, అచ్యుతుఁడు, అనంతుఁడు, గోవిందుఁడు, పుణ్యుఁడు—వీ రందఱును కొటమరాజునకు యుద్ధమున సాయెమగుదురు. సాగలకొండ వీరిఠాణ్యము.

పద్మనాయఁడు—

ఇతఁడుఁ వెలమకులమునకుఁ జెందినవాఁడు. 'కులమున వెలమ నాచెలిమిని గొల్ల'యని యాతనిని కొటమరాజు సంబోధించును. ఇతఁడు కలనాయని కుమారుఁడు. కలనాయఁ డొక గోహత్యను గావించినాడు. అపాప మఱువదియేండ్లకుఁగాని తీరదుట! గోహత్య కావున గోపాలకునికిఁ దాసుసేవచేసినఁ గాని యాపాపము పరిహారముకాదు. అందుచే నాతని తరువాత పద్మనాయఁడు కొటమరాజునకు మంత్రియై సేవ చేయును. అతఁ డీతనిని బావ మఱఁదిగా సంభావించును.

గంగమ్మ—

యాదవుల కులదైవ మీమె. ఈమెనుగూర్చి యీక్రింది ప్రశస్తిని గొల్లలు చెప్పుదురు.

పండ్రెండుచేతుల భాగీరథీగంగ
జడలు విరబోసిన జాహ్నవీ గంగ
మురిమురి మీస మెచ్చిన మాడులతుల రాజుల శిరసులు—
నడుముకి వడ్డాణం కావించె కొటమరాజు
తొంబైనూఱు యేనుగుల కుంభస్థలము
గావు మెడదు పెట్టెను కొటమరాజు
పన్నెండు చేతుల భద్రేశు ఆయుధాలను బట్టె
అసురుల మర్దించు అంబువు ఒకచేత
దూతల మర్దించు దుడ్డు ఒకచేత
పట్టెను గంగ త్రిశూలము ఒకచేత
సింగిణి ఒకచేత కరవాల మొకచేత
కత్తి ఒకచేత ఖడ్గము ఒకచేత
పరుసైన దానిమ్మపండు ఒకచేత
శంకువు ఒకచేత చక్రము ఒకచేత
విరిగోల ఒకచేత.........
డక్క ఒకచేత డమరుక మొకచేత
బద్ది యారగించేటి పట్టెడ ఒకచేత
కట్టెన దమ్మవారు మాంధూళి చీర
తొడిగినది గంగ తొమ్మిది మూళ్ళ
దొంతావళి రవిక
రాక్షసవన్నియ రవిక తా దొడిగి

ఈ వర్ణనము గంగస్వరూపమును దెలుపుచున్నది.

మనుమసిద్ధి—

ఈతఁడు నెల్లూరును పరిపాలించినరాజు. నల్లసిది యను సీత నికి వ్యవహారము కలదు. ఈతఁడు అమరావతి లింగేశ్వరునికిని పార్వతికిని బుట్టిన ముక్కంటికిఁ బుత్రుఁడు. ఈతని కెనిమిదిమంది సోదరీలు గలరు. కుందమాదేవి యం దొకతె. సంప్రదాయముగా మనుమసిద్ధిని గూర్చి చెప్పఁబడు వృత్తాంత మిది. చరిత్ర నికషమున కిది నిలువఁజాలక పోవచ్చును.

ముక్కంటి—

ఈతఁడు అమరలింగేశ్వరస్వామికిని పార్వతికిని కుమారుఁడు. ఇతనికి నెనిమిదిమంది సంతానము. ఈతని జన్మమును గూర్చి యొక వింత కథ కలదు. విస్తరభీతి నది యుదాహరింప మానితిని.

* * * *

## కొటమరాజు కథ – భారతము

పలనాటివీరుల కథ భారతమంత పెద్దగ్రంథ మగుటచే నది పలనాటి భారత మనియు, బ్రహ్మనాయుఁడు పలనాటి కృష్ణుఁడుగా, బాలచంద్రుఁ డభిమన్యుఁడుగా భావింపఁబడుటయుఁ గార్యమపూడి కదనరంగము కురుక్షేత్రసంగ్రామరంగముగాఁ దలపబడుటయు నెల్ల రెఱిఁగినవిషయమే. పలనాటివీరుల కథ పలనాటిభారత మయినట్లే కొటమరాజుకథ యాదవభారత మనఁ దగియున్నది. కురుక్షేత్రమునఁ బాండవులతోఁ బోరుటకు సైన్యాధిపతి నియామకములు జరిగినట్లే యిందును నొక్కొక్క దినమున నొక్కఁడు ప్రధానముగా యుద్ధముసేయుట గమనార్హము. అర్జునకు శ్రీకృష్ణునివలెఁ గాటమరాజునకుఁ బద్మనాయఁడు సలహాల నొసఁగుచు నుండెను. అనాగత విషయములయం దాతఁడు పల్లికొండ సలహాల నపేక్షించుచుండువాఁడు. యుద్ధమాడువ దంతులను పల్లికొండయే తెలుపుచుండెను.

"బలభద్రమూర్తి! యో బావ! పల్లికొండ!
తెలఁగి మన యాదవుల్ చేసిన యాజి
మాఘబహుళ అమావాస్య మంగళవారంబు మొదలు
బాగుగా తంబళ బ్రహ్మరుద్రయ్య
దశమి గురువారాన తగఁ జల్లవారు
ఎసగంగ బొల్లావు ఏకాదశి తిథి
అమర ద్వాదశినాఁడు అమరబీరన్న
త్రయోదశినాడు తగ బాలరాజు
లెనయంగ రేపట నెవ్వరి వంతో ?"

భారతమునందువలె నిందును రాయబారము కలదు. కనుక పలనాటివీరుల కథను పలనాటిభారత మనినట్లే కొటమరాజు కథను కూడ యాదవభారత మనఁదగు ననుటలో దోషములేదు.



ఒకరి అనుభవం మరొకరికి విశ్వాసం యిస్తుంది. సుఖజీవ
నానికి పూలబాట వేస్తుంది. భరింపరాని గర్భవేదనతో,
దిగజారిన మనస్సుతో జీవితాన్ని యీడ్వవలసిన
మహిళలకు "లోధ్ర", విశ్వసనీయమైన శరణ్యం.

"లోధ్ర" అన్నిచోట్లా లభ్యమవుతుంది.

# మంజీర*

★

"దాశరథి"

ఎవరి గజ్జెల రవళివే నీవు! మంజీర!
ఎవరి కజ్జల బాష్పధారవే! మంజీర!
నీవు పారిన దారిలో ఇక్షుదండాలు
నీవు జారిన జాడలో అమృత భాండాలు
నీవు దూకిన నేల మాకు విద్యున్మాల
నీవు ప్రాకిన పథము మాకు చైత్రరథమ్ము
ఎవరి కొరకయి పరుగులెత్తి వచ్చితివి?
ఎవరి జూచి తటాకమైనిల్చి పోతివి?
నా తెలుగు నింగి నీడల నడచి నడచి
తెలుగు నడకలు నేర్చుకో గలిగినావు;
తెలుగు కవి కలమున మషీజలమువోసి
వ్రాయమని నావు తీయని పదము నొకటి

జీరలు వడ్డనా గళముజేరి నవధ్వని పుక్కిలించు మం
జీరవు నీవు; నీవెలుగు జిందెడి చక్కని దేహయష్టికే
చీరలు కాన్క తేగలను చెప్పుము? తెల్గునదీ! తెలుంగు బం
గారపు రంగు లద్దిన నిగారపు కావ్యదుకూలముల్ వినా.

నీ నీలాల జలాల చేలములలో నిద్రించు నాకాశ మం
భో నిర్నిద్ర పయోద గర్జనముతో ప్రోద్యన్మహో విద్యుదు
ల్కానీకమ్ములతో సదా సలిల ధారా రమ్య వర్షాభిషి
క్తానమ్మై కృషిక ప్రజావళి బుభుక్షా శాంతి గావించుచున్

ఆకలి తీర్చుకన్న ఘనమైన మహా యజనమ్ము కానమీ
లోకమునందు; నీ మనసులో నొకనాడు తదీప్సితమ్ము చీ
కా కొనరింప వాకవయి, కాలువవై, ఝురివై, తటాకమై
మా కొరకేగు దెంచితి సుమా! కమనీయ పయో భరమ్మునన్

---

* ఈయమ బాలగిరి కనుమల్లో ఉద్భవించి తెలుగింటికి జారివచ్చిన తెలంగాణ ముద్దుబిడ్డ. ఈమె చల్లనిచూపుల జల్లులకు మూడు లక్షల ఎకరాల ఎర్రని ఎడారి పచ్చని పంట చేనుగా పరిణమించింది. ఈవిడ దూకుళ్లకు విద్యున్మాల లుద్భవించి పల్లె పల్లెకూ కాంతిని ప్రసాదిస్తున్నాయి. గంజి దొరకని కర్షకులకు అప రంజి దింపిన నదీమతల్లి—మంజీర.

శిలగా నే గిరిసీమ నుండితివో మంజీరా! శతాబ్దాలు ని
శ్చల వృత్తిన్ పలుకేనిలేక నొక వృక్షచ్ఛాయ దుష్టాత్ము గుం
డెలలో ద్వేషమువోలె ఇంచుకయినన్ హృద్యమ్ముగా; కిష్టు క
న్నుల నీరై ఇటుజారినావు దయతోనో, ప్రేమ భావాననో!

నిను కరగించి తెచ్చిన పునీతుడెవం? డతనిన్ భగీరథుం
డనవలె; వాడు నాతెలుగు టంగణ మందలి ముళ్ల దుబ్బులన్
తునియలు కొట్టి ఈ చెరకు తోటలు నాటి, హాలమ్ము గ్రుమ్మి భూ
మిని ప్రసవింపజేసి పసిమిన్, మిసిమిన్ పెకలించె దండిగా

ఆతడు నేల దున్ని బ్రతుకంతయు పస్తులు పన్న రైతు మా
పోతనయేమొ! వాని వడపోతలలో కవితా ప్రపంచ మా
పాత మనోహరమ్మయిన పల్కు జగద్విదితమ్ము! వాని సం
గాతమునీకు కావ్యతను కల్పన చేసినదోయి, వాహినీ!

ఒకట నదివయి, ఒకచోట ఒదిగి ఒదిగి
*సాగరమవై చలింపక డాగియుంటి
వెంత సౌమ్య స్వభావమోయీ! పరుంగు
లిడు మనస్సును బంధింప దొడగి నావు.

†'ఇందూరు మండలం' బెందాక నీనీటి
తడి తాకి తీయని తనము నొందు,
నా తెలంగాణమ్ము గీత నృత్తములతో
నెందాక నిన్ను పూజించుచుండు
నెందాక నిరుపేద లంది నీ జలధార
పండింతు రొల్లగా పైరుపంట,
ఏ కవీశులు నీ మహాకావ్యత నెరింగి
తమ కలమ్ములకు సౌందర్య మిడుదు,

రంత దాక మహీ మండలాంతరమున
నీ వెలుంగుకు రవ్వంత నీడరాదు;
దివ్య గోదావరీ గృంహాంతికము నందు
నీ విలాసమేనాటికి నిలిచిపోదు.

రుద్రవీణ తీవ మాదిరి జుం జుమ్మని
తరగలెత్తి వచ్చుదాన వీవు;
నా మనస్సులోన నాదాలు కల్పించి
స్పందనమ్ము నేర్పజాలి నావు

---

*నిజాంసాగర ప్రాజెక్టు

†నిజామాబాదు జిల్లా

నా తెలుగు వీణపోయిన మూర్ఛనలు నేడు
నీవుగా పారి నిండినవి నాభూమిలో:
ఇక ఎన్ని చెరకు తోటలు పండవీ చోట!

యెవ్వరే యెదురొచ్చి* ఏడు పాయలు చేసి
రవ్వల్ల వీణగా రాగమెత్తిరి నిన్ను?
'ఏడుపాయల దుర్గ' యేమన్నదే నిన్ను?
యేమన్నదే నిన్ను యేడుపాయల దుర్గ?

(మంజీర మానభంగం)

"ఏడుపాయల దుర్గ యెదురుగా వచ్చింది,
పాడు కొమ్మన్నాది, పరుగులిడ మన్నాది,
స్వర మొక్క-పాయగా సాగిపొమ్మన్నాది,
బంగారు పండించి ప్రజల కిమ్మన్నాది."

(మంజీరకు విశ్రాంతి)

అదిగో హసంతికలు అదెసుమ లలంతికలు
అదిగో శామంతికలు అదిగో వాసంతికలు
జయ దాయకములు సంశయ మాయకమ్ములు
ప్రియకరము లమృత పిచ్ఛిలము లుజ్జ్వలములు
మిట్టలెక్కి యెక్కి గుట్టలు దిగజారి
త్రోవ గడిచి వచ్చి నావు నీవు;

మిగుల శ్రమలు గొన్న మిసిమింతు రాలవు
సేద దేరు మీ ఉగాది చెంత!
ఎవరి గజ్జెల రవళివే! నీవు మంజీర!
ఎవరి కజ్జల బాష్ప ధారవే! మంజీర

---

*మెదకు మండలంలో ఒకచోట ఈమె యేడు పాయలుగా చీలుతుంది. యేడు పాయలుగా మంజీర చీలినచోట 'ఏడుపాయల దుర్గాదేవి' వెలిసింది. జాతరకూడా యేటేటా జరుగుతుంది.

# ఆంధ్రదేశ ఖనిజసంపద

★

శ్రీ ఏ. వి. భాస్కర్

ఆంధ్రరాష్ట్రావతరణం త్వరలోగానున్నట్లు వార్తా పత్రికలు, ఉద్దండనాయకుల ప్రసంగములు తెల్పుతున్నాయి. వివిధ గతుల ప్రయత్నములు సాగించి, ఎంతోకాలముగా వేచి చూచుచుండిన ఆంధ్రులముందు ఒక ఆశారేఖ పొడ చూపింది. అది నిర్దుష్టంగా నిలిచే అవకాశాలూ చాలా కన్పిస్తున్నాయి.

ఈ శుభసమయంలో ఆంధ్రరాష్ట్ర స్థానిక పరిస్థితులు ఆమూలాగ్రంగా తెలుసుకోవలసిన, అవసరం, బాధ్యత ప్రతీ ఆంధ్రుడి మీదా ఉన్నాయి. ఈ సందర్భంలో పెక్కురు వివిధరీతుల ఆంధ్ర రాష్ట్రస్థాపనలోఉన్న లగువు బిగువులు, ఆర్థికంగాను, సామాజికంగానూ, వ్యావహారికంగానూ, వ్యక్తీకరించారు. ఖనిజసంపదలో ఆంధ్రరాష్ట్రస్థితిగతులను తెల్పడమే ఈ వ్యాసముయొక్క ముఖ్యోద్దేశము.

ప్రకృతి శాస్త్రరీత్యా ఖనిజసంపద ముఖ్యంగా కొండప్రదేశాలలో ఎక్కువగా అగుపిస్తుంది. ఈ విషయంలో ఆంధ్రదేశానికి వెన్నెముకవలెనున్న తూర్పు కనుమలు, కడప కర్నూలులోనున్న కొండలుతో సహా చాలా ఖనిజసంపద గల్గినట్లుగా తెలియగలదు. దానివెనుక గోదావరి, కృష్ణల లోయలుగూడ ఒకవిధముగా సారవంతములే. వీటి అన్నిటినీ జతపరచినచో మనరాష్ట్రములో అధిక ఖనిజసంపదగల్గిన ప్రదేశములు చాల గలవనియు, వాటిని తగురీతి ఉపయోగించుకొనుముందు వృద్ధి యొనర్చుకొనుట మన విధాయకముగా కన్పడును.

భూగర్భ శాస్త్రజ్ఞులు విపులముగా తెల్పినవిధముగా దక్షిణ భారతమున ముఖ్యముగా ధార్వారు రాళ్ళు (*Dharwar rocks*) ఖాండలైటులు (*Khondalites*) కడప, కర్నూలు కూటములు (*Cuddapahs and kurnools*), గొండ్వానాలు (*Gondwanas*), దక్కను రేగడిరాళ్ళు (*Deccan paps*), ఎర్రలాటిరైట్లు (*hafentes*) వయస్సు గల రాళ్లు గలవు. మన ఖనిజసంపద అంతయు వీనియందేయున్నది. ఈరాళ్ళే యేభాగములలోనున్నవో, వానిలోఉన్న ఖనిజము లేవియో తెలుసుకొనవలసిన అవసరము గల్గినది.

ధార్వారురాళ్లు చాలా లాభకరమైన ఖనిజములను మనకు గల్గించుచున్నవి. వీనిలో ముఖ్యముగా అభ్రకము ఎన్నుకొనదగినది. ఈ అభ్రకము భారతదేశమందలి ఒక ముఖ్యమైన ఖనిజసంపద. దీనిని భారతదేశము అధికముగా ఎగుమతులుచేసి ధనార్జన సేయుచున్నది. ఆంధ్రదేశమున అభ్రకము దొరకుచోటు ముఖ్యముగా నెల్లూరుజిల్లా. ఇది భారతదేశము అభ్రకగనులలోగూడ పేర్గన్నది. ఇచ్చటనుంచి చాలకాలమునుండి ఎక్కువగా అభ్రకము, ఇంగ్లాండు, అమెరికాలకు ఎగుమతి చేయుట పరిపాటి. ఇచ్చట ముఖ్యముగా మస్కనైటు (*Muscovite*) అను అభ్రకము దొరుకును. ఎక్కువగా ఇదియే పరిశ్రమలలో ఉపయోగపడునట్టి అభ్రకము.

ఈ ధార్వారురాళ్లలోనే ఇనుము, ఖనిజరూపములో దొరుకుచున్నది. కాని దీనిపేరు పెద్దగా భారతదేశసంపదలో పేర్కొనబడలేదు. ఏలయన భారతదేశమందు పెక్కుగనులలో దీనికన్న ఎక్కువ విలువగల ఖనిజము దొరుకుచుండుటయే. ఇనుము ఆంధ్రదేశమున, క్రిష్ణ, కర్నూలు, కడప, విశాఖపట్నము, బళ్లారి, మొదలగు ప్రదేశములలో దొరుకుతున్నది. రాగి ఖనిజములుగూడ ఈవిధముగానే 'ధార్వార్ల'లో గుంటూరు, నెల్లూరు, కడప, బళ్ళారి ప్రదేశములలోనున్నట్లు తెలియుచున్నది. బంగారము అనంతపురములో ముఖ్యముగా దొరుకుచున్నది. తూర్పుగోదావరి, బళ్ళారి ప్రదేశములలోగూడ గలదు.

ఈ ధార్వారురాళ్లలో, గ్రానైటు (*Granite*) అనుబడు రాళ్లు ఎక్కువగా కలవు. వీటినన్నిటిని బంగళాలు కట్టుటకు, రోడ్డులువేయుటకు ఉపయోగించుచున్నారు.

తరువాత పేర్కొనబడిన ఖాండలైటులలో పెక్కు ఖనిజములు దొరకును. ఈ తూర్పుకనుమలలోనున్న వీ రాళ్ళే. హిందూ దేశమునకు ప్రపంచ ఖనిజసంపదలో ఒకస్థానమును తెచ్చిన మాంగనీసుఖనిజము ఈ రాళ్లలో దొరుకును. ఈ ఖనిజపుగనులకు నిల్వలకు ప్రసిద్ధిగన్నది విశాఖపట్నంజిల్లా. దీనిని విపరీతముగా మన దేశము పైదేశములకు పంపుచు ఖనిజసంపదను తగ్గించుకొనుచున్నట్లు పెక్కురు శాస్త్రవేత్తలు తెల్పుచున్నారు. మాంగనీసు బళ్లారిలోనూ సమృద్ధిగా దొరుకుచున్నది. కర్నూలులోగూడ ఉన్నట్లు తెలుపబడినది. ఫ్లోగొపైటు (*Phlogopite*) అను అభ్రకము విశాఖ, గోదావరి, కృష్ణ జిల్లాలలో దొరుకుచున్నది.

ఈ ఖాండలైటులలోనే గ్రాఫైటు (*Graphite*) అను ముఖ్యమైన ఖనిజముగూడ దొరకుచున్నది. ఇది గోదావరిజిల్లాలో విశేషముగాను కృష్ణ, విశాఖ జిల్లాలలో కొద్దిగానూ ఉన్నది. పెక్కు ఖనిజములు గోదావరి, విశాఖజిల్లాలలో ఉన్నవి కాని వాటిని ప్రత్యేకము పరిశ్రమలలో ఉపయోగింపవలసినవే. ఉదాహరణగా: (1) కోరండం (*Corundum*) (2) సిల్లిమనైటు (*Sillimanite*) (3) కయనైటు (*Kyanite*) (4) గార్నెట్టు (*Garnet*).

కడప, కర్నూలుకూటములలో చక్కనైన ఉపయోగకరమైన పెక్కు ఖనిజములున్నవి. మనదేశమునకు చాలగా పేర్గన్న

వజ్రరాజములు ఈ కూటములలోని రాళ్లలోనివిగా తెలియుచున్నది, "గోల్కొండ వజ్రములు", "గ్రేట్ మొగల్" మొదలైనవి బంగనపల్లి, కొల్లూరు, (కృష్ణ), వజ్రకరూరు, మొదలగు కడప, కర్నూలు, కృష్ణ, గుంటూరుజిల్లాలలోని ప్రదేశములనుండి వచ్చినవే. ప్రస్తుతము బ్రిటిషు ప్రభుత్వమును పాలించురాణి కిరీటమునందున్న "కోహినూరు" వజ్రము కొల్లూరునుండివచ్చినట్లుగా తెలియుచున్నది. ఇప్పటికినీ చాలగా కృష్ణరేవులో వజ్రములు దొరకుచున్నవనియు, వాటిని తగురీతి సొమ్ము చేసికొనుచున్నట్లును వాడుక.

సీసము, యశదము కర్నూలుజిల్లాలో దొరకుచున్నవి. ఇంతేగాక కడప, గుంటూరుజిల్లాలలోగూడ దొరకుచున్నది. ఈ ప్రదేశములలోనే వెండి ఖనిజములుగూడా కలవు. ఈ ఖనిజములన్నియు ఎక్కువ లాభకరముగా ఉపయోగపడనివి అని మాత్రము ఇంతవరకు దానిపై చేసిన పరిశోధనలవలన తేటతెల్లమైనది.

ఆస్బెస్టాసు (*Asbestos*) ఖనిజము చాలా ఎక్కువగా దత్తమండలములో గనులద్వారా బయలుపరచుచున్నారు. దీనికి పెక్కు ఉపయోగములుండుటచే ఇది ముఖ్యఖనిజములలోనొకటి. టాల్కు (*Talc*) రాయి అగు స్టియటైటు (*Steatite*) అను నున్నటి మెత్తని రాయి దత్తమండలములలో చాలగా దొరుకుచున్నది. నెల్లూరు, విశాఖపట్నములలోగూడ ఈ రాయిఉన్నట్లు తెలియును. ఇతర ఖనిజములు బెరైటీసు, ఓఖర్-దత్తమండలమందు ఎక్కువగా త్రవ్వి వీలగునంత నిల్వలున్నవి. చదునురాళ్లు, లేక చాపరాళ్లు (*Slabs*), సున్నపురాళ్లు (*Limestones*) గూడ గుంటూరు, దత్తమండలములయందు దొరకుచున్నవి.

గోండ్వానారాళ్ళలో ముఖ్యముగా బొగ్గు లభించును. తూర్పు, పశ్చిమగోదావరిజిల్లాలలో రాక్షసి బొగ్గు లాభదాయకముగా పనిచేయగల్గినంత నిలువలుఉన్నవి. వీటిని సరియైనవిధముగా ఉపయోగపరచుకొనవలసిన బాధ్యత చాలగా రాబోవు ఆంధ్ర రాష్ట్రప్రభుత్వముపై గలదు. లింగాల, తోటపల్లి, చెడదనూరు ప్రదేశములలోనున్నదిగాక చెడుదనూరు, చింతలపూడి మధ్యభాగములపైగూడ తగురీతి పరిశోధనలు జరిపి దానియందలి నిల్వలు కనుగొనవలెను. వీటినన్నిటినిబట్టిచూడ ఆంధ్రలో కావలసినంత రాక్షసిబొగ్గు కలదని, దానినే గనుక బయటకుతీసినచో ఇతర రాష్ట్రములనుండి దిగుమతిచేసుకొనవలసిన అవసరము కనుపించదు. ఈ గోండ్వానారాళ్లలో కట్టడములయం దుపయోగపడు ఇసుకరాళ్ళు (*Sandstones*) దొరకుచున్నవి.

తరువాత తెలుపబడిన దక్కను రేగడిరాళ్ళు విరివిగా తూర్పుగోదావరిలో రాజమండ్రివద్ద దొరకును. ఈ రాళ్లయందు సర్వసాధారణముగా చక్కని స్ఫటికములు, వివిధ ఆకృతులలో దొరకుచుండును. వానిని చెక్కి, సానబెట్టినచో చిన్ని వజ్రముల రూపము వచ్చుటచే విరివిగా ఉపయోగపడును. కొన్ని ఊదారంగు గల స్ఫటికములు (*amethysts*) చాల విలువగలవిగా వ్యక్తీకరింపబడినవి. ఈ రేగడిరాళ్లను విరివిగా కట్టడములయందు, రోడ్లు వేయుటకుగాను ఉపయోగింతురు.

తెల్లనై నటువంటి బంకమన్ను (*clay*) ఈ గోండ్వానా రాళ్ళయందు దొరకును. విశాఖపట్నము, గోదావరీ జిల్లాలలో ఇది దొరుకుచున్నట్లు, దానిని పోర్సలీను, సిరామిక్సు తయారుచేయుటకు ఉపయోగించ వచ్చుననియు, తెలియుచున్నది. బంకమట్టి దొరుకు అవకాశములు, చాలచోట్ల గలవు.

ఎర్ర లాటిరైటు రాళ్ళు ముఖ్యముగా విశాఖజిల్లాయందు గలవు. వీనికి ప్రకృతి స్వభావముగా ఉన్న ఆ ఎర్రరంగువలన దీనిని పెయింట్లలో ఉపయోగించు. ఓఖర్ (*ochre*) గా వాడుదురు. ఈ ఓఖర్ దత్తమండలముందే గాక పెక్కు ఇతరమండలములలో గూడ దొరకును.

ఇంతవరకును పైన తెల్పినవానివల్ల ఆంధ్రదేశపు ఖనిజసంపద కొంతవరకు తెలియగలదు. కాని ఇంతవరకు పైవానిలో రానివి కొన్ని ఖనిజములు పేర్కొనక తప్పదు.

మానజైటు (*monazite*) అను ఖనిజము ఈమధ్య జరిగిన పరిశోధనలవలన, ముఖ్యముగా విశాఖపట్నపు సముద్రపు టొడ్డువద్దనున్న ఇసుకలో చాలగా ఉన్నట్లు తెలియుచున్నది. మొత్తము ప్రపంచ ప్రఖ్యాతమైన నిల్వలలో పేర్గన్నది తిరువాన్కూరు సముద్రపు టిసుకనుండి తీయబడు మానజైటు, హిందూదేశములో చాల తక్కువ ప్రదేశములందు గలదు. ఈ ఖనిజముతో కూడుకుని ఇల్మెనైటు (*Ilmenite*), గార్నెట్టు (*Garnet*) దొరుకుచున్నవి. ఈ గార్నెటు కృష్ణా, నెల్లూరు, గోదావరి జిల్లాలలోగూడ గలదు. చాలా అరుదుగా దొరుకు ఖనిజములైన సమార్స్కయిటు (*Samarskite*) కొలంబైటు (*Columbite*), బెరిల్ (*Beryl*) నెల్లూరులో దొరుకుచున్నవి. ఫాస్ఫేటులు ఎక్కువగా నెల్లూరు, విశాఖజిల్లాలలో గలవు. క్రోమైటు (*Chromite*) కృష్ణాజిల్లాలోనూ, జిప్సము (*Gypsm*) నెల్లూరు జిల్లాలోనూ దొరకుచున్నవి.

చాల ముఖ్యమైన ఈ ఖనిజములుగాక మరికొన్ని ఖనిజములు ఆంధ్రలో ఉన్నట్లు తెలియుచున్నది. కాని అవేవియును ఖనిజోత్పత్తికి సహాయపడనట్టివి. కాబట్టి వానివిషయ మంతగా ప్రస్తావించ పనిలేదు.

ఇంతవరకు జరిగిన పరిశోధలవల్ల ఉన్నట్లుగా తేలిన ఈ ఖనిజములు అసలు ఉన్నవాటిలో కొంతమాత్రమె అను మాట చెప్పక తప్పదు. ఇంకను శోధనచేయని ప్రదేశములు పెక్కులు గలవు. భూగర్భమున నిక్షిప్తములైన వానిని వెలికితీయుటలోని కష్టనిష్ఠురములెన్ని అయినను, బాధ్యత, అవసరము మన కెక్కువగావున అతిత్వరలో, అనుమానాస్పదమైనవి, శోధనలు జరుపకుండా ఉండిపోయినవాటి విషయమై తగురీతి విచారణ జరుపవలసిన పని ఆంధ్ర రాష్ట్ర నిర్మాణమున కెదురుజూచుచున్నది. అశ్రద్ధవల్ల ఇంతవరకు మొదలుపెట్టి విడిచిపోబడిన గనులను తిరిగి ఉత్తేజపరచినచో చాలా లాభకరము. ఈ విషయమై తగు చర్య రాబోవు ఆంధ్రరాష్ట్ర నాయకుల ముందుపనిగా ఉన్నచో ఆంధ్ర చాలగా తక్కిన రాష్ట్రములమీద ఆధారపడవలసి యుండదు.

ఖనిజములు వివిధప్రదేశము లందున్నట్లు తెలుసుకొనిన వెనుక, వాని ఉపయోగములుగూడ తెలుసుకొనుట విధాయకము. ఈ క్రింద వాని ఉపయోగము లొకదాని వెనుక నొకటి ఇవ్వబడినవి.

అభ్రకమునకు గల లక్షణములలో నెల్ల ముఖ్యమైనది, విద్యుచ్ఛక్తిని ప్రవహింప చేయకపోవుటయే. దీనివలన అభ్రకమునకు చాలా ఉపయోగము దొరకినది. విద్యుత్ పరికరములందు పెక్కు వానిలో అభ్రకము నుపయోగింతురు. పెట్రోమాక్సు దీపములకు గాజు బదులుగా దీనిని వాడుదురు. ఇవియే గాక వేడిని నిరోధించ వలసిన సమయములలోగూడ దీనికి ఎక్కువ పనిగలదు. పెయింట్లలో అభ్రకపు పొడుము వాడబడును.

మాంగనీసు ఖనిజము రసాయన పదార్థములలో ఎక్కువగా వాడుదురు. దీనితో బాటరీలు తయారుచేయవచ్చుననియు అవి బాగుగా మనగలవనియు శాస్త్రజ్ఞులు తెలియజేసిరి. మాంగనీసు మిశ్రలోహములు తయారు చేయుటకుగూడ ఉపయోగింతురు.

గ్రాఫైటు ఖనిజము పెయింట్లలోనూ, పెన్సిళ్లలోనూ, ఎలక్ట్రోడులయందు వాడుటయే గాక మూసలుగా తయారుచేయుదురు. ఈ మూసలు ఎంత వేడినైనను నిరోధించగలవు. చాలా ప్రదేశములలో ఈ మూసలు తయారుచేయబడుచున్నవి. ఇది నున్నటి ఖనిజము గాబట్టి దీనిని ల్యూబ్రికేటర్ గా ఉపయోగింతురు.

కోరండం చాల కఠినమైన ఖనిజములలో నొకటి. దీనిని గరుకు కాగితములు తయారుచేయుటకు గాను ఉపయోగింతురు. గార్నెట్ అను మరియొక ఖనిజమును ఈరీతిగానే వాడుదురు.

సిల్లిమనైటు, కయనైటు ఎక్కువగా వేడివల్ల పుట్టిన ఖనిజములు గావున వేడి నిరోధకశక్తి వీటికి ఎక్కువ. దానివలన వీనిని పెద్ద ఫర్నేసుల లోపల ఇటుకలరూపములో తయారుచేసి పెట్టుదురు (*Refraectory*). అది ఎంత వేడికైనను కరుగక ఇతరపదార్థములను కరుగజేసి లోహములను విడివరచును.

ఆస్బెస్టాసు నిప్పు కెదురాడు ఖనిజము. దీనిని పెంకులు గానూ, రేకులుగానూ, సిమెంటుతో కలిపి తయారుచేయుదురు. ప్రత్యేకముగా ఇంజనులవద్ద పనిచేయువారి దుస్తులలోగూడ దీనిని వాడుదురు.

టాల్కు, స్టియటైటు, ముఖ్యముగా ఫేసుపౌడరు తయారు చేయుటకు, వాడుదురు. సోపులలో పెయింట్లలో గూడా దీనిని వేయుదురు. ఈ రాయి, అతి నున్నగానుండి, కఠినముగా నుండక పోవుటచే దీనినుండి చక్కని బొమ్మలు చెక్కుదురు.

బెరైటీసుయొక్క ఉపయోగములలో కెల్ల * ముఖ్యమైనది పెయింట్లలో దాని అవసరమే. ఇది అతి బరువగు ఖనిజమగుటచేత, పెయింట్లకు కొద్ది సరుకుతో ఎక్కువ బరువుజూపుటకుగాను దీనిని వాడుదురు. దీని వందువల్లనే ఫిల్లర్ (*Filler*) అని అనుట వాడుక.

జిప్సము అను ఖనిజమునుండి ప్లాస్టర్ ఆఫ్ పేరీస్ తయారు చేయుదురు. ఎఱువుగా దీనిని ఇతరమైన ఫాస్ఫేటులతో కలిపి వాడుదురు. సిమ్మెంటులో దీనితోపాటు సున్నపురాళ్లను గూడ ఉపయోగింతురు.

రాతిబొగ్గుయొక్క ఉపయోగములు వేరే తెల్పనవసరము లేకపోయినప్పటికీ, రసాయన పదార్థములు గూడ వీనినుండి తీయుదురని చెప్పక తప్పదు.

స్ఫటికములు చాలవరకు సానబెట్టి వజ్రములుగా అమ్ముదురు. వీనిని ఆభరణములలో సర్వసాధారణముగా ఉపయోగింతురు.

మహా అరుదైన మూలపదార్థములు (*Rare earths*) దొరకు మానజైటు, సామర్స్కయిటు, కొలంబయిటు బెరిల్ యొక్క ఉపయోగము పెక్కుగ శాస్త్రరీత్యాయే ఉన్నవి. అవిగాక మానజైటులోని థోరియమ్ (*Thorium*) ను పెట్రోమాక్సు మాంటిల్సులో కాంతినిచ్చుటకు గాను వాడుదురు. బెరిల్ లోని బెరిలియము, అటంబాంబునందలి గొలుసు ప్రయోగమును (*Chain reaction*) వేగిరపరచునట.

ఇల్మనైటు ఖనిజమందలి టైటానియం రంగు, (*Pigment*)కై వాడుదురు. క్రోమైటును క్రోమ్‌స్టీల్ (*Chromc Steel*) మిశ్రలోహమునకు, బట్టల ఖాకీరంగునకు, రసాయనిక పదార్థములకు ఉపయోగింతురు.





జీవిత భారం

—చిత్రకారుడు శ్రీ ఎ. పైడిరాజు

# "ఉత్తమాయిల్లాలు"

శ్రీ బుచ్చిబాబు

★

[స్థలం : పొలంచుట్టు చదునుగావున్న గట్లు. అక్కడక్కడ పెద్దవి, చిన్నవి రాతిబండలుంటాయి.

గట్టున కూర్చుని చంద్రన్న తాటిమట్టలు కత్తితో చదును చేస్తూంటాడు. వయస్సు పాతికలోపు. మోకాళ్ళమీదికి మెలితిప్పి, బిగించి గోచీపోసిన పంచకట్టు, బుజంమీద ఎర్రంచు తువ్వాలు.

ప్రవేశం శేషు. వయస్సు ఇరవైనాలుగు. లాల్చీ, పంచె, చేతులో మధ్య పత్రికపెట్టిన పుస్తకం. తిన్నగా వొచ్చి బండమీద కూర్చుంటాడు.]

చంద్రన్న : దండాలు శేషయ్యబాబు. ఏ టిటూ ద్రైచేసినారు ? బస్తీల్లోవుండే వోరికి మీకు యీడేం పొద్దుపోతుంది ?

శేషు : పొద్దుపోకనే యిట్లా వచ్చా చంద్రన్నా. ఏమిటో పల్లెటూళ్ళో ప్రకృతి, ప్రశాంతంగా, హాయిగా వుంటుందంటారు. నాకేమీ ప్రశాంతం, హాయీ కనబళ్ళేదు. ఇంటిదగ్గిర, గొడవలు, తగువులు, బావగారి తీర్పులు...

చంద్ర : కరణంగారి లోగిలంటే మరేటనుకున్నారు ? తీర్పులు సెప్పేవోరుంటున్న కొద్దీ తగవులుంటాయండి. మరో పదిరోజులుపాటుంటారాండి ?

శేషు : శెలవులింకా వో సెలరోజులున్నాయి. చదువుకొనేందుకు నాలుగైదు పుస్తకాలు తెచ్చుకున్నాగనక, కాలక్షేపమవుతోంది. లేకపోతే యీ పాటికి బిచాణా ఎత్తెయ్యాల్సిందే.

చంద్ర : ఈ సదువులవుతే, మీరేం వుద్దోగం సేస్తారండి ?

శేషు : ప్లీడరీ వృత్తి.

చంద్ర : అదేటండి. అది తుళ్ళా తగువుల యవ్వారమే కదాండి...!

శేషు : (నవ్వుతాడు) ఊంకోళ్ళ తగువులు తీరుస్తుంటే చూడ్డం విసుగుపుడుతుందిగాని మనమే తీరిస్తే...

చంద్ర : ...తీరిపోతుంది. (అటూ యిటూ చూసి) ఛస్—కొట్టిద్దామంటె సెట్లని వో ముంజీ కనబడదండి. అదుగో ఆ రామిగ్గాడిపనే—ఎవడూ యిక్కడలేకండా సూసి, ఆట్లకని రావడం ముంజిలు కోసెయ్యడం.

శేషు : అట్లంటే జ్ఞాపకం వొచ్చింది. ఎవరు చంద్రన్నా—మొన్న సాయంత్రం యిటుకేసి వో అమ్మాయొచ్చింది—దూరం నుంచి చూశా, మొహం సరిగా కనబళ్ళేదనుకో...ఇరవైయ్యేళ్ళుండొచ్చు. హుషార్‌గా, దర్జాగా నడుచుకుంటూ, పాడుకుంటూ వెడుతోంది. దగ్గరగా వెళ్ళిచూద్దామనుకుంటుండగానే, లేడిలా ఎగురుకొంటూ వెళ్ళిపోయింది.

చంద్ర : అదాండి—అదియెంకి—వో ఎర్రిబాగుల్ది.

శేషు : అంటె ?

చంద్ర : ఏడవాల్సినకాడ నవుతాది ; నవ్వాల్సినకాడ ఏడుత్తాది. తల్లితండ్రి సిన్నతనంలో పొయ్యారండి. ఇంటికాడ యిన్నాళ్ళ తాతుండేవాడు. ఆడు సచ్చినకాణ్ణుంచీ ఇది పనిపాట సెయ్యకుండా మొరాయించుక్కూకుంటుంది.

శేషు : మరి భుక్తి ?

చంద్ర : బగవంతుడికి తెలియాల, అడిగితే "పూలవాసన్లు తాగుతా—గాలి తింటా" నంటుందండి—ఎర్రిది.

## దీవెనలు

నాటికలో శ్రీ బుచ్చిబాబు నాపాటల కెక్కువ అవకాశం యిచ్చారు. కాని కథా సంవిధానమునకు, పాత్ర నిర్వహణమునకును (*Plot and Character development*) అంతగా ప్రాముఖ్యత నీయలేదు. ఈనాటక నిర్మాణంతో గాని, భావతోగాని, పాత్ర పోషణతోగాని నాకెంతమాత్రము సంబంధం లేకున్ననూ 'ఎంకి' అను పేరున్న పాత్రమునే కథావస్తువు నాదైనట్లు పొంగిపోవుటే ఎరుగుదును గాని విమర్శించుట ఎరుగని వాడ నగుట యీనాటకం నామనసు కలిచి వేసినదనియు, యీనాటకంలో శ్రీ రచయిత ఎంకిపై కనుపరచిన ప్రేమ నాకు కన్నీర చేయుటకు మారుగా మనశ్శాంతి నిచ్చుచున్నదనియు మాత్రం యిక్కడ చెప్పి శ్రీబుచ్చిబాబుని దీవిస్తున్నాను.

ఏలూరు
15-12-52

(సం) నండూరి వెంకటసుబ్బారావు.

శేషు : మొన్న మా బావగారు, అక్క, ఈ యెంకినిగురించే కాబోలు లడాయేసుకున్నారు. అంత కళైన మొహం లేదంటుంది అక్క, అడివికోతంటాడు బావగారు.

చంద్ర: సక్కదనం గనక లేకుంటే డానాట్లు సాగనిద్దురా వూళ్ళో జనం...!

శేషు : కథానాయకులారా ఏం ?

చంద్ర: కతలకింద సెప్పుకుంటారు—కరణం రామయ్య గార్ని కదలెయ్యండి తెలుస్తై. మీ బావగారేగా. తోటల్లో పళ్ళు, పూలు బతకనియ్యడు. కనబడ్డ మొగాడితో టల్లా పరాచికాలు, తులకటం, అల్లదుగో ఆ సాయు డోడు దొరికాడు, పనిపాట్లు లేకుండా...ఆడు, అది పొలాలంట సికార్లు, ఎకసెక్కాలు—ఓ...మొన్నే కైందో తెలుసాండి ?

శేషు : చెప్పు చెప్పు—వింటుంటే కవిత్వం పుట్టుగొస్తోంది.

చంద్ర: ఇది రెడ్డెయ్యపొలం, ఆళ్ళిద్దరూ యీడకొచ్చి, అంగామా చేసినారు. అంటే, యీతసెట్లు నరికెయ్యడం—యెంకి సావల్లి పొలం నడుంగా పండుకుంది. ఆడు మామిడితోపులో జొరబడి, పిందిలేకుండా దులిపేశాడు. ఆ మట్టున, రెడ్డెయ్య దుడ్డుకర్రతిప్పి, ముక్కలిరగ్గొడతానన్నాడు. నే నడ్డుపడినా...ఇంక యిటేకేసి రావడానికి యీల్లేదని సెప్పేశా. ఇంక రారండి...భో భో...అయ్యో దూడలా గడ్డోమి పైసలా...భోయ్ భోయ్... ఆటేని తరిమొస్తా—

[పరిగెడతాడు—శేషు పుస్తకం తెరిచి చదవడం మొదలెట్టి క్షణంలో మూసేసి, జేబులోంచి సిగరెట్టుపెట్టి తీసి, డొల్లపైకి లాగి, చించి వెనకభాగం వ్రాయడం మొదలెడతాడు. 'యెంకి వొంటి పిల్ల లేదోయ్, యెంకి నావొంకింక రాదోయ్' అని పైకంటాడు. ఇంతలో యిద్దరువ్యక్తులు కొంచందూరంగా కొలనుగట్టున బండవెనక నిలబడతారు. శేషుకూర్చున్న బండమీదినుంచి దిగిపోయి, వారికి కనబడకుండా పొంచి కూర్చుని, వారికేసి చూస్తుంటాడు—]

ఆమె : ఇక్కెందుకొచ్చా ?

అతను : నీకోసరమే.

ఆమె : ఎందుకేంటి ?

అతను : అది తెలిస్తే, నే భగవంతుణ్ణై... '

ఆమె : పో—

అతను : ఏట్లోకి పోవాల. సూడిటు...

ఆమె : నే సూణ్ణు...

అతను : నీముంగలే సచ్చిపోతా.

ఆమె : ఎట్టా ? కత్తులు, కటార్లు ఎయ్యి ?

అతను : నీ సూపు బాకు; లేకుంటే యీ సెర్లో పడతా...

ఆమె : పడు. నీళ్ళెయ్యి ? (నవ్వుతుంది) అట్ట దూరంగా కూకో...

అతను : సచ్చాం.

ఆమె : ఏటది ?

అతను : పెద్దెయ్యొస్తుండాడు. ఊడాయిద్దాం.

ఆమె : ఏం వొస్తే ? రానీ భయమా నీకు ?

అతను : పెద్దెయ్యంటే నీకు తెల్దు. ఊర్లోకల్లా పవరైన పెద్దమనిషి.

[పెద్దెయ్యొస్తాడు. వయస్సు యాభైపైన, నిండైన పంచికట్టు, ఖద్దరు కమీజు, చేతులో కర్ర, పొయ్యి క్రాపింగు పెరిసింది.]

పెద్దెయ్య: సిగ్గుసెరా ల్లేవంట్రా అడ్డగాడిదల్లాగ...మీ మామ యాతంకాడ వొక్కడూ చస్తుండాడు...పోయి సాయపడ్రాదు ? లేకపోతే, మీ బాబయ్యతోకూడ మినుపని చేసుకోరాదు—నీ కెందుకు బుద్ధిలేదే ? మీ అమ్మ మంచానబడి మూలిగి చస్తావుంది.

ఆమె : నాకు...మరి మరేమో...

అతను : అదికాదు తాతా...మరి మాకు...

పెద్ద: ఏడికారు...కొంపలకి నడవండి.

అతను : కొంపకి...మరి.

ఆమె : అమ్మకి గోరింతాకు...కావాలంటే...

పెద్ద: కదలండి ఇటొ స్తిరా...రెడ్డెయ్య నరికేస్తాడు.

[వాళ్ళిద్దరు గబగబ నడుస్తారు. పెద్దెయ్య మరోదిక్కున వెళ్ళిపోతాడు—శేషు నిలబడి వ్రాసినదాన్ని పైకి, పాటగా, చదువుతాడు—]

యెంకి వొంటీ పిల్ల లేదోయి లేదోయి
యెంకి నావొంకింక రాదోయి రాదోయి
మెళ్లో పూసలపేరు
తల్లో పూవులసేరు
కళ్ళెత్తితే సాలు
కనకాబిసేకాలు.
యెంకి వొంటీ పిల్ల లేదోయి, లేదోయి...
సెక్కిట సిన్నిమచ్చ
సెపితే సాలదు లచ్చ
వొక్కనవ్వే యేలు
వొజ్జిరవొయి డూరాలు.

[ఇంతలో చంద్రన్న వొచ్చి కర్ర నిలబెట్టి, దానిమీద గడ్డం ఆనించి పక పక నవ్వుతాడు]

శేషు : ఏం, ఎందుకు నవ్వుతున్నావు చంద్రన్నా ? నాగరికతలో మమేకమైన మాబోటివాళ్ళకు ప్రాకృతికమైన, సహజమైన సౌందర్యాన్ని చూసినప్పుడు, కవిత్వమొస్తుంది. మాబావగారు యెంకిలో అందం చూళ్ళేకపొయ్యాడంటే, ఆయనలో నాగరికత లేదనేనా అనుకోవాలి...

[చంద్రయ్య యింకా నవ్వుతాడు]

లేకపోతే నీకు పిచ్చైనా ఎత్తిందనుకోవాలి.

చంద్ర. (నవ్వు ఆపుగుంటూ) మిమ్మల్ని సూత్తుంటే నాకేంటి, ఎవురికైనా, నవ్వు...నవ్వు...(విరగబడి నవ్వేస్తాడు)

శేషు : నవ్వుకి కారణం లేదా ఏమిటి కర్మ ?

చంద్ర: అదుగో...మీరే నవ్వు మొగం పెడుతున్నారు...

శేషు : నీ వైఖరి చూస్తుంటె నాకూ కొస్తంత నవ్వుగానే వుంది...

చంద్ర: (తమాయించుకుని) ఆ ఎళ్ళే పిల్లని సూసి యెంక నుకుంటారు...

శేషు : అవును, కాదా ఏం?

చంద్ర: అది పూతోరింటాడ బడుసు. సీతా యంటారు' అడు దాసుగాడు. మిసనుకొట్టు గన్నెయ్య తమ్ముడు కొడుకు... నా న్నవ్వలేను బాబు...ఇదేం యెంకండి! యెంకి అరుబైట కన బడిందంటె...సెంద్రుడు కూడా సిగ్గుపడాల్సిందేనండి.

[శేషు నవ్వుతాడు.]

చంద్ర: ఎందుకండి నవ్వులు?

శేషు : నా కవిత్వానికి నవ్వావా మరి...కానేపు నీ కవిత్వానికి నన్ను నవ్వనీ...

చంద్ర : ...శేషుబాబు...పొద్దోయింది లెగండి పోదాం. నే దూళ్ళని తోలుకొస్తాను మీరు కదుల్తూండండి.

[ఇద్దరూ వెడతారు - యెంకి కళ్ళుమూసుగుని తూలిపడుతూ ప్రవేశిస్తుంది. వయస్సు యిరవై వొకటి, పసుపురంగు చీర గోచి పోసి కట్టు, ఆకుపచ్చరంగు తెల్లపూలు అద్దకం రవిక, జడ సగం సగం అల్లి వొదిలేసి, పైకి కొప్పులా మెలితిప్పి కడుతుంది. కొప్పులో ఎర్రమందారాలు; చేతికి చామంతిపూలు మాలగా కట్టి వుంటాయి. చామనచాయ, సన్నటి కోలమొహం, పొడుగ్గా సాగా రిన కళ్ళు, మెళ్ళో పూసలపేరు, చెక్కిట చిన్నిమచ్చ.

వెనక నాయుడు బావ. గుబురుగా ఎదిగిపోయిన వుంగరాల జుట్టు, పాగాలో యిమడక, చుట్టూ జారి కనిపిస్తూ వుంటుంది. పొట్టిచేతుల తెల్లకద్దరు కమ్మీజు. మోకాలు కిందికి దిగిన నీరకాయి పంచి.]

బావ : ఏట దెంకి తూల్తుండా? పడితే పళ్ళూడతాయి.

యెంకి : కళ్ళు మూతడితే కల్లో నీవొక్కడివే కనబడ్డావు బావా......కళ్ళల్లో సత్తెంగ కట్టినట్టుండావు. నేలేను. భయమేసింది. నీకోసరం ఎతుక్కుంటూ కలంతా గాలించాను. అకుడక పోతే తూలిపడ్డా కామాను. కళ్ళుతెరిసి నిన్ను సూసేతలికి కలంతా కరిగింది మావో!...

బావ : ఏదో ఎర్రూసులాడుతునే వుంటా వెంకి...

యెంకి : అటు సూడు మావా, మనం పొద్దంతా యీడ తిర గతం సూసి సూసి, యిసుగేసి సూరుడు కొండెనక దిగినాడు... సూస్తివా...?

బావ : మన్ని సూడ్డానికోసరం పొద్దుస్నె మల్ల లెగుస్తాడులె...

యెం : మనం ఏం పీసాతేస్తుమో సూడమని సెప్పి, సెంద్రుణ్ణి ఫారాయేసి పోయినాడు.

బావ : ను వ్వేసం ఎయ్యటం లేదుగా...

యెం : సత్తెమైన మనసులేనోరి కేసాలుకాని—మనకెందుకు మావా? సెంద్రుడికిమల్లె, వానసినుకుల్కి మల్లె, నిర్మలం గుండాలి..

బావ : అరెరె కొంపతీసేసినా...!

యెం : అదేటి మావ అదిరిపడ్డా?

బావ : అసలైం దొదిలేసినావా దొంగా—

యెం : ఏటా లైలు...?

బావ : నీ కంటిలో తలుక్కిమల్లె.

యెం : పో మావ.—గాలికైనా కౌగిలివ్వనంటివే. నన్నిడిసి సంతకెల్తా పోయుంటివి—వొంటిగా? వొంటిగా నువ్వెందు కెడతా—నీ నీడని తీసుకుపోయినా వవునా? నీ నీడపాటైనా సనువులేదా నాకు?

బావ : ఎర్రెంకి. సంతలో కెళ్ళిపోతే, నువ్వెట్ల దిగులు సూపెడతావో తల్సుకు సంబరపడదామని, ఎళ్ళినాను. నాకే టెంకి? వొక్క నేనే నీకు—బోలెడు నీవులు నాకు. కంట నీరెట్ట మాకు. సందమామ దిగులడతాడు. ఇటు సూడు. కనుబొమ్మతో నవ్వి మనసు కరిగించవోలె?

యెం : ఏనాటి వరాలు, యీ నాగరీకాలు నారాజా! కలలో నీవు కాపడమంటే మెలుకువయ్యేదాకా కలవరిస్తాను.

బావ : (కూర్చుంటాడు) ఎన్నాళ్ళో మనకోలె యీసుకం?

యెం : నా కళ్ళల్లో నీరైపోయేవరకూ మావా...కంటినీరు నీకు నేలేమె...తుమునుకుంటాలె. సంతకిపోయి నాకేటి తెస్తివి రాజా?

బావ : సెప్పనా?

యెం : సెప్పు.

బావ : నిన్ను సూసేదానికి రెండుకళ్ళు సాలక, మరో కన్ను కొనితెచ్చుకున్నా...

యెం : ఉత్తమాటలు పో...

బావ : నిజం సెపితే నమ్మవెట్లా? పోనీ, వొకటి తెచ్చినాను. ఏంటి సెప్పుకో...సెప్పుకోలేవు...అవుపేడ...

యెం : పో కిట్ట మూరితి ఎకసెక్కమాడవోక...

బావ : పోనీ గేద్దిలే, కోపంవొస్తే, కోరగా సూత్తావ నట్ల గన్నాను. ఆ సూపుకు సూరుడు బెదిరిపోడంటె! ఈగో నే ఎర్రిపిల్లా పూలు (బంతి పువ్వులిస్తాడు)

యెం : అయ్యో మావా ఎంతపచారం చేసివా? కోసేటం దుకు నీకు సేతు లెట్లొచ్చినాయి? ఎన్నెట్లా సెదిరిపొయ్యే లేతోసన, నీటి బుడగలాంటి పాణం.

బావ : ఈటిమజా నీతల్లో సూడాల్సిందె.

యెం. కటెగ్గుండి నీది మామో...ఏటోననుకుంటి.

(బావ పూలు జెడలో అమురుస్తాడు. వాటిని తీసి, రేకలు వొక్కటొక్కటే తెంచి, పైకి విసురుతుంది)

బావ : ఏటదెంకి? పూలనట్లా పారేస్తే నామనసెట్లాగుంటుంది?

యెం : సూద్దామనే పారేత్తుండా...

బావ : అమ్మో మ నెంకేనని సనువులకు పోకూడదు. ఏటో నవుతుంది.

యెం : ఈ పూలకంటె నే బాగుండానా సూడు, రాజా! ఆటినే కోసేత్తివే నన్నెట్లా తీసిపారేస్తావో ఆలోసించుతుంటె, గుండె సెరువై పోదు?

[దాసు, సీతాయి ప్రవేశం]

దాసు : సెగ్లో సేపలమాదిరి యీడుండారా ... మీ కోసం పొలమంతా ఎతుకుతుండాం.

బావ : వొచ్చేతలికింత పొద్దోయిందేం సీతాయి ?

సీతాయి : ఏం సెప్పేది—సాయంత్రం వొస్తిమి, పెద్దయ్య తాతొచ్చి. కూకలేసేతలికి, దాసదిరిపోయి, కొంపకి లాక్కుపోయినాడు.

దాసు : అసలిసయం అదికాదు. సీతాయి సింగారింపు తెమిల్తేగా...అద్దంలో నూసుకుంటమె సరిపోయె. సావొచ్చింది. అద్దం నే బట్టుగు నిలబాడలంట. అదృష్టమంటె నీదిరా అన్నా...

బావ : అవును దాసు. సిగ్గేత్తుంది. నిజంసెప్పేదా, అందం నూసుకోడాని కద్దం ఎందుకంటుండెంకి. కంటెదర నాకాడ కని పాపలో నీడనూసుకుంటూ నొసట సుక్కెట్టుకుంటాది.

యెం : నూత్తివా సీతాయి మీబావ లేతసొరకాయలు ఎంత సమ్మంగా కోస్తుండాడో...!

సీతా : మా దాసయ్య గుమ్మడికాయలు తప్ప సొరకాయ జోలికే పోడు. ఎందుకొ నవ్వ యెంకి ?

యెం : సీకట్లో నాకళ్ళ తళుకు నూడాలని ఆముదందీపం కొస్త ఆర్పినాడు మావ. ఇప్పుడిల్లాగంటుండాడు. నమ్మబోకేం సీతి. యీ దొంగూసులన్నీ పాతవే...

బావ : నూత్తివా దాసు. పాత పదాలొద్దంటావుంది. ఓమారేం జరిగిందో తెల్సా ... నేవూరెళ్ళేతలికి, తను పొగాసుట్టి, నామాదిరిగ ఏసంవేసుగుని, అమ్మలక్కల్ని వూరించిందంట...

యెం : మాకేసాలకి మా రాజుదే ముందుపరుగు దాసయ్యా.. తానేం సేసినాడో తెల్సా...గొంగిళీ ముసుగేసుకు నేతలికి అదిరి పడ్డాను. ఏటదంటె రావణాసురు డన్నాడు.

బావ : గేపకం వొచ్చిందోలె...రామాయణం ఆడుకుందామా ?

యెం : సై... నే సీతామ్మవోర్ని, నాకొ లేడిపిల్ల కావాలి. తీసుకొస్తవా ?

దాసు : అదేంటె, అదిలేడికాదు. మేక. కుంటిదికూడా...

యెం : బావ రాములోరైతే, అది బంగారులేడి, ఎల్లి తీసుకురా, రాములోరా...

బావ : ఇదె పోతుండా, నీ కీడుండు తమ్ముడా లచ్చనా.. (వెడతాడు)

యెం : ఎల్లినాడు. మరి నీ వేసమేంటె సీతాయి ?

దాసు : నూరుపనక, ముక్కు సెవులు, కోసేస్త...

యెం : అడ్డబాస అడ్డంగుంటె ఎట్టకోస్తావు మరిదీ ?

[దూరంగా బావ 'హా లచ్చనా, చచ్చితి, చచ్చితి' అని కేకేస్తాడు]

యెం : అయ్యొ పమాదం, ఆపతొచ్చింది. నువ్వెల్లు మరిదీ.

దాసు : అదంతా నాటకంలెగండి సీతొదినా, కూసింది, అన్నగాడు, మాయరాచ్చసుడు.

యెం : ఛీ పిరికోడా అక్కడ అన్న అదిరిపడుతావుంటే యీడ వొయ్యారంగా వుంటుండావా ? సిగ్గులేదా ? తెల్సిందిలే నీ నూపుల్లో గుబులు—

దాసు : అయ్యొ సీతొదినా, ఎంతమాటంటివి!...పోతుండా ...ఈగీటుదాటి రామోక. (వెడతాడు)

సీతా : అటునూడెంకీ—ఆ వొచ్చేది పెద్దయ్య తాతకాడు గందా...

యెంకి : అవుతే మటుకు భయమెందుకే ?

సీతా : అమ్మో నాకు భయమే, నే పోతా, నువ్వు రావా ?

యెం : ఆ బండెనక దాంకో. తమాస చూస్తుండు.

సీతా : నేనుండబట్టలేనమ్మ...(బిగ్గరగా) దాసయ్యో, లగెత్తుకురా...

[దాసు బావ వొగుర్చుకుంటూ వస్తారు]

దాసు : పెద్దయ్య తాతలాగుండాడు. ఉడాయిద్దాం, లెగండకే...పదవే సీతాయి—

బావ : కదులెంకీ...

యెం : ఎందుకింత భయం ? మనమేం నేరం సేసుండాం ? రామాయణ మాడుకుంటుండాం. చస్తిమంటే, స్వరగంలో ఎండి గొలుసులుయ్యాల లూగుతాం.

దాసు : పెద్దయ్య సేతులో పలుపుతాడు నూత్తివా, మనం పోదాం పదవే సీతి.

[సీతాయిని లాక్కుని గబగబ వెళ్ళిపోతాడు]

బావ : నూత్తివా మనం రాకుండానే ఆళ్ళిద్దరూ వుడాయించినారు. ఇంతే జీవితం?

యెం : ఎర్రిరాజా—ఆళ్ళిద్దరూ వొంటిగా ఎకసెక్కాలాడుకుంతాని కళ్ళినారు.

బావ : మనమూ పోదాంపద. పొద్దోతోంది.

యెం : సందమామ నొక్కణ్ణే వొదలేసి ఎళ్ళడానికి నీకొళ్ళెట్లొస్తాయి మామా? నువ్వాబండెనక దాంకో. తమాస చేస్తానూడు.

[బావ బండివెనక పొంచికూర్చుంటాడు.. మెల్లిగా చంద్రన్న ప్రవేశించి చేతిలో పలుపుతాడు పైకెగరేసి గుండ్రంగా తిప్పుతాడు]—

యెం : బిచ్చమెయ్యనా రామణాసురుడా...

చంద్ర : అదేంటి?(కాసేపాలోచించి) తెల్సిందిలే. రాములోరేడి ?

యెం : బంగారులేడికోసం ఎల్లినాడుగా. ఆపతొచ్చినట్లరిస్తే మరిదెల్లినాడు.

చంద్ర : బిచ్చమెట్టు.

[యెంకి అటుయిటు చూసి, రెండుమూడు మెక్కల్ని పీకుతుంది]•

యెం: ఇటురా, పెడతా...

చంద్ర : నేను రాను, నువ్వేరా...

యెం : నీ రథమేదీ?

చంద్ర: చక్రమూడితే, మేకు దిగేయించడానికి వొదిలేశాసా.

యెం : ఎత్తుకుపోదామనే—గుట్టలెక్కగలవా ? ఏరు దాటగలవా ?

చం: ఏరుదాటలేను నాకీతరాదుగా. నూడెంకి—నాయుడే మయ్యాడు? యింతకితం యీడే వున్నాడుగా...

యెం : ఏం కత ?

చం : ఏం లేదు. ఎన్నాళ్ళమట్నించో, నీతో వోటి సెప్పుదామనుంటుంది.

యెం : ఏంటది ?

చం: ఏం లేదూ...మరి, అటువితే...సూడు...నాయుడేడీ?

యెం : బావ, బండెనక నక్కినాడు.

చం : అహ, మరేంలేదు— నే సెప్పేది, బావిసయమే...

యెం : బైటికి రా రాములోర! సెంద్రన్న నీ యిసయ మేదో సెప్తాడంట...

బావ : (వొచ్చి) ఏందది సెంద్రన్న ?

చం : కరణం కామయ్యగారింటికి, పై వూర్నించి పెద కామందుగా రొచ్చుండారు. మీ మామ, ఆరిపాలంకాడ, నిన్ను పనిలో కుదురుస్తానికి మాటిచ్చాడు. సాలికి పది బస్తాలదాన్యం, జీతం...మాట్లాడుకుంతానికి, నిన్ను దబ్బున తీసుకురమ్మన్నారు.

బావ : నిజంగానా, సెంద్రన్నా ?

చం : నుంచున్న పళంగా రమ్మన్నారు..

బావ : పోదామా యెంకి ?

యెం : నేను రాను. నువ్వెళ్ళిరాక.

బావ : ఎందుకు ?

యెం : సెంద్రన్న పల్లోజేరి ఏం బావుకుంటుండావు ? కామందుగారు సీకట్లో పొలాని కెళ్ళమంటె ఎళ్లాల్సిందే. ఎండనక, వాననక దేవుడా అంటూ, సెమటోడ్చి సావాలి.

చంద్ర : సావకపోతే బువ్వెట్టాగొస్తుంది ?

నాకెందుకు నేపోతా—ఎర్రావు మందనుండి దిగడింది. తోలికెళ్లాలి, (వెడతాడు)

బావ : పల్లో యాడేంది, పోదాం రా యెంకి. మామ నా కోసరం పని చూస్తుండాడంట, ఏదో పనిలో చేరకుండా ఎల్లా ? మొగోడు పనిసెయ్యాల, ఆడది కూడొండాలి. బోలెడు డబ్బు సంపాదించుకుంటే కొంప కట్టుకోవచ్చు. ఏమంటా ?

యెం : నువ్వు మనసుండబెట్టుగోలేవు మావా—సెప్పుడు మాట్లని సెప్పుల్లో కాళ్లెడతావు. మనమిద్దరమె ఎవ్వరొద్దంటివి మరి సినావా ? యీ సేలు, యీ తోట్లు అన్నీ నావంటివి, ఇంతట్లో యిట్టగైపోతే నాబాధంతా సెంద్రుడితో సెప్పుకోవాలి, మాటాడ వేం? సందమామని సూడు—ఎద్దుమోపల్లె ఎట్లు వొంకర తిరిగి సూత్తుండాడో...(నిదానించి] నే నంటె కోపమా రాజా...?

బావ : నేనెందుకు మాటాడ్డం...సెందురుడున్నాడుగా...

యెం : యాడసేరి స్తిపీ యలక ? మనకిపనెందుకు ? నీవు నేనూ, నాకు నీవు—ఆకశం భూమికి మల్లె నిలిసిపోదాం, నీ వెట్ట సెపితే అట్ట సేస్తా, నీ రెప్పల్లో నిదరోతాను. నీ పాగ నాకోట, నీ నీడలో మేడకడత నాయుడు బావోయ్ జాగర్త...!

బావ : నిన్న పొద్దత్తమానం పెద్దెయ్య కూకలెట్టినాడు. గాడిదల్లే వూరంట తిరక్కపోతే పల్లో దూరుకు మామకి సాయ పడరాదా అని—అరిసినాడు. పోయొత్తా...తరవాత నూసు కుందాం, కులుకులాట్లు...

యెం : తరవాతేడుంది మావా ? ఈ చనంలో యిద్దరం బతి కుందాం, తరవాత తెరతీసి నువ్వు నూసావా ? తరవాతకి కంప్లుం డయ్యా, కరుస్తుందా ? కథ సెప్తుందా ? పదం పాడుతుందా?

బావ : ఏంటూ సొద సీదంతా—నే పోతా...

యెం : ఇంతేనా బావా? నే వొద్దంటినిగా—నే రాకుం డనే పోతవా?

బావ : సచ్చేదా మరి? మావరుస్తాడు—కామందులు కరు స్తారు. పొట్టలో కూడుంటె గందా, నీతో ముచ్చట్లు.

[కదుల్తాడు.]

యెం : అయ్యో బావా—కదుల్తున్నావా—రొంపిలో కెళ్ళి పోతుండావా? కుళ్ళు నూపెట్టే కనికొరంకోసరం, యెంకి మనసు యిరిసేస్తివా... [వెడతాడు]

[యెంకి దిగులుగా కూర్చునీ, చేతులో మొక్క ఆకుల్ని లాగి నలిపి, పారేస్తూంటుంది. చంద్రన్న వొస్తాడు.]

చంద్ర : ఏందెంకి అట్లా దిగాలుపడి కూసుండా...అడేడీ?

యెం : మేడ కడతాని కెళ్ళినాడు.

చంద్ర : అదేంటి?

యెం : పనిలో సేరి డబ్బు గడించి మేడ కడతాడంట,— అద్దాల వొంటితంబం మేడ.

చంద్ర : ఓ అదా. మరి నువ్వెల్లలేదేం? హాయిగా మేడలో గొలుసులుయ్యా లేసుగుని వూగుదువుగా...

యెం : పల్లో సేరి, గొలుసులు పీక్కుసుగుని నువ్వూగుతుండ వుగా...

చంద్ర : ఓలె—పిల్లకి కోప మొచ్చిందో—కోప మొచ్చి నప్పుడే నువ్వు గుమ్మగుంటావు...

యెం : ఏంటి సంద్రన్న...!

చంద్ర : గుమ్మగుంటావు—అని నాయుడంటాడోలె పిల్ల. లెగు—యింటికాడ దిగబెడత... (మామిడికాయ తీసి, ఆమె కిస్తూ) నీ కాకలిగా లేదు? ఇదిగో యిది తిను.

యెం : మీ తోట్లో కాయలు నాకేమొద్దు. [తీసుకోదు]

చంద్ర : ఏం—నిన్న కసిరానని కోపమా...కామందుగారి పెదపాలేరుండాడని అట్లాగంటిని. అదికూడ తెలుసుకోలేవు... ఎర్రిపిల్లా—నిన్నేంటి, సెంద్రన్నేంటి కసరడమేంటి...అంతపని జరిగితే, ఆవులు అంబా అని ఏడవ్వంటే? కాయి తిను—

యెం : నేను తిన్ను. పరాయోళ్ళ సొమ్ము తాకను.

చంద్ర : నే పరాయోణ్ణా?

యెం : ఏందా ప్రశ్న ?

చంద్ర : పెళ్ళికాని పిల్లకి, పెళ్ళికాని మొగాడు పరాయో డెట్లాగవుతాడు—నువ్వు సెప్పు, యవ్వారం తెలిసినదానివిగా...

యెం : అబ్బో—సంద్రన్నమావ, ఎన్నెట్లో సిందులు తొక్కుతుండాడు. పెళ్ళిసేసుకుంటేనే మొగాడు పరాయో డవు తాడు.

చంద్ర : నాకింకా పెళ్ళాంలేదుగా...

యెం : ఎందుకు లేదు ?

చంద్ర : ఏదుంది ?

యెం : ఈపాలికి పుట్టేవుంది.

చంద్ర : సర్లె...నీకు మొగుడుండాడా—నీకు మొగుడుంటె నాకూ పెండ్లాం వుందనుకో...

యెం : ఉండాడో లేడో నీకు తెల్దా ?

చంద్ర: నాకేటి తెలుసుద్ది. జనం అనుకోడం, నువ్వు నాయుణ్ణే సేసుకుంటావని.

యెం: నీకు దిగులుగా వుండాదా ?

చంద్ర: ఎప్పుడూ సేసుకోదు—పందెం.—అంటిని.

యెం: ఏమాత్రం పందెం ?

చంద్ర: నువ్వు నాయుణ్ణి సేసుకుంటే, నే నసలు పెళ్ళే సేసుకోను. అదీ పందెం. సరేనా ?

యెం: నా పెళ్ళిసయం నీకంత పట్టెందుకు ?

చంద్ర: నీకు తెల్దా యెంకి ?

యెం: నాకేటి తెలుసుద్ది !

చంద్ర: ఇదిగో, యిటుసూడెంకి—సెంద్రుడి సాచ్చికంగా సెప్తుండా...నువ్వు...మరి...నేను...నేనుగాదు ...మరి నువ్వు.

[తడబడి ఆమె చేతులు పట్టుకోబోతాడు, 'అదా కద' అంటూ, యెంకి చేతులో మిగిలిన దూలగుండ కొమ్మని, ఆకుల్నీ అతని చేతులపైనా మొహంపైనా కాళ్ళపైనా కొడుతుంది. అతను దురదల్తో అవస్థపడుతుంటే, నవ్వుకుంటూ యెంకి పరుగెత్తుకు పోతుంది. దూరంగా వెళ్ళింతర్వాత.]

యెం: ఆనాటి నావోడు సెందురూడా - అలిగిరాలేదోయి సెందురూడా— (వెళ్ళిపోతుంది...)

[తెర]

## రెండోరంగం

[కొలను పక్కన చిన్న పూరిపాక, పెద్దచెట్టు నీడకింద వొక మంచం, దానిపక్కన చాప, నాలుగైదు కుండలు, బిందె, తాడుమీద ఆరేసిన చీర, నాయుడు బావ, "యాడుంటివోలె యెంకి, యాడుంటివె ?" అనుకుంటూ నాలుగుదిక్కులా తొంగి చూస్తూంటాడు. పాకవెనకవైపు తొంగిచూస్తుండగా, యెంకి చెట్టువెనకనుంచి వొచ్చి "ఎవరు వోరు?" అని కసురుతుంది. నాయుడు అదిరిపడతాడు]

బావ: ఓ, సెట్టెనక నక్కినా ?

యెం: ఎవరువోరంటె మాటాడరేం...

బావ: నేనా ? నేను దొంగోణ్ణి...

యెం: ఇక్లెందుకొచ్చా ?

బావ: దొంగతనానికి...

యెం: సిల్లుకుండలు, సిరిగిన సాపలు తప్ప దొంగిలించేటందుకు యీడేముంది ?

బావ: ఓటుంది, అందుకోసరం, సెప్పనా...నీ గుండికాయ...

యెం: నాగుండి సెరువై పోయిందిగా...

బావ: అట్టైగితే పోయి సెర్లోపడతాలే.

యెం: మావా—నువ్వు సెర్లోసేప వవుతే నేనేంగాను ?

బావ: గాలమేసి నన్ను పట్టెయ్యి.

యెం: మావా—నేను బంగారు కాసవుతే, నీకేం గావాలనుంది ?

బావ: మెళ్లో దోపుకునే, డబ్బుసంచీ...

యెం: నీకు డబ్బంటె యింత మోజెందుకు రాజా ? డబ్బుకోసరమని, పెదకాపుగోరి కొంపమీదికి, వుడాయిస్తివిగందా నన్నొంటిగా వొదిలేసి—ఏమాత్రం తెస్తివి ?

బావ: ఒట్టిదెంకీ—ఆరు నాకోసరం కబురు సెయ్యలేదంట, సెంద్రన్న బూటకం, మా తాతనడిగారంట, నన్ను పన్లో వుంచుతాని కిష్టమేనా అని...మాతాతకి దగ్గు, గుబులు, నీకు తెల్సుగా, ఇంటికాడ, ఆడుసత్తావుంటె గొంతులో కాసిని నీళ్ళు పోసేటందుకైనా మనిసి లేకుంటె ఎట్టగన్నాట్ట.

యెం: ఓ సింతెనా—సల్లో, నీమేడలో వుందా మనుకున్నాలే...

బావ: ఏ యెంకి.....బుద్దొంచ్చిందంటినిగా......సెంపలేసుగోనా...నిన్నొదిలి నే నేడకీ పోను—ఇదుగో సేతులోసెయ్యి. (చెయ్యితీసుకుని వొత్తేస్తాడు)

యెం: (మొహంలో మొహంబెట్టి) కంట్లో కన్ను—మనసులో మనసు—సంద్రం, వుప్పుకీ మల్లె, వొక్కటై కలకాలముండాల మావ.

బావ: నీతోటె వుంటా యెంకీ—

యెం: నీమాట యింటాను నాయుడు బావా...

బావ: నీ సక్కదనాని కేమిచ్చేదె సంతన పిల్లా?

యెం: నువ్వు సల్లగుండు బావా-మరమ మిడిసి మనసియ్యి—నాకింకేటి కావాల...

బావ: ఓ సెందురుడు సాక్షిగా...

యెం: సెందురుడు యింకా రాందే...

[పెద్దయ్య ప్రవేశించి]

పెద్ద: నీకోసరం సెందురుడు పగలె వొస్తా డెంకీ—సూర్యుణ్ణి కూడా రానీకుండా చేసేటంతటి పెద్దమ్మవోరివి మరి!...

బావ: అదె పరాచికాని కంటూంది తాతా...

పెద్ద: పెళ్ళి పెడాకులు లేకుండా, పరాయోడితో పరాచికాలేంటిరా నాయుడూ?—అది, ఆడది. బుద్ధి గడ్డి తింది. నీకైనా సిగ్గుండొద్దు? ఇంటికాడ, మీ తాత మంచానపడి సత్తావుండాడు. గొంతులో గంజిపోసే దిక్కు లేదు. నీ కెవత్తినో అమ్మోర్ని కట్టబెడితే, యింటిపంచనుండి, నాలుగు మెతుకు లొండి పెడుతుందని ముసిలోడి సంబరం. నీకు పొద్దుటే సంబంధం కుదిర్చినాడు.

యెం: పెద్దయ్యతాతకి పెళ్ళంటే భలే సర్దా. ఊళ్ళో ఎవుళ్ళకి పెళ్ళయినా, తనకయినట్టే నూసుకుంటాడు పాపం. బావకి, అళ్ళతాత సంబంధం నూత్తుండాడంటివి. మరి నన్ను నువ్వే సేసుకోవాలి తాతా...

పెద్ద: పిన్న పెద్ద వొయినం లేకుండా ఏందా వోగుడు... నువ్వు పెద్దదానివై యుంటివి. మరియాద నేర్చుకో...

యెం: లోపలో టుంచుగుని పైకోకటనడం—అదీ మరియాదంటే. అది నాకు సేతకాదు తాతా. ఇదా నీ సావాసంవల్ల అబ్బుద్దేమో...

పెద్ద: నీ సావాసంవల్ల కణికంటి నాయుడు సెడ్డాడు. చంద్రయ్య సెడుతుండాడు. దాను సెడబోతాడు. నే నొక్కణ్ణే మిగిలిపొయ్యాను.

యెం: అందరితోబాటు నువ్వు కూడా సెడలేదనేగా నీ దిగులు...

పెద్ద: ఛవ్ నోరు ముయ్—ఏందా కబుర్లు సిన్నా పెద్దా లేకుండా...!

యెం: మీకు సిన్నలుంటే, మాకూ పెద్దలుంటారు. సెడిపోడ మేంది? ఆ కబుర్లు బాగుండయ్యా—అడగవేం బావా?...

బావ: సెడిపోతం ఏంలేదు పెద్దయ్యతాతా. సేవితంగా వుంటం. సిన్నతనం. సల్లనేళ ఆడుకోటం, పదాలు పాడుకోటం, కతలు సెప్పుకోటం...

పెద్ద: ఒక్క పిల్లల్ని కనడంతప్ప, మిగతవన్నీ—అన్న మాట.

యెం: చాల్లే తాతా—ఆ యెంకటేశ్వరుడి కనికారం వుంటే గండా పిల్లలు కలిగేది. పదం పాడితేనే పాపాయి పుడతాడా ?

పెద్ద: నీ కింటికాడ గదమాయించేవోళ్ళు లేరు. హద్దుపద్దు లేదు. బయబక్తుల్లేవు. తెగించి పోనావు. పదిమంది పెద్దలం పట్టు బట్టి నీ పెండ్లి చేయించేస్తేగాని, యీ వూళ్ళో వొక్క మనిషి కూడా మర్యాదగా బతికేటట్టు లేదు.

బావ: ఏంది తాతా—మర్యాద మర్యాదంటావు ?

పెద్ద: హాయిగా ఏడనో సేరి పొద్దత్తమానూ పనిసేసి నాలుగు రాళ్ళు గడించుకోటం, పెళ్ళిచేసుకుని, సుఖంగా వుండటం...

యెం: పిల్లల్ని కనటం, ఆళ్ళకి జబ్బులుచేసి మూలుగు తూంటే సూత్తూకూకుంటం...కట్టుకున్న పెళ్ళామంటె సిరాకెత్తి మరొక దానితో లేసెళ్ళటం—అది మళ్ళా పిల్లల్ని కనటం—ఆళ్ళకి జబ్బులుసేసి మూలుగుతూంటే...సూత్తూ కూకుంటాని కుక్కడా యిల్లేదు. ఈలోగా యీ మొగోడికి ఏ పచ్చవాతమో వొస్తుందిగా...అదీ మర్యాదగా బతకటమంటె...

పెద్ద: నీ యవ్వారం ముదరకముండె, కరణం కామయ్య గారితో సెప్పి నలుగురు పెద్దమనుసులం కూడబలుక్కుని, ఏదో తేల్చెయ్యాలి. అదుగో, ఆదాసు సీతాయి యవ్వారం తేలిపో యిందిగా...పెళ్ళిచేసుకుంటుండారు.

యెం: మా సీతాయి, దాసయ్యని పెండ్లిసేసుకుని సీతామ్మ వారు కాబోతోందా!—నాకు సెప్పనేలేదు — పిల్లకి సిగ్గు కామాసు...

పెద్ద: ఏం నాయుడూ—మీ తాతని సూడ్డానికొత్తవా ? సాయంత్రానికి గుటుక్కుమనేతట్లుంది ముసిలోడి పానం. మీ యిష్టం. నే పోతుండా...(వెడతాడు.)

బావ: యెంకీ, మా తాతని సూసొద్దాం—లెగు పోదాం.

యెం: నేనెందుకు ? నన్నెవోరూ రమ్మన్లేదు. సంబంధం సూత్తానికెళ్ళేవోడికి సంకని పిల్లోకటా...?

బావ: నాకేటి భయం నువ్వు రాసోరింటికెళ్ళి రంగు తెచ్చే పిల్లవి. నువ్వు ఎనకాతలుంటే దైర్యంగా మావోళ్ళతో సెడుగుడా డెయ్యనంటె...!

యెం: నాను రానులె మావా...మన్నిడ గొడదామని వూళ్ళో వాళ్ళంతా పగబట్టి యిసాలం కక్కుతుండారు. నువ్వు ఏ ఆటకా తాళం వేత్తుండటం ఆళ్ళకి మరీ సిమెత్తింది.

బావ: సూడు, గంటలో తిరిగొత్తా...నువ్వు లేకుంటే నా తోవ సదునుసేసే దెవరోలె...కూకుని, రామాయణం పాడుకుం టూండు...ఎల్తున్నా...నవ్వాల......పిల్లసిగలో పూలు కళ్ళిప్పి నాయి. నవ్వు...అద్ది...అద్దిగదీ...

యెంకి గాలాకపాలి యిసిరినాసాలు...

[వెళ్ళిపోతాడు. యెంకి కూనిదీర్ఘం తీస్తూ పాడుతూ గదిలోని వొస్తువుల్ని సవరిస్తూంటుంది.]

నేను కోయిలనైతే
నీరాగమాదూ
దిశలహో నిన్నే
కీర్తింపగా జేతూ
పూవు నేనైతే నేనీ వలపునాదూ
పూనిన్నే జగమంత
ధ్యానింపజేతూ—

[బిండి బుజాన వేసుకుని వెళ్ళబోతూండగా చంద్రన్న ప్రవేశం.]

యెం: ఏం దిట్టొచ్చావు సంద్రన్నా...?

చం: నువ్వేంది హుశారుగా పాడుతుండా?

యెం: బావ సంబంధం సూత్తాని కెళ్ళాడు. నేనే పెళ్ళి కూతురు ననుకొని, జాయిగా పాడుకుంటుండా...

చం: ఏందీ ఆణ్ణి పెళ్ళాడతాని కిష్టపడినా—చివరికి? భలె...భలె...

యెం: అదేంది—అంత సంబరం. నాగూడ ఎవత్తినేనా సేసుకుంటుండవా?

చం: సూడెంకీ, ఇన్నాళ్ళూ నా పెళ్ళిసయం నీతో సెపు దామనుంజేది. ఇంక సెప్పేదానికి యీలు లేకుండాపోయింది.

యెం: అంటే?

చం: నువ్వు నాయుణ్ణి సేసుకుంటూండావుగా...

యెం: భలే తెలివి. నాయుడు ఎవత్తినో సేసుకుండాలని సూసొద్దామ నెల్లినాడు.

చం: ఎట్టగట్టగట్టగట్టా...?

యెం: సర్లె—నీకు తెల్సేతలికి, బావ సేసుకోబొయ్యేది పిల్లల్ని కూడ కనుద్ది...

చంద్ర: (నవ్వుతాడు) యెంకీ, నీకు పెళ్ళిచేసుకోవాలని వుండదూ...?

యెం: అది జరిగింతర్వాత కాని, దానిలో మజా తెల్దులే సంద్రన్నా...

చంద్ర: అంటే ?

యెం: పెళ్ళి సేసుకున్నతర్వాత, పసుసులుకి పెళ్ళిలో రజను తెలిసొస్తుంది. కట్టుకున్నదాన్ని వొదిలేసి, మరొక మాకె మ్మతో మంతనాలు, ఆపైన పెళ్ళిమేళంతో మంత్రాలు...

చం: మరి పిల్లలమాట ?

[కరణం కామయ్య దోవంటవెడుతూ, చంద్రన్నని చూసి నిలిచిపోతాడు. మాసినకోటు, పంచికట్టు...నుదిటిపై కళ్ళి

పోయి, కొస్తంత ఆ సరాచూసుగుని వూడకుండా నిలబడిన [కొపింగు, చేతిలో కర్ర—ఆయన వాలకం]

కామ : ఏవిటి చంద్రదన్నా పిల్లలంటున్నావ్ ?

చం : (పెదవి కొరుక్కుని) పిల్లలు కొదండి—పిల్లులంటుండా.. రెండు కూనల్ని తెచ్చిపడేస్తే, కొంపలో ఎలికిలబాధ లేకుండా వుంటుందీ—అంటోందండి యెంకి—ఆ యిసయం సెప్తుంటే యింటుండా...

యెం : కరణంగోరూ...ఆ మంచంమీద కూకోండి, సంద్రన్నకీ, సత్తానికీ, ఆకాశానికీ భూమికీ వున్నంతదూరం. సంద్రన్నకి పెళ్ళిచేసుకుని పిల్లల్ని కనాలనుందంట కరణంగోరూ—నే నంటుండా—పిల్లల్నే కనతానికి, పెళ్లిచేసుకోనక్కర్లేదురా నాసామీ అంటుండా...

చం : అయ్యో అయ్యో ఎంత లావబద్దం. (చెప్పొద్దన్నట్టుగా సైగలు చేస్తాడు)

కామ : ఏడిశావుగాని చంద్రదన్నా, పెద్దలందరూ వొచ్చారేమో చూసిరా (చంద్రదన్న వెడతాడు) అవుతే, పెళ్ళికాకపోతే సంతానం ఎట్లా కలుగుతుంది ?

ఇద్దరు వ్యక్తులు కలిసివుండడమే పెళ్లంటె, పెళ్లనేది అనాది నుంచీ వొస్తున్న వొకసాంఘిక సంస్థ. మనుషుల్లోని అరాజకత్వాన్ని అణిచిపెట్టి, వొకేచోట కేంద్రీకరింప చేసే వొక నైతిక సంప్రదాయం కుటుంబ జీవనానికి ఆయువుపట్టు.

యెం : మీరు సెప్పేదేంటో వొక్కటీ తెలీడంలా, నా ఆయువుపట్టు యమధరమరాజు దగ్గరుంది. పెండ్లిచేసుకోటం ఏంటండీ—

కామ : వొకే గృహంలో కలిసి మెలిసివుండి పిల్లల్ని కనడం..

యెంకి : పిల్లలకి ఎంకటేసుడి కటాచ్చముండాలి. మా అమ్మమ్మ నీ పెండ్లిసేత్తానని మొట్టికాయలు మొట్టేది.

కామ : ఇంచుమించు పెండ్లి అట్లాంటిదే...మొగుడు తప్పుడుపన్లు చేస్తే నాలుగు మొట్టే అధికారం నీకూ వుంటుంది...

యెం : మొట్టికాయలతో కుదురుగావుండే మొగుణ్ని అసలు కట్టుకోటం ఎంతుకండి—మీరు సెప్పండి.

కామ : అట్లాంటివాణ్ణి కట్టుకోమని ఎవరన్నారు ? మంచివాణ్నే కట్టుగో...ఇప్పుడు నాయుడున్నాడా...వాడూ నువ్వూ కలిసిమెలిసి వుంటున్నారా...దగ్గరగా స్నేహంగా — అంటే చాలా యిదిగా-అంటే చాలా-(విసుక్కుని) యిదిగా...

యెం :(నవ్వి)బావ కళ్ళల్లో సత్తైసుగా కట్టినట్లుండడాండి.

కామ : అదుగో ఆ తంతు పదిమంది సమక్షంలో జరుపకోడమే పెండ్లి...

యెం : పదిమందిలోనూ సిగ్గేత్తుందండి...యీ మాయదారి మనసులంటే నాకు భయం... నేనట్లు పెండ్లాడనండి...

కామ : వివాహం బహిరంగంగా జరిగినప్పుడే సంఘం ఆమోదించి, మీ సుఖదుఃఖాలను పంచుకుంటుంది. సంఘం అంటే—మనుషులు—అంటే...అంటే...

యెం : యిదన్న మాట...

కామ : యిదికాదు...సంఘం అంటే, నేను, చంద్రదన్న పెద్దయ్య మొదలైనవాళ్ళం...

యెం : కామయ్య కామందుగోరూ...పాతింటోరి రంగులు, మొగుడు పిల్లల్తో అలో లచ్చనా అని సంసారం దిద్దుకోలేక సత్తా వుండారు. వూళ్ళోవాళ్ళు వాళ్ళకేం చేసినారు?

కామ : ఏం చెయ్యాలి ? దాని సంసారం దిద్ది, వొడు దుడుకుల్లేకుండా, సంఘం వాళ్ళు విడిపోకుండా కాపాడుతుంది..

యెం : నేను, నాయుడు యిడిపోము. అందుకనే పెండ్లి చేసుకోం.

కామ : పోనీ—కరణంగారి విషయం చూడు. పెండ్లి చేసుగుని, ఇరవయ్యేళ్ళయింది. వాళ్లు విడిపోయారా మరి?

యెం : అల్లెందు కిడిపోతారు? అల్లకి వొకళ్ళమీదొకళ్ళకి—నాకు నారాజుకు మల్లే—ఏంటి—యిదుంటేగా...?

కామ : ఇంకా నయం—ఎంత మాటన్నావ్—కరణంగారంటే ఏమిటో తెలుసా?

యెం : ఏంటో తెల్దు కానండి—ఎవరో తెల్సింది. మీరేగా

కామ : ఆ! ఆ! అమ్మాయి పాకం ముదురుతోంది! పెద్దయ్యవాళ్లు, నీమీద నేరాలు చెబుతుంటే, ఏమిటో—గిట్టక చెబుతున్నారేమో—అనుకునేవాణ్ణి—

యెం : సందేహం ఎందుకండి—గిట్టకే ముదరష్టపు కూతలు కుయ్యటం. పకుసుది అళ్ళకేసి కన్నెత్తి సూడదు గనక, యీ ముసిలోళ్ళకి కడుపుమండి, యీ రంకెలెయ్యటం.

కామ : పెద్దెయ్య తాతనే అంటున్నావు?—నీకు భయభక్తులు లేవల్లేవుందే...

యెం : నాకు మనుసులంటే భయం—చావంటే భక్తీవుండాయండి.

కామ : బావ మనిషి గాడా యేం కర్మ...

యెం : పరాయి మనుసుల మధ్య లేకుంటె, నాయుడు దేవుడండి.

కామ : దేవుడు కాడు దయ్యం.

యెం : నే సెపుతున్నదీ అదె—మీరందరూ పట్టుగుని అణ్ణి దెయ్యంలాగు సేత్తుండారు.

కామ : చాల్లే వాక్కు, చిన్న పెద్ద అంతర్యం తెలీకుండా. నీకింకా తెలీదేమో—ఊళ్లో పెద్దలం నలుగురూ రెడ్డెయ్యగారింటి ముందు పంచాయితీ జరుపుతున్నాం యీపూట. నీ విషయం; నాయుడి విషయం, మీరు పెళ్లీ, పెడాకులు లేకుండా యిల్లా వుండటం ఎవ్వరికీ నచ్చడంలేదు.

యెం : మే మిట్లాగుంటే ఎవర్నేం సేసినాము?

కామ : పెండ్లి కాకుండా, సరసా లేమిటి?

యెం : పైవోళ్ళతో సరసాలాట్టం లేద నేగా?

కామ : ఛీ నోరు ముయ్. శుద్ధబద్ధం లేదు! పెళ్ళి చేసుకోపోతే ఆస్థిపాస్థుల విషయంలో పేచీలొస్తాయి.

యెం : ఆస్థిపాస్తు లుంటేగా పేచిలు రావటానికి? అడికి నేను, నాకాడు—మా యిద్దరికి మద్దెనా సెందురుడు—

(చంద్రదన్న వస్తాడు)

కామ : మీ యిద్దరికీ మధ్య చంద్రదన్నా?

యెం : మీ రిట్లాంటి పుట్టింపులు పుట్టిస్తావుంటే మీమీద వూళ్ళోవాళ్ళు పంచాయతీ చెయ్యరేం ?

కామ : పరిహాసంలే పిచ్చిపిల్లా...

చంద్ర : (గొంతు సవరించుగుని) ఆళ్ళందరూ...అంటె పెదకాపులందరూ...సిద్దంగా కూకుండారండి.

కామ : సర్లే. వెడుతున్నా యెంకీ—ఒక్క విషయం. పెళ్ళిచేసుకోపోతే పిల్లలు పుట్టరుగా...

యెం : పెండ్లికాకుంటే పిల్లలు పుట్టరాండి ?

కామ : హరిహరి. ఇదోటా పైగా...నిన్ను సంఘం లోంచి వెలేస్తారు. కరణంగారుండికూడా యిట్లా చేశారని నామీద నిందమోపుతారు ప్రజ...

యెం : మీరు వూళ్ళోవోళ్ళకి బయపడి పెండ్లాడమంటా వుండారుగాని లేకపోతే నే నిట్లాగుండటం మీకిట్టమే...ఏం బాబుగోరు...!

కామ : నీ కర్మ...చెప్పవల్సింది చెప్పాను. ఏరా చంద్రన్నా...

చంద్ర : వొస్తుండానండి.

యెం : ఎలకల్ని పట్టేదానికి పిల్లుల్ని తెచ్చావా ?

చంద్ర : ఎలకని పట్టేదానికి బావురుపిల్లులు రావిచెట్టుకింద కూకుండాయిలే—అవుద్దిలే నీపని ! వొస్తుండానండి.

కామ : నువ్వు రావొద్దు—పొలంకాడికి పో...

చంద్ర : పోతుండానండి. (మొత్తుకుంటూ పోతాడు... కామయ్య కూడా మరో దిక్కుగా వెడతాడు. యెంకి కూనిదీర్ఘం తీస్తూ బిందెతో నీళ్ళు తెస్తూవుంటుంది.)

నా పేరె నారాజు జపమన్న అపవాదు
ఈపూట దేకాదు ఎప్పటికిపోదు
ఏనాటి వరములో
ఈ నాగరీకాలు
పాటలో తన పరువె
బ్రతుకులో బరువటే !
నా పేరె నారాజు జపమన్న అపవాదు.

(సీతాయి ప్రవేశిస్తుంది.)

యెం : దావే సీతాయి, బావింకా రాలేదు సూస్తివా.

సీతా : ఇంటికాడ పేచీలుపెట్టి సంపుకు తింటుండారంట.

యెం : సంబంధం ఏమైంది సీతాయి ?

సీతా : యినెరి కొట్టాడంట, నువ్వుండగా మావ ఆ యేసా లెందుకేత్తాడు. !

యెం : ఎంత మంచోడేనారాజు, బావలేకుంటె నాకెట్లా వుందమకున్నా, సంద్రం మద్దిలో కొట్టుకపొయ్యే నురుగులా గయ్యాను. అడివి తగులడుతుంటె కాలని కొయ్యలాగైనాను. నీలు తేబోతుండానా,—వొట్టమ్మ...నా యెంట ఎవరో నడిసి నట్టుంటాదె ! అద్దంలో సూత్తుంటె అదేటో సిగ్గు...యెనకాత లెవరో నవ్వినట్టుండాదె సిత్రం...!

సీతా : యెంకీ వోమాట సెప్పనా ?

యెం : నాకు తెలుసులే, నీకూ దాసుకీ పెండ్లిచేస్తామంటుం డారు. అవునా ?

సీత : నీకెట్ట తెల్సింది ? మూర్తంకూడ నిశ్చయించారు. నువ్వొత్తవా...?

యెం : మా వొత్తాదులే...మావకి పెండ్లిఅంటే సర్దా...

సీత : నీకు లేదా యేం ?

యెం : పదిమందిలో పందిట్లో కూకుంటం నాకు సిరాకు, పదిమంది ముందరా పొత్తు—వొంటిగా లడాయి...యిదే మన జాతోళ్ళ పెళ్ళిముచ్చట...

సీతా : ఎప్పుడూ పెళ్లిలేకుండా యిట్టగే వుంటావా ?

యెం : ఎందుకుండగూడదు.? సావు పుట్టకలతోపోయే సావా సమైతేనే పెండ్లి...అటుసూడు, మబ్బులమద్దెన మెరుపులా నాయుడొస్తా వుండాడు.

బావ : యీడుంటివే యెంకి యాడుంటివె
మామిడితోటకెల్లి
మంచి పండోటి కోసి
యేటాగాని నోట్లేస్తే
యిసమై పోయిందోలె
యాడుంటివే యెంకి యాడుంటివే...

సీతా : ఏటి బావా, వుసారుగా వొత్తుండా ఏంటికథ...?

బావ : సీతాయి, కొంపకి లగత్తి పెండ్లిసేసుకో...ఇంక, నేను యెంకి, మా తాతయ్యగారి పెదపందింట్లోకి పోతుండాం... ఆడేవుండి ఆరిపాలాలు, యిళ్ళు సూసుకుంటాం...ఎంచక్క పెళ్లి సేసుకుని, యీడేంటి బిక్కు బిక్కుమంటూ ! వూళ్ళోనైతే మను షులుంటారు, ఆబోతులుంటై—ఆడోళ్లుంటారు.

యెం : కాన... నేనేం రాను ఆ మనుషుల్లోకి.

సీత : అదేటెంకి—నన్నే మా దాసయ్యగారింటి కెళ్లమని నువ్విదేంపని—మాట నిలకడలేదు.

యెం : నా యిసయం వేరు సీతి. బాబు పుట్టింటోరు రాచ్చ సులు...

బావ : అవుతేనేం...ఎంచక్క పెళ్ళిపందిట్లో ఆడబడుసు లుంటారు. బామకలాపం. రేతిరి మర్రిసెట్టుకింద గొల్లసుద్దులూ... హరిహరి నారాయణో ఆదినారాయణో, మా యెంకి పాదాలకు పసుపు పారాయణా,...లెగుపోదాం...

యెం : నేను రాను మావా సత్తెం తెల్సిందిలే...నీకు నేను తప్ప అవన్నీ కావాలి.

బావ : అద్దుగో కనుబొమ్మ లెగరేసి అమ్మోరిలాగ అగ్గై పోమాకు. నే పోతే, నా యెనకాల నువ్వూ వొత్తావు.. నలుగు రమ్మలక్కలతో సేరి నేను కత సెప్తుంటె నీనూపులు సూడా లాయేళ...నువ్వు పదం పాడేతలికి వూళ్లోవోళ్ళ పాపాలన్నీ పోవాల.

యెం : నాకేం పొగడ్తలొద్దు...కత్తిమీద సాము, కొత్తి మీద కూడు, నీతో చెలిమి.

బావ : సూడెంకి—ఎక్కసెక్క మాడమోక. ఇంటికాడ తాత సెప్పాడు. ఊళ్లోవాళ్ళు పంచాయితీ జరుపుతుండారంట... మనం పెళ్ళిసేసుకోకుంటె, నిన్ను నన్ను ఎలేత్తారంట. పమాదం కాదూ—అంచేత సేసేసుకుందాం...

యెం : మన పెళ్ళిజోలి ఆళ్ళ కెందుకంటాను. పెళ్ళి సేసుకుంటె మనసులుండవు మావా...సూడు—యీళ్ళ సంసారాలు సూడు. ఒక్కళ్ళు సుకంగుండారా?...ఆడు దీనితో లేచెల్లెడం... అది ఆడితో లేచెళ్ళడం...కొట్లాటలు, కూనీలు, పంచాయితీలు, తీర్పులు. .ఏందీ బతుకు?

బావ : పెళ్ళి లేకుంటేమట్టుకు అట్టాగే కలిసి మెలిసుంటారంటావా...?

యెం : ఎంకటేశుడి కటాక్షముంటె వుంటారు. పెళ్ళిసేసుకుంటేనే, దిగుళ్ళు, ఆపైన తెగుళ్ళు...

బావ : నీకు నచ్చచెప్పే దెట్లా, సేసుకుంటే హాయిగుంటాం. పోరూ పొందూ లేకుండా...

యెం : పెళ్ళాంపోరు మిగులుద్ది.

బావ : నువ్వాట్లాంటిదానవు కావుగా...

యెం : నువ్వు మొగుడి వవుతే, నేను పెళ్ళాన్నవుతాను. మొగుడుపెళ్ళాలమద్దెన మనసులుంటయ్యా? మమకారాలుంటాయి. సరసా లుంటయ్యా—? విరసాలుంటై, ప్రేమలుంటయ్యా? పేచీలుంటై. (దాసువొస్తాడు.)

దాసు : యెంకి...ఓ, ఆడ అమ్మలక్కలు సేరి, ఏం సెప్పగుంటుంటారు!—ఆ క్రరెమ్మలేదూ—అది, వో మాటగాదు, వో కూతగాదు...నీకు...నీకు ... (సిగ్గుపడి, మూడు వేళ్ళు చూపించి) నీకు మాసమంట...

యెం : అంత అదృష్టం కూడానా...!

బావ : పెళ్ళికాకుండా యింకేమన్నా వుందీ...! అమ్మో (గుండెలు బాదుకుంటాడు).

యెం : పెళ్ళికాకుంటె పుసతం మాన్తారా ?

బావ : అయ్యో, అయ్యో పుట్టకూడదే—నన్ను సంపెయ్యరూ...!

యెం : నువ్వు మొగుడివైతే సంపుతారు–కాకపోతే ఎందుకు సంపుతారు...

సీతా : తప్పుమాట లెందుకెంకీ—పెండ్లిసేసుకోండి...

యెం : రేపు నువ్వు దాసూ ఏం బావుకుంటారో సూత్తాగా, పెండ్లిసేసుకుని...

దాసు : ఇంతకీ తీర్మానం యిన్నావా—నాలుగురోజుల్లో పెళ్ళికాకుంటె, నిన్ను వూళ్ళో వుంచనివ్వరంట...

యెం : అమ్మయ్య, హాయిగా ఏటవతల వొంటిగా, నచ్చత్రాలు లెక్కెడుతూ, పచ్చులల్లే పాడుకుంటూ, సందమామ వొంపులో సొంపు సూసుగుంటు, నేనూ రాజా, రాజా నేనూ... గిల్లుకుంటూ, గొల్లుమంటూ, నవ్వుకుంటూ, పేదరాశి పెద్దమ్మ, పెద్దెయ్య లవుతాం...

బావ : అడుగో చంద్రన్న వొస్తుండాడు. ఏం జరిగిందో,

చంద్ర : (వొగుర్చుగుంటూ వొస్తాడు) యెంకీ—దబ్బున, ఎట్టగో అట్టాగ పెండ్లిసేసుకోండి—లేకుంటే పెమాదం...

యెం : పట్టుమావా పెళ్ళిచేసుకుందాం...దా...(చెయ్యి పట్టుగుంటుంది.) సెంద్రన్నా మంత్రాలు సదువు...సీతాయి, తలంబ్రాలు తీసుకురా—ఆ కుండలో బియ్యపుగింజలుంటాయి. మావా, బంగారం లేదుగా...యిదుగో కుండపెంకు—దాసయ్య పొగాలో పోగుతీసి, కుండపెంకుకట్టి, నా పీక్క సుట్టి—నన్ను సంపు...

చంద్ర : ఎంత యిడ్డూరం ... (ముక్కుమీద వేలేసుగుంటాడు).

యెం : ఇంతేగా పెండ్లి...!!

చంద్ర : అందుకనే, నీకేదో గాలి అంటుండారు.

దాసు : దూళంట! యిరుగుపొరుగు అమ్మలక్కలు యిరగబడి సెప్పుకుంటుండారు.

యెం : ఆళ్లనుండి, ఆళ్ల మొగళ్ళని నే తీసుకుపోతానేమోనని ఆళ్లకి భయం...నేనట్లా సెయ్యనని సెప్పు!

బావ : నోరునొక్కు—గో—పెద్దెయ్య తాత వొస్తుండాడు. (పెద్దెయ్యవొస్తాడు)

పెద్దె : యవ్వారం, కరణంగారి ధర్మమా అంటా తేలిపోయింది....తాంబూలాలుచ్చుగుని మూక్తం రేపటిలోగా నిశ్చయమవాలి. లేకుంటే యీవూళ్ళో పుట్టగతులుండవు.

యెం : ఎవరికుండవు ?

పెద్దె : మీకు...

యెం : మీకంటె,—నాకా—మా యిద్దరికీనా...

పెద్దె : నీకు...

యెం : అవుతే, నీ కనక మీకంటావెందుకు? నాకూ మావకీ పెండ్లికాకుంటే, నావొక్కత్తికే రేపు పెండ్లి సేసేస్తారు... అంతేనా...

పెద్దె : అంతె...

యెం : అదేం నాయం? పెండ్లి సేసుకోనందుకు, మావనూ వెలెయ్యాల.

పెద్దె : పెద్దల తీర్మానం అంతె, ఆణ్ణి సెడగొట్టింది నువ్వు.

యెం. నేనేం సెడగొట్టాను.?

పెద్దె : ఆణ్ణి పనిలోకి పోనీకుండా—పెళ్ళిచేసుకోకుండా..

యెం : నాతో వుండటం మట్టుకు పనిగాదా యేం? నువ్వు, నీ పెళ్ళాన్నొదిలి పన్లోకెళ్ళేవాడివా ?

పెద్దె : నువ్వు పెళ్ళానివి కావు గనకనే, యీ చిక్కు.

యెం : కానని నీకెట్లా తెలుసు, మాకు పెండ్లయింది. యిరుగో, సెంద్రన్నా సీతాయి, దాసన్న సాచ్చులు.

పెద్దె : నువ్వు నాటకాలు తొక్కమోక—కుదురుగా మసులు—ఏం—ఇదేందనుకున్నా కులుకుతానికి ?—

యెం : కులికే వోళ్లకిది నరకం...ఏం పెద్దగా నే నరక లేననుకున్నావా...ఆడూ నేనూ పెళ్ళిసేసుకున్నాం.....సరేనా... (బిగ్గరగా)

పెద్దె : ఎప్పుడు ?

యెం : పుట్టకముందే—

బావ : (నవ్వుతాడు)—అదేందే...

పెద్ది : నాయుడూ, నువ్వు నవ్వావంటె తలపగలేస్తాను. పుట్టకముందేంది—పరాచికాలా నాతో—జాగ్రత్త...

యెం : మాది, ఎనకజన్మలో సావాసం.

పెద్ది : ఎనకజన్మలో నాయుడు గాడిద—

యెం : అవుతే నేనూ గాడిదనే—

పెద్ది : చాల్ చాలు...వాగమోక...

[కామయ్య వొస్తాడు.]

కామ : ఏమిటి పెద్దెయ్య, మళ్ళా యిక్కడో పంచాయితీ తీర్చారు!

పెద్ది : విషయం చెప్పేశానండి—పెండ్లి చేసేసుకున్నామంటోంది, నక్క జిత్తులమారి.

కామ : చేసుకోనంటివిగా యెంకి?

యెం : నేను సేసుకోలా—ఆడు నన్ను సేసుకున్నాడు.

కామ : అదేమిటి—విడ్డూరం.

యెం : ఆడదాని కిష్టంలేని పెళ్ళి మొగాడు సేసుకోడంలా—అల్లాంటి పెండ్లి జరిగింది—అంటుండా...

కామ : నీకు నాయుడంటె యిష్టం లేదూ?

యెం : యిష్టం గనకనే, పెళ్ళి సేసుకోను. యిష్టంగా వుంటం యిష్టం లేకనే, మీరందరూ సేసుకోమంటుండారు. నాయుడు సరేనని సేసేసుకున్నాడు.

కామ : ఎప్పుడు చేసేసుకున్నారు? గంట క్రితమేగా నేను నీతో మాట్లాడత.

యెం : మా పెళ్ళిళ్ళు ఎంతలో జరుగుతాయండి.—కన్ను మూసి తెరిసేతలికి, పెండ్లికావడం, పిల్లోడుట్టడం—ఆడికిపెళ్లి... ఆడికి పిల్లోడుట్టడం—

బావ : ఇదంతా నవ్వులాటైగండి.....యెంకి కీపొద్దు గుబు లెక్కింది...పెళ్ళీ సేసుకోలేదు—పెడాకులూ సేసుకోలేదు...

యెం : అదేంది మామా, సేసుకుంటిమిగా...!

పెద్ది : సేసుకుని మూడు మాసాలు పైగా అవాలి...

యెం : అవును తాతా నువ్వు వూరంతకీ పెద్దవి. ఏడు మాసాల్లోగా మంచి వుయ్యాలోటి చేపించివుంచు. నీపేరెట్టుగుంటాం.

పెద్ది : ఇంకేంటి అన్నింటికీ తెగించింది—దీన్ని వూళ్లోంచి తరమక యింకా చూస్తారేంటి...రేపుటిదాకా వుంటానిక్కూడా వీల్లేదు. తక్షణం కదలాల్సిందే—కదులు...

బావ : ఏందది తాతా—నే నచ్చచెబుతాగా వూరుకో... బాబ్బాబు...

యెం : ఏంది బావా మనమేం తప్పు సేసినామని యీళ్ళకి భయపడతం.

బావ : పెండ్లిచేసుకుంటూ నసెంకీ—నీకు పున్నెముంటుంది.

కామ : అవును.

యెం : నే నన్ను. ఇదివరకే సేసుగున్నాం. అంటాను కావలిస్తే—ఎనకజన్మలో...

పెద్ది : అవుతే నువ్వు వూళ్ళోవుండడాని కీల్లేదు...

యెం : ఇది వూళ్ళోగాదు—వూరవతలే...

పెద్ది : పొలిమేర దాటిపోవాల్సిందే—కదుల్తావా కదలవా..

[ఒక్కొక్కటే, బిందె చెంబు మూట గిరవాటెడతాడు, నలుగురూ అటకాయిస్తారు. వాళ్ళని విదిలించేస్తాడు.]

యెం : పెద్దయ్య తాతా—నీమేలు ఎప్పటికీ మరిసిపోము—దూరంగాపోయి హాయిగా ఏటవతల బతుకుతాం...పద, మావా... పోదాం...

కామ : హా-సి-నీ—తెగించింది...!

బావ : నీదో పిచ్చిగోల, ఏడకిపొయ్యేది, ఆడ కూడో...?

యెం : కూడా !...పచ్చులు, జంతువులు-ఆటికి కూడేడది? మనకీ అంతే,—కాశీరాణి కనికారముంటే సాల్దు ? నువ్వుంటే నాకు దాహం... నేనుంటే నీకు ఆకలీ-వుంటయ్యా ఎర్రిమావా..!

పెద్దెయ్య తాతా... నే నుత్తమా యిల్లాలిని...పొమ్మంటే పోతా...నా వుసురోసుకోమాక ... పదికాలాలబాటు సుకంగా బతుకు...

కామయ్య : (కళ్ళు తుడుచుకుంటూ వెనక్కి తిరిగి పోతాడు.) వెర్రిపిల్ల...

పెద్ది : ఎర్రిపిల్లంటెనే, నిమెత్తింది. పోనీండి—కడుపులో కాలి పొద్దున్నకి రాదూ...మీదేందో భ్రమకాని !

యెం : రా, బావా...రావడం—యిష్టంలేదా ?

పెద్ది : ఆడురాడు, నువ్వు పో...

యెం : ఏం ?

బావ : ఎట్ట సావను...(జుట్టు పీక్కుంటాడు)

పెద్ది : నువ్వెక్కడికిరా ? మీ తాతేమో యింటికాడా సత్తావుంటే, నీకు దాంతోటి కులుకులాట్లా ?

యెం : బతికినప్పుడే కులుకులు—సచ్చింతర్వాతేటుంది... రా...మావా...

పెద్ది : ఆడురాడు పో...వెళ్ళు...

యెం : వెడుతుండా...(మెల్లిగా పాడుకుంటూ)

ఉత్తమా యిల్లాలి నోయీ
నన్నుసురుపెడితే దోసమోయీ...
నిదురలో నినుసూసి సెదిరి నేమో మనసు
పొరుగువోరంత నానరసకురికారంట
ఉత్తమా యిల్లాలినోయీ...
'ఏలనే నవ్వంట,' 'ఏడుపేలేయంట
పదిమంది ఆయింట పగలబడినారంట
ఉత్తమాయిల్లాలినోయీ...
సాటునుండే యెంకి - నబకు రాజేశావ ?
పదిమంది నోళ్ళల్లో పడమంటరాశావ...?

[వెడుతుంది, బావ మొహాన్ని చేతుల్లో దాచుకుని కూర్చుంటాడు. నలుగురూ, మెల్లిగా వెడతారు. బావలేస్తాడు.]

బావ : నేనుండలేను తాతా—నేనూ యెంకితోటే పోతా. అదిలేకుంటే సచ్చిపోతా...(పెద్దెయ్య కామయ్య ముక్కుమీద వేలేసుగుని నిర్ఘాంతపోయి చూస్తుంటారు, బావ వెడతాడు)

పెద్ద : పీడ విరగడైంది.

కామ : మనమూ విరగడౌదాం,పద...(వెడతారు) (కాసేపు నిశ్శబ్దం...చంద్రన్న అటూ యిటూ చూస్తూ మళ్ళావొచ్చి మంచాలు, కుండలూ సర్ది, అమురుస్తూంటాడు ? శేషు ప్రవేశిస్తాడు)

శేషు : ఏం చంద్రన్నా...జనమంతా మూగితే ఏమిటో చూద్దామనొచ్చా—ఏమయ్యారు ?

చంద్ర : ఇప్పుడే వెళ్ళారండి, పంచాయితీ జరిపి యెంకిని కూలొప్పించి ఎల్లగొట్టారు. ఎనకా తల ఏడుస్తూ నాయుడెళ్ళాడు, కుండా, సెంబూ మూటాముల్లూసరిది అందచేద్దామని యీడకొచ్చా...

శేషు : ఎందుకు వెళ్లగొట్టడం ?

చంద్ర : అదొక యిచిత్రం. యెంకి పెండ్లిచేసుకోకుండా, నాయుడుతోవుంటానంటుదండి.

శేషు : ఎందుకో...?

చంద్ర : సదువుకున్నవారు, మీకే తెలియాలి, పిచ్చను కుంటా...

శేషు : పిచ్చి యెంకికి కాదు. మన కవగూడదు? ఎటు పొయ్యాడు?

చంద్ర : యెంకి ముందెళ్ళిందండి...ఎనకాతల నాయుడు... అల్లదిగో,—ఏటికేసి పొయ్యారు...ఏంది నవ్వుతుండారు?

శేషు : ఏమీ లేదు చంద్రన్నా—యేడవటం ఈరోజుల్లో భలే కష్టం...నవ్వడం భలే సులువు...అందుకే...

చంద్ర : నాకు నవ్వుదామంటే రావడం లేదండి— (తనకి తనే చక్కిలిగింతలు పెట్టి చూసుగుంటాడు.) మీరెట్లా నవ్వుతుండారు?

శేషు : నువ్వింకా పిచ్చివాడివి కాలేదు చంద్రన్నా... అందుకనే నవ్వలేకపోతున్నావు. పిచ్చెత్తకండా వుండటంకోసమే నవ్వు. నీకు యెంకితో బాగా పరిచయం వుందిగదా—ఎందుకు పెండ్లి చేసుకోనంటుంది?

చంద్ర : పెండ్లి చేసుకుంటే ఆడితోనే పడుండాల. లేకుంటే సేచ్చగా వుండొచ్చు.

శేషు : నాయుణ్ణి ప్రేమిస్తుందిగా—ప్రేమకంటె స్వేచ్ఛ ముఖ్యమంటావా?

చంద్ర : బీదోళ్ళకేం ప్రేమలండి...బీదోళ్ళకేం స్వేచ్ఛలండి...అయ్యన్నీ సదువుకున్న పెద్దపెద్ద ఆసామీలకి.

శేషు : నీకింకా తెలీదు చంద్రన్నా. మాబోటి చదువుకున్న వాళ్ళకి ప్రేమంటో ఏమిటో తెలుసు - కాని, మీలాగ ప్రేమించుకోటం చేతగాదు.

చంద్ర : ఇంకా నయమండి. కడుపులో మాడతా వుంటే, పేమలు గీమలు ఎగురుతయ్యండి. ఏటవతల ఏముందండి వల్లకాడు. ఒక్క సిక్కి రేపటికో మాపిటికో పక్కా రారండి...!

శేషు : చూడు చంద్రన్నా వోసాయం చెయ్యి. ఏటవతల మా బావగారి భూముంది నీకు తెల్సుగా...అది నిజంగా మా అక్కది. మా అమ్మ రాసిచ్చిన రెండెకరాలు—అందులో దూళ్ళ పాక లున్నాయి. వాటిల్లో మకాం చెయ్యమని, వంట సామానూ కాసిని గింజలూ జేరేసి కాస్త కనుక్కుంటూ వుండు....ఏం?

చంద్ర : నేనూ అదే అనుకుంటూండానండి. ఊళ్ళోవాళ్ళకి తెలీకండా జరగాల. తెలిస్తే నన్ను సంపేస్తారు. నాకేం బెదురు లేదనుకోండి. నాకొక్కప మెచ్చిందంటే మనిసినే గాను—

శేషు : అల్లా వుండాలి. నేను రేపు పట్నం పోతున్నా. వాళ్ళెట్లా వుంటున్నదీ వో కార్డుముక్క రాసిపడేస్తుండు. అడ్రెసు రాసిస్తా...[వెడతాడు.]

[తెర]

## మూడవ రంగము

[ఏటవతల పొలంలో యెంకి పాక. చుట్టూ సర్వి చెట్లు. ముందు గడ్డివామి. చెట్లమధ్య కొమ్మలకి అమర్చిన ఉయ్యాలమీద యెంకి వూగుతూ పాడుకుంటుంది.

యీ రేతి రొక్క తెవు యే మెచ్చినావే
ఆడు నేనిక్కడే ఆడినామమ్మా.
యేటినురుగలకేసి యేటి సూశేవే?
మావోడి మనసట్టె మరుగుతాదమ్మా.
సెంద్రవొంకలో యేమిసిత్రమున్నాదె ?
వొంకపోగానె మావోడొస్తడమ్మా.
ఆడు నేనిక్కడే ఆడినామమ్మా
మావోడిమనసట్టె మరుగుతాదమ్మా
ఆవొంకపోగానె మావాడొస్తడమ్మా—

[వెనకాల నాయుడుబావొచ్చి కళ్ళు మూస్తాడు]

బావ : ఎవరు చెప్పుకో...

యెం : ఎవరా...ఎవరికోసరం మొగ్గ పువ్వవుద్దో, ఎవరికోసరం సందమామ గుండ్రంగా నవ్వుద్దో...? ఎవరికోసరం నచ్చత్రాలు మిసమిసలాడతయ్యో.

[చక్కిలిగింతలు పెడతాడు]

ఎవరికోసరం ఆవు పేడ వేసుద్దో...ఆడు.

[ఉయ్యాల దింపుతాడు. గడ్డివామి మొగలో ఆకుపచ్చరంగు చీర పరిచివుంటుంది]

ఏడకి పోయుంటివి నారాజా...?

బావ : వేటకి పోయింటినే రాణీ.

యెం : ఏడుసేపలు తెచ్చి ఎంజేస్తివా...?

బావ : ఏడుపుచ్చొంకాయలు కామయ్యగారి తోట్లోవి—

యెం : ఆకలి పుడుతుందా...? (లాలిస్తూ)

బావ : నీకు లేదంటే—నూడు సిక్కిపోతుండా — తిల్లుకుంటే దిగులేస్తావుంది.

యెం : దిగులెందుకు బావా. నాకు నువ్వు, నీకు నేను. మానిద్దరికి నక్షత్రాలు, చందమామ, ఆకాశం—గడ్డిపూలూ నూత్తివా. —(కోస్తుంది) జంటపూలు. ఇది యెంకి, యిది బావ. ఒంటిగా వుండాయి సుకంగా. మంచు పీల్చుకుని సల్లంగుండాయి. అయ్యో, యంచక్కా మాట్లాడతాయనీ! కూతంత గాలి లెగిస్తే, మొగది వూగిసలాడి యాడికో ఎగిరిపోతనంటుంది. ఆడది, 'కూకోసా' అని కసిరి పండుకోపెడుద్ది. అంత సున్నితమైన ప్రాణానికి అంత మమకారం. అట్లుండాల మనం.

మద్దినాలకి మాడ్చునులే. కూరొండి పెడితా. కూకుని కథ సెప్పు.

బావ : యెంకి యిట్ట యెంతకాలం మనబతుకు...?

యెం : శెంగెందుకు మావా. మూన్నాళ్ళ ముచ్చట. పాపిష్టి మనుషుల్లో ఎందుకు...సరివిచెట్ల కంతల్లోంచి నక్షత్రాలు, నీ పెదవుల్లే ఎర్రంగా కౌగలించుగునే సంజె, జోకడతా అరుల పాలు, బుగ్గనలిపి లెగదీసే సలిగాలి, వుండంగా మనకేటి! ఆటికేసి నూత్తా కూకుండనీకండా రెప్పలోటి అడ్డమెట్టినాడు దేవుడు.

బావ : ఊరికే అంటినే. అట్ట దిగులుగా వుండావేం...?

యెం : శేతిరి వోకలొచ్చింది. అందులో నువ్వుండావు. ఎవళ్ళో బంగారు రెక్కల మనషులు యిమానం దిగి, నిన్నేదో అడుగుతారు. నా వూసెత్తారు కూడ. అదేవిటో సెప్పు..."యెంకి దేదో లోకము. ఏమో ... ఏమో ... ఏదో" అంటారు అళ్ళు. అదేటి...?

బావ : బాగుంది. నీకొచ్చిన కలలో ఆళ్ళేటన్నారో నే సెప్పాలా...? సిత్తరం. సరే యిను. ఆళ్ళు దేవుళ్ళు. ఎనక జన్మలో మనము ఎవరిమో ఆరికి తెలుసునంట. ఈ జన్మలో అమాదిరిగా నువ్వు లేవంట.

యెం : అంతా యెటకారం—పోమావా. ఎప్పుడూ మనిద్దరిదీ వొకే జన్మ. అవునా?

బావ : ముందు మనకే జన్మంటూ యెంకీ...?

యెం : (కళ్ళు పెద్దవిచేసి) ముందా...! ఇంక ముందేటి మావా? ఇదే యెనక. ఇదే ముందు.

బావ : ఎన్నాళ్ళో మన కోలె యీ సుకము ... ఎన్నాళ్ళో...!

యెం : ఎన్నాళ్ళ...? అంతేనా...ఎప్పుడూ కాదూ...? ఎప్పుడూ అను రాజా. అబ్బ అను. ఎన్నాళ్ళో ... (ఏడుస్తుంది వెర్రిగా)

బావ : (సమదాయిస్తూ) పోకల్లె వండుకున్నావా...? కనుబొమ్మ కరువుదీర నూడనీ యెంకి. ఇటు నూడు. నీ ముంగల కూకుంటె, అగ్గిముందు కూకొని సలికొానుకున్నట్టుంటుందెంకీ. (దిగులుగా నవ్వుతుంది)

అదుగో నూడు, సీతాయొత్తావుంది సింగారించుకుని. (యెంకి లేచి కూర్చుంటుంది.)

[సీతా యొస్తుంది. వొదులుగా జారిపోయిన కొప్పు. మెళ్ళో మధ్యమధ్య వూడిపోయిన నల్లపూసలతాడు చేతికి వొకటే ఎర్ర గాజు, పెద్ద బొట్టు, కాళ్ళకి అందెలు]

సీతా : ఎట్టగుండరు మావా...

బావ : సెర్లో సేపలల్లే, తుప్పప్పగా వుండాం. ఏంటి కథ...?

సీత : ఏంచెప్పనెంకీ. దాసయ్య పుట్టింటోరు రాచ్చసులు. ఆ డన్న పెండ్లా మొకర్తుంది. దానికోకొడుకు. అడు కరక్కాయ లాటాడు. నేను గదమాయిస్తే, ఆళ్ళమ్మతో, నన్ను గీకింది, సీరింది అని గొల్లుమని సెప్పేవాడు నేసుస్తాడు. ఆవిడగారు శోకన్నాలు. అయ్యగారితో సెప్పేతలికి, అడు, అత్త కలిసి, గంతులు. దాసయ్య పిరికోడు. అమ్మంటే బెదురు. అన్నంటే చెదురు. నన్ను రంపాన పెట్టి, కోసేస్తుండారంటే నమ్మొలె.

యెంకి : అసలు గొడవేంటి...?

సీత : మా బుడ్డాణ్ణి నూశావుగా. రేపవాపనకు రెండోయే డొస్తుంది. ఆడికి నలుసంత బంగారం—తాతగా రిచ్చింది—దాంతో మొలకి రెండు మువ్వలు సేయించా. దాసయ్య, అన్న గారితో జూదాలు మొదలెట్టాడుగా. ఆ మువ్వలు తెంచి, అన్న గారి కిచ్చినాడు. నా వొళ్ళుమండి, ఆళ్ళ కుర్రోడు లేడూ,—కరక్కాయగాడు. ఆడి వేలున వుంగరం వుంటే, అది పీకి దాసయ్య కిచ్చినాను. దాంతో లడాయిలు. నేను ఆ కొంపలో చణం వుండనన్నాను. దాసయ్యకూడా ఆళ్ళతో కలిసి, పోతే పో—అని, యిసిరి కొట్టాడు. ఇట్టగుంది యవ్వారం. సంటోడు ఏడుపు. ఇంటో ఆముదంబొట్టు లేదు. కూంతుండా మీ యింటికాడ?

బావ : మాకో యిల్లు. మా యింట్లో ఆముదం. భలే.

యెం : సీతాయి ఎర్రిబాగుల్ది. దాన్ని గేలిచెయ్యమాకమావా. ఎన్నెల రాత్రుళ్ళు. మాకు ఆముదం దీపాలొద్దులే. నువ్వు తీసీకెళ్లు. కాస్తంత ఆముదంవుంది డబ్బీలో.

సీతా : మరి మీకో...?

యెం : బావూసులు నీకు తెలుసుగా. సీకటి పడేతలికి, ఆరి పేయవే దీపము—సీకట్లో నూడాల నీ కళ్ళు తళతళలంటూ పదం లంకించుకుంటాడు. మావా, అల్లతోట్లోకెళ్ళి, సీతాయికి నాలుగు జొన్నకండెలు పీక్కురా. (వెడతాడు)

సీతా : యెంకీ—ఏమో ననుకుంటి. మీాపనే బాగుందే. హాయిగా పోరూ పొందూ లేకుండా. ఇంటికాడ పాణం యిసిగి మనస్సు సల్లంగుంటాదని యిటొచ్చా. నీకేం—నువ్వంటే బావకి సముద్రం అంత వలపు.

యెం : సంద్రం నువ్వు నూశ్తివా? ఏమాత్రం వుంటుందేం?

సీతా : మాతాత చూశాడు. మనకీ శూరుడికీ మద్దె నుంటుం దిట.

యెం : ఎర్రిపిల్లా సంద్రం ఏమంత పెద్దదనుకోమాకు. ఊళ్లోంచి ఎల్లగొడితే సంద్రం అంత కన్నీరు కార్చినానన్నారు. అమ్మలక్కలతో బావా సరసమాడితే, సంద్రం అంత కన్నీరు కార్చినానన్నారు. ఇంతేనా సంద్రం...? మనకూ సూరుడుకూ మధ్యనుండే కూసింతేనా—? నా నీతి, జాతి పోయి, మనసు సాగరమైందన్నారు. అంచూ దరీలేదు, అద్భుతం వుంటుందంటె, దేముడంతుంటాడో యేమొ, అనుకున్నాను. ఇంతేనంటే సంద్రం అంటె; ఎంతో అనుకున్నాను.

సీతా : ఇంటికాడ కన్నీరు కార్చడానికి తీరుబడుంటేగా. దాసయ్యకి గడ్డెట్టి బుద్ధి సెపుతాడేమో, పోనీ మా వని నాతో తీసికెళ్ళ...నా?

యెం : బావకి పెళ్ళీ పెటాకులూ లేదుగా. ఆడిమా టెవ రింటారు...?

సీతా : బావని తీసికెడితే, ఆడు దాసయ్యని యీడకి తీసుకొస్తాడు. నువ్వు బుద్ధి సెపుతువుగాని.

యెం : నేనా...? అయ్యోరాతా...? నే నంటే, వూళ్లోంచి వెళ్ళగొట్టిన మీవూళ్ళోళ్ళవోళ్ళకిగురా ఇంకా న యం!

సీతా . లేదెంకీ. ఊళ్ళోళ్ళవోళ్ళందరికీ నీవూసే. నువ్వు సాల కుదురైనదానివట. ఎవళ్ళైనా సెడుపన్లుసేస్తే, యెంకినిసూసి బుద్ధి నేరుసుకోరాదా...అనడందాక వొచ్చింది.

యెం : అవుతే, వూరికాపదొచ్చిందన్నమాటె! నేను బాగై నంటుండారా ! ఏంది బాగు? సెడంటే ఏంది...? మనుషులమీద కనికారముంటె సెడూ లేదు...బాగూ లేదు. అది లేకుంటే నే యియ్యన్నీ. బాగుంటె కలిసుంటం వుండదు. మనసులు కలిస్తేనే బాగుంటం సీతీ.

సీతా : నీ కియ్యన్నీ యెట్ల తెలుసునెంకీ...?

యెం : ఎనక జన్మంలో నేర్చుకున్నా!—ఎర్రిపిల్లా, తెలిసే టందు కేముందీ? మనసు బాగుండాల, ఆకాశంలా నిర్మలంగా. (నాయుడు జొన్న కండెలు తీసుకొస్తాడు)

బావ మనసు సూడు. అద్దంలాగుంటుంది. అప్పుడప్పుడు కన్నె పడుచుని సూసేతలికి గుబులు పుడుతుందనుకో. అది కూసేపే.

బావ : సీతాయి ముంగలేండా మాటలు? అట్లగంటె, నాకేసి చూసుద్దీ? నాతో మాటాడుద్దీ?

యెం : నీమీద నేరాలు సెప్పేటందుకు నా కింక ఎవ రున్నారు. నేరాలు సెప్పకపోతే, నువ్వు నిజంగా మంచోణ్ణనుకుని దేవుడైపోతావు. నే నిట్లాగే మనిషిలా గుండిపోతాను. అప్పుడు కూడ యవ్వారం బెసికిపోతుంది. మరీ అంత దేముళ్ళాగై పోకూడదు. గుండికాయ కొట్టుకోవాల. మనస్సు మాత్రం మెదలకుండా వుండాలి.

బావ : ఏందో నీదో సోది.

యెం : నే సోది సెప్పేదా? (కూర్చుని అభినయిస్తూ) యిటు సూడు యిటుసూడు. అటు నల్లంగ రెండు కళ్ళు నీకేసి సూత్తున్నాయి. నీమీద ఆమెనీడ పడ్డాది. అదిగో—ఆ జుట్టు యిర బోతలో నీ కూపిరాడటం లేదు. వల్లో సిక్కుకుంటావు. కాని, భయంలేదులే రాజా. ఆడ యేటవతల నీ యిల్లా లుండాది. నీ మనస్సు పదిలపడతాది.

బావ : ఎళ్ళు నీ యెటకారం...నువ్వూను.

యెం : ఇదిగో సీతాయితో యెళ్ళి, దాసయ్యని తీసుకురా. నాలుగు సివాట్లు పెడుదువుగాని.

సీతాయితో భద్రంగా ఎల్లిరా.

బావ : బద్రంగా అనడం దేనికి ?

యెం : ఊరికే అంటిని రాజా...

సీతా : రా మావా.

యెం : ఇవిగో పాత్తిలు. మీ పొత్తులుకూడ యీ పొత్తులికి మల్లె వుండాల. సంటాణ్ణి సూసుకొని దేవుడికి మొక్కుకో. (వెడతారు)

[యెంకి చిరుగులు పోగుచేసి, మండించి, వంటయత్నం చేస్తూవుంటుంది. చంద్రన్న ప్రవేశం]

చంద్ర : యీగో గుడ్లు. నాయుడేడీ...?

యెం : గుడ్లెందుకి తెస్తివ సంద్రన్నా. లోపలున్న లేత ప్రాణం, నీళ్ళల్లో అలలమాదిరి కొట్టుకుంటుందే. దాన్ని సంపె య్యడమే !

చంద్ర : యీయాళ కూరగాయలు దొరకలా. సేపలు కావా లంటే పట్టి తెస్తాను.

యెం : నీ కింత కనికార మెందుకు సెంద్రన్నా...?

చంద్ర : నువ్వు తిండి తినకుండా, బక్కసిక్కి, సెర్మం ఎనక బొమికలు కనవడ్తావుంటే నా కెట్టగో వుంటాది.

యెం : ఊళ్ళో యింకా బోలెడు మందుండారు, కూడూ గుడ్డా లేకుండా. అళ్ళని సూస్తే నీకెట్టగో వుంటుందా...?

చంద్ర : ఉంటుందనుకో. ఆ యిసయం వేరు.

యెం : ఏంటి తేడా, కూంత సెబుదూ.

చంద్ర : ఎట్ట సెప్పేది, అదోకలాగు నుంటాది.

యెం : నువ్వు పెళ్ళెందుకు సేసుకోవ్ సెంద్రన్నా...?

చంద్ర : పెళ్లా...? పెళ్లి. నువ్వెందుకు సేసుకోలేదు...?

యెం : నే సేసుకున్నా గా బావని.

చంద్ర : బావకున్న తెగింపు నాకు లేదెంకీ. అణ్ణికూడా ఎలేసి ఎళ్ళగొట్టినారు. ముసిలోడికోసం యెంకి నొదులుకుంటానా అనేతలికి, ఆడి తాత గుటుక్కున పాణం వొగ్గేశాడు.

యెం : పాపం. మనసొంత యవ్వారం కుదురుగా వుంటేనే, అళ్ళనీ—యీళ్ళనీ ఆదుకునేది. యెంకీ వుండాల, తాతా వుండా లంటే కుదర్దు. అవ్వా—బువ్వా—రెండు జరగవు.

చంద్ర : నువ్వే బువ్వవి.

యెం : నేను బువ్వెంటే ముసిలవ్వను. నువ్వుకూడా వో అవ్వని తెచ్చుకో. యీడే కాపరంవుండి, సేపల పులుసొండి పెడు దువు గాని.

చంద్ర : నాకు అవ్వేడ దొరుకుద్ది. నాయుడంటే, ఆడి చేతులో అయిదువేళ్ళకీ అయిదు చక్రాలుండాయి.

యెం : సూడు సంద్రన్నా. అయిదు చక్రాలుండ మొగాణ్ణి చేసుకో మాకే.

చంద్ర : వూళ్ళోళ్ళవోళ్ళు యింతకాలం నన్ను మొగా డంటుండారుగా.

యెం : అవును. ఏదో ఆలోచిస్తూ మరిసిపొయ్యాను. యీ గుడ్లేడవి...? దొంగిలిస్తివా...?

చంద్ర : యీ గుడ్లు...

[కామయ్య వస్తాడు]

కామ : ఏమిటి చంద్రన్నా గుడ్లంటున్నా...?

చంద్ర : (గుటకలేస్తూ) గుడ్లు—ఎలకలు సూర్లో గుడ్లెడు తుండాయి. తీపించి పెట్టమంటే.

యెం : ఒట్టిది కామయ్యగారూ, నాకోసం ఎక్కడినుంచో కోడిగుడ్లు తీసుకొచ్చాడు.

చంద్ర: నే నట్లా గల్లి గడ్డి కడతానండి. (వెడతాడు)

కామ: ఇంక్కడివి. వీరయ్యగారి కోళ్ళవి. ఇదంతా నే నేదో ఏర్పాటు చేస్తున్నానని, వూళ్ళోవాళ్ళంతా నన్ను మాట్లంటున్నారు. చంద్రన్న మాపాలేరా....—వాడిద్వారా మీ కన్నీ సప్లయిలుచేసి, రాణీ వైభోగం జరిపిస్తున్నానుట. నాలుగు రోజులుపోతే, ఆఖరికి నామీదే పంచాయితీ చేసేటట్లున్నారు.

యెంకి: మీరేం జేసినారు...?

కామ: ఇంకా ఏంచెయ్యాలి.? ఈ పొలం, పాకాయిచ్చి, యిందులో వుండనివ్వడమే—నే చేసిన అపరాధం.

యెం : మీ సొంత పొలమేగా, వూళ్ళోవోళ్ళకి గులు కెందుకు...?

కామ : సరిసరి. ఇంకా నయం. రెడ్డి సత్తెయ్యపొలం యిది.

యెం : మీ ఆవిడగారిదంట. సెంద్రన్న సెప్పాడు.

కామ : వాడిమొహం, వాడికేం తెలుసు. అమధ్య గిరాకీలో సత్తెయ్య కొనుక్కున్నాడుగా. మీ రిక్కడుంటానికి వీల్లేదు. నాలుగు రోజుల్లో యిక్కడనుంచి బిచాణా ఎత్తెయ్యాలి. లేకపోతే చర్యతీసుకుంటాను—అని యీ సంతంతా నా నెత్తిన పెట్టాడు, సత్తెయ్య.

యెం : దీనికి బెంగెందుకు బాబూ. సత్తెయ్య పొలం కాకుంటే, కామయ్యగారి పొలంలోకి పోతాం హాయిగా. మీరుండగా మాకేటి కొదవ.

కామ : అవుననుకో. మన పొలంలో కలుపు తీస్తున్నారుగా.

యెం : నేనూ కలుపు తీస్తాను. కలుపంటే పలవులాంటిది. నా కెప్డె సరదా నాకు.

కామ: సర్దా లకేం. ముందు యిక్కడనుంచి మకాం ఎత్తేసి మరోచోటికి వెళ్ళడం వుత్తమం.

యెం : మీ లోగిల్లోకి రానిస్తారా...?

కామ : మా ఆవిడ సంగతి నువ్వెరగవు. ఇహ నీకు ఆక లంటూ వెయ్యదు. నన్నే కూరొండి పెడుతుంది.

యెంకి: (విరగబడి నవ్వి) కారం కారంగా వుంటారు కరణంగారు. మా స్త్రీరా మా సీతాయి అబద్దాలాడటం నేర్పింది. ఊళ్ళోవాళ్ళకి నేనంటే గురి కుదిరిందీ—సీతమ్మ గోరిని చెప్పి గున్నట్లు నన్ను వేనోళ్ళ మెచ్చుగుంటున్నారంది.

కామ: మొగాళ్ళ విషయంలో అది కొంతవరకూ నిజమే. ఆడాళ్ళు మాత్రం కత్తులు నూరుతున్నారు. రెడ్డి సత్తెయ్య భార్య పట్టే యెక్కువగా వుంది.

యెం : నాకు తెల్సులెండి. ఆడోళ్లందరూ, ఆళ్ల మొగుళ్లని జాగ్రత్త పెట్టుకుంటుండారు. ఇక్కడనుంచి కదలకుండా వుంటే ఏం జేస్తారేంటి...?

కామ : అల్లా పట్టుదల కెడితే ప్రమాదిస్తుంది. మంచిమాట చేసుకుంటే నే, ఏమన్నా ఉపయోగం.

యెం : మీరు చెప్పే సలహా యేంది...?

కామ : ఏముందీ—నీకు తెలీకండా వుంటుందీ యీపాటికి! మాట, మంచీ, కాస్త కులాసా...ఏది...?

యెం : దిలాసా కబుర్లు సెబుతున్నారే కామందులు.!

కామ : నువ్వెరుగుదువుగా. మొదట్నుంచీ నువ్వంటే నాకు చాలా...ఏది...?

యెం : ...యిది. (నవ్వుతుంది)

కామ : ఆఁ. అవునా మరి. సత్తెయ్య పొలం వ్యవహారం పరిష్కారం చెయ్యడం మన చేతిలోపనేగా.

యెం : ఓహో. యిప్పుడు తెల్సిందిలెండి—మీ రైలు. ఈ పొళ్ళు యీపొద్దుండి—రేపు సుసవుద్ది. దీని నప్పగించేసి, కుళ్ళిపోయిన మనసులికి కులాసా కలిగిస్తే, యీ వొంటినీడ కుళ్ళనిస్తారు. కానివ్వండి. వున్న మేనా దక్కుద్ది. ఆడదానికిచ్చేదాని కంతకంటే ఏముంది...? నా కిష్టమే కరణంగారూ. మీ ఆవిడితో యీ సంగతి చెప్పేసి వొప్పిస్తిరా, నా కబ్బెంతరం లేదు.

కామ : ఇంకా నయం. మా ఆవిడకెందుకు తెలియాలి...? నేను బతికుండటం నీ కిష్టంలేదా...?

యెం : నేను బతకడం మీ కిష్టముండే అంటున్నారా యీ మాటలు. మా బావిసయం తలిశారా?

కామ : బావని సంతలోకి పంపుదాం.

యెం : పెద్దమనిసులకిది సమ్మతమేనా...? మొగాళ్ళకి నేనంటే గురి కుదిరిందంటుండారుగా. పెద్దయ్య తాతతో చెపుదాం. ఆరితో యెంకి సరసాలాడితే, కరణంగోరు పొలంలో వుండనిస్తామన్నారని చెబుతా. ఆరిష్టపడితే సరి.

కామ : సరిసరి—నీదంతా ఆటగావుంది.

యెం : యెట్టగండీ మరి. మనం సేసేపని — ఆడోళ్లకేనా నచ్చాలి. మొగోళ్లకేనా నచ్చాలి.

కామ : మొండి వాదనకి దిగావంటే, మర్యాదగా వుండదు.

యెం : మర్యాదోస్తులకి మర్యాదగా వుండదు. మీరుకాదు నేనుకాను. మనకి మర్యాద లెందుకు...?

కామ : ఛీ నోర్ముయ్—ఎందుకని వూరుకుంటుంటే... తక్షణం యిక్కడనుంచి బిచాణా ఎత్తెయ్యి.

యెం : ఓ—లచ్చణం వూళ్ళోకెళ్ళి, మీరు సెప్పిందంతా చెప్పేస్తా....—వెడతా.

కామ : ఇదుగో—ఆగు. ఇచిక్కడి కర్మ!—నిజమను కున్నావేం. నిన్ను పరీక్షచేద్దామని అల్లా అన్నాను.

యెం : అబద్దాల బతుకుల కలవోళ్లైన వోరికి సత్తెం బహు దూరం లెగండి, బాబుగోరూ. నామాటెవళ్ళూ నమ్మరు. అంచేత, మీరు బెదిరి బయపడిపోమాకండి. వూళ్ళో కెళ్తుండా. అందాక సాయంగా రండి.

కామ : చెబుతావా. చెబితే చెప్పనో. భయమనుకున్నావా? ...? ఊరంతకీ పెద్దని. నామాట చెల్లుతుందిగాని, నీమాట చెల్లదు. వెళ్లు...వెళ్లు. (చంద్రన్న వస్తాడు)

చంద్ర : ఆగండి ఎల్లటం...?

యెం: వెళ్లటంకాదు సెంద్రన్నా. వేళ్ళు (చేతివేళ్ళు చూపించి) కరణంగారి చేతివేళ్ళు ఎంచక్కుండాయో అంటుండా. వలికి వొంకరైనా యంటుండారు.

కామ: చంద్రన్నా—ఇహ నువ్వు యీ పొలంకేసొస్తివా, మక్కలిరగదంతా. కలుపుకి పద. జనం అంతా యేరీ. మీ పని వాళ్లకి కొవ్వెక్కిందిరా. కదలవేం.

[పొగాలో కట్టుకొచ్చిన కూరగాయలు, జొన్నపొత్తులు, చెట్టువెనక పడేసి, పరిగెడతాడు చంద్రన్న. వెనకాల కామయ్య కూడా చరచరా నడుస్తాడు. యెంకి ఆకులతో విస్తళ్ళు కుడు తూంటుంది. ఒకటి రెండు నిమిషాల్లో దాసయ్య వొస్తాడు.]

యెం: ఏం దాసయ్యా, సీతాయిని పువ్వుల్లోపెట్టి, పూజి స్తున్నావంటగా.

దాస: నీకేటి తెలుసెంకీ. సీతాయి వెంకి ఘటం, నీకు మల్లేగాదు.

యెం: నాకంటె వెంకి ఘటం పది పరగణాల్లో వుండదని బావంటాడు.

దాస: బావేడీ...?

యెం: సీతా యొచ్చి తీసికెళ్ళింది. నేనే పంపా. దాన్ని మీ పుట్టింటోరు రా పాడేస్తుండారంట. నాగూడ ఆళ్లల్లోకలిసి తైతక్కలాడుతుండావంట. ఇక్కడికి తీసుకొస్తా, బుద్ధి సెపుదువు గాని—అని, నీకోసరం వెళ్లారు ఆ రిద్దరు.

దాస: నాకు మతి సెడిందోలె. ఇంటికాడుండబట్టదు. సీతాయంటె సీదర. అట్టట్ట పిచ్చోడికి మల్లె తిరుగుతూండా. ఏటి గట్టంట వొస్తుంటే, అందులోపడి, పాణం కారీమని కొడిలేద్దా మనుకుండ.

యెం: భలేవాడివే. పెళ్లి సేసుకుని మూడేళ్లవలేదు. పిల్లోణ్ణి పుట్టిస్తివి సంబడం పాలక. ఇప్పుడేమో ఏట్లోపడి హాయిగా సత్తా నంటావా. మంచోడివే.

దాస: మరేటి సెయ్యను సెప్పు...!

యెం: తిరకాసేంది...?

దాస: ఇంటికాడ సీతాయి తగువులు.

యెం: సీతాయి నువ్వూపోయి వేరేవుండండి. నాకు—నాలుగుగోజులుపాటు, సీతాయికి దూరంగా వుండేటందుకు అట్టట్ట తిరిగిరా. ఎప్పుడూ వొకేసోటుంటే సిరాకులు, తట్టుగాలి. పుట్టు కొస్తయ్యి.

దాస: నువ్వూ—నాయుడూ సిలకా గోరింకలల్లె వుండే టంలా...?

యెం: నేనూ నాయుడూ పెళ్లిసేసుకోలా. మరి మొగుడనం గానే, సొంతోడైపోతాడు. నూడు యీసీర నాసొంతం. దీన్ని కట్టేసి, మాపేసి, సింపేత్తుండా. మొగుడూ అంతే. పెండ్లి కానంత కాలం పిల్ల పరాయిది. పువ్వల్లె కాసేపు వాసన సూసుకుంటం. ఆమీద నూత్తూ కూకుంటం. సాయంత్రానికి పువ్వు వాడిపోద్ది.

దాసు: పోనీ, యెంకీ నేనూ సీతాయి వొచ్చేని మీతో బాటే యీడు ఉడిపోమూ...?

యెం: మా లాగుల్లె వుండండి. కాని, దాసయ్యా నీకు తెల్దు. సారుగోళ్ల తంచనుంటే మడత పేచీలొస్తయ్యి. వూళ్లో వోళ్లని నూడు, ఎంతుకో కందుకు కొట్టుకు సత్తావుంటారు. వొంటిగా, మడంగా వుంటేనే పాణానికి సుఖం. కోపమా...?

దాస: కోపమెందుకు? మనలో మనకేం పేచీలొస్తయ్యి?

యెం: ఎందుకురావు? బావ సీతాయిని,పరాచిక మాడతాడు. నువ్వు సీకట్లో—అమాస సీకట్లోలే—నాకేసి కన్ను మెదుపుతా. మనుసుల బుద్ధులు మంచివికావు దాసయ్యా. ఉండదానితో పూరటుంటం సేతకాదు. కొత్త కొత్త మజాలు, మోజులు కావా లంటారు. వొయసం చిక్కిందా వొదులుకోరు—పాకీ కరెయ్య అంతే, కరణం కామయ్య అంతే—

దాస: ఏం మాటలు యెంకీ—అట్లాంటి వోణ్ణికాను నేను.

యెం: చూస్తివా అప్పుడే మొహం ముడుసుకున్నావు. నేనూ అట్లాంటిదాన్ని కాను. పట్టుబడనంత కాలం, దొంగ, దొరే. నామాటిని సీతాయి దగ్గరకెళ్లు. కులుకు నూపెట్టు. కాళ్లట్టుగో—నూడకుంటె సచ్చిపోతానని బతిమలాడు. బంకల్లే నిన్ను పట్టుగు నిడిసిపెట్టదు.

దాస. సరే, పోతా—పైన భగమంతుడుండాడు.

యెం: రెండు పొత్తులు తీసికెళ్లు. సంద్రన్న మాకోసరం తెచ్చినాడు.ఒకటి సీతాయికి, ఒకటి నీకు. ఆ, మరిసా—మూడోది, పాపాయికి—

[దాసయ్య తీసుకుని నవ్వుకుంటూ వెడతాడు—యెంకి ఉయ్యాల ఊగతుండగా, తెరమెల్లగాజారి, వెంటనే మెల్లగా లేవాలి. యెంకి ఉయ్యాల వూగుతూనే వుంటుంది— —పాడు తుంది]

ఆనాటి నావోడు సెందురూడా
అలిగి రాలేదోయి సెందెరూడా!

యెంకి మనమిద్దరమె
యెవ్వ రొద్దన్నాడు
యీ నేలు యీతోట
లింక నీవన్నాడు.

మాటాడుతుండంగ సెందురూడా
మంచిదా పోయేవు సెందురూడా!

"కలకాల మీ దినమె
నిలుసు మన"కన్నాడు
"గాలికైనా" తాను
"కవుగిలీ న"న్నాడు

నను సూసి నవ్వేవు సెందురూడా
నాయమా నాముద్దు సెందురూడా...!

[వెనకాలె బావొచ్చి 'భోరియ్' మని దడిపిస్తాడు.]

[యెంకి పాడుతునే వుంటుంది]

మాటాడుతుంటంగ దయ్యామా
మాయమై బాయ్ మనేవు దయ్యామా...

బావ: సంతోషించినాంలే, దిగు. (దింపుతాడు) ఇదుగో సూడు—ఇహనుండి మనం బిక్కు బిక్కుమంటూ యీడుండం తెల్సిందా. సీతా యొత్తుండాది.

యెం: అదేంది?

బావ: సీతాయి, దాసయ్య — యిద్దరూ మనింటికాడే మకాం. నీకు పోద్దోద్దా—నాను—నానా? దరిజాగా బస్తీకిపోయి పనిలో సేరుకుని బోలెడంత డబ్బు దసకం మూటకట్టితెచ్చి నీముంగల పడేస్తా. అంతా సైసైపోయింది.

యెం: ఏందీ యాసం మావా—సిమెత్తిందా? ఆళ్లకి వూళ్లో కుదరకపోతే, వేరే, మరో పొలంలో పాకేసుగుంటారు. మనింటి కాడే ఎందుకు? దాసయ్యతో కూడా అట్లాగనే అంటిని. నువ్వు బస్తీలకి పోవడం ఎందుకు? డబ్బు దసకం కావాలని నీతో మొరెట్టుగుంటినా?

బావ: యీడేంది—దిగులుగా లింగు లింగుమంటూ నాకు పొద్దోటంలేదు. గొప్పోళ్లల్లో మసలాల. పనిసెయ్యాల, డబ్బు సంపాదించాల—కీర్తి సంపాదించుకోవాల.

యెం: అగ్గొ మావా—నీకీ వోటిపైసా బుద్దులెట్టి గొచ్చిరై!...నాకోసరం తోటంత రాజల్లె తవ్వీపోసేనంటివి నే కాపడకుంటె జొన్నసేలో సిత్తరమై పోతాదంటివి. 'సూడ రెండేకళ్ళు నాయెంకి' అంటపదాలు పాడితివి—'వొయికుంత మె నీతో వొరుగుతాద'ని సింగులు తొక్కితివే—ఇట్టైతివా మావా...!

బావ: ఎప్పడూ యిట్టనేవుంటే యిసుగుపుట్టదంటే నీకు మాత్రం?

యెం: యిసుగా!—ఎన్నెట్లో నూనిద్దరోతుంటే, నీకాసి సూత్తూకూకుంటే తెల్లారిపోద్దని నాకు దిగులు. మట్టిలో యిత్తనం పెడితే, మొక్కవటం సూత్తానికిసుగా?— సూరు డెర్రగా కరిగిపోయి, సీకట్లు తరుముకొత్తావుంటే సూత్తానికే సిగ్గేత్తుంటే?— యిసుగా మావా యీబతుక్కి!...యారు నేరిపినారు నీకీ సాకులు?

బావ: సీతాయి సెప్పిందోలె, భలే పిల్ల. తోవలో హుషారైన వూసులాడింది. కొంగు కొంగు ముడెట్టుగుని, ఏటిలో తానమాడదాం రమ్మందోలె. దాని కళ్ళల్లో సూసేతలికి నాకు మతోయిందో లెంకి. నూతులో సూసినట్లు. ఎదురుగా లోతుగా నల్లగా—ఎట్టగుండదీ...

యెం: అద్దా కత, సీతాయితో కులుకులాట్లా!...సీతాయి మంచిపిల్ల—సల్లంగా సూడు. దాన్ని నవ్వించి, నువ్వు నవ్వుకో...

బావ: యీడే వుంచుగుంటాను నీకిష్టమేగా?

యెం: నీకిష్టమైతే నాకూ యిష్టమె నారాజా...

బావ: సీతాయి నామీద కన్నేస్తే నీకు కోపంలేదూ? నే నిట్లానె పోతం నీకొప్పందమే...?

యెం: మనిషి సుట్టూ గీతలుగీసి ఆటిల్లో మసలమండం నాసేతకాదు. గదమాయించి తెచ్చుకున్న మంచితనం నాకెందుకు? మావా, ఎవరుసెప్పారని గూటిలోపక్షీ కిలకిల్లాడుద్ది?

బావ: నే నెట్లాగుంటేడీ నీ కక్కర్లేకపోతే నాదోవనే సూసుకుంటా—నాకీడ పొద్దోడంలేదు.

యెం: నీయిష్టం రాజా. నీకు మనుషులు కావాలిగాని మనసులెందుకు...?

బావ: కోపమొచ్చినప్పుడే నీయందం యెంకీ—వూరికే నంటిని, ఏమంటావో సూద్దామని. నూ సెక్కు సెదర్లా. నా గుండె సెరువైంది. నువ్వు సిత్రమైందాని వెంకీ. సీతాయి, దాసు, పేచీ లేకుండా వుంటామని వొట్టేసినారు. నీకు నొప్పి కలిగించినందుకు సెంపలేసుగోనా...?

యెం: తప్పు రాజా...మనసుండబెట్టుగోవాలి—మనం పది కాలాలు మసలాలంటె.

బావ: గొంగళీపట్టుకు యాతా. కాడికి పోదామా...? ఉండు దీపం తెచ్చేదా...

యెం: నీ మొహమంత సందమామముంటె, గుడ్డిదీపమొకటా... అటుసూడు—ఎవరో వొస్తుండారు..

బావ: మాంచి వుశార్లోవుంటే యీ మనుషులేంది గాడిద మాయల్లే!

[పెద్దయ్య తాత, ఫిలిం డైరెక్టర్ దివాకర్, వొస్తారు... పంచికట్టు లాల్చి, కండువా, కళ్లజోడు, దివాకర్ వేషం. చేతిలో సిగరెట్ టిన్, అగ్గిపెట్టె]

పెద్ద: (గొంతు సవరించుకుని) చూడు నాయుడూ—ఆ చాపిట్లాగెయ్యి—వీరు సినిమాలు తీసేకామందులు. డైరెక్టర్ గారు, యీడండి, నాయుడు—

బావ: దణ్ణాలండి. ఇట్ల కూకోండి. (చాపేస్తాడు)

దివా: ఫరవాలేదు. యిల్లా కూర్చుంటాను. (బండమీద కూర్చుంటాడు) అప్పుడప్పుడు యీ పల్లెటూళ్లకేసొస్తే ప్రాణం హాయిగా వుంటుంది.

[సిగరెట్టు ముట్టిస్తాడు. డబ్బా నాయుడికిస్తాడు]

పెద్ద: ఆ డింకొ సిగరెట్లు, బీడీలు తాగడం మొదలెట్టలేదు లెండి. నేనోటి తాగేదా?...(తీసుకుని ముట్టిస్తాడు) యెంకీ యిటు రాయే డైరెట్టురు గారొచ్చారు.

దివా: డైరెక్టరంటే—నే నింకా డైరెక్టర్ని కాను. ప్రస్తుతం మధుకరంగారికి అసిస్టెంటుగా వుంటున్నాను—తెలుసుగా మధూ ఫిలింస్ వారి చిత్రాలు—'చిన్నల్లుడు' 'ఆస్పత్రి' 'లేడీలాయర్'—మొదలైనవి చూసేవుంటారు.

పెద్ద: మాకు సినిమాలకేడ తీరుతుందండి. ఎప్పుడేనా సంతకి పోయుంటే, పొద్దోక ఆ డేరా సినిమాలో కాసేపు కూకుంటం. నాయుడు అప్పుడప్పుడు సూత్తుంటాడు లెండి.

బావ: సూసుంటిని. నాకు సినిమాలంటె భలేసర్దా మా యెంకిని తీసుకెళ్లాం ఎప్పుడైనా...

దివా: ఆవిడ సినిమానే చూళ్లేదా?

బావ: మా యెంకి భామ కలాపం. గొల్లసుద్దులు. తోలు బొమ్మలు సర్దాగా చూసుద్ది.

దివా: తోలుబొమ్మలుకూడా వొరకంగా సినిమాల్లాంటివే. కొంచెం లైటింగు పద్ధతులూ అవీ ప్రిమిటివ్ గా వుంటయ్యి. మా

చిత్రాలని గురించి వినేవుంటారు. చిత్రాల మాటల్లావున్నా, మేం కొన్ని ఆదర్శాలతో యిందులోకి దిగాం. ఇప్పుడు, సినిమాలు చాలా డబ్బు తగలేస్తున్నాయనీ, అందులో పనిచేసేవాళ్లకి పెద్ద పెద్ద వేతనాలనీ, వొక విమర్శవుంది. ఈ విమర్శకి సమాధానంగా చిత్రాలు తీస్తున్నాం. అంటె, ఎవ్వరికీ ఎక్కువ వేతనాలుండవు. కొద్ది ఖర్చుతో ఫిలిం పూర్తిచెయ్యడం, ఇందులో పనిచేసేవారి కందరికీ యించుమించు సమానమైన వేతనాలుంటాయి. తారలకీ, సంగీత దర్శకుడికీ, రచయితకీ టెక్నీషియన్‌కీ—స్వల్ప వ్యత్యాసాలున్నా సమంగా యివ్వాలని సంకల్పం.

పెద్ద: అంతేనండి, అట్లాగే వుండాలండి. మాట్లాడవేం యెంకీ—ఏదీ? లోపలుందా?

బావ: చిరుగులు లేవడానికట్లా ఎల్లిందేమో...రా యెంకీ— (దూరంగా 'వొస్తుండా' అని కేకేస్తుంది) నేయింటాలె సెప్పండి.

పెద్ద: నీకే టర్థమవుతుంది. ఏది తెల్సిందో సెప్పు.

బావ: అంత మతిలేనోణ్ణనుకో మాకు తాతా...

దివా: ఈ రోజుల్లో సినిమా వ్యవహారాలు, వార్తలు, తెలిసినంత సులువుగా, రాజకీయాలు కూడా తెలియవు.

పెద్ద: బాగా చెప్పారు.

దివా: ఇప్పుడు, రచయిత విషయం తీసుకోండి. నన్నడిగితే, సినిమా మీడియమ్ తెలిసున్న రచయిత, మనదేశంలో లేడంటాను. ఇతరత్రా పేరుపడ్డ రచయితని పేరుకోసం వేసుకోడం, డైరెక్టర్లే రాసుకోడం జరుగుతోంది—స్టేజి నాటకాల్లో పేరుపడ్డయాక్టర్లని, పబ్లిసిటీకోసం, సినిమాలో కెక్కించినట్లు — సీ...! (నవ్వుతాడు)

బావ: అదేలెండి. కరణంగారి పేరుమీద పాలేరు గదమాయించినట్లు.

దివా: రైట్ యూ ఆర్—అంతే...కరణంగారంటే జ్ఞప్తికొచ్చింది. ఇప్పుడు మేం తలపెట్టిన జనపదచిత్రానికి, సంభాషణలు, పాటలూ వ్రాయడానికి, మీవూరు కరణం కామయ్యగారి...

బావ: ఏంది, మా కరణంగారే—

పెద్ద: వినెహే—ఊ తొందర...

దివా: కరణంగారుకారు. ఆయన బావమరిది శేషగిరిరావు లేడూ, అతన్ని తీసుకుంటున్నాం.

పెద్ద: శేషుగారు, వూళ్లోనే వుండారు. అర్నికూడా పిల్సుకురమ్మని, సంద్రన్నతో కబురంపినా, వొస్తూంటారు.

బావ: అర్ని మే మెరగం...ఏం యెంకీ — కరణంగారి బావగారంట—శేషుగారంట సువ్వెరుగుదువా?

యెం: (వొచ్చి దూరంగా చాపమీద కూర్చుంటుంది) సెంద్రన్న సెప్పటం యిన్నా. అరు ప్లీడరీ వృత్తంటగా...

దివా: ప్రాక్టీస్ పెట్టాడు కొత్తగా. కాని, యీ రోజుల్లో ప్లీడర్లు, మాస్టర్లు, ఆఖరికి డాక్టర్లుకూడా ఎప్పుడో కప్పుడు, సినిమాల్లోకి రావడం తప్పదు. ఫర్ దనోతింగ్...గ్లామర్, సెకండ్లీ—మనీ...ఫైనల్లీ—ఫేమ్...సీ? (నవ్వుకుంటాడు)

పెద్ద: నాకు సెప్పండి అదేంటో, మేమూ నవ్వుతాం.

దివా: అది బాగుంది. (ఇంకా నవ్వుతాడు) విప్పి చెప్పడం వరకూ వొస్తే ఎల్లా...అందుకనే సామాన్యప్రజలకు రక్తికట్టే జనపదచిత్రాలో అని ప్రజమెరెట్టుగుంటారు. క్లాస్ పిక్చర్స్ మనదేశానికి సరిపడవు. ఇంకా వాటి టైమ్ రాలేదు.

ఇప్పుడు మేం ఒక జనపద చిత్రం తలపెట్టాం. ఇదివరలో లేవనికాదు.—ఉదాహరణకి...చల్ మోహనరంగా ... (ఎవ్వరూ ఏమీ అనరు) యింతవరకూ మెట్రొపాలిటన్ లైఫ్ — అంటే, బస్తీ మనుషుల మనస్తత్వాలని చూపే చిత్రాలు తీశాం. 'అస్పత్రి' అల్లాంటిది. బస్తీల్లో బాగా రన్నైంది. పల్లెల్లో — కంప్లీట్ ఫ్లాప్ ..

పెద్ద: పే రేందండి?

దివా: పేరు ఫలానా అనుకోలేదు. శేషగిరిరావ్, యెంకి విషయం చెప్పాడు. అతను కొన్ని పాటలుకూడా కూర్చాడు. యీ పాటలు మెల్లిగా ప్రజలని ఆకర్షించాయి. కొన్ని గ్రామ్‌ఫోన్ రికార్డులుకూడా వొచ్చాయి. వీటిని సేకరించి, వొక కథ అల్లి, చిత్రం తియ్యాలని.

పెద్ద: శేషుగారు ఏమోననుకొంటి గొప్పోరే...

బావ: ఆరికి మాయిసయం ఏం తెలుసండి?

పెద్ద: వోర్రోడ, యెంకిభాగోతం ఎవడికి తెలీదు! జనాన్నొదులుకుని, పెళ్ళి పెడాకులు లేకుండా, పొలాలమ్మట, యిచ్చల యిడిగా, మొగాడితో తిరుగుతుంటే చెప్పకో రంట్రా...!

యెం: ఇప్పుడయ్యన్నీ ఎందుకులే పెద్దెయ్య తాతా...

బావ: అసలిసయం ఏందో సెప్పండి.

పెద్ద: ఇట్లారా దగ్గరగా—చెప్తారు.

దివా: ఏముందీ—మీరు గ్రహించే వుంటారు. ఈ జనపద చిత్రానికి యాక్టర్లని బుక్ చేద్దామని నిల్లా బైలుదేరాను. మా డైరెక్టరు, అసలు వ్యక్తుల్నే యిందులో చూపెడితే బాగా రాణించి, జనం విరగబడి చూస్తారని—యెంకిదేవిగారినే బుక్ చేస్తే...

యెం: (నవ్వుకుంటుంది) యెంకిదేవి! — నాయుడు దేవతా!...

బావ: దేవేందండి—అహా అహ...(నవ్వుతాడు)

దివా: అదే, ఆమెని—ప్రధాన భూమిక—అంటే పాత్ర, రోల్—

బావ: రోలేందండి—రోలూ రోకలీని...!

పెద్ద: అదికా దిరిమొగమా — అందులో యాసం ఎయ్యమని సెప్తుండారు.

(యెంకి, బావ బిగ్గరగా నవ్వుతారు)

పెద్ద: ఎందుకా నవ్వులు?

బావ: యాసమంటే తవొచ్చింది. యెంకి ధలేయాసాలే కుద్ది—ఓపాలి నేవూళ్లో లేనప్పుడు నామాదిరిగా తీగలుతెంపి, పాగాలా సుట్టుకుని, మొక్కజొన్నకండె పీసు మీసంగా తగిలించుకుని, కిరుజోళ్లేసుగుని, కర్రుచ్చుగుని, ఆడిపొయి, నవ్వించి అమ్మలక్కపక్కలు యిరిసిందంట...

యెం: ఏటావూసులు పెద్దోరిముందు.

బావ : గుల్లలో దూరిన నత్తమాదిరి దూరకుంటాలే...

దివా : ఇదుగో, యీరకం...సహజమైన భాష, భావాలు, ధోరణి వుండేలా తియ్యడానికే యెంకిగార్ని, యిందులో వుండమని కోరదామని వొచ్చాను.

ఎవరా వొచ్చేది?

పెద్ది : సెంద్రన్న...ఏం సెంద్రన్నా, వొస్తుండారా?

చంద్ర : శేషుగారు, ఎవరో స్నేహితుణ్ణిసూడ్డానికి పైవూరు సైకిల్ మీద వెళ్లినారంట...రాంగానే పంపుతామన్నారు.

పెద్ది : మరి కరణంగారు?

చంద్ర : మునసబుగారింటికాడ పని సూసుకుని వొస్తామన్నారు.

బావ : సెంద్రన్నా, యెంకిని సినిమాలో యాసమెయ్యమంటుండారు. ఏటంటా?

చంద్ర : నాకేం తెలుసుద్ది. నీ యిష్టం.

పెద్ది : కళ్లుమూసుకు నొప్పేసుకోవే—యీ దేముంది, బోడి వూళ్లో బొమ్మలాటని. ఆడికిపోతే, బోలెడంత డబ్బు. దర్జా, బట్టలు...

దివా : ముందే చెప్పాగా, ఈ చిత్రం వొక ఎక్స్పెరిమెంట్ కింద—తీస్తున్నాం...పైగా మా ఆదర్శాలుకూడా మీరు మనస్సులో వుంచుకోవాలి. ఆర్నెల్లల్లో చిత్రం పూర్తవుతుంది. మొత్తం పూర్తవగానే, ఆరువేలు. ఇదికాక ప్రతినెలా రెండొందలు జీతం వుంటుంది.

బావ : అమ్మబాబో, ఆరువేలే...!

పెద్ది : నెలనెలా రెండొందలే...!

దివా : మా వేతనాలు తక్కువని వొప్పేసుకుంటున్నాను. ప్రాఫిట్స్ బాగుంటే, యింకా యివ్వొచ్చు — పర్మనెంట్ స్టార్ కింద కాంట్రాక్టివ్వొచ్చు. హాలీవుడ్‌లో యిలా జరక్కపోలేదు. 'గ్రీయర్ గార్సన్' మొదట్లో అసలేమీ వేతనం లేకుండానే ... గ్రీయర్ గార్సన్ తెలుసుగా ... గుడ్ బై మిస్టర్ చిప్స్...తెలీదు? అవును, మీకు తెలీదుగా — సరే అవన్నీ ఎందుకులెండి.

పెద్ది : ఒప్పేసుకో యెంకి...

బావ : ఏం—ఊఁఅనెయ్యి, హాయిగా పట్నంపోయి కులాసాగుందాం.

యెం : పట్నంలో ఏం కులాసా...?

దివా : పోనీ, స్టుడియో సెట్టింగ్ అక్కర్లేకండా, షూటింగ్ యిక్కడే జరపొచ్చు — మాంచి నాచురలిస్టిక్‌గా వుంటుంది. ఎ సిరీస్ ఆఫ్ యాక్చ్యుయాలిటీ షాట్స్...ఆలోచించుకునే చెప్పండి, తొందర్లేదు.

[బావ యెంకిదగ్గరగా వెళ్లి, మెల్లిగా సంప్రదిస్తాడు]

యెం : మనం ఎక్కడికీ పోవొద్దు మావా...నాకేసమేవిటి నా మొహం...!

బావ : బోలెడు డబ్బు. కరణం కామయ్య మనల్ని కొంకాయిస్తాడు?...రెడ్డి సత్తెయ్య పెళ్లాం నోరుపెసులుద్ది? కాలుమీద కాలేసుగుని, రాజారాణీలా మాకోవొచ్చు. వొప్పేసుగో...

యెం : మనకా బస్తీ పోకళ్లొద్దు మావా — మనకి డబ్బెందుకు, దసకమెందుకు? ఎంకటేస్రుడి కటాచ్చముంటే సాల్దూ?

బావ : కటాచ్చం వుండబట్టే యీనొచ్చి సొమ్మలిస్తామంటుండాడు.

యెం : నే నొప్పను మావా...

బావ : కాయమె...?

యెం : ఆఁ...

బావ : నీకు నాకు సెడిపోతుందిసుమా...!

యెం : (నవ్వుతుంది) అది మనిష్టమా—? బ్రహ్మదేవుడు రాసిపెట్టాల...

బావ : యిడిపోవటం వొప్పందమే?

యెం : మాట జారుతుంది. కన్ను గుడ్డవుతుంది. చెవు డోస్తుంది. జుట్టు నెరుస్తుంది. గుండె నిల్సిపోతుంది. కాని మావా, మనస్సులుండి పోతయ్యి...

బావ : ఏందో నీదో గొడవ—అదుగో, కామయ్యగారు—యింకా దాసయ్య...సీతాయి, వొస్తుండారు. ఈ ముతాలోంచి తెగిసిపోదాం. వొప్పేసుగో...

యెం : నే వొప్పుగోను.

బావ : నాకర్మ పావొచ్చి పడింది. (నుదిటిమీద కొట్టుకుంటాడు)

కామయ్య : రాత్రిభోజనం మాయింట్లోనే, దివాకరంగారు. మా శేషు యీపాటికి వొస్తూంటాడు. ఏమంది యెంకి? ఏరా నాయుడూ?

బావ : ఇంకా ఆలోచిస్తావుందండి. కొత్తకాదండి—సిగ్గు, భయం...

కామ : సిగ్గు, భిడియం వున్నదైతే, యింత రామాయణం ఎట్లా చేస్తుందిలేగాని...

దివా : అంతగా తప్పదూ అంటే, పక్కవేషానికి, యీ నాయుడుగార్నే బుక్‌చేసేవిషయం ఆలోచించొచ్చు...

బావ : ఏంది, నేనే—తెరమీద యెంకితో బొమ్మలాట. ఇంకేం దెంకీ — వొప్పేసుకో. ఆడకూడ, మనిద్దరమే భలే భలే...!!

యెం : వెర్రిమావా — బొమ్మలు వూళ్లో జనం అంతా చూస్తారు...

బావ : అవును, మరిసా ఎవ్వరూ సూడకుండా ఏరేగా తీస్తారా?

దివా : బాగుంది. నలుగురూ చూడ్డానికే సినిమా. మాస్ ఎంటర్‌టైన్‌మెంట్. పైగా—కావాలంటే కొన్ని యింటిమేట్ షాట్స్, ప్రైవేట్‌గా మనం వేసుకు చూసుకోవొచ్చు.

దాస : ఇంక నేమెంకి. అరిన్ని సెప్తావుంటే, బెసుకెందుకు? మా సీతాయిని రమ్మంటేనా, ఎగిరి గంతేసును. ఏం సీతా?

సీతా: పో, యీ దేంది మన సొద.

దివా : మనకి గుంపుల షాట్స్‌లో, జనం ఎల్లాగా కావాలి. అందులో మీరూ వుండొచ్చు.

పెద్ది : నన్నుకూడా తెరమీద ఉంపేస్తిరా, మీ పుణ్యముంటుంది. రేపో మాపో సస్తాను. సచ్చేలోగా, తెరమీద పడితినంటే...ఓ...

కామ : ఆట్టే, వెర్రి వెర్రి వేషా లెయ్యక వొప్పేసుగో, పక్క వేషం నాయుడేగా...

బావ : చూశావా మరి...!

దివా : పక్క వేషం వీరు వెయ్యొచ్చు. కానైతే టు టెల్ ది ట్రూత్ — వీరిదంత ఫొటోజెనిక్ ఫేస్ కాదు ... అఫ్‌కోర్స్, మేకప్‌లో కప్పెయ్యొచ్చులెండి. దానికేం. హైటొకటి తృప్తికరంగాలేదు. మరో రెండంగుళాలుంటె, సరిపోను. సారీ, యివన్నీ చెప్పినందుకు...

కామ : పక్క వేషం మొగా డెవడైతే, ఎవరిక్కావాలండీ —ఆడవేషం బాగుండాలి.

దివా : అమ్మమ్మ—అలా అనడానికి వీల్లేదు. అది వెనకటి రోజుల్లో. ఈరోజుల్లో మన స్త్రీ ప్రేక్షకులుకూడా మేల్ బ్యూటీకి రెస్పాండవుతున్నారు. ఆలోచించి, ఏ విషయం చెప్పారంటే... మరి...ఆవిషయంలో సంకోచనక్కర్లేదు. ముందుగా కొంత ఎడ్వాన్సుకూడా...

బావ : (యెంకిని దూరంగా తీసుకెళ్లి)

ఊ అసెంకీ, సంపక, సీతా — దాసూ. యిటురండి. దీనికి వచ్చ సెప్పండి.

సీతా : యెంకీ, ఒప్పుకోరాదంటే-మేంకూడా వుంటాంగా.

యెంకీ : నీకూ దాసయ్యకూ సెడింది—నేనూ బావా బాగుంటం నీకెంతు కిష్టముంటుంది?

దాస : మాకేం సెడలా...నువ్వు డబ్బు గడించి గొప్పదానివైతే—నీబావే సుఖపడతాడు.

యెం : బావకీ, నీకూ—మీ అందరికీ గొప్పలు, బడాయిలు కావాల. డబ్బుంటే అయ్యన్నీ సాగుతై...

బావ : నీకుమాత్రం అక్కర్లేదా సింగారింపులు—

యెం : నాకా? బావా, ఇట్లగైతివా...నా కలలన్నీ కరిగి పోయినాయి. మన మనసు లిరుసుకున్నాం. యీలోకం యీమనుషులు — వూపిరి సలపకండా బందికానా లోగిళ్లు, పరువిడిసిన పోక్కిళ్లు, పేరు గొప్పలు పాణం యిసిగించే గడబిళ్లు — యింతేనా బావా?

బావ : ఏందీ నీసొద—ఇప్పుడేం నీతోడే వున్నాగా...?

యెం : బావా—ఇంక నాకు నూలేవు. మనుషుల్లో కలిసి పోయినావు. నే నొంటిగా వుంటాను.

బావ : మనిషివికాక, మనం రాచ్చసులమా—?

యెం : మనకొరం మనుషులు, మర్మం మనుషులు — మేఘాల్లో మాయమై, గాలిలో కలిసిపోయి, నక్షత్రాల్లోదాంకుని నవ్వే దేవతనవాల మావా—! యీడేముంది, యెండిరూపాయిల సుసి—బంగారం పూడ్సిన బురద...

కామ : (దూరంగా కేకేస్తూ) ఏం నాయుడూ, యిహ తెముల్దా...?

బావ : నా సావుకి దాపరించావే—దయ్యమల్లే—ఛీ పాడు పుటక...వొస్తుండానండి...ఆరితో వొప్పేసుగుంటుందిలెండి అని సెప్పొస్తా...

[యీ గుంపు దగ్గరకి వొస్తాడు]

యెం : మావా — ఇహ నీకొప్పణ్ణు — నువ్వు సల్లగుండు బావా...ఈమనిషి జన్మంలో మనకి మనుసుల్లేవు. మరో జనమలో నూసుకుంటా — (దూరంగా వెడుతుంది. సీతాయి, దాసూ, వెనక్కి వొస్తారు. చంద్రన్న యెంకివెనకాల నడుస్తూంటాడు. — — నాయుడు నెత్తిబాదుకుంటూ వుంటాడు]

పెద్ద : ఏందిరా ఆ వాలకం—దయ్యం పట్టిందా యేం...

బావ : నాకు మతోయింది ... యీ పూట కల్లిపొండి సాములూ—రేపు సెప్తాలెండి.

[దివాకరం కదుల్తాడు]

దివా : తొందర్లేదు, రేపుదయం చెబుదురుగాని.

పెద్ద : రాండే సీతాయి. రారా దాసూ — ఆళ్లూ ఆళ్లూ ఏదో మాట్లాడుకుంటార్లే. పదండి. (మెల్లిగా అడుగులు వేస్తూంటారు)

ఒరేయి నాయుడూ, మీరు వొప్పుగోరా? —వొప్పుగోక పోతే రేపు సాయంత్రానికి యీ పాకలో వుంటాని కీల్లేదు. గురుతు పెట్టుకో...

[అటు చంద్రన్న, ముందు యెంకి నడిచిపోతారు. ఇటు, పెద్దెయ్య మిగతవారూ నడిచివెడతారు—నాయుడు బిక్క మొహం వేసుగుని అటు యిటూ చూస్తూంటాడు]

బావ : ఇదిగో యెంకీ—నిలు—నేనూ వొస్తుండా...నిల బడవు? పోతే, పో — విరగడైంది మాయలమారి ... (నిదానించి, కళ్లు తుడుచుకుని) ఏందీ—నాయెంకి నే ... నాయెంకే లేకుంటె ఎల్లావుంట...(ఇటుతిరిగి) పెద్దెయ్యతాతా, నాయెంకి సినిమాల్లోకి రాదు. మేం రాం ... పొండి మీ యబ్బతో చెప్పుకోండి ... మీ డబ్బు గొంతులో పోసుకుని పాతరేసుకోండి—మేంరాం... తెల్సిందా...యెంకీ నిలబడు—వొస్తుండా ... (పిచ్చిగా అటూ యిటూ చూస్తూ, సణుగుతూ) యెంకీ — ఎల్లిపోతుండావా ... నన్నిడిసి...కల...ఏడవటం రావడం లేదెంకీ—

[పడిపోతాడు. కాసేపటికి తేరుకుని, లేచి, పిచ్చివాడిలా, యెంకి వెళ్లిన వెంపు పరిగెడతాడు...తెరపడి, లేస్తుంది. యెంకీ చంద్రన్నా ప్రవేశిస్తారు]

చంద్ర : యెంకీ? యాడకి పోతుండా?

యెం : నాకీ డెవరుండారు ? వెంకటేసురుడి దగ్గరకు పోతుండా...

చంద్ర : యెంకీ—యెంకీ...(ఏడుస్తాడు)

యెం : ఏం చంద్రన్నా—(బుజ్జగిస్తూ, కన్నీరు, వేళ్లతో తుడుస్తుంది)

ఎందుకు బెంగ...?

చంద్ర : నువ్వెళ్ళమాక. నూ లేకుంటే నే బతకలేను.

యెం : అదేంది సంద్రన్నా...నీకు నామీద మనుసా...? పిచ్చోడా...

చంద్ర : నేను సెంపలేసుగుంటా, నన్నుగురించి పెద్దగా అనుకోమాక...

యెం : ఎందుకనుకుంటాను? నా మంచోడివి సెంద్రన్నా ...నాకోసరం యింతకాలం పెళ్ళిలేకుండా వుండావు...అవునా ఎర్రోడా...

చంద్ర...అదికాదెంకీ, ఆనాడు కరణంగారు పనిలో కుదురుస్తారంట అని దొంగ కబురుసెప్పి, నాయుణ్ణి పంపేసినాను... నీతో వుండామని...నేను సెడ్డోణ్ణి యెంకీ...నిన్నేదో సేద్దామనుకున్నాను...

యెం : మరి సెయ్యలేదుగా...బెంగెందుకూ?

చంద్ర : మనుసులో అల్లాంటి బుద్ధి పుట్టడం తప్పుకాదూ? నన్ను దయతో సూసి రచ్చించు, యెంకీ...

యెం : నీకాబుద్ధి పుట్టిందంటె, తప్పు నీదికాదు సంద్రన్నా ...నాది...నాలో అల్లాంటి పోకిళ్ళుండబట్టి, అట్టా సేసినావు... మీ కరణంగారంత పెద్దమనిషికూడ ఆ బుద్ధి పుట్టింది. పెద్దెయ్య తాత, అంతా మొహాన పూసి గడ్డెతారని వూరుకుండాడుగాని, లేకపోతే తనకీవుంది యీ బుద్ధి. నే జాలిపడతానని దాసయ్య, సీతాయితో తగవులాడినాడు ... అంతకీ లోపం నాది సెంద్రన్నా...

అటుసూడు, బావ యెందో ఎల్లగిలపడిపోయినాడు. ఎల్లి లెగతీసి తీసుకురా...

చంద్ర : నువ్వూరా...

యెం : నేను రాకెక్కడికి పోతాను?

చంద్ర : ఎంకటేసురుడి దగ్గరకి పోతానన్నావుగా...

యెం : ఆ ఏడుకొండలవాడు, నన్ను తనదగ్గరికి రానిస్తాడా ...పాపిష్టిదాన్ని...

చంద్ర : నువ్వు పాపిష్టిదానివా...ఉత్తమా యిల్లాలి వెంకీ...

యెం : అవుతే, దేవుడి దగ్గరకే పోతాను...

చంద్ర : నువ్విడే వుండు...బావని తీసుకొస్తా (వెడతాడు, యెంకి పరుగెత్తుకుంటూ వెడుతుంది. చంద్రన్నా, నాయుడూ వొస్తారు) యెంకేది? ఎటుబోయింది...అదుగో ఆ పడవలో కెక్కింది...అరెరె, ఏరు వొరదలుగా వుంది...అరెరె...

[పరుగెడతాడు, నాయుడూ పరిగెట్టబోతుండగా, శేషు ప్రవేశిస్తాడు]

శేషు : ఎక్కడికీ చంద్రన్న అల్లా పరిగెడుతున్నాడు?

బావ : ఉండెండి. యెంకి, వొంటిగా, ఏట్లో పడటానికి పడవెక్కిపోతూంది. అపుచెయ్యడాని కెల్లినాడు...

శేషు : ఆ. ఆ. ఏం జరిగింది?

బావ : అదుగో ఆ పడవలో ... (పరిగెడతాడు. శేషు అటూ యిటూ చూస్తూంటాడు, కొన్ని క్షణాలయ్యాక దాసయ్య, బావా చక్కావొస్తారు)

బావ : రండి బాబుగోరు...అయిపోయింది. సెంద్రన్న ఏట్లో వురికినాడు పడవ నాపుదామని...మళ్లా తేల్లేదు...పాపం ఆడి కీతరాదు...వొద్దంటూనే వుండాడు...ఇంకేంది నా బదుకు...?

శేషు : మరి యెంకేమైంది...ఆ పడవ నాపుజేశారా...?

బావ : పడవలోది యెంకిగాదు...సేపలనోడు సలికి ముసుగేసుకుని పోతుండాడు...యెంకీ, యెంకీ...ఏడకి పోతి వెంకీ... నన్నిట్ట గిడిసి మేఘాల్లోకి పోతివా నీ కల కరిగించేటందుకు కన్నీరు లేదెంకీ...(అటూ ఇటూ చిందరవందరగా పరుగెడతాడు) 'యాడుంటె వెంకీ' — (తెర)

## చివరి రంగం

[దివాకరం, శేషు, కుర్చీలమీద కూర్చుని కబుర్లు చెప్పుకుంటూంటారు]

దివాక : చిత్రంగా వుంది. ఇంతకీ యెంకి యేమైనట్లు...?

శేషు : తిరుపతి—కొండలన్నీ ఎక్కుకుంటూ వెళ్లిందట. ఆలయంలో దర్శనం దొరికేవరకూ, వుపాసం వుండి చిక్కి శల్యమైందిట. దర్శనం దొరికిందట...స్వామి ముందే, ప్రాణం వొదిలేసిందిట...—అల్లా చెప్పుకుంటూరు.

దివాక : ఆత్మహత్యంటారా...?

శేషు : పరమాత్మని కలుసుకుని శాంతి, ఔన్నత్యాలు పొందానన్న పారవశ్యంలో, ప్రాణం వొదిలేసిందేమో...! లేక అంతర్ధానమై దైవంలో ఐక్యం అవకూడదూ?

దివాక : ఈ రోజుల్లో అల్లాంటివి నమ్మడం కష్టం సుమండీ...

శేషు : చెప్పలేమండీ...మనుషులు — వాళ్ల కోరికలు. ఆశలు, అనాదినుండీ, యీనాటివరకూ, వొకే మోస్తరు. వారు మారరు. పరిస్థితులు వాతావరణం మారచ్చు. అట్లాంటివి అరుదు కావొచ్చు...అరుదైనవీ, అపూర్వమైనవీ, మానవత్వాన్ని మరోసారి ఋజువుచేస్తుంటాయి.

దివా : చచ్చిపోడంలో అపూర్వం వుందనుకోను... నేను, చిత్రాన్ని మరోలా ముగించాలనుకున్నాను.

శేషు : పిల్లలు, సంసారం...మనమలు...ఆ ధోరణిలోనా? కథలలోకి మల్లె, జీవితంలో సంపూర్ణమై రెడీగా ముగింపైన కథలుండవండి...యెంకి, తన అంతంలో, తన కథనికూడా ముగించి, పరిపూర్ణత నిచ్చింది...

దివా : పరిపూర్ణతలో అందం లేదేమొ?

శేషు : నా కందం కనిపించింది. మీరు మరోటి జ్ఞాపకం పెట్టుకోవాలి. మీరు, ఎంకిని చూశారు. నే నెప్పుడూ చూల్లేదు. నిజస్వరూపంలో నా వూహ మలినం కాలేదు.

దివా : శుభం. ఐతే నాయుడేం చేస్తున్నాడు?

శేషు : పిచ్చివాడిలా యెంకిని వెదుకుతూ తిరుగుతూన్నాడుట...

దివా : ఇంకా ఏమన్నా కొత్తపాటలు వ్రాశారా...?

శేషు : ఎంకొక్క దేవతై వెలిసిందనిపిస్తుంది. వింటారా? (పాడతాడు.)

**నా టేలా, నీకు మాటేలా**
**సిన్నదనమేలా సిగ్గేలా?**
**ఆ సీమ యీ సీమ**

అంద రందాలు
తిన్నంగ నిను సూస్తు
దిద్దుకుంటారు......సాటేలా
యెంకొక్క దేవత్తై
యెలిసె నంటారు
యింటింట పెడతారు
యెంకి నీపేరు

దివా : అవుతే మీ కమ్మాయిపుడితే, యెంకని పిలుస్తారన్న మాట.! నాకో సందేహారి. మీ వుద్దేశంలో, యెంకి జీవితం దేన్ని సూచిస్తుందంటారు? అంతర్యం ఏమిటో—అంటే అసలు యెంకి ఎవరం టారు?

శేషు : (నవ్వి.)

మనందరం—అంటే—మీరూ, నేనూ కాదనుకోండి—నాయుడు బావా, పెద్దెయ్య తాతా, కరణం కామయ్యా వగైరా అందరూ నీడలం...ఇక, వెలుగెవరో, వూహించుకోలేరు...?

కోటి గొంతులు కలిసి
పాటపాడే వారి
వెలుగు నీడల నడుమ
నిలిచి ఆలించు.
ఏటి మిలమిల లోన
తోట నవనవ లోన
వెలుగు నీడల పొత్తు తెలిసిపాలించు
యెంకవ్వరని లోక
మెపుడైన కదిపితే
వెలుగు నీడలవైపు
వేలు చూపించు.

---



లినోకట్ చిత్రం

శ్రీ వేలూరి రాధాకృష్ణ.

# హైదరాబాదులో ఆంధ్రసారస్వత వికాసము

శ్రీ దేవులపల్లి రామానుజరావు

★

ఇరువదియవ శతాబ్దమున మొదటి యర్థభాగము గడచి, రెండవ యర్థభాగము ప్రారంభమైనది. ఈ యేబది సంవత్సరాలలో మన దేశమున చరిత్రనిర్మాణము జరిగినది. ఈ యర్థశతాబ్దము, అందు ముఖ్యముగా గడచిన శతాబ్దము, హైద్రాబాదు చరిత్రలో అత్యంతప్రధానమైన ఘట్టము. మధ్యకాలపు రాజవంశ పరిపాలన అంతమొంది సంపూర్ణబాధ్యతాయుత పరిపాలన మేర్పడినది రాజకీయముగా జరిగిన యీ మార్పుల ప్రభావము ఆర్థికసాంఘిక సాహిత్య రంగములందు గూడ గోచరించుచున్నది. అందుచేత హైద్రాబాదులో గడచిన కొన్ని శతాబ్దాల యందు జరిగిన సాహిత్య కృషిని సమీక్షించుకొనుటకు ఇది సరియైన సమయమని నిస్సందేహముగా చెప్పవచ్చును.

ఈ సారస్వత వికాసమును సమీక్షించునప్పుడు ఇక్కడి ప్రత్యేక పరిస్థితులను దృష్టిలోనుంచుకొనుట అవసరము. హైద్రాబాదు స్వదేశ సంస్థానాలలోనే వెనుకబడియున్న స్వదేశ సంస్థానాలలో గూడ మొదటిదిగా నుండెను. ఇక్కడి పరిపాలకులు ప్రజల భాషలతో నేమాత్రము సానుభూతి కలిగియుండలేదు. అంతేకాదు; వారి భాషల అభివృద్ధినివ్యతిరేకించి వాని యభివృద్ధిని సర్వవిధముల నిరోధించిరి. తత్ఫలితముగా తెలుగు సరస్వతికి కొంతకాలము అజ్ఞాతవాసము తప్పలేదు. రాజనరేంద్రుని నుండి రఘునాథరాయల వరకు రాజాస్థానాలలో ముత్యాలశాలలందు దీనారటంకాల తీర్థమాడిన ఆంధ్ర శారద ఉర్దూ పార్సీ అరబ్బీ బిబ్బీల వెనుక నెట్టివేయబడి తబ్బిబ్బు జెందినది. అందుచేత హైద్రాబాదు రాష్ట్రమున తెలుగు సరస్వతిని అరబ్బీ పార్సీ సాంప్రదాయాలచేత పరిపోషితమైన ఉర్దూ భాషకు ఊడిగము చేయించు ప్రయత్నాలను ప్రతిఘటించుట భాషాప్రియుల ప్రథమ కర్తవ్యమైనది. ఇండియాయూనియన్‌లో ఇంగ్లీషువారు ఏమి చేసినప్పటికిని సారస్వత సమావేశాలను నిషేధించి ఆంధ్రభాషా వికాసమునకు అడ్డుపడలేదు. రాజకీయాలతో ప్రమేయము లేని వీరేశలింగ ప్రభృతుల నిరంతర కృషికి నిరోధములు కలుగలేదు. హైద్రాబాదు రాష్ట్రప్రత్యేక పరిస్థితుల ననుసరించి ఆంధ్రగ్రంథ పఠనాసక్తిని విద్యావంతులలో నిలిపివేయించుటయే యొక ఘన కార్యమైనది. ఆంధ్ర సారస్వత సంస్కృతుల వికాసమునకు అభివృద్ధికి యీ ఘనకార్య సాధనయే ప్రథమ సోపానమైనది. ఈ దృక్పథముతోనే యీ ప్రాంతమందలి తెలుగుభాషా వికాసమును మనము ఆవలోకించ వలసియుండును.

ఆంగ్లభాషా సంపర్కములేని ఉర్దూ భాషా ప్రభావమును గూడ మనము గమనించవలసియున్నది. హైద్రాబాదులో ఉర్దూభాష రాజభాషయై విశ్వవిద్యాలయ బోధనాభాషయై, విద్యాధిక ప్రపంచమున గణుతికెక్కినది. నలుగురు పెద్దలొకచోట సమావేశమైనచో వారినాలుకలమీద ఉర్దూ సరస్వతియే నాట్యమాడినది. తత్ఫలితముగావిధ్యాధికులలో రెండు భిన్నవర్గాలేర్పడినవి, సంస్కృతాంధ్రములందు పాండిత్యము కలిగి, పల్లెటూళ్లలో నివసించుచు, అధునాతన ప్రపంచమునకు దూరముగా నుండి, రాజాదరణ లేక, గ్రాసవాసో దైన్యమున కృశించుచుండిన పండిత బృందము, మొదటి వర్గము. కొలదియో గొప్పయో పరిచయము ఉర్దూ పార్సీ భాషలతో కలిగి లౌకిక

ప్రపంచమున వ్యవహర్తలైన ఆస్తిపరులు రెండవ వర్గము. ఆంగ్ల భాషతో యీ రెండు వర్గాలకు కూడ సంబంధము అల్పమే. అందుచేత తెలంగాణములోని ఆంధ్రభాషపైన ఆంగ్ల భాషాప్రభావము ఆలస్యముగా పడినదని చెప్పవలసియున్నది. ఉర్దూ భాష మరియు ఆంగ్లభాషా ప్రభావాలు పూర్తిగా భిన్నమైనవి. ఉర్దూ వాఙ్మయము పరిమితమైనది. ఆంగ్ల వాఙ్మయము అపరిమితమైనది. ఆంగ్ల భాషతో పోల్చినప్పుడు ఉర్దూ ప్రాయము కడు కొద్దిది. ఉర్దూ భాష ప్రత్యేకత శృంగారము మరియు సూఫీ తత్వము. ఆంగ్లభాష ప్రపంచ విజ్ఞానమునకు ప్రపంచ సాహిత్యమునకు ఆటపట్టు. ఉర్దూ అప్పుడప్పుడే పరిపాలకుల భాష యగుటకు ప్రాకులాడు స్థితిలో నుండెను. ఆంగ్ల భాష సకల ప్రపంచమునకు వ్యవహారయోగ్యమై, వాడుకలోనికి వచ్చియుండెను. కావుననే ఇండియా యూనియన్‌లో ఆంగ్ల భాషవలె హైద్రాబాదులో ఉర్దూ భాష పాఠకులను ఉత్తేజితులను జేసి, ఆంధ్ర మహారాష్ట్ర కర్ణాటక వాఙ్మయములందు చెప్పదగిన పరిణామాలను కలుగజేయలేక పోయినది. కావున హైద్రాబాదు రాష్ట్రములో ఆంధ్రభాషావికాసము పూర్వ వాఙ్మయ పఠనము మీదనే యెక్కువ ఆధారపడవలసివచ్చినది. భావ కవిత్వపు వెల్లువ మరియు నవలా రచనా వ్యాసంగప్రవాహము తెలంగాణ క్షేత్రమున తక్కువగా పొంగి పొరలినట్లు కనపడుచున్నది. హైద్రాబాదులో ఆధునికాంధ్ర వాఙ్మయ వికాసము ముఖ్యముగా నాలుగు మార్గముల జరిగినట్లు స్పష్టము కాగలదు. ఒకటి చరిత్ర పరిశోధన, రెండవది విజ్ఞాన వాఙ్మయ నిర్మాణము, మూడవది కథానికా రచన, నాలుగవది ప్రభుత్వమునకు ప్రజలకు మధ్య జరిగిన సంఘర్షణచే ప్రేరితమైన కవితా రచన.

తెలంగాణమున ఆంధ్ర భాషా వికాసమునకు తోడ్పడిన సంస్థానాధీశ్వరులను ఈ సందర్భమున ప్రశంసించవలసియున్నది. ప్రభుత్వ విధానము ప్రజల భాషల అభివృద్ధికి ప్రతికూలముగా నున్న సందర్భమున నిజాముకు సామంతులై యున్నప్పటికిని గద్వాల, అమరచింత మొదలైన సంస్థానాధీశ్వరులు తెలుగు కవులను ఆదరించి, పోషించినారు. ఆధునిక యుగ నిర్మాతలైన శ్రీ తిరుపతి వేంకట కవుల వంటి వారు తమ సారస్వత జైత్రయాత్రల సందర్భమున యీ సంస్థానాలకు అరుగుదెంచి సన్మానములను పొందినట్లు నానా రాజసందర్శనము తెలుపుచున్నది. ఈ ఆస్థానాలు మినుకు మినుకు మని తెలుగుభాషా దీపములు వెలుగుచున్న ప్రమిదలలో కొంత చమురు పోసి, అవి ఆరిపోకుండునట్లు కాపాడిన గౌరవము సంపాదించుకొనినవి.

హైద్రాబాదు రాష్ట్రమున ఆంధ్ర సారస్వత వికాసానికి వెలుగుగల దారిని జూపిన విజ్ఞాని ధన్యజీవి స్వర్గీయ శ్రీ కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు. లక్ష్మణరావుగారు మహారాష్ట్ర దేశమున విద్యాభ్యాసము చేసి, మహారాష్ట్ర భాషలో ప్రావీణ్యము గడించి, అక్కడ జరుగుచున్న వాఙ్మయ కృషిని అవగాహన చేసికొనిన ఆంగ్ల విద్యాధికులు. లక్ష్మణరావుగారు హైద్రాబాదులోని ప్రత్యేక పరిస్థితులను పరిశీలించి, వాఙ్మయ వికాసానికి మూడు ముఖ్యమైన మార్గములను జూపించినారు. ఒకటి గ్రంథాలయోద్యమము. ఊరూర గ్రంథాలయాలను స్థాపించి నిరక్షరాస్యత అజ్ఞానములందు మునిగియున్న ప్రజలకు విజ్ఞానము ప్రసాదించి, మన సాహిత్యపు రుచులను ప్రజలకు తెలియజేయవలసిన అవశ్యకతను గ్రహించి లక్ష్మణరావుగారు ఈ ఉద్యమానికి బలమైన పునాదులు వేసిరి. స్వయముగా హైద్రాబాదులో కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయము, హనుమకొండలో రాజనరేంద్ర భాషా నిలయములను స్థాపించిరి. తరువాత తెలంగాణలో అనేక గ్రంథాలయాలు అవతరించి సభలు మరియు సమావేశాల ద్వారా మంచి చైతన్యము కలుగజేసి, అనేక యువరచయితలభావనా శక్తికి దోహదము గావించి అమోఘమైన సేవ జేసినవి. చరిత్ర, విజ్ఞానము లక్ష్మణరావుగారు అభిమానించిన వాఙ్మయ విశేషములు. ఈ రెండు మార్గముల రచనలు గావించవలసిన ఆవశ్యకతను లక్ష్మణరావుగారు తెలంగాణ ఆంధ్రులకు తెలియజేసినారు. లక్ష్మణరావుగారి విజ్ఞానచంద్రికా గ్రంథమండలికి హైద్రాబాదు జన్మస్థానము. చరిత్ర పరిశోధనమున వారి అనుచరులగు, ఏకలవ్యశిష్యులకు హైద్రాబాదు ఆటపట్టైనది. ఈ ముప్పది సంవత్సరాలకాలమున ప్రకటితమైన గ్రంథజాలమును పరిశీలించినచో

వాని మీద విజ్ఞానము మరియుచరిత్రలయొక్క ప్రబల ప్రభావము మనకు వెల్లడి కాగలదు. లక్ష్మణరావు గారిచే స్థాపితమై, వారి యనంతరము వారి స్మారకార్థము లక్ష్మణరాయ పరిశోధకమండలి యను నామకరణము పొందిన పరిశోధనా సంస్థ, ఆంధ్ర దేశ చరిత్రలో అజ్ఞాతముగా నున్న సత్యములను వెల్లడి చేయగల అనేక శాసనాలను, వ్యయప్రయాసల కోర్చి, తిరిగి, పరిశీలించి, సేకరించి, పరిశోధించి తెలంగాణ శాసనములను సంపుటముగా ప్రకటించినది. ఇంకను యీ మండలి వద్ద ప్రకటించవలసిన శాసనము లెన్నియో కలవు. ఇది ఆంధ్రదేశ మంతయును గర్వించదగిన కృషి ; ఆంధ్రభాషా వికాసమునకు అత్యంత ఉపయుక్తమైన సేవ.

విజ్ఞానచంద్రికా గ్రంథమండలియు తత్ప్రకటనలు అనేక ఇతరగ్రంథమాలల అవతరణకు కారణభూతమైనవి. గోలకొండ, కిన్నెర, దివ్యవాణీ సుకృతి ప్రాసాదము, మాతృభారతి, ఆంధ్రశ్రీ, కాకతీయ, పూలతోట, వీరేశలింగ కవి కంఠాభరణ, కృషిప్రచారిణి, శివధర్మ, విజ్ఞానప్రచారిణి, వేంకటేశ్వర, కావ్యమాల గ్రంథమాలలను యీ సందర్భమున పేర్కొనవలసియున్నది. అణా, దేశోద్ధారక, ఆంధ్రకేసరి గ్రంథమాలలు కొద్ది వెలలో ప్రజలకు అవసరమైన విజ్ఞానమును ప్రసాదించు ఉత్తమ వచన గ్రంథములను ప్రకటించినవి. సాధన సమితి ఆంగ్ల విద్యాభూషితులైన యువకులు స్థాపించి నిర్వహించు సంస్థ. ఇందులో కథకులు అధిక సంఖ్యాకులు. ఈ సమితి తెలంగాణ రచయితల ఖండకావ్యములను, కథానికలను విరివిగా ప్రకటించి ప్రశంసనీయముగా భాషాసేవ జేయుచున్నది. యువకులు నిర్వహించుచున్న మరొక సంస్థయగు సాహితీ మేఖలయొక్క ఆశయము కవితారచన, కావ్య ప్రచారము, ఇందులో కవులు అధిక సంఖ్యాకులు. నూతన భావాలతోపాటు యీ కవులు ప్రబంధముల పక్వతతో కూడిన శైలిని అలవరచుకొనినారు. ఈ యొడ్డాణములో పొదిగిన రత్నములు కొన్ని నిజముగా సానలుదీరియున్నవి. ఈ దశాబ్దములోనే అవతరించిన ఆంధ్ర చంద్రికా గ్రంథమాల, మరియు విజ్ఞానవర్ధనీపరిషత్తులు సరిగా విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి ఆశయాలతోనే కృషి చేయుచు, వివిధ విజ్ఞాన శాఖలకు సంబంధించిన మంచి గ్రంథములను ప్రకటించుచున్నవి. అభ్యుదయ యువకవులు సారథ్యము వహించుచున్న తెలంగాణ రచయితల సంఘము జేయుచున్న కృషిగూడ యీ సందర్భమున ప్రస్తుతించదగియున్నది.

భాషావికాసమునకు పత్రికల ద్వారా జరిగిన కృషిని ప్రత్యేకముగా పేర్కొనవలసి యున్నది. ఇండియా యూనియన్‌లోని పత్రికలకున్న స్వాతంత్ర్యములో నూరవభాగమైనను హైద్రాబాదు పత్రికలకు లేకపోవుట జగత్ప్రసిద్ధమైన సత్యము. హైద్రాబాదులోని రచయితలకు తగినంతప్రచారము కలుగకపోవుటకును, ఇతరాంధ్ర దేశ రచయితలతో వారికి పరిచయము కలుగకపోవుటకును, పత్రికా స్వాతంత్ర్యము లేకపోవుట యొకముఖ్యకారణమని చెప్పవచ్చును. అయినప్పటికిని తీవ్ర ప్రతిబంధకాలను అధిగమించి కొంతకాలమైనను సేవజేసిన పత్రికలు కొన్నికలవు. వీని పూర్వ సంపుటాలను పరిశీలించినచో కథకులకు, కవులకు, వ్యాసకర్తలకు, విమర్శకులకు, పరిశోధకులకు, నాటికా రచయితలకు, ప్రోత్సాహమునిచ్చి, యీ పత్రికలు భాషావికాసమునకు తోడ్పడినట్లు విశదము కాగలదు. ఈపత్రికల కృషిఫలితముగా ఉన్నత విద్య నభ్యసించిన యువకులు నూతన రీతుల భాషా సేవకు బద్ధకంకణులైరి. వీరిలో సకలాంధ్ర ప్రశస్తి గాంచిన కథకులు, రచయితలు క్రమముగా సిద్ధమైనారు. గోలకొండ, తెనుగుపత్రిక, నీలగిరి, సుజాత, శోభ, భాగ్యనగర్, సారథి, ఆంధ్రాభ్యుదయము మొదలైన పత్రికలలో ప్రకటితమైన వాఙ్మయము హైద్రాబాదులో జరిగిన భాషా వికాసమునకు మంచి నిదర్శనము. ఈ కాలమున ఆంగ్లభాషా పరిచయముతోపాటు ఆంధ్రభాషలో ప్రావీణ్యము సంపాదించిన యువకులు ముందంజ వేసి కథలు, గేయాలు, వ్యాసాలు మొదలైనవి వ్యావహారిక భాషలో రచింపసాగిరి. హైద్రాబాదు పోలీసు నాజీకర్తల నగ్ననృత్యము, రజాకార్ల రాక్షస కృత్యములు, నిజాము నిరంకుశ చర్యలు, వీనిపైన తిరుగుబాటు యువకుల గేయాలలోను రచనలలోను శక్తివంతమైన శైలిలో వ్యక్తీకరించుట జరిగినది. సజీవమైన భాషలో కండగల కవిత్వ మీ సంఘర్షణ సాహిత్యమున సమృద్ధిగా అవ

తరించినది. ఈ రచనల సమీక్షకొరకొక ప్రత్యేక వ్యాసమే వ్రాయవలసియున్నది. ఇందు తోపాటు ఆంధ్రసారస్వత పరిషత్తు తెలంగాణ మందంతటను శాఖోప శాఖలతో విస్తరించి, వయోజనులకు రాత్రి పాఠశాలలను నిర్వహించి, పరీక్షలను నిర్వహించి, మన భాషలోని మంచి పుస్తకములను ప్రజాసామాన్యముచే పఠింపజేసి, స్వయముగా ప్రజలకు అవసరమైన విజ్ఞాన ప్రదములగు ఉత్తమ గ్రంథములను ప్రకటించి, దేశములో ఒక మంచిసాహిత్య వాతావరణము కలుగజేసి, రచనా శక్తికి సర్వవిధముల దోహదమొసగుచున్నది.

ఈ విధముగా హైద్రాబాదులో రచనా వ్యాసంగము, ఆంధ్రభాషా వికాసము ఒక విశిష్టమైన ఫక్కీని జరిగినది. పరిశోధన, విజ్ఞానము, కథానిక, సంఘర్షణ యుగమునకు సంబంధించిన అభ్యుదయ కవిత్వము, తెలంగాణ రచనలలో ప్రధాన స్థానము నాక్రమించుచున్నవి. ఆంధ్రభాషకు, ఆంధ్రసంస్కృతికి కృత్రిమమైన సరిహద్దులు పొలిమేరలు కల్పించుటకు వీలులేదు. అట్టి ప్రయత్నాలు నెరవేరగల అవకాశాలు అంతరించినవి. సమగ్రాంధ్ర దృక్పథముతో సాహిత్య కృషిజరుగవలసియున్నది. అట్లు జరుగుచున్నది కూడ. కృష్ణా గోదావరీ తుంగభద్రలు సకలాంధ్రులకు సమష్టి స్వత్వము. నన్నయ, తిక్కన, పోతన మొదలగు మహాకవులు వివిధప్రాంతాలలో అవతరించి ఆంధ్రభాషను ఆరాధించి నప్పటికిని ఆంధ్రజాతి కంతకును వారు సమానముగా గౌరవపాత్రులై యున్నారు. వారి కృషి సకల ప్రాంతములందలి ఆంధ్రభాష యొక్క అభ్యుదయమునకు మార్గదర్శకమైనది. ఈనాడు తెలంగాణము, రాయలసీమ, సర్కారు జిల్లాలలో జరిగిన సాహిత్య కృషిని అందరము కలిసి సమీక్షించుకొని ముందుకు అడుగు నేయవలసి యున్నది.



లినోకట్ చిత్రం — శ్రీ వేలూరి రాధాకృష్ణ.



ప్రమథగణం

(భువనేశ్వర దేవాలయ కుడ్యశిల్ప ప్రతిచిత్రము.. శ్రీ కె. వేణుగోపాల్)



"నటరాజు"

కీ. శే. శ్రీ అడివి బాపిరాజుగారు.

# దేశిసారస్వతము - బాలగేయములు

★

'కృష్ణశ్రీ'

పిల్లల పాటల్లో గంగాయమునల్లాగ రెండు శాఖలు కలిసి ప్రవహిస్తాయి. ఒక శాఖ పిల్లలకోసము పెద్దవాళ్లు రచించినవి; రెండో శాఖ పిల్లలే రచించుకున్నవి. వ్యక్తియొక్క జీవిత వికాసాన్ననుసరిస్తే గేయ వాఙ్మయములో లాలిపాటలే మొదటి మెట్టని చెప్పవలసివచ్చినా, గేయవికాసాన్ని అనుసరించాలంటే పిల్లల పాటలకే ప్రథమ తాంబూలం. లాలి పాటలూ, మేలుకొలుపులూ, పెద్దలు పిల్లలను వస్తువుగా స్వీకరించి రచించుకున్న పాటలు. వాటిలోని సంగీతాన్నైనా ఆలకించి పిల్లలు ఆనందించాలిగాని, వాటిలోని భావాల్ని ఎంతమాత్రమూ ఆనందించలేరు. పేరంటానికి వేంచేసిన ఇతర సుమంగళులు ఈ పాటలలోని అందాన్ని అనుభవిస్తారు. వీటి ఆవిర్భావానికి బిడ్డలు నిమిత్తమాత్రులే; వీటికి శ్రోతలు మాత్రము కారు. అందువల్ల, జోరుగా సాగే స్వరాలు తప్ప లాలిపాటలలో పిల్లలకోసము ఉద్దేశించినవేమీ ఉండవు. తొట్లెలలో పడుక్కునే శిశువులు తాళపు దెబ్బల్ని కూడా అనుసరించలేరు. కనక ఏదో 'రామలాలీ మేఘశ్యామలాలీ' అన్న ఒక్క లాలిపాటలో ప్రవేశించిన తాళగతి పిల్లలకోసము కాదేమో నంటాను.

పిల్లల్ని కవ్వించి వారి చైతన్యాన్ని రెచ్చగొట్టే పాటలు వారికి ఆరు నెలలేనా వచ్చేవరకూ పాడి ప్రయోజన ముండదు. ఆఁ ఊఁ అంటూ, పలకరిస్తే నవ్వే దశయే వారి చైతన్యము కదలాడడానికి ప్రారంభదశ. మెల్లగా వికసించే ఈ యెఱుకకి మాటలూ చేతలూ అలవర్చడములో పాటలు బాగా పనికివస్తాయి. కాళ్ళమీద పడుకోబెట్టుకుని ఉగ్గుపట్టిన తర్వాత, ఆ జిడ్డు వారి చేతులకూ, కాళ్ళకూ రాస్తూ, బొజ్జ నిమిరి 'జీర్ణం జీర్ణం; వాతాపి జీర్ణం;' అన్న మాటలే ప్రప్రథమంగా పలుసార్లు వింటారేమో పిల్లలు. ఐదు ఆరు నెలలు వచ్చేసరికి పిల్లలు కూర్చోగలుగుతారు. వారికి చేతులానకుండా కూర్చోడము నేర్పడానికి

> తారంగం - తారంగం
> తాండవకృష్ణ – తారంగం
> వేణూనాద – తారంగం
> వెన్నల దొంగ – తారంగం
> చిన్ని కృష్ణ – తారంగం

అని చప్పట్లు కొడుతూ, చప్పట్లు కొట్టడం నేర్పుతారు. ఈ పాటలోని తారంగం, తారంగం అన్న మాటలు తాళాన్నీ నాదాన్నీ కూడా ఇముడ్చుకుని పిల్లల్ని కవ్విస్తాయి. ఏకరేపా ఎత్తుకున్న బిడ్డకి ఈ పాటతో చప్పట్లు కొట్టడం బాగా నేర్పవచ్చును. అయితే లయ అంత సులువుగా పట్టుబడదు. గోరుముద్దలు తినిపిస్తూ పాడే,

> చందమామ రావె
> జాబిలి రావె
> కొండెక్కి రావె
> కోటివేలు తేవె
> బండెక్కి రావె
> బంతిపూలు తేవె
> నట్టింట పెట్టవే
> అమ్మాయి కివ్వవే

అన్న పాట తాళాని కనుగుణంగా కాకపోయినా చెయ్యి —పిలుస్తున్నట్టు— ఊపడం నేర్పుతుంది. ఈ పాటలు మూడు నాలుగేళ్ళ పిల్లలకి సులువుగా పట్టుబడతాయి. వారు ఈ పాటలు పాడుతూ చంటిపిల్లల్ని ఆడిస్తారు. ఇలాగ అడపా దడపా లయ గర్భితములైన పాటలు వింటూ, శిశువులు చప్పట్లు కొట్టడమూ, చేతు లూపడమూ నేర్చుకుంటారు. ఈ పాటలలోని లయ క్రమంగా వారి లలితసంస్కారములో ప్రవేశిస్తుంది. పిల్లల్ని ఎత్తుకుని పాడే

> చెయి వూచమ్మ చెయి వూచు
> సంతకు పోదాం చెయి వూచు
> శనగలు తెద్దాం చెయి వూచు
> చల్లగ తిందాం చెయి వూచు
> మిఠాయి తెద్దాం చెయి వూచు
> మెల్లగ తిందాం చెయి వూచు

అనే పాట తాళాని కనుగుణంగా చెయ్యి వూచడము నేర్పేస్తుంది. ఈ వూచడానికి చెయ్యి ఎత్త నక్కరలేదు, ఆట్టే కష్టపడ నక్కరలేదు. కనక బిడ్డలు చెయ్యి వూచడానికి చేసే ప్రయత్నాన్ని ఈ పాటయొక్క తాళమే నడుపుతుంది.

కాళ్లుచాచి, పిల్లల్ని తొడలమీద కూర్చోపెట్టుకుని గుండెల మీద ఒక చెయ్యి పెట్టి

'గుమ్మాడమ్మా గుమ్మాడి
ఏవూరెళ్ళింది గుమ్మాడి
ఏమి తెచ్చింది గుమ్మాడి
ఏలూరెళ్ళింది గుమ్మాడి
వెలక్కాయ తెచ్చింది గుమ్మాడి
పూలు పూసింది గుమ్మాడి
కాయలు కాసింది గుమ్మాడి'

అని ముందుకూ వెనక్కీ వూపుతూ పాడేపాట, మొత్తంగా వూపడమునించి శరీరానికి లయ అలవాటుచేస్తుంది. ఈ పాటలన్నిటికీ పాదాల్లో చివ్వర ఒకేమాట వస్తూంటుంది చూడండి. ఈఏర్పాటువల్ల బిడ్డల లేతనెత్తురులో లయ జ్ఞానము మెల్లిగా ప్రవేశిస్తుంది. ఆటా, పాటా, మాటా కలిసి అల్లిన సంస్కృతివేణీబంధాలు ఈ పాటలు.

ఇలాగ కొంతకాలమలవాటైతే, పెద్దవారు పట్టిచేయించనక్కరలేకుండానే పిల్లలు చెయ్యివూపడమూ, చందమామని పిలవడమూ, తాళానుగుణంగానో కొంచెం భిన్నంగానో చప్పట్లు కొట్టడమూ నేర్చుకుంటారు. 'దాయిదాయిరావే' అనగానే చంద్రుడికోసం చూడడమూ, 'నీముక్కేదీ' అంటే ముక్కుచలములు కుంచించడమూ, కళ్ళేవీ అంటే రెప్పలు అప్పళించడమూ ఈదశలోనే. ఈదశలోనే పిల్లల అరచేతులు పట్టి 'పప్పుపెట్టి, బువ్వపెట్టి,...అత్తారింటికి దారేదోయ్, అంబలికొండకి చిల్లేదోయ్' అని చంకలో కితకితలు పెడతారు. 'అత్తారింటికి దారేదోయి' అన్న పాదముయొక్క మాత్రాబద్ధగతినీ, ఆమాటలు సూచించే విశేషార్థాన్నీ పిల్లలు ఇప్పుడు గ్రహించగలరనుకుంటాను, కనుకనే తరుచు"అత్తారింటికి..."అని గతిబద్ధరచన ప్రారంభమవగానే చేతులు లాగేసుకుని దండల్ని చంకలకి నొక్కుకుంటారు. ఇంచుమించు ఈదశలోనే 'విద్దెము విద్దెము, వీసెడు నెయ్యి, విద్దెముచేస్తే గిద్దెడునెయ్యి,' అనేపాటలు అంటూ నిలబడడము నేర్పుతాము. పాట గతి దురితగతి. పడిపోతానేమో అని పసిబిడ్డపడే భయానికి ఇది వగారాకొట్టి నిలబెడుతుంది.

చేతులూ కాళ్లూ చేర్చి పట్టుకుని ఊపుతూ,

ఊయ్యాలోయ్
దంపాలోయ్

అని పాడేపాటా, చేతులుపట్టి చల్లచేసినట్టూపుతూ,

చల్లాచెయ్యి, గొల్లాభామ
పందిట దండలు కదిలేను
గోవులు కాయవె గొల్లాభామ
గుజ్జనకాళ్ళూ కదిలేను
పాలూ పిండవె గొల్లాభామ
పట్టెడు గుత్తులు కదిలేను"

అని పాడేపాటా, చేతులు అడ్డంగా కుడివైపునించి యెడమవైపుకి వూపుతూ,

తోడుపాయసంతోడు
తోడితే అబ్బాయికి వేడి
తోడు నీళ్లు తోడు
తోడితే చేతులు సాగు

అని పాడేపాటా, పెద్దవాళ్ళు వెల్లకిలాపడుక్కుని కాళ్ళు ముడిచి పాదాలమీద పిల్లలని కూర్చోబెట్టుకుని, ముందుకీ వెనక్కీ వూపుతూ,

నిమ్మచెట్లకు నీరోసీ
దానిమ్మకు ధారోసీ,
దబ్బచెట్లకు నీరోసీ
కొబ్బరికోనకు నీరోసీ
ఏతాం కిర్ర్"

అని కాళ్లు ఎత్తేపాటా, మెల్లి మెల్లిగా, బిడ్డకి మాటలు వచ్చేదాకా సాగుతాయి. ఇవన్నీ పిల్లలకోసము పెద్దలు పాడేపాటలే. ఇవి పాడుతూంటే మూడునాలుగేళ్ళపిల్లలు వీటిని వింటూ నేర్చుకుంటారు. చిన్నబిడ్డలకి లయ అలవాటు చెయ్యడానికి పనికివచ్చే ఈ పాటలే కొంచెం పెద్దపిల్లలకి యతులూ, ప్రాసలూ, గతీ అలవాటు చెయ్యడానికి పనికివస్తాయి. చంటిబిడ్డల్ని వీళ్లు ఆడిస్తున్నప్పుడు ఈ పాటల్నే పాడుతూ, తాళముకోసము తడుముకుంటూ, దిద్దుకుంటూ, సరిగ్గా పాడడము నేర్చుకుంటారు.

శిశువులకోసము పెద్దలు రచించిన పాటలయినా, ఇలాగు కొంచెం పెద్దపిల్లలే తరుచు పాడేపాటలు చాలావున్నాయి. ఇవి పిల్లల్నించి పిల్లలకే పాకుతూంటాయి సామాన్యంగా.

"తప్పెట్లోయ్ తాళాలోయ్
దేవుడిగుళ్లో బాజాలోయ్
పండ్లూ ఫలమూ దేవుడికోయ్
పాలూ ఉగ్గూ పాపాయ్‌కోయ్"

అనేపాట ఇలాంటిదే.

ఏనుగమ్మా ఏనుగు
ఏవూరెళ్లిందేనుగు
ఉప్పాడెళ్లిం దేనుగు
ఉప్పునీళ్లు తాగిందేనుగు
మావూరొచ్చిం దేనుగు
మంచినీళ్ళు తాగిం దేనుగు."

అన్నది మరొక్కటి. వీట్లోకూడా అంత్యప్రాస చక్కగా వినబడుతుంది. చంటిబిడ్డల్ని ఆడిస్తూ ఈ పాటలూ పాడతారు. యతి నిలపడముకోసము అసందర్భపుమాటలు 'ఉప్పునీళ్లు తాగిందేనుగు' వంటివి ప్రవేశించడము అజాగ్రత్తవల్ల మాత్రమేమీ కాదు. కావాలని ప్రవేశపెట్టినవే. *Nonsense Rhymes* అంటారు ఇంగ్లీషులో వీటిని.

పిల్లలని కాళ్లు చాపించి వరసగా కూర్చోపెట్టి కాళ్లను లెక్కపెడుతూన్నట్లుగా "కాళ్లా గజ్జి, కంకాళమ్మ, వేగూ చుక్క, వెలగా మొగ్గ, మొగ్గకాదు, మోటానీరు, నీరూకాదు, నిమ్మలవాయ, వాయాకాదు, వావింటికూర, కూరగాదు, గుమ్మడికాయ, కాయాకాదు, పాపాయి కాలు, కాలూతీసీ, గట్టునపెట్టు" అని పాడేది ఈరకపు పాటే. వీటిలో మాత్రా గతి

లికుతుగా నుంటుంది, యతులు చక్కగా పడతాయి. "గుడుగుడు గుంచం, గుండారాగం, పాములపట్టం, పడగారాగం, అత్తారి చెవులో ముత్యాలేస్తే బయటికిరావే పందికొక్కా" అనేదీ ఇలాంటిదే. ఇవి శిశువులకోసము కావు; మూడునాలుగేళ్ల పిల్లలికి. యతుల ప్రాధాన్యతా, గతి ప్రాధాన్యతా పిల్లల మనస్సులకు చక్కగా పట్టడానికి ఇవి సాయపడతాయి. ఆ రెంటిమీదా దృష్టిపెట్టి, అర్థశుద్ధిలేనిమాట గమనించరు పిల్లలు. ఇవి బాగా ఆకళించుకుంటే ఇక అర్థశుద్ధితో పాటలు కల్పించడము తరవాతి మెట్టే.

అల్లల్లా కోడి
పిల్లల్లా కోడి
గట్టుమీద కోడి
గవ్వల్లా కోడి
అడుక్కో బుడుక్కో
పంబారు బుడ్డి.

అనే పాటలో ప్రాసలూ యతులూ ఎలాగ కిక్కిరిసిపోయాయో చూడండి. ఒకొక్క ఆటలో పాడే పాటకీ ఆ ఆటలోని గతికీ ఎక్కువ సామరస్యము కుదరకపోయినా యతులూ ప్రాసలూ మాత్రము తప్పిపోవు. ఇద్దరు ఆడపిల్లలు చేతులు సాగించి పట్టుకుని పాదాలు ఒక్కచోట చేర్చి గిరగిరా తిరుగుతూ పాడే పాట వినండి,

"ఒప్పులకుప్ప - ఒయ్యారి భామా
సన్నపప్పు - చాయబియ్యం
చిన్నమువ్వ - సన్నగాజు
గూట్లో రూపాయి - నీమొగుడు సిపాయి."

అని యతుల్నీ ప్రాసల్నీ నిలబెట్టుతుంది. గిరగిరా తిరుగుతూన్నప్పుడు, అర్ధవలయాని కొకమారుగాని పూర్తి వలయానికిగాని ఒకమారు తాళము పడాలి. ఇది సాధించడమూ కష్టమే, చూచేవారికి స్ఫురించడమూ కష్టమే. ఇలాంటిదే

వానావానా వల్లప్పా
వాకిలి తిరుగూ చెల్లప్పా
తిరుగూ తిరుగూ చెల్లప్పా
తిరగాలేను చెల్లప్పా
విసురు విసురూ చెల్లప్పా
విసరాలేను చెల్లప్ప.

అనే పాట కూడాను—తిరిగి తిరిగి కళ్లు తిప్పడంవల్ల చతికిలపడిపోతారు పిల్లలు. అలాగని పాట విరిగిపోదు, సక్రమంగా నడిచిపోతుంది. ఒకొక్కప్పుడు ఆటలోని లయలే పాట లయకీ సామరస్యము సాధించడము సాధ్యమే అయినా, సాధించడానికి చూడరంతగా! తాళము తప్పినా ఆటపోదు.

కొండామీదా వెండీ గిన్నె
కొక్కిరాజు కాలు విరిగె
దానికేమి మందు?
వేపాకు చేదు
వెల్లుల్లి గడ్డ
నూనాయి బొట్టు
నూటొక్క ధార.

అని ఆఖరి గచ్చకాయ ఎగరవేస్తారు. ఈపాట ఆట సాగుతూన్నంతసేపూ దానిదారి నది సాగుతూనే వుంటుంది. 'ఒక్కో చెలియా, రెండూ రోకళ్లూ, మూడూ ముచ్చెలకా, నాలుగు నందన్నా' అని లెక్కపెట్టినప్పుడూ, 'దాగుడు మూత దండాకోర్' అని 'తల్లి పిల్ల' అరిచినప్పుడూ, 'నూకలిస్తా మేకలు కాస్తావా?' అని అడిగినప్పుడూ, 'ఉత్తుత్తా పండు, ఉత్తరేణీ పండు, దానిమ్మపండు, దబ్బాపండు' అని ఆటలలో పండేవారిని లెక్కబెట్టినప్పుడూ, ఆడపిల్లల పాటలలో యతులూ ప్రాసలూ తప్పిపోకుండా సరిగ్గా నడిచిపోతాయి. మగపిల్లల ఆటలలో, "ఒక్కాయి డొక్కి, రెండాయి రొట్టి, మూడాయ్ మువ్వ, నాలుగాయ్ నంది" అని గోళీల ఆటల లెక్కలోనూ, 'చిటుకు చిలాట్, ములికి ములాట్' అని బొంగరాల ఆటలోనూ, 'కాళ్లా కంటి, మూలా ముట్టి, నాలుగు వరాలు' అని గోటీబిళ్ళ లెక్కలలోనూ, 'ఆకు—అల్ల, నూది—సుద్ద; అంభి బీంచి, సర్వబీంచి; అరిటాకు—అరిమల్లి శేరు శనగల్లు; అనే చెడుగుడు కూతలలోనూ ఈ లక్షణాలే గోచరిస్తాయి. చిత్రంగా వుంటాయి ఉడికించే పాటలు ఇవి వినండి.

ఉడుకుడుకు బూరి
ఉప్పులో గారి
బ్రాహ్మడు బ్రాహ్మడు బెడ్డముక్క
బ్రాహ్మడి పెళ్లాం సుద్దముక్క"
'కోమటి కోమటి
కొత్త బెల్లం
కొంటావా? తింటావా?
కొంటే డబ్బు ఖర్చు
తింటే కడుపునెప్పి'
'తతా పీతా,
ముంజికాయమూతా'
'తాయిలారి నెత్తిమీద గోరింక
చెప్పకు చెప్పకు చిట్టిపాప
చెబితే నీ కళ్లోతాయి'

వీటన్నిటిలోనూ సామ్యము పాటంతటికి అదే వచ్చినట్టు కనబడే యతులే. దసరా పిల్లల్ని ఉడికించే పాట ఇది వినండి. ఉడుకు పాటలకి కిరీటము!

"పిడకలూ పుడకలూ అమరంగ పెట్టీ
అందులో అయ్యవార్ని పండుకో బెట్టీ
తాటాకు వెలిగించి తలకింద పెట్టీ
అయ్యయ్యొ పంతులూ అయిపోయినావా?"

ద్విపదలలోకి దిగింది తక్కిరి బిక్కిరి పాట! అయితే పిల్లలపాటలలో యతిప్రాసలూ, తాళముకూడా చక్కగా అమిరివున్న పాటలు లేకపోలేదు. మగపిల్లల కూతపాట వినండి.

ఇంతింత నాబండి ఇనపకట్లాబండి
తొక్కితే నాబండి తొంభైమైళ్ళా బండి
ఘల్లూ, ఘల్లూ, ఘల్లూ, ఘల్లూ,

రైలుబండిని గురించిన పాట ఇది. యతులూ అంత్యప్రాసలూ కనబడుతునే వున్నాయి. తాళముకూడా, ఏడేసి అక్షరాల నాలుగు లఘువులతో నడిచే పాదాల్లో తూగుతూ పడుతోంది.

ఉరుములు మెరుములు
ఉటాపు తీగెలు
కాళ్ళకు గజ్జెలు
ఘల్లూ, ఘల్లూ, ఘల్లూ ఘల్లూ,

అంటూ నాలుగేసి అక్షరాల లఘువులతో సాఫీగా నడిచి పోయేపాటకూడా ఈ రకమే. అయితే మగపిల్లల పాటలకి కడపల దసరా పద్యాలేనంటాను. ఎవరో తప్పిజారి ఒకడో అరో గాయకుడు కావచ్చునుగాని సమూహమంతా మొత్తమ్మీద గాయకులు కానవసరములేదు. కాని తెలుగుజాతి నైసర్గిక ఛందస్సు—ద్విపద—వారికి పట్టుబడాలి! అందుకే గాబోలు దసరా పాటల్ని ద్విపదల్లో రచించారు. రంగు రంగుల విల్లంబులు పట్టుకుని—

“శ్రీరస్తు విజయోస్తు దీర్ఘాయురస్తు
ఆరోగ్యమస్తు మీకైశ్వర్యమస్తు
వస్తువాహనమస్తు వారశుభమస్తు”

అని ఆశీర్వాదాలు,

మరుజనక మమ్మేలు మత్స్యావతార
గురుతుగా కృపజూడు కూర్మావతార
వరదుడవు కావయ్య వరహావతార
..........................
శేషాచలాధీశ శ్రీ వెంకటేశ

అని స్తోత్రాలూ,

అయ్యవారికి చాలు అయిదువరహాలూ
పిల్లవారికి చాలు పప్పుబెల్లాలూ

అని పాడుకుంటూ సగము ఆటగానూ కొంచెము పనిగానూ సంపన్నుల ఇండ్లకు బాలురు తిరగగల అవకాశమును దొరకబుచ్చుకుని దేశిసారస్వతము నడిచేదారులు వారికి సుపరిచితము చెయ్యడము మెచ్చుకోదగ్గది. దేశిసారస్వతంనించి పండితుల రచనలకి వారి మనస్సులు తిరిగేముందు దేశిని వారు చక్కగా గ్రహించుకోడానికి కూడా సాయపడతాయి మహార్నవమి ‘పద్యాలు.’

ఆడపిల్లల సంగతే వేరు. వారు అంతా పాటకత్తెలవాలనే అందరి ఇష్టమూను. పాటతోపాటు ఆటకూడా వారి హక్కే. కనక వారి పాటలు ఆటా పాటా మాటా చక్కగా హత్తుకునే దసకి వృద్ధి అవుతాయి.

చెమ్మచెక్క — చారడేసి మొగ్గ
అట్లు పొయ్యంగ - ఆరగించంగ
రత్నాల చెమ్మచెక్క రంగులెయ్యంగ
ముత్యాలచెమ్మచెక్క ముగ్గులెట్టంగ

అని పాడుతూ, నాలుగేసి అక్షరాల క్రియలతో నడిచే ఆ పాటకి అనుగుణంగా నృత్యము చేస్తూ ఆడపిల్లలాడుతూంటే చూడడానికి ముచ్చటగావుంటుంది. తాళము నిలబడుతూ నాదము రింగుమని మోగేపాట యిది వినండి.

“బుజబుజరేకుల పిల్లుందా
బుజ్జారేకుల పిల్లుందా
స్వామీదండల పిల్లుందా
సహారాజులు మెచ్చే పిల్లుందా”

అని ఇటూ అటూ రెండుజట్లు పిల్లలు వీరిని వారూ వారిని వీరూ సంబోధిస్తూ పాడుతారు. వీరు ఎదిగినపిల్లలు: తొమ్మిదీ పదీ ఏళ్ళవారు. ఈ పాటకి చాలావున్నాయి చరణాలు. గొంతులన్నీ శృతికలిసి మేళవించి, తాళము సరిగ్గా పడుతూవుంటే ఈ పాట ఆటకాదు పాటే అవుతుంది.

దీని తరువాతిది, నృత్యగీతాల్ని చక్కగా ప్రదర్శించడానికి ఆడపిల్లలు ఉపయోగించి బహుమతులు పొందేది, గొబ్బిపాటల నృత్యము. ‘గర్భ’ అన్న సంస్కృతపదము ‘గొబ్బి’ అయిందేమో అన్న దీక్షితులుగారితో నేనేకీభవిస్తున్నాను.

గొబ్బీయెల్లో గొబ్బీయనీ పాడారమ్మా॥
కంచీ వరదరాజాలే॥
గొబ్బీయెల్లో గొబ్బీయనీ పాడారమ్మా॥
..............................
ప్రహ్లాద వరదుడే॥

కిటతక, కిటతక అని నాలుగేసి అక్షరాల క్రియలతో, యతులు నిలబెట్టుకుంటూ, దీర్ఘాక్షరాలలో చక్కగా మేళవించే కంఠాల మాధుర్యాన్ని రంగరించుకుంటూ, కరకంకణాల తాళాలకి అనుగుణంగా పడే అడుగుల కలుపుతో స్ఫురించే బాలికా వర్తులపు ప్రసారాకుంచనాల లయ ఎలాంటి హృదయాన్నైనా గంతులు వేయిస్తుంది.

తోట విజయరాఘవుడట తన దశమస్కంధ పూర్వభాగకథా గొబ్బిపాటలలో “కరకంకణములు ఘల్ ఘల్లనగా-వినెడు సరసుల సుండె ఝల్ ఝల్లనగా-వరుస జప్పట్లూ గొట్టుచుమనో-హరములొనట్లూ-దిరుగుచు మది దిరముగ వరములు కరము భక్తినిగోరి “శ్రీపతిపై గొబ్బిపాడరే...” అని చక్కగా వర్ణించాడు. వరదరాజుల గొబ్బి పాటలలోనూ, అన్నమాచార్యుల గొబ్బిపాటలలోనూ, చూడికుడుత్తనాచ్చియార్ మీది గొబ్బిపాటలలోనూ మనము సామాన్యముగా వినే వరుసలే కనబడుతున్నా, తోటవిజయుని రచనలు మాత్రము హుసేనిరాగములో ఏదో కొత్తవరసలో ఉన్నాయి. అన్నమాచార్యులవారు తమ కాలములో వినబడుతూండిన పాటల వరుసలన్నిటినీ తమ సంకీర్తనాకాలములో చుక్కల్ని చేశేశారు. వారి వరుసలకు భిన్నమైన వరుసలన్నీ వారి తరువాతివారు కూర్చినవేనని ఊహించడము సాహసము కాదేమో.

# పాడులోకం! పాడుమనుషులూ!

శ్రీ బలివాడ కాంతారావు

నీలకంఠం, తోడి గుమస్తా పెళ్లాం పోయినప్పుడు అన్నాడు "ఆరోజు వస్తే ఎవరూ ఆపలేరు. అయినా నివ్వింత యిదిగా ఉండటం బాగులేదు. చచ్చేవాళ్లతో మనం చచ్చిపోతామా?" పొరుగింటాయన పెద్దకొడుకు కళ్లుమూస్తే "చావంటే మాసినబట్టను వదలి కొత్తది వేసుకోవటమేగా! ఆత్మకు చావులేదని తెలుసుకోరేం?" అనుకున్నాడు. ఆవీధిలో ఒక యింటిలో వారంరోజుల వరకూ ఒక చావుకు మిగిలినవారు ఒకటేయేడుపు "చావుకు యేడ్వ మనం ముస్లింలు, క్రైస్తవులు కంటే యెంత వెనుకబడ్డాం!"

నీలకంఠం ఎంత తేలిగ్గా అన్నాడో, అనుకున్నాడో చావు గురించి అంత చులకనగా అభిప్రాయపడ్డాడు.

పాతికేళ్ల పరిచయం ఉన్న భార్య గతించిందీ నాటికి. నీలకంఠంకు ఒక కాలువిరిగినట్లు, ఒక చెయ్యి తెగినట్లు, గుండె బీటలు దేరినట్లయింది.

చావు—భయం, భయంకరం—విషాదం! రోజంతా కడుపున నింపుకున్న దుఃఖాన్ని కటికచీకటిలో డాబామీద కన్నీటిగా కొంత కార్చాడు.

ఉండటానికి ఇల్లు సంపాదిస్తాననీ, భార్యకు పట్టుచీరలు కొంటానని, ఒంటి నగలు నింపుతానని పెళ్ళయిన మొదట్లో అనుకోవటమే కాదు.—పెళ్లాంతో చెప్పాడు కూడాను. చెప్పటమే కాదు ప్రయత్నించాడు. ఆ ప్రయత్నం ఊహలోనే జరిగింది. "అదృష్టం ఉంటే అవేవస్తాయ్" అని ఆమె అన్ననాడు నవ్వుకున్నాడు.

తొమ్మిది మాసాలు నిండేవరకు తనకు ఎవరైనా ఒకటే అనుకున్నా, కూతురుపుట్టగానే "ఇంటికి లక్ష్మీకళ" — ఉత్సాహంతో ఊగుతున్నాడు. ఆ కూతురుకు వీణ నేర్పిస్తాననీ, విద్యల సరస్వతి చేస్తాననీ యెగిరాడు.

"దానిరాత ఎలావుందో? అప్పుడే ఎందుకనుకోవాలి" అన్న భార్యమీద చిరాకుపడ్డాడు. రాత—రాత—మనుష్యులు సోమరులవటానికి, చేతకాని వాళ్ళవటానికీ ఈ పిచ్చి అంటుకుంటుందని అభిప్రాయం వెలిబుచ్చాడు.

ఈ కూతురుపెళ్ళి ఘనంగా చెయ్యాలనీ, గొప్ప ఆఫీసరు అల్లుడవ్వాలనీ, అనుకున్నాడు. అందుకు సర్వప్రయత్నాలు మనోభావాలతో చేశాడు.

ఒక కూతురు ఒక కొడుకైతే చాలు హాయిగా వుంటుందనుకుంటే రెండో సంతానం కూతురే!

మూడోసారి తప్పక కొడుకే అనుకున్నాడు. దేవునియొక్క నిజాయితీ చూదామని భార్యతోపాటు తనూ ఒకటి రెండుసార్లు ఉపవాసమున్నాడు. శివాలయానికి వెళ్లాడు. కొడుకని కలలుగన్నాడు. కొడుకు చదు వెలావుండాలో వూహించుకున్నాడు. ఒకరిద్దరితో యీసారి కొడుకుతప్పదని చెప్పుకున్నాడు. కొడుక్కీ తనకూ మధ్య యెలాంటి తగాదాలు ఉండవనీ, తను రిటైరై కొడుకువల్ల సుఖపడతానని తలచాడు. కానీ యీసారీ కూతురే! ఆ నిముషంనుంచీ దేవునిమీద భక్తి గౌరవాలు తగ్గాయి. పూజలు పురస్కారాలు బూటకం అనుకున్నాడు.

మూడోపిల్లకు తల్లి ఎంతో గర్వంగా ముగ్గురు పేరంటాళ్ల పేర్లు కలిపి "వెంకట సీతామహాలక్ష్మి" అని పేరుపెట్టింది. నీలకంఠం ఈ సన్యాసి ఎక్కడ పుట్టిపోయిందని సన్యాసమ్మ అని పిలిచేవాడు. చివరకు ఆ పేరే నిల్చిపోయింది.

పిల్ల యెప్పుడూ యేడుపే. నీలకంఠంకు ఎంతో చిరాకొత్తేది. చస్తే పీడాపోయేదని ఆలోచించినా అలా ఆలోచించటం పాపమని మళ్లీ సర్దుకొనేవాడు.

సన్యాసమ్మ షష్టిపూర్తి చదువుతో చాలించమంటే యేడ్చి యేడ్చి ఒకరోజు అన్నంకూడా మానివేసింది. భార్య "పోనీ దాని సరదా యెందుకు చంపాలని" బ్రతిమాలటంవల్ల థర్డుఫారంవరకూ వూరుకున్నాడు.

తనకు ఆడవాళ్ళ చదువుగురించి నిశ్చితమైన అభిప్రాయం యీనాటికీ లేదు. ఏమైనా యీనాటి చదువులు ఆడవాళ్ళకి పనికిరావని మాత్రం నిష్కర్షగా చెప్పగలడు. సీత, సావిత్రి, శకుంతల నేర్చిన చదువులాంటిది తన అమ్మాయిలకుకూడా చెప్పించాలని, అదే అసలైన చదువని తన అభిప్రాయం. ఆ సిలబసు చెప్పమంటే చెప్పలేదు. చాలామంది చదువుకున్న అమ్మాయిలు పెళ్ళిచేసుకోకపోవడమో, పెళ్ళిచేసుకున్నా మొగుడు చెప్పినట్లు వుండకపోవటం, డొంక తిరుగుళ్లు తిరగటం, గర్వం అహంభావంతో ఎగిరిపోవటం—యిలా యెన్ని దృష్టాంతాలైనా తన వాదనను బలపరచుకోడానికి చెప్తాడు. ఎవరైనా "నీ చిన్నమ్మాయిని యెందుకు చదివిస్తున్నా"వంటే తనకు తెగకోపం వచ్చేది. వాళ్లా ప్రశ్న వేశారని కాదు. ఆ అమ్మాయంటేనే కోపం.

సన్యాసమ్మ యిక చదవటం కల్లోమాట. ఏడుపు యిక పని చెయ్యలేదు. నాన్నజీతం భద్రంగా అమ్మపెట్టిలో పెట్టడం చూసింది. ఆ మరుచటిరోజు యింట్లో పెద్దరభస జరిగింది. "సరే! మరేం చేస్తాం. పోనీ చదవనియ్యండ"న్న పెళ్ళాంమీద నిజంగా ఈ

ఒక్కసారే కోపంవచ్చింది. దొంగతనంచేసి స్కూలుజీతం కట్టిన కూతుర్ని సమర్థించినందుకు భార్యమీదకు ఎగిరిపడ్డాడు.

తరవాత తనేదో తప్పుచేశాననుకున్నాడు. భార్యకు తనిచ్చిన వాగ్దానాలు జ్ఞాపకానికొచ్చాయి. అందులో వెయ్యోవంతైనా తను తీర్చడంలేదు. అయినా ఆమె తనని కనిపెట్టుకొనివుంది. అప్పుడప్పుడూ తను దురదృష్టవంతుడనని అసమర్థుడనని తనభార్య సమర్థ రాలనుకోవటం తనకు సరదా!

"ఏమీ అనుకోవద్ద" ని అన్నాడు.

"మీరైనా అనకపోతే యింకెవరంటారని" నవ్వుతూ అంది.

అలాంటి భార్య యీనాడు చచ్చిపోయింది.

కొడుకు కావాలన్న ఆశ...ఆరాటమై...నిరాశై...చివరకు కూతుర్లు యెదుగుతుంటే మంచి పెద్ద హోదాలోవున్న అల్లుళ్లు కావాలన్నకోర్కె హెచ్చయింది.

ఈ కోర్కె తీర్చుకోవాలనే ఆరాటంలో—

సంఘం పాడైపోయిందనుకున్నాడు. కట్నాలు రక్తంపిండి నట్లు పిండుతున్నారు. ఆడపిల్లలుండటం నేరం! ఉదాహరణలుగా యెన్ని కుటుంబాలనో వేలెత్తిచూపిస్తాడు. చాలాసంబంధాలున్నా యని తెలుసు. అవెందుకో తనకు నచ్చవనుకుంటాడు. వాళ్ళతో తనకు పొత్తు కుదరదు. మంచి మనసుకలవాళ్లయితే ముందుకే వచ్చే వాడు!

ముఖ్యంగా తన పెద్దకూతురు పెళ్ళే మనసులో యిరవైనాలు గ్గంటలూ వుండేది. ఆమెను ఒక చక్రవర్తికిచ్చినా తన ఋణం తీరదు. ఆకూతురు కడుపులో ఉన్నప్పటినుంచీ గర్వించాడు. రాను రాను పలవరించాడు, రోడ్డుమీద యెవరైనా అందమైన కుర్రాడు కనిపిస్తే తేరిజూచేవాడు. ఒక్కొక్కసారి నా కూతురికి తగిన వాడీ లోకంలో లేడేమో అనిపించేది. అందముంటే గుణం పూజ్యం. గుణం వుంటే అందం తక్కువ.!

ఒక్కొక్కసారి అనుకొనేవాడు "ఈ కుర్రాడు చాలా మంచివాడు. కట్నంలేకుండా పెళ్లిచేసుకోవాలని పట్టుదల. కానీ తండ్రి వేలమీద ఉన్నాడు. ఈ సంఘర్షణలో పాపం నలిగి పోతున్నాడ"ని విచారించేవాడు.

ఇంకోముసలాయనని చూసి "ఈయన రెండువేపులా ఖర్చులు భరించుకొని వున్న ఒక్కకొడుకును పేదింటి పిల్లనిచ్చి పెళ్ళిచేద్దా మనుకుంటున్నాడు గానీ పెళ్లాం కొడుకు కాదంటున్నారు." "ఉద్యోగం అయ్యాక గానీ, పెళ్ళిచేసుకోనని" చెప్పేవాళ్ళు చాల మంది తన వూహకు వచ్చేవారు. ఈ ఊహలో వచ్చినవాళ్లలో పెళ్లయినవాళ్లు, పిల్లలున్నవాళ్ళు కూడా వుండేవారు.

తన వూహ ఒక్కసారే నిజమైంది. బాగా డబ్బున్నవాళ్ళే. ఆ అబ్బాయిని చూడగానే కమ్యూనిష్టనుకున్నాడు. అక్షరాలా నిజమైంది. ఆ తండ్రి ఆ కొడుకుకోసం పడ్డఆరాటం! తండ్రినే దొంగలా చూస్తాడేం ఆ కొడుకు? నీలకంఠం తనకు ఆ కుర్రాడు అల్లుడు కాకూడ దనుకున్నా రెండురోజులవరకు విచారించాడు. ఈ లోకంలో ప్రజలు యెందుకు యిన్నిపార్టీలుగా విడిపోతారో తనకు అర్థంకాలేదు. తనకు మొదటినుంచి యిప్పటికి ఒకటే దృక్పథం. తను ఆరోజుల్లో ఖద్దరుకట్టాలనీ, సత్యాగ్రహం చెయ్యా లనీ, జైలుకు వెళ్లాలనీ, త్యాగపురుషు డవ్వాలనీ ఎంతో వుబలాట పడ్డాడు. ఏదీజరగలేదు కాని తనకు కమ్యూనిజమంటే పూర్తిగా తెలియకపోయినా మనిషిని కమ్చీతోకొట్టి పనిచెయ్యిస్తుందని అస హ్యంగా చూస్తాడు.

అయినా యీ ప్రజలు ఒకరికొకరు అసహ్యించుకోవటం తనకుగిట్టదు. తన చిన్నకూతురుమీద తనకు అసహ్యం అంటే ఒప్పు కోడు. కూతురంటే అభిమానమే, కూతురు గుణాలంటే నచ్చవు కాని. ఈ లోకంలో ఎవరికితగ్గ కష్టాలు వాళ్లకి ఉన్నాయి. డబ్బు కోసం ఒకతెగ కష్టపడితే, మానసికంగా మరికొందరు బాధపడ తారు—అంతే భేదమని చెప్తాడు.

అల్లుళ్లకోసం ప్రయత్నించింది తక్కువ—ఆలోచించింది యెక్కువ. మనసులో బాధపడింది బ్రహ్మాండం!

ఆఫీసులో తను డబ్బు రాబట్టుకోగలసీటులోనే ఉండేవాడు. ఈ కూతుర్ల పెళ్ళి ఒక్కొక్కసారి మనసును ఆ విషయంవేపు త్రిప్పేది. ఎంతోమంది పుచ్చుకుంటున్నారు కదా తను ఎందుకు పుచ్చుకోకూడదని పొరపాటున అనుకున్నాడు. పనిఅయ్యేవరకు బ్రతిమాలి డబ్బు చేతపెట్టారు తరువాత శాపాలుకురిపిస్తారు. అంతే కాకుండా డబ్బు పుచ్చుకుంటే తన్ను తనే తిట్టుకోవాలి; అనుమా నించాలి. లోకం యెన్నికైన మనిషని అనదు. దొంగని చూపించి నట్లు వ్రేలుతో చూపిస్తుంది. తను వృత్తి గాలిబుట్టవలె తేలిపోతాడు. లంచాలు పుచ్చుకున్న తోడి గుమస్తా పెళ్లాం చచ్చిపోయిందే! తనలాచేస్తే తన పెళ్లాం పోతుంది. వద్దువద్దని వందసార్లు అను కున్నాడు. ఈ బ్రతుకే చాలు...ఈ పెళ్లామే మహాలక్ష్మి!

పెద్దకట్నం యెరచూపలేని తను పెద్దకూతురు పెళ్ళినాడు ఎంత బాధపడ్డాడు! ఈ సంఘంమీద యెంతగా యేడ్చాడో. తను అనుకున్నదల్లా జ్ఞప్తికివచ్చి గుండె పగిలిపోయింది. అందం నెమ్మది, ఆభరణాలుగాగల యీ కూతుర్ని ముందూ వెనుక యెవరూ లేని తనలాంటి గుమస్తాకే యిచ్చాడు!

ఈ పెళ్ళయినా తను యేవగించుకున్న పెళ్లాం పిసినారితనం వల్లనే జరిగింది!

గుండెలో పుండు యింకా మానలేదు గునపాం పోటులా తగిలింది. విద్యల సరస్వతిగా వీణావాణిగా యింకా వూహలో నిలిచిన కూతురు విధవై కూర్చుంది! దేవుడు గుడ్డివా డని యేడ్చాడు:

విధవావివాహాలంటే తనకు ప్రీతి. వీరేశలింగంగారంటే భక్తి. ఎవరైనా అలాంటి వివాహాలు చేశారంటే ముచ్చటపడతాడు. కానీ తనకూతురుకు మళ్ళీ పెళ్ళిచెయ్యటమంటే గిట్టనిపని!

ఆడవాళ్ళు పవిత్రులనీ వాళ్ళ పాతివ్రత్యమే మన సంఘాన్ని సాంప్రదాయాల్ని యీ దొరలు రాజ్యం చేసినా నిలిపిందనీ తన గట్టినమ్మకం. తన భార్య ఎప్పుడూ నాకిదికావాలని అది కావాలని కోరలేదు. తనమాటకు యెదురాడలేదు. బాధపడటానికి జంకలేదు. అన్నిటికీ తల ఒగ్గింది ఈ నరకాన్ని స్వర్గం చేసుకుంది.

# పి. సి. ఏ. అండ్ కంపెనీ, ఆయుర్వేద సమాజం,

## పెరిదేపి - నెల్లూరు జిల్లా

శ్రేష్ఠమయిన మా ఔషధములు వేలకొలది మంది చే వాడబడుచున్నవి.

అనేక యోగ్యతాపత్రములు గలవు. వెల స్వల్పము, ఫల మధికము,

## నారసింహ లేహ్యము

బంగారు చేర్చబడినది, మేహములు, నిక్కాక - నిస్సత్తువ శుక్లనష్టము, అతిమూత్రము, మొదలగు వాటిని హరించి మిక్కిలి బలమును వీర్యవృద్ధిని, సంభోగశక్తిని, రక్తవృద్ధిని, కలిగించుటలో అమోఘమయినది.




రు. **3-4-0.**

20 తులముల డబ్బీ

## మదనకామేశ్వర లేహ్యము

మేహములు, నిక్కాక, నిస్సత్తువ, శుక్లనష్టము, అతిమూత్రము మొదలగు వాటిని హరించి వీర్యవృద్ధిని బలమును కలిగించును, దీనియందు బంగారు చేరదు గాని, నారసింహ లేహ్యము వలెనే పనిచేయును.

20 తులముల డబ్బి రు. **2-0-0**

## పాలసుగంధి లేహ్యము

సవామేహములు, మేహపొడలు మచ్చలు, చర్మరోగములు, కీళ్లనొప్పులు, మలబద్ధము - మొదలగు వాటిని హరించుటలో శ్రేష్ఠమయినది.

20 తులముల డబ్బి రు. **2-0-0**

## రోజాపుష్ప లేహ్యం

మలబద్ధమును ఖండించుటలో శ్రేష్ఠమయినది. అజీర్ణము, వాతము, మూలవ్యాధి మొదలగు వాటిని హరించి కాలవిరోచనమును చక్కగా కలిగించును.

15 తులముల డబ్బి రు. **1-0-0**

## చ్యవనప్రాస లేహ్యం

క్షయ-దగ్గు-ఉబ్బసము మొదలగు వాటికి మంచిది.

20 తులముల డబ్బి రు. **1-12-0**

## మహా ఖండార్ద్రక లేహ్యం

పైత్యములు, అజీర్ణము, వాంతులు ఎక్కిళ్లు - మొదలగు వాటిని హరించి ఆకలిని జీర్ణశక్తిని కలిగించును.

15 తులముల డబ్బి రు. **1-4-0**

## ఘనసార చందిని

ఇది-ఎరుపు, తెలుపు, పసిమి, మొదలగు అంటు (గనేరియా) సంబంధమగు వ్యాధులను, స్త్రీల కుసుమ వ్యాధులను ఖండించును. సీసా రు **2-4-0**

అనుపానము చందిని అత్తరు సీసా రు. 1-0-0.

## గంధక రసాయనము

రక్తశుద్ధికి శ్రేష్ఠమయినది — సవా మేహములు, మేహపొడలు, మచ్చలు. కుష్ఠువు, చర్మరోగములు. క్రిమిరోగము-అండవాయువు మొదలగు వ్యాధులను ఖండించి, బలమును కలిగించును. 10 తులముల డబ్బి రు. **2-8-0**

## ప్రమద

స్త్రీల పాలిటి వరప్రసాదము. ప్రదరము - బహిష్టు చక్కగా కాకుండుట, ఋతుశూల - మొదలగు గర్భకోశ సంబంధమగు వ్యాధులను హరించి సంతానమును కలిగించు దేవామృతము. 8 ఔన్సుల సీసా రు. **2-4-0**

## సంజీవన కల్పము

ప్రతి యింట నుండదగినది. జ్వరములు, ఉష్ణవాత సంబంధమగు వ్యాధులు, వళ్లు నొప్పులు, మూత్రవ్యాధులు, మొదలగు వాటికి అమృత తుల్యము—

5 తులముల డబ్బి రు. **1-8-0**

## చందనాది తైలము

సువాసన, మెదడుకు చల్లదనము, శిరోవేదిమి మొదలగు వాటిని హరించి వెంట్రుకలను వృద్ధిచేయును—

4 ఔన్సుల సీసా రు. **1-2-0**

## ఇంకా అనేక ఔషధములు గలవు.

## అన్నిటికి పోస్టు ఖర్చులు ప్రత్యేకము.

మా వద్ద శ్రేష్ఠమయిన 300 రకములగు ఔషధములు గలవు. కోరిన వారికి క్యాటలాగు వుచితము.

## పి. సి. ఏ అండ్ కంపెనీ, ఆయుర్వేదసమాజం-పెరిదేపి, నెల్లూరు జిల్లా.

**P. C. A. & Company, Ayurvedic Samaj, PERIDEPI, Nellore District**

అచ్చంగా ఆమెలానే కూతుర్లూ వుండాలని కాంక్షించాడు నీలకంఠం. అందుకే మొదటి యిద్దరుకూతుర్లంటే తనకు తెగ అభిమానం. భార్యకు వీళ్ళకు తేడా—భార్య ఉత్తరం వ్రాయలేదు—వీళ్లిద్దరు వ్రాయగలరు.

ఇన్నికష్టాలూ పంచుకున్న భార్య పోయింది. ఆలోచించాడు ఆమెతో వున్నకాలమంతా నెమరువేసుకున్నాడు. ఏకాకిగా యేడ్చాడు. ఆ వయసులో వాళ్ళెవరూ అంతగా యేడవనట్లు యేడ్చాడు. అంతేకాదు ఆభార్య చివరి ఘడియలు జ్ఞప్తికివస్తే యీ పాతికేళ్ళూ దగ్గరగావున్నవాడు ఆమెకు దూరమైనట్లు అనిపించేది. ఆ ఆలోచనరాకుండా వుండాలని ప్రయత్నించేవాడు.

"ఆమె స్వంతలాభం చూసుకుంది. ఆమె జీవితంలో ఒక్కసారే—అదీ చనిపోయేముందు" — నీలకంఠం దృష్టిలో ! యింత కల్లోలంగా వున్న యింటిని చూసి ఎలా విడిచివెళ్ళింది? పుణ్యస్త్రీ చావురావాలని కోరుకుందే? ఏమిటో పిచ్చి ! అంతమంచిమనిషి యేంకోరుకుంటే అది రాదూ? భార్య యింకా బ్రతుకుతానని కోరుకుంటే నీలకంఠం దృష్టిలో బ్రతికేదే!

ఆమెతో ఇల్లు సంపాదిస్తానన్నాడు. ఆమె అద్దెయింటిలోనే చనిపోయింది. ఒంటి నగలు నింపుతానన్నాడు. మంగళసూత్రంతోనే మాయమైపోయింది. పట్టుచీరలు కొంటానన్నాడు మాసిన బట్టలతోనే చనిపోయింది! అయినా ఆమె యివేవీ లేకపోయినా "నాకేం లోటు" అంటుండేది!

ఇదే తలపుకువచ్చి మరీ కళ్ళు నులుపుకున్నాడు!

ఇటు మనసులో మూలుగుతూ అటు పెద్దమ్మాయి లిద్దరువేపు చూస్తుంటే గుండె తరుక్కుపోయేది!

ఇద్దరూ ఆతల్లిని తల్చుకొని యేడుస్తారు. వాళ్ళని తను ఓదార్చాలనుకున్నా ఓదార్చలేడు! తను అసమర్థుడని అనుకోవటంకన్నా లోకం తనకు అన్యాయంచేసిందని ఎవరితోనూ చెప్పకోలేకపోతున్నాడు. తన ప్రస్తుత పరిస్థితులలో రెండో అమ్మాయి పెళ్ళి వూహించడానికైనా వీలులేనిదని స్ఫురించింది.

అంత సమ్రతతో బతికిన యిల్లాలికి తను యెంతైనా ఋణపడి యున్నాడు. ఆ ఋణం తీర్చుకోడానికి కార్యానికి మాసికాలకు రూపాయికు నెలకూ అణా వడ్డీలకు అప్పు వాడటానికి జంకలేదు. ఒక మిత్రునిదయవల్ల ఒక షావుకారుదగ్గర యెటువంటి హామీ లేకుండా యీ మూడువందల చిల్లర దొరకింది! అలా దొరకిందీ అంటే ఆ భార్య మంచితనమే అనుకున్నాడు.

నెలనాడు ఇరవైరూపాయిలు వడ్డీ కట్టాడేకాని మనసు భయంతో నిండిపోయింది. అన్నమాట నిలపటం తనవిధి. తను గంజి తాగైనా అప్పు దీర్చాలి అని అనుకున్నాడు — ఆ విషయం అహోరాత్రాలు ఆలోచించేవాడు.

ఈ ఆలోచనతో నీరసించటం అలావుంచి, చిన్నకూతురొక సమస్య తెచ్చిపెట్టింది. తల్లిపోతే బెంగపెట్టుకొని కుమిలిపోవలసింది! నిజానికి ఆతల్లి మిగతా యిద్దరికన్నా, యీ చిన్నకూతుర్నే బాగా చూసింది. వాళ్ళలా యీ కూతురు క్రుంగిపోకపోవటంచూసి యెంత కృతఘ్నురాలని అసహ్యపడ్డాడు!

ఇంటరులో చేరుతానని పట్టుబడితే తను పట్టలేనికోపంతో మాటాడలేక పల్లు పటపటలాడించాడు. స్నేహితురాళ్ళు సహాయం చేస్తామంటున్నారు. మీరేమీ అడ్డుపెట్టకండి అంటే వెటకారంతో యీసడింపుమాటలాడాడు. దీనితో కూతురు యింట్లో మిగతా యిద్దరిలా దేవతా విగ్రహంలా పవిత్రంగా వుంటుం దనుకున్నాడు.

సన్యాసమ్మ యింటరులో చేరింది! ఎప్పుడూ లేనిది నీలకంఠం కళ్ళు తుడుచుకొని తన కోపాన్ని దుఃఖంతో మిళితంచేసి మిగతా కూతుళ్ళదగ్గర వెళ్ళగక్కాడు. భార్య ప్రయత్నం లేకుండానే జ్ఞాపకం వచ్చింది.

కాలేజీనుంచి ఇంటికి వచ్చిన చెల్లెలిని యిద్దరూ మందలించారు. నాన్న కష్టాన్ని చెప్పారు!

సన్యాసమ్మ తనను కొందన్నట్లుగావూరుకొని మళ్ళీ స్కూలుకు వెళిపోతూ అంది! "నాన్నకా దొంగతనం ఎందుకు? నన్నేమైనా అనాలనివుంటే నా యెదురుగా అనకూడదేం?"

అసలు మనసంఘంలో యేయింటిలోనూ జరగనిపని జరిగిందని నీలకంఠం బాధపడ్డాడు !

దాని ప్రతిఫలం ఆమరుచటినెల తను వూహించినట్లే కనపడింది. ప్రయివేట్లు కూతురు చెప్పటం చూశాడు. ఒకనాడు ఆఫీసునుంచి వస్తూ గోడలమీద రాతలుచూసి కళ్ళు పొడుచుకోవాలనుకున్నాడు. తనపెళ్లాన్ని తలుచుకొని మనసు నింపుగా దుఃఖాన్ని నింపుకున్నాడు. ఆకోపంతో వచ్చి "చూడండమ్మా! మీ చెల్లెలు పేరు గోడ లెక్కిందే ! కర్మ ! కర్మ !" అంటూ తల బాదుకున్నాడు.

ఇద్దరు కూతుళ్ల కళ్ళల్లో నీటి పర్యంతం వచ్చింది. రెండో అమ్మాయి ధైర్యంచేసుకొని చెల్లెల్ని మందలించింది.

"ఎవరో తెలితక్కువవెధవలైతే నేనెందుకు బాధ పడాలి! రాయటమే కాదు — పేపర్లుకూడా పంచి పెట్టనీ" అంది. ఈమాటలు ఒకచెవిని వింటున్న తండ్రికి ఒళ్ళంతా జరజర లాడింది.

ఇంకోనెలలో కూతురు జోడు వేసుకోవటం చూశాడు. మడమలు కొద్దిగా ఎత్తుగా ఉన్నాయ్. ఏదో బ్రహ్మాండం బ్రద్దలైనట్లనిపించింది. అది మన సంస్కారానికి తగని దనిపించింది. ముఖమెత్తుకొని ఠీవిగా నడిచే ఆడవాళ్లని గౌరవించటం తను నేర్చుకోలేదు. ఇన్నాళ్లూ ఆగాడు, కూతురు ఒకనాడైనా ఒకకానీ అడుగుతుందేమో యని. అడగకపోవటంతో తను యింటికి పెద్దననే విషయాన్ని గమనించలేదని యేవగించుకున్నాడు. చిన్నకూతురికి ముఖం చూపించడమన్నా ఆమెతో మాట్లాడడమన్నా అసహ్యమైన పని—తనమనసు ససేమిరా ఒప్పుకోలేదు. దీనికింకోకారణంకూడా వుంది. ఆ వీధిలోనే కొందరు కాలేజీకుర్రాళ్లున్నారు. ఒకనెల అవసరానికి ఒకకుర్రాడ్ని అడిగి అప్పుతీసుకుందని తెలిసిపోయింది.

ఆ వస్రాళ్ళంటే తనకు అసహ్యం. వాళ్లు తన పిల్లలకోసం చప్పరిస్తుంటారని! అలాంటి తెగలో వాడిని అడిగింది!

ఈ కోపం ఉంచుకోడానికి మనసులో చోటులేక నెళగ్రక్కాడు. "ఆడవాళ్ళ ప్రతిచిన్నవిషయంలో మగవాళ్ళు మహా తెలిసినట్లు జోక్యం చేసుకోవటం అంత మంచిపని కాదక్కా! ఆడవాళ్లబుర్రల్లో మట్టిలేదుగా. ప్రతీదానికీ నాన్నమీద నే ఆధారపడమంటావ్? కన్నందుకు కడుపునిండా తిండి పెట్టున్నారు చాలదా?"

ఈ సమాధానంతో యిద్దరూ నోరు మూసుకున్నారు.

సన్యాసమ్మకు చదువిచ్చిన సంస్కారం నడకలోనూ, వేషభాషల్లోనూ కనిపిస్తూనే వుంది. అందమైన ఆ ముఖానికి మెరుగుపెట్టిం దీచదువు. మాటల్లో ముత్యాలు రాలతాయి. నవ్వకుండానే మోదాన్ని గొలిపే ముఖం చిరునగవు వెలబోస్తే చూచేవాళ్ళు చాలసేపటివరకూ, ఆ ముఖాన్ని మనసునుండి తుడిచి వెయ్యలేరు. యౌవనం ప్రతిఅవయవంలోనికి చొచ్చుకొనిపోయి విజృంభించింది!

ఇలాంటికూతుర్ని తను ఎంత స్వేచ్ఛగా విడిచిపెట్టాడు? లోకం ఏమనుకుంటుంది? ఆమెకు చిన్ననాడు వచ్చిన జబ్బులు కూడా తలపుకు వచ్చాయి. అనుకోకుండానే డాక్టరుని ఎందుకు పెట్టావని తికమకపడ్డాడు.

ఈ కూతురు మనస్సుకు యిచ్చేఆవేదనతోబాటు అటు డబ్బుకు కూడా చిక్కులుపడుతున్నాడు. ఇదివరకు ఒకరిదగ్గరకు వెళ్ళి చేయిచాపే అవసరం తనభార్య కలగనివ్వలేదు. ఇప్పుడు తెచ్చిన డబ్బు ఖర్చుపెట్టడంకూడా తనకు తెలీయటం లేదు. తను ఒకసారి హెచ్చు ఖర్చు పెట్టేస్తున్నానని, యింకోసారి పిసినారినైపోతున్నానని అనుకున్నా తనకు యెన్నడూ లేనిది డబ్బున్నవాళ్ళు ఖర్చులతో తన ఖర్చులు వాళ్ల నిజాయితీతో తన నిజాయితీ వాళ్ళ కష్టాలతో తన కష్టాలు పోల్చుకోవటం అలవాటయ్యింది. ముఖ్యంగా నెలకు వడ్డీ కట్టిననాడు మనస్సెంతో అటమటించి పోయేది. ఆ బాధతో ఎందరో తనలాంటి గుమస్తాల గురించి కుటుంబాలగూర్చి కడుపు సొదతో అటమటించే అనుక్కొనేవాళ్ల విషయం ఆలోచించేవాడు. ఆ రాత్రంతా నిద్దర వుండేది కాదు. రష్యాలో అంతా ప్రభుత్వమే చూస్తుందట—మన దేశంలో అలాంటి ప్రభుత్వంలేదే అనిపించేది. మిగతా డబ్బు యింట్లో చాలక యే స్నేహితుడినో అడిగితే వాడు, లేదన్నప్పుడు మెడకు వురిపోసుకోవాలన్నంతగా మనస్సు చచ్చిపోయేది.

రానురాను ఆర్థికంగా కష్టం వూహించటమే కాకుండా అనుభవించటం జరుగుతోంది. రోజుకు రోజు మనిషి బెంగతో నీరశించిపోతున్నాడు. తనెందుకో అప్పుతీర్చాలనికూడా ఆలోచించక పోలేదు. మధ్యను ఒక్కడ్ని పెట్టాడే—అందులో ఆడబ్బు భార్య కోసం వినియోగించాడే—మాటపోదూ?

తనకు యిదివరకులా దృఢంగా వుండే నమ్మకాలుకూడ చెదర జొచ్చినయ్. నిజాయితీ యేమిటనుకున్నాడు. తన తహశీల్దారు రెండు కుక్కలను పెంచుతున్నాడే—తన హెడ్ గుమస్తా స్వంత మేడలో ఉంటున్నాడు? తనకు తెలిసిన వాళ్లల్లో నిజాయితీగా ఉన్న వాళ్ళెవరూ కనపడలేదు. తనలా బాధపడ్డ వాళ్ళెవరూ లేరు. తను నిజాయితీగా ఉండిమాత్రం ఏం సుఖపడ్డాడు? తన పెళ్లామూ పోయింది. తనకూతురా విధవైంది—తనకా మగసంతానం లేదు. ఆడపిల్లలు కన్నందుకు బాధ్యత తీర్చుకోలేకపోయాడు.

ఇదే నిశ్చయానికివచ్చి తనకు డబ్బిచ్చేవాళ్ళెవరూ అగపడ లేదు. ప్రతిదానికీ మీదనున్న వాళ్ళే తడుముకుంటుంటే తనవరకూ వచ్చే దేమిటి? చేతకూ పావలాకు కక్కుర్తిపడే బదులు పూరుకుంటే ఉత్తమం. డబ్బున్నవాళ్లు మరింత పెరగడానికి, పేదవాళ్లమీద సవారీ నిజంగా చేస్తారని—వాళ్ల మానసిక బాధలకి ఈ సవారీ సరిగ్గా చెయ్యలేకపోయామనేదే కారణమని తోచింది. ఇన్ని పార్టీలుగా ప్రజలు విడిపోవటంలో వేసబబు యేమీలేదనిపించింది. సుఖం లేనిది ప్రజలంతా ఒకతాటిని ఎలా నడుస్తారు? కొందరి కడుపులు మాడుతుంటే మరికొందరి కడుపులునిండుగా ఉంటాయ్ – కొందర్ని చూసి మరికొందరు అసహ్యించుకుంటారు—ఒకరి నీడ ఇంకొకరు చూడలేరు. పేపర్లలో పెద్దపెద్ద వాళ్లు ప్రపంచశ్రేయో ప్రభుత్వమనీ ప్రజాప్రభుత్వమనీ—ఇలా పెద్దగా యిచ్చే ఉపన్యాసాలు చూస్తుంటే ఇదివరలా తను యిప్పుడు ఆసక్తి చూపించలేక పోతున్నాడు. సంస్కృతి గురించి ఎవరైనా మాటాడితే ఇదివరలా చెవి యొగ్గలేకపోతున్నాడు. ఆకలితో ఉన్న కడుపుకి అన్నమే సంస్కృతి—బాధపడే మనిషికి సుఖమే సంస్కృతి—ఈ సుఖం కమ్యూనిజంలో వస్తుందని విన్నాడు. దానిగురించి కొంత తెలుసుకున్నాడు. ఎలక్షన్‌లో ఆ పార్టీకే ఓటువేశాడు. రాజకీయచైతన్యం లేకండా బ్రతకకూడదని తోచిందతనకి. తను రిటైరయ్యేలోగా ఈ దేశంలో అంతా ప్రభుత్వం చూసుకొనే పరిస్థితివస్తే ఎంత అదృష్టం అనుకున్నాడు.

ఈ డబ్బువిషయంలో తప్ప మిగతావిషయాల్లో రష్యా సాధించిన అభ్యుదయాన్ని తనుకోరలేదు. రష్యాలో స్త్రీలు గడ్డెక్కి మాటాడతారు, సైకిళ్ళు తొక్కుతారు. విమానాలు నడుపుతారు. మొగాళ్లతో సరిసమానంగా ఉంటారు—వాళ్లపనిని పంచుకుంటారు; అది ఈ దేశానికి పనికిరాదని నీలకంఠం నిశ్చితాభిప్రాయం. మన బతుకులు వేరు యేమైనా మన జీవితాశయం వేరు, ప్రపంచంలో మన మతానికి ఒక విశిష్టమైనస్థానం, మనకు గొప్ప సాంప్రదాయాలు వున్నాయి. ఆడది పూజింపదగ్గ పవిత్రవస్తువు. వాళ్ళు గృహలక్ష్ములు. భర్తయందు గౌరవం – నవ్వుతూనే కష్టాలు అనుభవించే సహనంగల వాళ్లీ దేశపుస్త్రీలు!

ఆర్థిక సమ్మంధమైన ఆశయాల్లో మార్పువచ్చినా, నీలకంఠం నిజస్వరూపం అట్టే మారలేదు. అంచేతనే తనకూ, చిన్నకూతురుకూ, తగాదావచ్చింది.

ఈసారి అనుకోకుండానే కూతురుమీద విజృంభించాడు—సన్యాసమ్మ వెంటనే జవాబు చెప్పకుండా తరవాత, తండ్రికి వినిపించేటట్లు పెద్దక్కతో అంది "అభ్యుదయం అనేవాళ్లే అలా తీసుకుంటే నేనేం చేస్తాను! మనుషుల నాలుకకు హృదయానికి పోలిక లేదెప్పుడూ. వాళ్లని నాన్న పెద్దమనుష్యులుగా భావించడ మెందుకో?"

ఈ రకమైన మాటలు తనకు మరింత వెర్రెత్తించాయ్. ఏం లేకపోతే లోకం వూరికే అనదు. తనకూతురు, ఆ డిమాన్ స్ట్రేటరు వలలో చిక్కుకుందనే దృఢమైన వూహ తనను వూరుకోనియ్యలేదు. కాలేజీ కుర్రాళ్లు తనను చూసి అనలేదే! వాళ్లు దారంట పోతూ అనుకుంటుంటే తను విన్నాడు; కూతుర్ని రేపట్నుంచీ కాలేజీకి వెళ్లొద్దన్నాడు.

"చాల్లెద్దూ యీ చదువు" అంది రెండో అక్క. సన్యాసమ్మ నెమ్మదిగా "నాకు తెలుసు. చవుదుకుంటే ఆడదాని శీలం చెడుతుందని యీరకంవాళ్ల వుద్దేశం! అమాయకురాలిగా కనపడని ఆడదాన్ని గౌరవించలేని వాళ్ళు ఆత్మవంచన చేసుకుంటున్నారు. అందుకే యేమైనా అంటారు. ఆ డిమాన్ స్ట్రేటరుకు 'జబాబు చెప్పకండా వుంటే యెంతగర్వం అనేవాళ్లూ లేకపోరు!"

ఇంకా కూతురు చలించకండా కళ్లలో నీరులేకుండా మాటాడటం నీలకంఠం కోపం రెట్టింపు కాడానికి ఆధారమైంది. ఇంక యిల్లు కదలితే కాలువిరగగొట్టానని అరిచాడు. కళ్లలో కోపం నీటిని గిరగిర త్రిప్పింది. ఎవరినైనా క్షమించగలడు కాని శీలంలేని ఆడదాన్ని క్షమించలేడు. నేను చదువు మాననని కూతురు వెంటనే జబాబు చెప్పటంతో పల్లు పటపట కొరుక్కున్నాడు. పెదాలు కరచుకున్నాడు. ఈ కూతురు ఎవరితోనో లేచిపోయి తను వురిపోసుకోనేటట్లు చేస్తుందనుకున్నాడు.

ద్విగుణీకృతమైన కోపముతో సిగ్గుదెచ్చుకోమని యింకా నానామాటలూ అన్నా సన్యాసమ్మ అక్కడనుంచి జబాబివ్వకండా కదలిపోయింది, యిద్దరు అక్కలూ నాన్న కాళ్లమీదపడి క్షమాపణ కోరుకో అన్నట్లుగా చూస్తుంటే చివరకు నెమ్మదిగా, అంది "చస్తానుగానీ......"

ఈమాట స్ఫుటంగా చెవులోపడగానే నీలకంఠం మనస్సు అదోలా అయిపోయింది. ఆరాత్రి పడుకుందామన్నా ఈమాటే మనస్సులోనుంచి కదల్లేదు. తెల్లారి లేవగానే చావు మనసులో తిరిగింది, గబగబ అద్దంలో చూసుకున్నాడు, తనెంతగా చిక్కిపోయాడు? నిజంగా సగానికి సగమయ్యాడు. బలంలేనిది బ్రతుకేమిటి? తను అప్పులతోనే క్రుంగిపోతున్నానని ఆ వడ్డీలు పుచ్చుకొనేవాళ్ళు తనని పిప్పిచేస్తున్నారని, వాళ్ళెందుకు తను పోషించాలని యిలా యెంతో వూహించటం జరిగింది.

ఆవేళ పేపర్లో చావుగురించి పడిన వార్త చదవటానికి జంకాడు. ఆ మరుచటిరోజు యేదో శవం వెళిపోతుంటే తల దించి ప్రక్కరోడ్డుగుండా వెళ్లిపోయాడు.

చిన్నకూతురుని చూస్తే తనకేదో భయం ఆవరించింది. ఆమెను ఒక అసహ్యపుముద్దగా పరిగణించాడు. ఈరోజుల్లో యెంత ఆలోచించకూడదనుకున్నా మనసులో ఆ చావువిషయమే తిరుగుతోంది. రోజుకు రోజు ఆ భయం పోతోందని అనుకోవాలనుకున్నా అది హెచ్చు అవుతోంది.

అబ్బబ్బ! ఏమిటే యింత పిరికి! అనుకున్నా—అమ్మో! నేను యిలా యెండిపోయానే యే నిమిషంలో ఒంటికేమొస్తుందో నన్న భయం ఈ అప్పుల భయంతోపాటు నరాలన్నిటినీ పీకేస్తోంది!

తను చిన్న దగ్గు దగ్గినా, చిన్న రొంప చేసినా పెద్దకూతుళ్లిద్దరివేపు జాలిగా చూసేవాడు. ఒకనాటి రాత్రంతా వాళ్ళిద్దరి గురించే ఆలోచించాడు. ఆరాత్రి తను త్వరగా చచ్చిపోతానన్న అనుమానమే తన్నలా క్రుంగదీసింది!

ఆ మరుచటిరోజునుంచీ తను శ్రమపడకుండావుంటే బ్రతుకుతానని అనుకున్నా శ్రమపడుతునే వున్నాడు. జీతం అందుకొని వడ్డీ కడుతూనే ఉన్నాడు. తను అన్నం కొద్దిగానే తింటూన్నాడు.

రానురాను ఒక దెయ్యంలా యీ చావు భయం తన్ను బాధిస్తునే ఉంది. తననీడనే చూసి భయపడేవాడు. ఏరాత్రిమీద తెలివివస్తే అరుంధతిచుక్క కనిపిస్తోందో లేదోనని చూసేవాడు. ఒక్కొక్కసారి కనిపించేదికాదు. దానితో మనసు వికలమయ్యేది! తనభార్య చావు జ్ఞప్తికివస్తే — ఇదివరలా ఆ చావు తలచుకోలేకపోయేవాడు!

తన యిద్దరి కూతుర్లమీద అభిమానమే తన నింతగా భయపెట్తోందనుకున్నా ఆ అభిమానం రోజురోజు రెట్టింపవుతోంది! ఒక్కొక్కసారి ఆలోచనలు చాలాదూరంగా వెళిపోయేవి! తను చచ్చిపోతే ..వాళ్ళు అడుక్కుంటారు — అడుక్కుంటే ఎవరు కానీ వేస్తారు. యిచ్చినా యెన్నాళ్ళు!

నిజంగా తనకు ఒకనాడు జ్వరం వచ్చింది. కూతురే అంది జ్వరం వచ్చింది ఆఫీసుకు వెళ్లవద్దని. తనకు జ్వరం వచ్చిందనుకోవటం యిష్టంలేదు. ఏమీలేదని మొండికెత్తి ఆఫీసుకు వెళ్ళాడు. త్రోవలో తల తిరిగిపోతూంటే లోకం, వ్యక్తులు, వ్యవహారాలూ అంతా ఒక బూటకం అనిపించింది. తహశీల్దారునుంచీ బంట్రోతువరకూ లంచగొండులుగాను, కుర్రాడిదగ్గరనుంచి ముసలాళ్లవరకూ స్వలాభపరులుగానూ కనిపించారు. చివరకు తన్ను తానే అసహ్యించుకోజొచ్చాడు. తనొక పచ్చి అసమర్థుడని తోచటమే కాదు నిర్ధారించుకున్నాడు. ఇలా తను అనుకోగలిగాడంటే ఆ కూతుర్లమీదనున్న అనురాగమే!

చిన్నమ్మాయి డాక్టరుకి చూపిద్దామంటే కోపం వచ్చింది. లంఖనాలుచేసినా మనిషి మరింత నీరసించిపోయాడు గాని జ్వరం తగ్గలేదు. ఇల్లు కదల్లేని పరిస్థితి వచ్చింది. మంచం యెప్పుడైతే యెక్కాడో ప్రతిక్షణం బలంలేని మనస్సుకు చావు తలపు బాగా అంటుకుంది!

నాలుగురోజులు గడిచాయి. జ్వరం తగ్గే అవకాశా లేమీ కనపడలేదు. ఏ నిముషంలో తను చచ్చిపోతానో అనుకొనేవాడు. గుండె ఆగిపోతున్నట్లనిపించేది. తనకు దేవునిమీద భక్తి పూర్తిగా చచ్చిపోలేదు. ఇలాంటప్పుడు తను గంటలతరబడి ప్రార్థించాడు. తను దేవునికి పూజా పురస్కారాలు చేయకండా అపరాధం చేసినా, తన పెళ్ళాం, యిద్దరు పెద్దకూతుర్లు అపరాధం చెయ్యలేదు. అంచేత వాళ్ళిద్దరికోసం తను చచ్చిపోకుండా వుంటే వరం

ప్రసాదించమన్నాడు. చావురాదు, రాదనే కోరిక ప్రతిక్షణంలో నింపుదామనుకొనే అధైర్యాన్ని నింపుకుంటున్నాడు.

ఇద్దరుకూతుళ్లూ దగ్గర వాడిన ముఖాలతో కూర్చుంటే కడుపులో కత్తితో పొడిచినట్లయ్యేది. అవును — తనొక్కడే యీ లోకంలో అసమర్థుడు!

జబ్బుకంటే మనోవ్యాధే మనిషిని కూల్చేసింది! అలా ఒకొక్కసారి తలపుకు వచ్చి "అబ్బే! నాకేం జబ్బు. తిండిలేక నీరశించిపోయానుగానీ! నాది గట్టిశరీరమే! నేను చచ్చిపోవడమేమిటి?"

ఈ ధైర్యం ఒక లిప్తలోనే మటుమాయమై పోయేది. చిన్నకూతురు డాక్టర్ని తెచ్చిపెట్టింది. తనకు డాక్టరుమాటలు రుచించలేదు. జబ్బు గుంజుకోడానికి యింతది అంతచేస్తారని తనకు లేని జబ్బుని తెచ్చిపెట్టారని అసహ్యం!

నాలుగురోజులు గడిచినా మనిషి నాలుగింతలు నీరసించాడు. ప్రతినిముషం "నేను చచ్చిపోను" అనే అనుకుంటున్నాడు.

ఆరాత్రి తనకు అనుమానం హెచ్చిపోయింది. తనభార్యచావు కళ్ళకు కట్టుతోంది. తన పెళ్లాం పిలుస్తున్నట్లుగా తోచింది! తన ఒంట్లో అంత నీరసం వుండనే వుంది—అబ్బా! చావు......చావు... నేను చచ్చిపోవటమే...అమ్మో దేవుడా! నా కూతుర్లగతేంగానూ..."

కన్నులుమూతలుపడలేదు. ప్రతిక్షణంలోనూయేడుస్తున్నాడు. దేవుడు గుడ్డివాడని యీ ప్రపంచంలో న్యాయంగా పోయేవాడికి కూడులేదని విలపించాడు. వెక్కి వెక్కి యేడ్చాడు. పెద్దకూతురు కూర్చునే కునుకుతూంది. ఆ కూతురుముఖం చూస్తుంటే అతనికి ఎక్కడలేని అభిమానం కప్పేసింది! "అవును నాతల్లి ... యెంత పుత్తమురాలు! ఇలాంటప్పుడు గాజులు గలగల్లాడుతూ నుదుట కుంకుమతో...పిల్లలతోవచ్చి నాదగ్గర కూర్చొని ఉంటే.........నేనెంత హాయిగా చచ్చిపోదును" వెక్కుతున్నాడు. ముక్కు మూలుపుకుంటున్నాడు.

ఆప్రక్కనే రెండోకూతురు నిద్రపోతోంది! హరికేన్ లాంతరు మసకమసగ్గా వెలుగుతోంది! ఎప్పుడు ఆరిపోతుందో...! తనప్రాణం అంతే అనిపించింది!

తను యింకెంతసేపో బ్రతకనని నమ్మకంగా అనుకున్నాడు. ఆ యిద్దరికూతుర్ల వేపూ చూస్తూంటే గుండె పీక్కుపోతోంది! తను చచ్చిపోతాడు ఇల్లు కదలని తల్లులు ఇంటింట అడుక్కుంటారు! లోకం వాళ్లను కనికరించదు — వాళ్లయౌవనాన్ని దోచుకోవాలని యెందరు వెంటపడ్తారు! ఆకలితో మానం అమ్ముకున్న ఆడవాళ్లగురించి తను యెన్నికథలు చదివాడు.

యెంతమంది చెప్పగా విన్నాడు. యౌవనంతో తొణికిసలాడుచున్న తన కూతుర్లుమాత్రం యేమౌతారు? అన్ని మంచి గుణాలూ ఆకలిపాట్లలో ఆహుతైపోతాయి! అలా ఆలోచించేవారెందరు? ఫలానానీలకంఠం కూతుర్లు వీధిని పడ్డారు — రంకుటాలులయ్యారని అంటారు! ఎంత అప్రతిష్ఠ! ఇప్పుడే యింత యెగురుతోందికదా నేను కళ్లుమూస్తే నా చిన్నకూతురు యెవడితోనో ఎగిరిపోదూ?"

నీలకంఠం దుఃఖానికి అంతుపంతులేకపోయింది. ఆదుఃఖంతో పాటు యేనిమిషంలో కళ్లుమూస్తానన్న భయంకూడా కొండంతయ్యింది. ఈభయంతోపాటే తన కూతుర్ల నోటివెంబడి మాటలు విందామని కోరిక హెచ్చయింది!

అమ్మా! అని పిలిచాడు. పెద్దకూతురు ఆత్రతతో దగ్గరగా వచ్చింది. రెండోకూతురు లేచిపోయింది. నా బంగారు తల్లులు— వాళ్ళముఖాలు కనిపిస్తుంటే అలాంటి పవిత్రమైన పిల్లలని విడచి వెళ్తున్నానే అని బావురుమని పైకి యేడవలేక లోన గగ్గోలుపెట్టి యేడుస్తున్నాడు.

చివరకు హీనమైన గొంతుకలో దుఃఖాన్ని మిళితంచేసి "సరమ్మా సరి!" అందామని అనలేక గొనుక్కున్నాడు. యిద్దరు కూతుర్ల కళ్ళనీళ్ళు తనమీద వ్రాలాయి. కొంతసేపటివరకూ ఆ దృశ్యాన్ని చూడలేక కళ్ళు మూసేశాడు. ఈ క్షణంవరకూ ఈ ప్రపంచంలో తను అసహ్యించుకోకుండా వున్నవి రెండు జీవాలే!

తను అందామనుకున్న వెన్నివున్నా ఒకమాటా అనలేకపోతున్నాడు. 'ఎటుచూస్తే అటు చీకటే' కనిపిస్తోంది. మళ్లీ కళ్లు తెరచి ఆ ముఖాలవేపు చూసి వెయ్యిగొంతుకలు కలిగినట్లుగా నాకు చావురావద్దని యేడ్చుకున్నాడు.

ఏ నిముషంలో మాటపడిపోతుందో? ఏ క్షణంలో గుండె ఆగిపోతుందో? తను కోరికను వెళ్ళగక్కాలి! కానీ యేమని చెప్పగలడు? తనకు కావలసింది తనకూతుర్లు తను చచ్చిపోయాక వాళ్ళ శీలాన్ని కాపాడుకుంటామని వాగ్దానమివ్వాలి. కడుపుకు లేకపోతే చచ్చిపోతాంగానీ లోకం వేలెత్తి చూపించేట్లుగా వుండమని హామీయివ్వాలి!

ఎంత సంక్షోభిచెందినా ఆమాట తను బయటకు అనలేకపోయాడు. కూతుర్లు తెగించి అంటారని కాంక్షించాడు. కానీ వాళ్ళు తల్లిశరీరంలో బాగులేనప్పుడెలా యేడ్చారో అలానే యిప్పుడూ యేడుస్తున్నారు. వాళ్లయేడుపు కారకుడు తనేగా? వాళ్లకు యీ రక్తమాంసాలుతో తప్పించి యింకేమి వుంచాడు?

ఒక్క మూలుగు బాధతో మూలిగాడు. కూతుర్లిద్దరూ మరీ దగ్గరకు జరిగారు. ఇద్దరిచేతులు పట్టుకొని కళ్లల్లో నీరుబికి ప్రవహిస్తుంటే యిద్దరూ వెక్కి వెక్కి యేడుస్తున్నారు. "సరమ్మా... సరి...మీ అమ్మదగ్గరకు వెళిపోతాను...వీరాగతి...!"

ఉధృతంగావచ్చే దుఃఖం మాటలను రానియ్యలేదు. కూతుర్ల నోటి వెంబడి మాటవిందామని మహా వుబలాడపడుతున్నాడు.

నిముషాలు దాటిపోతున్నాయి. ఏడుపుతప్పించి ఒక్కమాటా రాలేదు. ప్రతిక్షణం యిదే ఆఖరుక్షణం అనుకుంటునే ఆ ఒక్క మాటా విందామని నిరీక్షణగా చూస్తున్నాడు. కాలం దొర్లుకపోతోంది తనకాంక్ష క్రుంగిపోతోంది! నిరాశతో నిట్టూర్పులను విడుస్తున్నాడు. రాను రాను "నాకేం నాన్నా" అనైనా యీ కూతుర్లు అంటారేమోనని ఆమాట వినైనా చచ్చిపోదామని యెదురు చూశాడు!

మళ్ళీ అన్నాడు "పాడుమనిషులు—యీపాడులోకంలో—మీరు బ్రతకడానికి—యేమీ వుంచలేదమ్మా! ఎలావుంటారో?"

ఈ మాటలకు మరింతయేడుపు తప్పించి మాటలు రాక పోటంతో, చిరాకు, దుఃఖం, కోపం, జాలి, అన్ని అనుభూతులూ ఒక్కసారిగా కల్గాయ్.

తనభార్య చావు జ్ఞప్తికి వచ్చింది! ఎంత హాయిగా చచ్చి పోయింది! తనకా అదృష్టం లేకపోయింది. యీ జన్మ ఉత్తి పనికి మాలినదైందని తలపుకువచ్చింది. తను చచ్చిపోతున్నాడు... ఏడుస్తూ చచ్చిపోతున్నాడు...ఆ క్షణంలో తనకు తను విడిచి పెట్టున్న యీలోకంలో అన్ని అసహ్యించుకున్నవే...తన యిద్దరి పెద్దమ్మాయిలు కూడాను!

కళ్ళు నిలబెట్టి అలా చూస్తుంటే కూతుర్లిద్దరికి భయంవేసి కావుమన్నారు. చిన్నకూతురులేచి గబగబవచ్చింది. తండ్రి మంచం మీద కూర్చోగానే నీలకంఠం ముఖంప్రక్కకు త్రిప్పివేశాడు.

సన్యాసమ్మ యేడుస్తున్న యిద్దరి అక్కలవేపు తీక్షణంగా చూసింది. నాన్న వంటిమీద చెయ్యివేసి "ఇంకేమీ రాదర్రా మీకు! ఇలా యేడుస్తూనాన్నని అధైర్యపరచండి! ఊరుకుంటారా లేదా?" అంటూ ఒక్కగసురు విసిరేసరికి యిద్దరూ, చెల్లెలి వేపు చూశారు.

ఈ మాటలు తను వినకూడదనుకున్నా విన్నాడు. ఏమీ అనుకోకూడదనుకున్నా అనుకున్నాడు. తను నిజంగా చచ్చిపోతున్నాడా లేక తన అధైర్యమే తను చచ్చిపోతున్నావని అనుకోనిస్తోందా?

చిన్నకూతురు "నాన్నా నాన్నా..."అని పిలిచింది. అనుకోకండానే వూఁ అని మూలిగాడు. "అధైర్యపడకండి! డాక్టరు చెప్పాడు. నీరసం తప్పించి యింకేంకాదని! నాలుగురోజుల్లో లేచి కూర్చుంటారుగా! కొద్దిగా నోరుతెరవండి...బార్లీనీరు పోస్తా!"

తనకు జబ్బులేదూ? తను చచ్చిపోవడంలేదూ? అబ్బబ్బే!తను చచ్చిపోతున్నాడే?

కూతురు నోటిలో బార్లీ పోస్తుంటే త్రాగకూడదనే గుటక వేశాడు. గుటకవేశాక తను గుటకవెయిగలిగావని తను బ్రతుకుతానని కొద్దిగా ఆశకలిగింది!

చిన్నకూతురు అంతతో చాలించలేదు. ఆమె గొంతుక విప్పితే తన కేదో క్రొత్త అనుభూతి కలుగుతోంది! అసహ్యం అధైర్యాలనే మంచుకొండల్లో తను కప్పబడ్డాడు! ఆమె మాటలు సూర్యరశ్మిలా వాటిని కరిగిస్తోంది!

అయినా ఆమెవేపు కన్నెత్తిచూడలేదు. లోలోనే యెన్నెన్నో అనుకుంటున్నాడు!

సన్యాసమ్మ కల్లోలంలో ఒక చల్లని కబురుచెప్పింది. తను కలలోనైనా యీమాట తన కూతురు నోటివెంబడి వస్తుందని వూహించలేదు. కాలేజీ మానివేస్తానని కూతురుచెప్పగానే మనిషి ముఖం నిగనిగలాడింది. పోయినప్రాణాలు తన బొందికి చేరు కుంటున్నట్లనిపించింది. కూతురు తియ్యగా అన్నది! "మీ రధైర్య పడకండి నాన్నా! ఈ అప్పులు తీరవని బెంగపడకండి. ఇప్పు డెలా ప్రయివేట్లు చెప్తున్నాగా, చదువు చాలిస్తాను. మరికొందరికి చదువుచెప్పొచ్చు! ఉద్యోగం దొరకేవరకు యిలా కానిస్తాను!"

ఈ ముక్కల్లో వెయ్యోవంతు కాంక్షించి నిరాశచెందిన నీలకంఠంకు లేచికూర్చోవా లనిపించింది. చిన్నకూతురు అంతతో వూరుకోలేదు "ఇద్దరి జీతం యేంచేసుకుంటాం నాన్నా? చిన్నక్క పెళ్లిచేద్దాం! అంత ముందుకొచ్చే మగాడుంటే పెద్దక్క పెళ్లి కూడా చేద్దాం! మనకేం? మనడబ్బు ఒకరు తినే పరిస్థితివస్తుంది!"

నీలకంఠం కళ్లల్లో నీరువుబికింది ఒక్కసారి శరీరమంతా వుబ్బి నట్లయింది. ఏడుస్తూనే నవ్వుతున్నాడు! తనకూతురు పుట్టేముందు, కొడుకని పడ్డ ఆరాటం మనసులో తిరిగింది. దేవుడు తనకు కొడుకు కంటే హెచ్చయిన రత్నాన్ని యిచ్చాడు. దేవుని దూషించి నందుకు యీ కూతుర్ని అసహ్యంగా చూసినందుకు విచారించాడు. తన భయంతో తను మెడలో వేసుకున్న వురిని యీకూతురే తప్పించింది!

అయ్యో! తను జీవితంలో ఎంత తెలివితేనిపని చేశాడు? తన పెద్దకూతుర్లిద్దరిని చదివించవలసిందే!!

# తీగెపడుచు

శ్రీ వేముగంటి నరసింహాచార్యులు

నవ వసంత ప్రియస్పర్శ దవిలినంత
పసరు మొగ్గల గగ్గురుపాటు గలిగి
క్రొత్త సింగారములు దిద్దుకొని యవిరళ
రాగమును వ్యక్తపరుతువో తీగెపడుచ!

పచ్చ పచ్చని తొలకరి పంటవలతి
లేత పచ్చిక పానుపుల్ సిద్ధపరుప
ప్రేమతో ప్రక్కగల విటపిని పెనగొని
కౌగిలింతల మురిసెదో తీగెపడుచ!

తలిరు చేతుల పూల బిడ్డలను ఎత్తి
రేకు రేకున వాత్సల్యమే కురియుచు
పాల బుగ్గల మకరంద పరిమళముల
తేలిపోదువు చక్కని తీగె పడుచ!

మంజులమ్మైన శ్రావణ మాస వేళ
నీలి మబ్బుల రేడు అందాలవాడు
చినుకు ముత్యాలజల్లు వర్షించి నిన్ను
తీయగా గౌరవించునో తీగెపడుచ!

కడలు పులకించి పోవగా పడగవిప్పి
నాట్య మొనరించు నాగకన్యక విధాన
మందమారుత వీచికాస్పందనముల
ఊగియాడుదు వటునిటు తీగెపడుచ!

స్వచ్ఛ శారద జ్యోత్స్నా ప్రశాంత కాంత
యామినులు చెలికత్తియలై భజింప
రమ్యమగు పూలతోటకు రాణివోలె
భోగముల నోలలాడు దో తీగె పడుచ!

శిశిరఋతు నాయకుని కొంటె చేష్టవలన
ఆకు కోకలు జారి నగ్నాంగ వగుచు
సిగ్గు బరువున తటకున శిరమువంచి
దిగులుపడి దిశల్ జూతువో తీగెపడుచ!

వాడి, తొడిమలముడి వీడి, పదములకడ
రాలిపోయెడు చిన్నారి పూలను గని
మెల్లగా జారు మంచుకన్నీళ్ల తోడ
తెలుపుదువు మూగశోకమ్ము తీగెపడుచ!

# విరుదుకవుల యుదంతములు

శ్రీ నిడుదవోలు వెంకట్రావు

★

## ౧. ఆంధ్రపాణిని

నెల్లూరి శివరామకవి తన 'కామకళానిధి'[1] కృత్యవతరణికలో తన గురువు నిట్లు వర్ణించి యున్నాడు.

సకలాంధ్రోక్తుల "కాంధ్రపాణిని"
యనన్ శాస్త్రంబు గల్పించితత్
ప్రకృతి ప్రత్యయ నిర్ణయంబు కొఱకై
భాష్యంబు గావించి దే
శికుడై రాజులచేత బూజగొను
నా శేషాచలర్షిన్ నివృ
త్తికులస్వామిని మద్గురున్ గొలుతు
భక్తిన్ మానసాబ్జంబునన్

పైపద్యమును బట్టి 'ఆంధ్రపాణిని' యని పేర్కొనబడిన యాతడు 'నివృత్తి' కులజుడనియు, శేషాచల నామధేయుడనియు రాజులచే బూజింపబడిన వాడనియు, నాంధ్రభాషకు సంస్కృతమున పాణినీయము వలె సూత్రములుగావించి, దానికి భాష్యముకూడా వ్రాసినాడనియు స్పష్టమగు చున్నది-

ఇక నీయాంధ్రపాణిని బూజించిన రాజు, తంజాపూరి మహారాష్ట్ర రాజులలో సంస్కృతాంధ్ర భాషా పోషకుడై కవియై గణుతిగాంచి మహా ప్రసిద్ధుడైన శహాజీ—ఇతడు తంజావూరిలో మహారాష్ట్ర రాజ్యము స్థాపించిన ఏకోజీ కుమారుడు. క్రీ॥ శ॥ 1684-1712 వఱకు తంజావూరిని పాలించినవాడు—ఈతని పేర శేషాచల కవి రచించిన భోసల కోసలీయమను నముద్రిత సంస్కృతకావ్యము నుండి కవిని గూర్చి యీ క్రిందిరీతిని గలదు.

సాయాసంకవనేతతోఽపి కఠినంకావ్యంతతో రూపకమ్
తస్మాద్ధ్వన్యమతః పదధ్వనిరసై వాగ్వైఖరీ జీవితమ్
తద్రామాయణ భాసిమజ్జయకథంజల్పాంధ్రవాక్పాణినే
శ్రీశేషా పత్యమాత్యకుశలోఽస్మీత్యాహ శాహాధిపః
శాహేంద్రదత్త శిబికా కనకాభిషేక
సంభావనారుణ భిద్రప్రతి కారహేతోః
యత్సాహసం విరచయేనను తత్రవాణీ
త్వత్తోఽధికం ప్రతి భువంకలయేన నూనమ్.
ద్వితీయ సర్గాంత గద్య
శ్రీభోజోనిజగోత్రకారణభరద్వాజోనివృత్త్యన్వయా
ద్యః శ్రీవేంకటపత్యమాత్యతిలకాజ్జాతోఽక్కదేవీవిభోః
శ్రీశేషా పత్యభిఖ్యకృతి నాస్తస్యాంధ్ర వాక్పాణినే
కావ్యేభోసలకోసలేంద్రచరితే సర్గే ద్వితీయోఽభవత్
మొదటనుండి ఆరుసర్గలు కలవు.[2]

పైయుదాహృతిని బట్టి 'ఆంధ్రపాణినియన బరగిన శేషాచల కవి శాహాజీ మహారాజుచే కనకాభిషేక మహా సత్కారమును, నాందోళికాది విశేష బహు

---

1. కామ కళానిధి పేరునుబట్టియే కామశాస్త్ర గ్రంథమని తెలియుచున్నది గదా. ఇది పద్యకావ్యము. తంజావూరి మహారాష్ట్ర రాజులలో, క్రీ శ. 1728 నుండి 1736 వరకు తంజావూరిని పాలించిన మొదటి తులజాజీ లేక తుక్కోజీ కుమారుడగు జయసింహునికిది కృతి—ఈ జయసింహుడు రాజ్యము పాలింపలేదు. ఈతని సోదరుడే ప్రతాప సింహుడు (1739-63) ముద్దుపళని వెలసినది ప్రతాప సింహుని కాలమునందే. కావున జయసింహుడును, శివరామ కవియు క్రీ. శ. 1730 ప్రాంతము వారు.

కామ కళానిధి క్రీ. శ. 1930 లో శృంగార గ్రంథమాల వారు ముద్రించినారు. ఈ గ్రంథము కృత్యవతరణికలో జయసింహుని వఱకు గల మహారాష్ట్ర రాజులవంశ వివరములు సంపూర్ణముగ నొసగబడినవి. కాని ముద్రణ గ్రంథమున నవతారికలేదు. మఱియు కామ కళానిధి వ్రాత ప్రతి. తంజావూరి పుస్తకశాలలో లేదు. మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో నున్నది.

2. A Descriptive Catalogue of Sanskrit Manuscripts. Tanjore Saraswati Mahal Library. Kavyas Vol. VIII Concluded No. 4233 Pages 3275-3277.

మానములను పొందినవాడనియు, నీతని గోత్రము భారద్వాజ గోత్రమనియు, తల్లి అక్కమ యనియు, తండ్రి వేంకటపతియనియు స్పష్టమగు చున్నది. సంస్కృతాంధ్ర భాషలయందే కాక, అష్ట[1] భాషల యందీతడు కవిత్వము చెప్పగలడని 'శాహరాజ విలాసము[2]నుండి తెలియుచున్నది.

"లలితగతి శాహరాజ విలాసమనెడు
నాటకముసేయు బుధులు సంతసము నొంద
ధీచమత్కృతి వెలయ శేషాచలపతి
అష్టభాషా విశేషంబు లమరు సుకృతి

ఈనాటకమున

"శ్రీకరగుణశాలి యేకేంద్రసుతమౌళి
స్వారిరాగా నొక్క సరసిజాక్షి
చూచి మోహించుచు శుకముఖ్య దూతిక
లంపిమన్మథ వితశాత్మయగుచు
వనకేళి మీనకేతను పూజ లొనరించి
శుభ సూచకంబైన సూక్తివలన
నవిలంబముగ చెలుల్ ప్రాణేశు డౌశాహ
విభునితో గూర్చిన విభవమెల్ల"

వర్ణితమైనది.

ఈశేషాచల కవియే తాను రచించి, గ్రంథ కర్తృత్వము శాహాజీమహారాజు పేర వెలయింప జేసిన 'సరస్వతీ కల్యాణము[3], నుండి యీతని తండ్రి మధురను పాలించిన చొక్కనాథ నాయకునియొద్ద మంత్రిగా నుండెడి వాడని తెలియుచున్నది. చొక్కనాథ నాయకుడు క్రీ. శ. 1659 నుండి క్రీ. శ. 1682 వరకును మధురను పాలించినవాడు. లింగనమఖి శ్రీ కామేశ్వర కవి ధేను మాహాత్మ్యము నీతనికే కృతినిచ్చినాడు.

సరస్వతీ కల్యాణములో

"అగుచొక్కనాథు మహామాత్యనాథు
సుగుణ సత్పుత్రుండు సుజనమిత్రుండు
చిరపుణ్య వరమతి శేషాచలపతి
వరశాహ విభుపేర వహిని దైవార
చారు శృంగార రసంబుల ధీరు
లౌరాయనుచు మెచ్చ హర్షంబు హెచ్చ
మొల్ల పువ్వుల పొట్లములు విప్పినట్లు
చల్లగా పన్నీరు జల్లినతీరు
పరగు సరస్వతీ పరిణయంబనెడు
సరసనాటకము లాస్యముల రంజిల్లి
భావముల్ తగు వేషభాషాదు లసర
గావించె భరతులౌ గాయకుల్ మెచ్చ
ఆచక్ర వాళాచలాచలాచక్ర
మాచంద్ర తారార్కమై యొప్పుగాత

అని ముగింపు గలదు.

ఇక నీతని యాంధ్రపాణిని బిరుదము సన్వర్థము చేసిన వ్యాకరణ శాస్త్ర గ్రంథమును గూర్చి వివరించెదను. ఇది యాంధ్రవ్యాకరణమను పేరితో తంజావూరి పుస్తకశాలలో నున్నది- [సంఖ్య-773_775] దీనిలో కృతికర్త తనపేరు 'శేషసుమతి'[4] యని వ్యవహరించినాడు. గ్రంథ ప్రారంభము.

"శ్లో॥ శ్రీశం దేవముపాస్య శేషసుమతి
స్సర్వాంశ్చభాషావిదాన్
కావ్యా దివ్యవహార చారుచతురాం
మత్వాంధ్ర భాషాంచిరాత్
తాంవ్యుత్పాదయ దంధ్రపాణిని
సమస్తజ్ఞోప కారీభవన్
ఆంధ్ర వ్యాకరణమ్ గణైర్మ్మని
మతైస్సాకం వ్యతానీద్ధ్రువమ్.
శ్రీపాణిని ముఖ్యేభ్యోనమః హరిఃఓం
అఇఉణ్ ఋౡక్ ఏఓఙ్ ఐఔచ్
హయవరట్ లణ్ ఞమఙణనమ్
ఝభఞ్ ఘఢధష్ జబగడదశ్ ఖఫఛఠథచటతవ్ కపయ్
శషసర్ హల్ ఇమానిత్రయోదశ?
సూత్రాణి ప్రత్యాహారార్థానివర్ణప
రత్వాత్సంస్కృతప్రాకృత సమాసాన్యపి
సంస్కృత మితి ప్రతిజ్ఞాస్యంతే

1. అష్టభాషలనగా సంస్కృతాంధ్రములుషడ్విధప్రాకృతములు
2. అముద్రితము. తంజావూరి పుస్తకశాల సంఖ్య. 632
3. అముద్రితము. 651-657. ఈనాటకమునకేడు తాళప్రతులుగలవు. దీనినిబట్టి నాటకప్రాశస్త్యమునూహింపజనును.
4. ఆకాలమున తంజావూరిలో విద్వాంసులు శాస్త్రి సూరి మొదలగు సుప పదములవలె 'సుమతి' యను సుప పదమును చేర్చుకొనెడువారు. ఇట్లే ప్రాసభారతమును రచించిన ఆలూరి సూర్య నారాయణసుమతి, ఈశ్వరసుమతి మొదలగు వారు గలరు.

ఏషామంత్య మిత్సంజ్ఞం విధాస్యతే. హాకారాది వ్యాకారస్సు ఖోచ్చారణార్థః.
సూ. అథాంధ్రశబ్దాను శాసనమ్-అథబ్దో మంగళార్థః ఆరంభాద్యర్థకోవా ఆంధ్రశబ్దానా మనుశాసనమారభ్యత యిత్యర్థః.

నిషేదివాన్ కంస కృపస్సవిష్టరే. ఇత్యాదౌ లౌకిక వాక్యానాం వక్తుర్వివ క్షాధీనమ్. ఆంధ్రకృతౌ భావి వస్వంత పాఠేన నిషేది వాంసుకు దూర్వాసస్సు ప్రాగ్విధి నా దుర్వాసనుండు ప్రచేతుల్ సదాగతుల్ యితిభావి. తత్సాన్వది శక్త్యా చత్త్వస్థిత్యే వసానజ శాంరు విసర్గస్యుచ నిరాసః సుపికిం వాగ్ఘాటి యశః ప్రతాపముత త్స మాసాన్యే వేహ పిప్రాదిపదికత్వాత్ వసుపథాయాదీర్ఘః వస్వంతస్య ఉపథాయాః దీర్ఘస్స్యాత్ విద్వన్+సు ఇతిస్థితే తద్ధితనుక్ తద్ధితస్యాత ఉపధాయాః చాద్వసుపధాయాశ్చ నుక్ స్యాత్. అకిన్నధ్యేవ. సుపో్పపథా బలేన పరమేన శ్రీమంత బంధు మంత తథాదిద్వాంస జలగడిగి.

పదస్థానం త్రిలింగ మిత్యుపపన్నమ్ అతయేవ త్రైలింగాః ప్రాప్తగంగా లింగత్రయం స్త్రీపున్న పుంన కాఖ్యంతేనా విభక్తి కతాత్రి లింగ జయ శీతాంశు కులావతంస అవధారు దేవ॥ దిహుాది భాందేరేహ లోఘుల హలన్తస్యా కారస్యాఘులిపరే. ఋత్విజ్ అఇతిస్థితేహల పరేనేత్యనేన శ్లిషోక్తిః ఋత్విజ సంపద పయోముచ మహాముద అముయంచ అద్రద్యంచ, ఆముద్ర్యంచ, ఆదముయంచవాచ పరీక్షతుగాచిన

ఏ, నే, మే, ఇదిత్రయః ఆదేశాస్యుః ఏము నేము మేము వాదిత్వాన్మీరలు మీరారులు॥ నుగ్లనుకొచ। మిమ్మునను, నిన్నును మిమ్ములను నుముయితి విభక్తి క్రమాన్నుగ్లను కొస్తః। మోర్లనుక్."

తెనుగు భాషను గూర్చి సంస్కృతములో వ్యాకరణములున్నను, నవి పాణినీయ పద్ధతి ననుసరించి వ్రాయబడినవికావు. శేషాచలకవికి కొంచెము ముందు గాగణపవరపు వేంకటకవి 'ఆంధ్రకౌముది'యను పేరున తెనుగున నొక వ్యాకరణము రచించినాడు. అది వేయి చరణములుగల సీసమాలిక. ముద్రితమైనదియే. 'ఆంధ్రకౌముది'యని పేర సంస్కృతమున మండలక్ష్మీ నరసింహాకవి' రచించినది[1] వేఱొకటి కలదు. ఈకవిని గూర్చి వెనుక దెలుపుచున్నాను.

ఈ రెండింటి యందు తెనుగు కావ్యములనుండి యుదాహరణము లీయబడినవి. కాని కేవలము పాణినీయ పద్ధతిని సంస్కృత భాషలలో రచితమైన తెనుగు వ్యాకరణము లేదు. అట్టి లోపమును దీర్చిన శేషాచలకవి యెంతయు ప్రశంసనీయుడు. అధీత పాణినులగు నాంధ్ర విద్వాంసులెందఱో మన దేశమున గలరు. వారెవ్వరేని యీగ్రంథము ప్రకాశమాన మొనర్చినచో నాంధ్ర విద్వల్లోకమునకు మహోపకార మొనర్చిన వారగుదురు.

శేషాచలర్షి, శేషాపతి, శేషాచలపతి: శేష సుమతిఅను పెక్కుపేళ్లతో వెలసిన 'ఆంధ్రపాణిని' గూర్చి లోకమునకు వెల్లడించుటయే యీ వ్యాసోద్దేశము—ఈతని యక్షగాన నాటకములు ముద్రితములైన తద్రచనమున నీతనికిగల విశిష్టస్థానము నిర్ణీతమగును.

## ౨. అభినవ దండి

ఆంధ్ర వాఙ్మయమున నభినవదండి కేతనయేకాక వేఱొకకవి కలడు. అనఘుము కోదండరామకవి తన పినతండ్రియగు కొండ నామాత్యుడు వేంకటగిరి రాజగు వెల్గోటి యాచశూరేంద్రునివలన 'అభినవదండి' యని బిరుదుగాంచెనని, తన రుక్మవతీ పరిణయమున నిట్లు చెప్పియున్నాడు.

కొండ కవీంద్రుం డభినవ
దండియనగ బేరుగాంచె ధారుణినాథా
ఖండలు డను వెల్గోటికుల
మండనుడై యొప్పు యాచమహిపతి చేతన్[2].

ఈ యాచశూరుడు క్రీ. శ. 1602 లో నుత్తర మల్లూరు కోటను గెలిచిన మహావీరుడు. కావున నీ యభినవదండియు క్రీ. శ. 1600 ప్రాంతమువాడు. ఈతని కృతులేవియు లభింపలేదు—ఈతడా పస్తంబ సూత్రుడు, కాశ్యపగోత్రుడు—రుక్మవతీ పరిణయ మైదాశ్వాసముల ప్రబంధము. ప్రద్యుమ్నుడు రుక్మవతిని పెండ్లాడుటయందలి కథ.

1. ఈగ్రంథమున కొంతభాగము శ్రీ పరవస్తువారి యార్ష ముద్రాక్షరశాలలో ముద్రితమైనది.

2. ఆం. సా. ప. ప. సం. 4. సం. 1. పుట 19.

# 3. కవిగంధ సింధురము

**కొండ మడుగు—పుల్లకవి లేక పురుషోత్తమ కవి.**

కన్యకాపురాణ పద్యకృతి ననుసరించి, పుల్లకవి ద్విపదకృతిగా మూడా శ్వాసములలో కన్యక యనబడు వాసవీదేవి చరిత్రను గూడ రచించెను—అందాతడు పురుషోత్తమ కవిననియే చెప్పుకొన్నాడు. ఇట్లున్నను నిరువురొకరే యనుటకు నా గ్రంథాంత గద్యల నుదాహరించు చున్నాను.

కన్యకాపురాణము—

నగేశ్వరునిపేర నవరసస్ఫురణ
భరణ భాషాసుధా ప్రవణానురూప
కవి వరస్తుత కన్యకాపురాణంబు
శ్రీకంభగిరి నారసింహాంఘ్రిపద్మ
సాకల్య సేవావిచక్షణాక్షీణ
మహనీయమతి కొండమడుగు సద్వంశ
విహితసంభవ కళాన్వితగిర్యపార్య
మణిసతీ వేంగమాంబా గర్భశుక్తి
మణిపుల్లకవి సుధామయ చాకచక్య
వాక్యవైఖరులచే......
వరనుతంబుగ జేసి

సానందోపాఖ్యానము—పద్యకావ్యము—[డి-866]-దూబగుంట వీరేశ్వర స్వామి కంకితము—

“ఇది శ్రీమత్కంబగిరి నరసింహపదార విందవందన సదానంద కందళితాంతరంగ సముత్తుంగ షాడ్గుణ్య సకల కళా ప్రవీణతాఖండ పాండిత్య కొండమడుగన్వయ విరాజద్భారద్వాజగోత్ర పవిత్ర ప్రభావిభాన మాన మహనీయాయ్యలార్యగ్రహారాధికానేక శాస్త్రైశ్వర్య భరణగిరియప సుధీవరేణ్యానందనాంధ్రభాషా విశేష పురుషోత్తమ కవిగంధ సింధుర ప్రణీతంబైన సానంద గణేశ్వరముని చరిత్రంబను మహాప్రబంధంబు నందు సర్వంబు నుతృతీయాశ్వాసము సంపూర్ణము”

పైగద్యలను చూచినచో పురుషోత్తమ కవికి పుల్లయకవియని కూడా వ్యవహారమున్నట్లు స్పష్టపడుచున్నది.

పైరెండు కృతులును వైశ్యుల కంకితము. కన్యకాపురాణము మిధునకుల గోత్రుడగు గుమ్మటూరి రామయ సెట్టికిని సానంద గణేశ్వరము అవధూతయని ప్రసిద్ధిగాంచిన కుంజేటి కిచ్చన సెట్టికిని నంకితములీయబడినవి. ఈతడు కవిస్తుతిలో నన్నయ, తిక్కన, నాచన సోమన, భీమవర భీము [వేములవాడ భీమకవి] రంగనాధుని స్తుతియించినాడు.

[1]సానందోపాఖ్యానమున గద్యననుసరించి పురుషోత్తమ కవికి ‘కవిగంధ సింధురము’ అను బిరుదమున్నట్లు స్పష్టమగుచున్నది. ఈ బిరుదమే యీతని కాల నిర్ణయమునకు గూడ తోడ్పడు చున్నది.

కార్వేటి నగరమును క్రీ. శ. 1719 నుండి క్రీ శ. 1732 వఱకు పరిపాలించిన వెల్లంటి కసవరాజున కంకితముగా రచితమైన [2]చంపూ రామాయణములో కృతి కర్తయగు ఋగ్వేదికవి వేంకటాచల విద్వత్కవి తన్ను గూర్చి యిట్లు కృతిపతి పలికి నట్లుగా నా గ్రంథావతారికయందు తెలిపి యున్నాడు—

చ. తరణి సమప్రతాపనిధి దామెర
యక్కనృపాలు సన్నిధిన్
వరకవి గంధ సింధురము
వచ్చెనటంచు వచించు వానిగ్రొ
వ్వర గవిరాజకేసరి న
టంచు బఠించితి వాక్సువైఖరిన్
సరసులు మెచ్చ వాఙ్ముఖవి
శంకట వేంకట శైలసత్కవీ

ఇందు పేర్కొనబడిన కవిగంధ సింధురమే మన పురుషోత్తమకవి. పురుషోత్తమ కవికిని, వేంకటాచల కవికిని శ్రీ కాళహస్తి సంస్థానాధీశులగు దామెర అక్కరాజుగారి సభలో కవితా వివాదము జరిగినట్లు నందు, వేంకటాచల కవియే జయము నందినట్లును పైపద్యము విశదపఱచు చున్నది - కావున వీరిరువురును

1. సానందోపాఖ్యానము పద్యకృతి యముద్రితము-ప్రాచ్య లిఖితపుస్తక భాండాగార గ్రంథసంఖ్య. 855 (R)

2. ఈ చంపూరామాయణము భోజచంపువున కాంధ్రీకరణము. ఆంధ్ర సాహిత్యపరిషత్ప్రకటితము-సంఖ్య. 4. క్రీ. శ. 1917

సమకాలీనులు—పురుషోత్తమ కవియు క్రీ. శ. 1700 ప్రాంతమున విలసిల్లిన కవి.

## ౪. కవిరాజకంఠీరవుఁడు

వేంటాచల కవి.

పైపద్యమున 'కవిరాజకేసరి' యనునది ఛంద స్సౌకర్యము కొఱకు జెప్పబడినది—వేంకటాచల కవి బిరుదము, 'కవిరాజ కంఠీరవము' అని యాతని గ్రంథమున నాశ్వాసాంత గద్యల ననుసరించి తెలియుచున్నది—

ఇది శ్రీమ దుమామహేశ్వర వరప్రసాద సమాసాదిత, సరసకవితా విలాస వాసిష్ఠ వంశకీర్తి ప్రతిష్ఠా సంపాదక ఋగ్వేదికవి తిరువెంగళార్య కలశరత్నాకర సుధాకర జగద్విఖ్యాత కవిరాజ కంఠీరవ బిరుదాంక వేంకటాచలపతి ప్రణీతంబైన చంపూరామాయణ మను మహా ప్రబంధంబునందు ప్రథమాశ్వాసము.

## ౫. ఆంధ్రభాషా కవితాపితామహుఁడు

మండలక్ష్మీనరసింహకవి.

[1]ఆంధ్ర కౌముదియను పేర త్రిలింగ శబ్దానుశాసనమును రచియించిన మండలక్ష్మీ నృసింహ కవి తనకు కవిరాజ కంఠీరవ బిరుదమేకాక, ఆంధ్రభాషా కవితా పితామహ శిరోమణియను బిరుదమున్నట్లుగా నా గ్రంథములో నిట్లు వ్రాసియున్నాడు. "ఎదమదంతస్యకి ప్రత్యయ ప్రయోగస్య కృతత్వా దశాస్త్రీయ ప్రయోగో గ్రామ్యమిత్యనేన అథర్వణ వచనేన సోమయాజి ప్రయోగస్య సాధురేవేతి జ్ఞాత్వామయా వేంగి నాటీయేన, మండకుల కలశజలధి సుధాకరేణ, శ్రీమదష్టభాషా సరస్వతినా సహస్రావధానినా, సరస కవి శేఖరేణ, కవిరాజ కంఠీరవేన ఆంధ్రభాషా కవితా పితామహ శిరోమణి శ్రీనకులీ వాగీశ్వరీ వరప్రసాద లబ్ధసర్వంకష సరససాహిత్య సకలానవద్య విద్యా పాండిత్య ధారేయేణ, లక్ష్మీ నృసింహ విద్వత్కవీంద్రేణ తిక్కన సోమయాజి ప్రయోగ స్స్పష్టా కృతోఽధునా"

ఈ 'ఆంధ్ర కవితాపితామహ' బిరుదముగూర్చి నేను వ్రాసిన ప్రథమాంధ్ర కవితా పితామహుఁడు శివదేవయ్య అను వ్యాసమును జూడదగును. భారతి. పార్థివ ఫాల్గునము 203-205 పుటలు.

1. ఆంధ్రకౌముది. ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార సంఖ్య డి. 1228 వ్రాత ప్రతి.



# విజయాహ్వానము

★

శ్రీ చింతలపూడి సన్యాసిరావు

విజయ కల్యాణ శృంగార విభవమొనగ
విజయ మొనరించు దివ్య గంభీరమూర్తి!
విజయ వర్షాభిధాన సద్విమలమూర్తి!
స్వాగతమునకు—మా దుసుస్వాగతమ్ము.

మాధవుని సన్నిధాన సంపద వహించి
ధన్యతను గన్న త్వచ్ఛుభోదయము నేడు
మాధవుని సన్నిధాన సంపద వహించి
మాకు శుభదమయ్యెడు మధుమాన వేళ

ఓ మహాదాశయా! విజయ! యుష్మదుదంచిత ధర్మ సద్గుణో
ద్దామ మహాత్వ సంగతి విదారిత దుర్మత సామజుండవై
ధీమహిమాస్పదంబు హరిదేశిక బోధిత కర్మయోగ వి
ద్యా మహనీయ తత్వమును వ్యాప్తమొనర్పుము శంఖ మొత్తుచున్-

జనులన్యోన్య విశాల సౌహృదయులున్, సౌజన్య ధన్యాత్ములై
వినుతానూన పరోపకారయుతులై, ప్రీతాత్ములై, నిత్య నూ
తన సంపద్విభవాభి రాములయి, సత్యజ్ఞాన యుక్తాత్ములై
మనగానో విజయాఖ్య ధీనిధి! ధరం బాలింపుమా! పూజ్యతన్.

విజయమగుగాత భారతోర్వికి సతంబు
విజయమగు గాత సద్ధర్మ వితతికెల్ల
విజయమగు గాత సజ్జనవ్రజమునకును
విజయ! తావక సత్సమావేశమునను



# వీరకుంకుమ

★

శ్రీ మునిపల్లె రాజు

తల్లిగర్భంలో, వెచ్చగా హాయిగొలిపే మసకమసక తమస్సులు బదికి.
కల్పించిన అమరశాంతిలో, నిరామయుడై బుద్ధుడివదనంతో, నడు
జీసస్ హృదయంతో, నిండు తొమ్మిదినెలలు తపస్సు చేసిన చిన్న -
ప్రతాపరెడ్డి—కెవ్వున కేక వేస్తూ, ధాతకరువు మిత్తియజ్ఞంతో మానవ
జాతిమీద కసి తీర్చుకొంటున్న ప్రకృతి ఒడిలో పడ్డాడు. క
వులో పోయినవాళ్ళుపోగా, యింకా చావుతో పెనుగులాడి (
వున్న అమ్మలక్కలుచేరి—గోపాలకిష్టుకు పుట్టాడు—గోపాల
పుట్టాడు—అన్నారు—ఆరోజు శ్రావణ బహుళ అష్టమి కా
వానలూ గుండ్లకమ్మ వరదలూ లేని శ్రావణమది. వర్షరుతు
దేవితాండవమాడుతోన్న ధాతనామసంవత్సరమది. అ
న్నెల్లికిందటే కొటకపువాతబడ్డ నాగులురెడ్డిలేని అష్ట
రెడ్డి అతని తండ్రి.

అమ్మలక్కల దీవనలు పుట్టిన చిట్టివా
ణమై, వసంతంలోని లేతమామిడిచున్న చిగురు
అత్య, ఒక్క క్షణం తలెత్తి పరికించి
ఈ భయానకలోకమూ, ఈ దయలేని ప్రకృత

పిల్లవాడు పుట్టిన నాలుగురోజు
పోయింది. జేజెమ్మ—ఒళ్ళోకి తీసుకొని
పేరు పెట్టమని బలవంతం చేస్తుంటే,
రెడ్డివిరా, దరిద్రుడా!" అన్నది బి
గుప్పెటవిప్పి, ప్రతాపరెడ్డి జేజెమ్మ
అత్మ భయంతో, దిగులుతో వణికిపో
ఉలో పెరిగాడు రెడ్డి.

ఐదేళ్ళు వచ్చింతర్వాత గాని
కాని దొడ్డికాళ్ళుపోయి, దృఢం
బిగువుతో నునుపుగా పెరిగాడు.
వండా దిగులుతో విన్నాడు. ప
వాడు, మంచెకిందచేరి, ఎర్ర
భయపడి, చందమామలో ప
కొంటున్న ముసలమ్మకు, ఎవర
నడిగితే తిడుతుందని వణికి దిగ
డైనాడు. రాయలపురంలో అ
రెడ్డి చదువుకోలేదు. అందుకని

దిగులు మధ్యనే జీవన
తోటలో పెద్దబావినుండి మోట
డైనాడు. అంతలోనే జేజెమ్మ

గించి, తన సాంప్రదాయం నిల
గాక మరి దేనికి అర్థం?

గభద్రకాలవపడి, ఈభూమిలో
అర్లీపెట్టి వేలు ముద్దల్లు
తెలిపే చుట్టాలుగావి

దిగులును
గాగిన
-,

ప్రతాపరెడ్డి మాట్లాడక పెట్టేదించి, ముఖం అటుతిప్పి కొడుకు చేతివేళ్ళు, ఖిడియపడుతూ నొక్కాడు.

"అదుగో...ఆ దిగులే..." అని చిట్టిరెడ్డి తండ్రి నెరిసిన వెంట్రుకల్లోకి తన కుడిచేయివేళ్ళు పోనిచ్చి సర్దాడు. ఇద్దరికీ పెద్ద నవ్వు వచ్చింది.

"దిగులేమిటి? దిగులు లేదు. నా చిట్టివుండగా నా కెందుకు దిగులు?"

"హంపీ వెళ్ళాలి. నా స్నేహితులంతా వెళ్తున్నారు. నువ్వు గూడా రా నాన్నా!"

"ఎందుకులే? నే నెందుకు? నువ్వుపోయిరా"

"నువ్వెందుకేమిటి? మన విజయనగర రాజ్యం సంగతి చెప్తాను. మ్మ కర్థం గాదు. నువ్వు రావాలి."

"ఖర్చులు..." అనబోయి ప్రతాపరెడ్డి నాలుక గరచు ను. "సరే...ఎప్పుడు?"

ంగళవారం..." అని కొడుకు జేబులోనుంచి సిగరెట్టు ాడు. తన ముందు కొడుకు యిదివరలో ఎప్పుడూ

కు కోపం రాకేం....చ్చుచ్చుచ్చు....అసలు ని పిల్లవాడి గొంతుతో చిట్టిరెడ్డి తండ్రినోట్లోకి ందించాడు. పొగవూదుతూ యిద్దరూ పకొలు వచ్చి..."ఏమిటే తంతంతా?" అన్నది నకుం తండ్రీ కొడుకులు తను కర్థమైన చిరునవ్వు ి చెరొక దారినపోయారు. ప్రతాపరెడ్డి ని.

పడమటింటిలో వున్నప్పుడు, ప్రతాప లోతు చేయించేందుకు, కో ఆపరేటివు పెట్టితెచ్చిన మొత్తంలో ఒకవంద

యిద్దరూ అన్నమ్మతో బొంకారు. ప్రపాలుగారి ముందు నాన్న వేలు వెయ్యరు" అని చిట్టి ఆశ్రుతితో

న్ని ఆ రా గనుకోక పోతిని. చి అన్నది. పుల్లెద్దం టే అన్న చిట్టి పుట్టకముందు అది కోడె ఎ. అది ప్రతాపరెడ్డి జేజెమ్మ మరంగు ఆవుపెయ్య మునిమను —అన్న—అని, ఆ యింటికి

దా? సరైన మేత లేకేతే దాని డ నసిగితే యిక ప్రమాదమని

రైల్లోను, హాస్పేటలోనూ చిట్టిరెడ్డి నోట్లను చిల్లర కాయి తాళ్లాగా ఖర్చుపెట్టాడు. ప్రతాపరెడ్డికి కొడుకులో తప్పు కనబడ లేదు. దర్జాగా, మనిషికి మనిషిగా, కాఫీహోటళ్ళలో కుర్ర వాళ్ళను అదిలించటం, హాస్పేటలో జట్కాబండి సాయిబుల నోటి దుడుకును, ముతక పదజాలాన్ని ఒక్క కంటి తీవ్రమైన చూపుతో అరికట్టగల్గిన తనకొడుకు, రైలంతా కొన్నట్లుగా బలిసి నిద్రపోతున్న బళ్ళారి సేఠ్లను, మలబారు పోలీసుల్ని గదిమి, కళ్ళ బరువుతో, బెంచీలమీద,రెండడుగుల స్థలంలో కూచొనబెట్టగలిగిన తనకొడుకు—యిటువంటి నోట్లను ముందు రోజుల్లో ఎన్ని సంపా దించనున్నాడు? ఏం? యిప్పుడు ఖర్చుగాక మరెప్పుడు? కరువు గావొచ్చు? తనుండగా తన చిట్టికేం కరువు?

హంపీలో అంతకుముందే వచ్చిన విద్యార్థి బృందంలోనుండి, చిట్టిరెడ్డి స్నేహితుడు రాజు కలిశాడు. సన్నగా, దివ్వెవలె శరీరం లేక ఒక్క ఆత్మతోనే లోకాన్ని పరిసరాల్ని కదిలిస్తున్నట్లుగా మాట్లాడాడు ఆ కుర్రవాడు. అతి తొందర. కళ్ళజోడు వెనుక నుండి అగ్ని కురుస్తున్నట్లుగా ఆ మాటల ధోరణి.

"నా స్నేహితుడు—రాజు, నాన్నా! భలే తెలివిగలవాడు." అని చిట్టిపరిచయం చేశాడు.

ప్రతాపరెడ్డికి ఏమనాలో తెలియలేదు. ఆ కుర్రవాడు, ఆ వెలిగి జ్వాజ్వల్యమానంగా వున్న అ దివ్వె—తనకొడుకు మిత్రుడు. ప్రతాపరెడ్డిలో సహజమై, పొందికై, రక్తమై దాగివున్న ప్రేమ, ఆదరం, అభిమానం పొంగి రాజు విజ్ఞానపూరిత ముఖవర్చస్సును చుంబించబోయినవి. రాజు మాట్లాడే ప్రతిమాటలోనూ ఏదో గొప్ప అర్థం, సామాన్య మానవదృష్టికి అతీతమైన వున్నత మన స్తత్వం దాగివున్నట్లు రెడ్డి హృదయానికి తట్టినది. ఈ నడిచి, మాట్లాడగల జ్యోతి తన స్నేహితుడని చెప్పుకొనటం చిట్టి కేమాత్రమూ గర్వంగా కనబడలేదే? ప్రతాపరెడ్డి కించపడి, తన ఆంతరంగిక భావవాహినిలో మునిగి తబ్బిబ్బై అవమానంతో మూగగా నిల్చొని, తెప్పరిల్లి, రాజు మండుతూన్న కళ్ళు ఒక్కసారి చూసి—

"మావాడు...నా కొడుకు...ఒక్కడే —"అని చిట్టిని చూపాడు.

రాజూ, చిట్టీ నవ్వారు. రాజు ఎగతాళికి నవ్వలేదని రెడ్డికి తెలుసు. తనలో లేని కల్చరుకోసం పైకి వెలిబడని వున్నత భావాల ఆత్మను సూటిగా అర్థంచేసుకొని నవ్విన నవ్వుగా దృగ్గోచరమైంది. లోకంలోని బాధనంతా తనుమింగి, మొయ్యలేక తన భుజస్కంధాలమీద, తన కళ్ళ విషాదంలో మోస్తున్న యీ అసామాన్య యువకుడా, తన చిట్టి స్నేహితుడా—అర్థహీనమైన తక్కిన కాలేజి మూక నవ్వు నవ్వేది?

రెడ్డిహృదయం పొంగింది. "మోటువాణ్ణి. చదువుకోలేదు." అన్నాడు క్షమార్పణ కోరుతున్నట్లుగా, రాజుతో.

రాజు సీరియస్ ముఖం కందిపోయింది. పెదిమలు వణికినవి.

"ఎవరన్నారు? ఎవరికా అధికారం? మీ ఆత్మలో మీరు ఉత్తమపురుషులు. మీకు నేను—నమస్కరించి గర్వించగలను. నేను!—రాజును!! మీరు భాగ్యంలో, అర్థంలేని చదువులో, దొంగ గౌరవపద్ధతుల్లో పెద్దమనుష్యులు కాకపోవచ్చు. నేను నమస్కరిస్తాను."

ప్రతాపరెడ్డి రాజుచేతిని, కన్నీళ్ళతో తనచేతిలోకి తీసుకొని, పావురాయి వీపును నిమిరినట్లు నిమరసాగాడు. చిట్టితో ఒకసారి తమయింటికివచ్చిన చౌదరిగారబ్బాయి, పోకిరి పోకుల్లో, ఆడపిల్లలమీద విసిరే రౌడీ మాటల్లో తన హృదయాన్ని గాయపరిచి, వున్నంతసేపూ తనను అంబోతు ఎద్దును చూచినట్లుగా చూచాడు. కాని ఈ బ్రాహ్మణబిడ్డ — (అశబ్దమే తనవద్దకు చేరనీయని) యీ నాగరికుడు!

చిట్టి యీ సన్నిహితభావప్రకటనకు ఉబ్బిపోయి—"నువ్వు రాజును మాట్లాడించవద్దు. వాడికి జ్వరం వస్తుంది" అన్నాడు.

అప్పటికే పొద్దు తిరిగింది. ఇక హంపీ శిథిలాల్లోని హృదయ వేదనతో చుట్టూ నడక ప్రారంభమైంది. చీకటి పడుతున్న కొద్దీ రాజు మాటలు భయంకర మనిపించినవి. ప్రతాపరెడ్డి ఆత్మ, రాజు ఆత్మతోపాటు ఆ శిథిలాల్లో, ఒకనాటి జీవనవాహినినుండి మిగిలిన గులకరాళ్ళలో ప్రతిఆలోచనకు, మాటకూ వణికిపోసాగింది. రాజు నోరు మూతబడలేదు. గణాచారివలె తూలుతూ, తాగినవాడివలె ఏదో లోకంనుండిమాట్లాడుతూ దృశ్యాలు, మంటపాలు, మహళ్లు, ఆలయాలు చూపించసాగాడు. ఆగి, అగ్నివలె వర్షించేవాడు మాటల్ని.

"ఇక్కడ—ఈ పుణ్యస్థలంలో — వేట కుక్కను కుందేలు తరిమి కొట్టింది. విద్యారణ్యులు చూశారు. ఇక్కడ క్రిష్ణదేవ రాయలి జెండా ఎగిరింది. మన తెలుగు కవిత్వం, భాగ్యం, ఔన్నత్యం, మన ఆత్మే — యీ రాళ్ళకింద శోకిస్తున్నది. మన సంగీతంలో యీ తుక్కు గాయకులు, కవులూ పిచ్చిమాటలూ, రాగాలూ వాడుతున్నారు. వాళ్లని యీ సంగీతం, శిథిల విజయ నగర రాజ్య సంగీతం వినమంటున్నాను."

రాజు కంఠం గద్గదికమైపోయింది. చుట్టూ కలియజూసి ఆకసంవేపు తల ఎత్తాడు. అక్కడక్కడ చంద్రుడులేని గంభీర నీలిమిలో నక్షత్రాలు తారట్లాడుతున్నాయి. రాజు మాటలు తిరిగి చీకటిరాత్రిని, అనంతశూన్యాన్ని, శిథిలభీభత్సాన్ని చీల్చుకుంటూ వినిపించినవి.

"ఆరోజులు రావు. రావు. కాని తిరిగి మన పతితశోభ వికసించక తప్పదు. విజయనగరశోభగా గాదు. విశాలాంధ్ర శోభగా."

కంపించింది ప్రతాపరెడ్డి ఆత్మ ఆ కంచుమోతమాటలకు. శిథిలాల్లో కూర్చొని ముగ్గురూ చీకటినే, మనస్సునే ఉచ్ఛ్వాస నిశ్వాసాల్లో అనుభవిస్తున్నారు. చీకటిలో ఏమీ కన్పించటంలేదు. వేయిస్తంభాల విఠలస్వామి ఆలయపు ఆవరణలో బండమీద కూచున్నరాజు హఠాత్తుగా లేచాడు. గంగాఝురివలె, వర్షాకాలంలోని అఖండగోదావరివరదవలె అతడు ఆంధ్రచరిత్రను ఏ కరువు పెట్టసాగాడు. "ఈమూల ఫలాని, ఆ దిక్కున ఫలాని...ఆ పాలకుడు, ఈ మంత్రి, ఆవంశం, ఈవంశం"—అక్షౌహిణివలె సంవత్స

రాలు, శతాబ్దులు, కిరీటధారులు, సామ్రాజ్యపతులు, మహారాణులు, సేనాపతులు, మంత్రిపుంగవులూ, యుద్ధాలు—చరిత్రకు చరిత్రే ప్రతాపరెడ్డి నయనాలయెదుట నడిచి వెళ్లినది. రాజు ఒక్కక్షణం ఆగి గాలి పీల్చుకొన్నాడు. ఆ నిశ్శబ్దమే భయంకరంగా మారింది. విజయనగరరాజధానిలోకంనుండి హఠాత్తుగా చలిగాలివీచే, చీకటి లోకి, కౄటకపు పులులు విహరిస్తున్న తన అడవిలోకి విసిరివేసే యీ భయానకనిశ్శబ్దం! చీకట్లో తన కొడుకుచేతినీ, రాజుచేతినీ పిరికిగా తడిమి చూచాడు—ప్రతాపరెడ్డి.

"వద్దు...వద్దు...రాజూ...అపవద్దు."

రాజు ఏడుస్తున్నాడు. ప్రతాపరెడ్డి లేచి అతన్ని కౌగిలించుకొన్నాడు, రాజు ఆత్మ అతనితో మాట్లాడింది.

"ఆ అందమంతా నాశనమైందనేనా?
ఎవరా నాశనం చేసిన దుర్మార్గులు"

రాజు రుద్ధమైన కంఠాన్ని సర్దుకొని—

"తల్లికోట...కోట...మన జెండా పడిపోయింది. తురకలు ... విదేశీ బహమనరాజుల తొత్తులు ... యీ అమరలోకాన్ని, అందాన్ని, మన నాగరికతనే కొలరాచారు."

ప్రతాపరెడ్డిని, రాజునూ చూచి చిట్టిగుండె చెదరిపోయింది. "నాన్నా..." అన్నాడు.

కాని రెడ్డి అక్కడ ... ఆలోకంలో లేడు. అతనిచర్మం కింద—రాజు మహావాగ్ధోరణితో, రాజు చరిత్రదర్శనతో, రాజు విజ్ఞానస్రవంతితో వేగంగా రక్తం పారాడినది. కటకంనుండి దక్షిణాదిదాకా తెలుగుజెండానీడను, శాంతితో సుభిక్షంతో, ధర్మపాలన సాగించిన పురాతనవీరుల రక్తం ఆ నాళాలనుండిఉబికింది. ఒకశరీరంనుండి మరొకశరీరానికి విద్యుత్ వేగంతో ఆ ఆవేశం ఏకవాహినిగా పారింది.

రాజు అన్నాడు—మళ్ళీ.

"అందుకు కత్తిగట్టలేం యిప్పుడు. చీలి చెదిరివున్న తెలుగుజాతి ఒకరాష్ట్రం కిందికి తప్పక వస్తుంది. దానితో మన నందికొండ, మన సిద్ధేశ్వరం, మనరామపాదసాగరమూ వస్తాయి. తెలుగునాడంతా దీపావళిరాత్రివలె వెలిగే రోజులు. ఈ కరువునూ, దారిద్ర్యాన్నీ, నిరాశను ఎరగని రోజులు."

ప్రతాపరెడ్డి రాజును తన కౌగిలినుండి విడిచాడు. చీకటిలోనే రాజు వెలుగుతూన్న కళ్ళవర్చస్సు చూశాడు. తనకు తెలియని విషయాలు అంత సులభంగా, గ్రాహ్యమయ్యేట్లుగా ఆధోరణి.

"నిజంగా—?"

"అవును. యిందులో అబద్ధమేముంది? మూడుకోట్లమందిమి మనమనుకొంటే కాని శుభకార్య మేముంది?" ఈ ఒక్క వాక్యం రాజు మహాయోగివలె అన్నాడు.

"ఎప్పుడు?" ప్రతాపరెడ్డికి తెలియకనే ఈ ప్రశ్న బయటికి దూకింది.

"అవును...అదే ప్రశ్న. నావంటి యువకులు చాలామంది చావాలేమో?" రాజు వదనం తిరిగి శాంతమయమై పోయింది.

"వద్దు...వద్దు...నువ్వు...మీరు...చచ్చిపోగా మళ్ళీ మిగిలేవి యీ రాష్ట్రాలు రష్యలే. వద్దు. నువ్వులేనిది ఏదీవద్దు" అని ఆత్రంతతో, ఆందోళనతో రెడ్డి ఆ అసామాన్య యువకుడిచేతిని తిరిగి పట్టుకొన్నాడు.

ఈమాటు మళ్లీ ఆ ఆత్రుతను, భయాన్ని చూచి చిట్టిరెడ్డి నవ్వి—"నువ్వన్నంతమాత్రాన రాజు బతుకుతా డనుకొన్నావా? ఇంత తెలివిగలవాడు లోకంమీద చాలాకాలం నిలవలేడు" అన్నాడు కొంత చిలిపిగా, కొంత అమాయికంగా.

అజ్ఞాతమైన విషాదం ఆ చీకటిని ఆవరించి వుంది. ఆ మాటలు శూలాలుగా ప్రతాపరెడ్డి ఆత్మను గాయపరిచినవి. "ఛీ, ఛీ, ఏం మాటలు?" అనిమాత్రం కష్టంతో అనగలిగాడు.

తిరునాళకువెళ్ళి జనం తోపుడులో, కోమట్ల పాత నూనె మిఠాయి వాసనలో, అసహాయస్త్రీలూ, పురుషులూ, నిజమైన భక్తులూ, దసరాబుల్లోళ్ళు ఏ మోసాలకో లోబడి దిగాలుగా తిరిగి పోయే ప్రయాణ మనుకొన్న — యీ హంపీయాత్ర, తన ఆత్మ విశ్వవిద్యాలయపరీక్షయిపోయింది. సన్నని, కళ్ళజోడు యువక అచార్యుడు రాజు—తనకు బిరుదపట్టాన్ని యిచ్చాడు. హాస్పేటకు ఆరాత్రి ముగ్గురూ నడిచి హోటలు చేరుకొన్నారు. కాని ప్రతాపరెడ్డిని మైకం వదలలేదు. ముగ్గురూ దిగులుతో, బరువుతో ఎంగిలిచేశామనిపించారు.

మర్నాడు రాజు నేరుగా కడపకు వెళ్ళాడు.

"మీరు చిట్టికి అంత డబ్బు పంప నవసరం లేదు. నాకు తెలుసు. మీనోరు నాలికకట్టుకొని చిట్టికి యిస్తున్నారు. వాడు అతిఖర్చుదారు"

అన్నాడు రాజు బస్సులోకూర్చొని. దిగులుతో, పిచ్చివాడై ప్రతాపరెడ్డి ఆ కౌగడాను చూశాడు.

"వద్దు. దిగులుపడవద్దు. మనమింకాచాలాచూడాలి చెయ్యాలి. ధరణికోట, నాగార్జునకొండ, ఓరుగల్లు, కొండవీడు-చాలావున్నవి. మళ్లీ కలుద్దాం. మన పొలాలు చవిటిలో బంగారం పండే రోజులు రావాలిగదా మరి? వస్తయ్! వస్తయ్. ఈ దిబ్బలమీద జీవం కురుస్తుంది మళ్ళీ. చూస్తారుగా...చూస్తారుగా!"

మావూరు రమ్మని చాలా బలవంతం చేశాడు రెడ్డి. కాదు, మీటింగులు అన్నాది ఆ దివ్యజ్యోతి.

## 3

రైలులో చిట్టిరెడ్డి రాజు చరిత్ర చెబుతుండగా ఖిన్నుడై విన్నాడు ప్రతాపరెడ్డి.

"వాడి మనస్సు అతికోమలం. ఎక్కడున్నా అన్యాయమంటే సహించలేడు. అందరి బరువులూ తననెత్తినవేసుకొంటాడు. బలవంతుల, దుర్మార్గులశత్రుత్వం నిర్భయంగా కొనుక్కున్నాడు. ఆస్తిపాస్తులు అన్నీ పోయినవి. ఆరోగ్యం మంచిది గాదు. చదువు కుంటినడకతో సాగుతున్నది. వాణ్ణిచూస్తే నాకుగూడా దిగులే నాన్నా! ఏం చెయ్యాను? వాడికివ్వవలసిన అమ్మాయిని, లేదవాడని

యివ్వక వేరేచోట యిచ్చేశారు. ఆ సంగతి ఎవరికీ చెప్పకు. దిగులతో కుళ్ళిపోతున్నాడు. మనం ఏదైనా డబ్బు సహాయం చేస్తే వచ్చేయేడుకుగూడా వాడి చదువు గట్టెక్కుతుందేమో!"

ప్రతాపరెడ్డికి, యీ సూర్యరశ్మిలో వెలుగుతోన్న ప్రపంచపు అత్యాచారం నగ్నంగా కనబడ్డది. రాజు, ఆ దివ్యజ్యోతి, ఆ బాలయోగి, ఆ విప్లవమూర్తి, ఆ మహాత్మ — పేద? చదువు ఆగిపోతుందా? అందరిభవిష్యత్తుకోసం కలలు సాధిస్తున్న యీ యువకుడికా శత్రువులు? ప్రతాపరెడ్డి ఆలోచించినకొద్దీ విషాదమూర్తి కాసాగాడు.

నీడవలె కన్పించింది జీవితం. తెల్లనీడ యీ పగలు. కనబడని నల్లనీడరేయి. యీ నీడలకు రాజువంటి సుందరమైన వస్తువెందుకు? వస్తువునువీడి, నీడనంటి మీసాలు దువ్వుకొని లోకం కూర్చొని సంపెంగనూనె రాచుకొంటోంది. ప్రతాపరెడ్డి ఆలోచనలలో రాత్రి, మృత్యువూ, నిశ్శబ్దత, నిరామయత — రాజుచుట్టూ నగ్న నృత్యం చేస్తున్నట్లు కన్పించినవి. తన భయంతో కుంగిపోయింది ఆత్మలోని ఔన్నత్యం. కొడుకువంక చూచాడు. రాజును తన రెండవబిడ్డగా చూచాడు. ఆ కొగడా జ్వాలనుండే తన కొడుకు వెలుగుతున్నాడని తెలుసుకొన్నాడు. హంపీనుండి వచ్చినతర్వాత అన్నమ్మతో తగాదాలు జాస్తిఅయినవి. పూనిన భక్తుడివలె ప్రతాపరెడ్డి దేనినీ అంటీ అంటకుండా, ఏ విషయంలో జోక్యం కలుగజేసుకోకుండా తిరగసాగాడు. దానితో అన్నమ్మ మరీ మండిపోయేది.

ఇంతలోనే సహకారసంఘంనుండి తెచ్చిన బాకీకి సమన్లు వచ్చినవి. బాకీ చెల్లింపులు వాయిదా వెయ్యమని కోరుతూ కాయితాలు రాశాడు చిట్టిరెడ్డి. కాని సంఘం చీనితోటను వేలం పెట్టించింది. మొదటలో ప్రతాపరెడ్డి పట్టించుకోక, ఆలస్యంగా యింటికి రా మొదలుపెట్టాడు. ఇంట్లో తిండిగింజలుగూడా తరిగిపోయినవని తెలుసుకొనిగూడా కన్నెత్తి చూడలేదు. కాని చిట్టి బలవంతంతో యిద్దరూ సహకార సంఘ సెక్రటరీవద్దకు పయనం గట్టారు.

మిట్టమధ్యాన్నానికిగాని పట్నం చేరుకోలేక పోయారు. ఈడ్చికొట్టే ఎండల్లో, నీడలేని రోడ్లమీద, చచ్చినపిట్టల్ని చూస్తూ చేరారు. సెక్రెటరీ లేడు. గుమాస్తా వున్నాడు. వేళగాదని నసిగి, దాస్యంలో, దరిద్రగర్భంతో ఆత్మనూ, గౌరవాన్ని లెక్కచెయ్యని ముసలి గుమాస్తా — అర్థం అయ్యే భాషలో "ఏమిస్తావయ్యా? నీపని అవుతుందిలే" అన్నాడు.

ప్రతాపరెడ్డి చిట్టివంక చెమట తుడుచుకుంటూ చూశాడు.

చిట్టివేళ్ళతో రూపాయలసంజ్ఞచేసి "లంచం" అన్నాడు.

ప్రతాపరెడ్డి చేతులు ముఖంమీదినించి జారిపోయినవి. మేతలేక ఎత్తుబడ్డ పుల్లన్నను, డబ్బులేక చదువాపిన రాజును, రేపు తిరిగి కాలేజిలో చేరలేనని నిరాశచేసుకొన్న తన చిట్టినీ—కళ్ళముందుకు ప్రయత్నించకుండానే తెచ్చుతున్నాడు. కొత్త ఆత్మ, కొత్త అందం లోకానికి వస్తయ్యని రాజు చెప్పిన భవిష్యత్తు సౌందర్యం, యీ నల్లని హృదయపు ముసలి దరిద్రనారాయణుడి వర్తమానం ముందు ఎంత అసంభవంగా కన్పించింది! ఉద్రేకియై కొట్టటానికి చెయ్యెత్తాడు. చిట్టి ఒక్కతృటిలో అడ్డుపడ్డాడు.

* * * *

వేసంగి సెలవలు అయిపోతూండగానే చిట్టి తండ్రితో అన్నాడు—"హాస్టలుకు దరఖాస్తు పెట్టుకోవాలి. జీతాలు, పుస్తకాలు మూడొందల దాకా యీశ్చేట్లుగా వుంది."

రెడ్డి కొడుకును కన్నార్పకుండా చూచి—

"మరి రాజుమాట"

"అందుకనే..."

మళ్ళీ యిద్దరూ మాట్లాడుకోలేదు. రాత్రి ప్రతాపరెడ్డి చాలాసేటిదాకా మేలుకొనే వున్నాడు. సందుకాయ పెట్టెలో, అన్నమ్మ పాతకాసులకంటె వున్నది. బోలుకంటె ఈ ధరల్లో నాలుగయిదు వందలకన్నా ఎక్కువ పలకదు.

ఉదయం హడావిడిగా కొడుకును ప్రయాణం చేయించాడు. ఆరోజు జొన్నలు తెచ్చిగాని అన్నమ్మ తిండిపెట్టదు. పెట్టెలో చిట్టిగుడ్డల కింద రాత్రి తీసినకంటె దాస్తూ — "ఇదొక్కటే వున్నది. యిద్దరూ చేరండి. జాగ్రత్తగా వుండండి" అని అతడి ముఖం చూడకనే పలికాడు. చిట్టి వెళ్ళిపోయాడు. మూడవరోజుకు అన్నమ్మ దొంగతనం కనిపెట్టి తిట్టిపోయ సాగింది. లక్ష్మి నడిచి పోయిందని వాపోయింది. శాపనార్థాలు పెట్టింది. మెటికెలు విరిచి, అఘాయిత్యంచేసి జుట్టు పీక్కొన్నది. రెడ్డియింట్లో కాలు పెట్టకనే అడాపెడా సావిట్లో తిరిగాడు.

పుల్లన్న మేతసంగతి మిగిలింది. పెదరెడ్డి గారింటికి వెళ్ళి చూచాడు. ఎవరూ కనిపించలేదు. కన్పించింతర్వాత, తన జీవితంలో మొదటిసారి బిచ్చమెట్లా ఎత్తాలో తెలియక తిరిగివచ్చాడు. అన్నమ్మ రాసుల సంకటిపెట్టి అవలకు వెళ్ళింది ఆరోజున. మాలపల్లి, మాదిగపల్లి, గొండ్లపేట కుమ్మరివీధి—అంతా నిర్మానుష్యమైపోయింది.

అడివినుంచి చింతగింజలూ, ఈతగింజలూ తెచ్చుకుని ఆ పిండితో అంబలి తాగిన యేతవాళ్ళ ముసలమ్మల కిద్దరికీ కలరా తగిలి, ఆ సాయంత్రమే చచ్చిపోయారు. ప్రతాపరెడ్డి పోయి, శవదహనానికి సహాయపడ్డాడు. కరువు అప్పు లిస్తారని తాసీల్దారు రాగా, అందరితోపాటు తనూ అర్జీపెట్టాడు. అందరితోపాటు తనూ తాలూకా చుట్టూ తిరిగివచ్చాడు. మఠం స్వాములవార్లువచ్చి గంజి కేంద్రం తెరిచారు మరునాడు వూళ్ళో. పంచినవాళ్ళకు—పల్చని గంజిపంచగా—యింకా రెండొందల ముసలి, పసిబిడ్డ కూలినాలి జనం మిగిలిపోయింది. వారంరోజుల్లో యీ గంజి కేంద్రం ఎత్తివేశారు. పంచాయితీ కోర్టు ప్రెసిడెంటు—రంగనాయకులు రెడ్డి కలెక్టరును తెచ్చిచూపి, కొత్త గంజికేంద్రం తెరిపించాడు. ఈ కేంద్రానికి రంగనాయకులు రెడ్డి గుమాస్తా—వీరిబ్రహ్మం పెద్ద. వీరబ్రహ్మం రోజుకు అయిదారుశేర్ల జొన్నలూ బియ్యమూ కాజేసి మిగతా భాండిలో యింత వుప్పూ అన్ని పుల్లిపాయిలూ వేసి, చుట్టుపక్కల పల్లెలనుండి అయిదారుమైళ్ళు నడిచి వచ్చిన అనాథలకు వేడినీళ్ళు వడ్డించసాగాడు. లక్కిరెడ్డిపల్లె

నుంచి వచ్చిన, గోతాం ముక్కల చెప్పుల ముసలివాడు వడదెబ్బ తిని కేంద్రం ముందే చచ్చిపోయాడు.

అక్కడికి మూడుకోసులదూరంలో కరువు రోడ్డుపనులు సాగుతున్నవి. ఎవరికీ చెప్పకుండాపోయి, ప్రతాపరెడ్డి రోడ్డు కూలిపనికి చేరాడు. అక్కడా యింతే. యిదే అన్యాయం. యిదే రాక్షసత్వం. సాయిబు కంట్రాక్టరు. ఏరోజు కూలీ ఆ సాయంత్రానికి యిస్తారన్న ఆశతో ప్రతాపరెడ్డి వెళ్ళాడు. కాని బట్వాడా జరగలేదు. అదేమని అడిగితే, సాయిబు కడపనించి దిగుమతిచేసిన రౌడీలు హరిజన స్త్రీలను చావ మోదసాగారు. ప్రతాపరెడ్డి వెళ్ళి పెద్ద గడ్డపలుగుచూపి అడ్డునుంచొన్నాడు. మర్నాడు ఆ పని గూడా పోయింది. కాని అక్కడ కోమటి దళారిగుంపు, ఇంకొక రెడ్లదళారి గుంపు వున్నది. కడుపు కాలినవాళ్ళు ఎంతకైనా లొంగివస్తారని ఆ గుంపు రూపాయికి వేశవడ్డీతో, ఆ అన్నార్తులకు అప్పులుబెట్టి, ఆకాశపు ధరలకు మట్టిగలిపిన జొన్నలమ్ముతున్నారు. ఈ కంట్రాక్టర్లు, దళారి గుంపు అంతా ఒకటేనని ప్రతాపరెడ్డికి తెలిసిపోయింది.

ఉదయ తేజస్సుతో లోకం స్నానం చేస్తున్నదనీ, మహోదయం వుదయించనున్నదనీ రాజు హంపీలో చీకటిరాత్రి చెప్పిన మాటల్లో ఎప్పటి సత్యంవున్నదో కాని యీ వాతావరణంలో విషమే గాలిగా వీస్తున్నది. పరచుకొని రెక్కలతో మృత్యువు దిక్కులను కప్పివేస్తున్నది. ఈ విషపూరిత ఉచ్ఛ్వాస నిశ్వాసాల బరువుతో తనుగూడా మృత్యువును సమీపిస్తున్నట్లనిపించింది. ఈ ఆత్మలేని, రాజు భావాలులేని లోకంకన్నా, మృత్యువూ, దాని తర్వాత ఏలోకమైనా వుంటే ఆ లోకపు చల్లదనమూ, శాంతీ, దాని ఆలోచనా ఎంతో ముదావహంగా వుంది. ఆకలినుండి, అన్యాయంనుండి మానవజాతికి విముక్తిలేదని ప్రతాపరెడ్డి యింటికి తిరిగివచ్చాడు. నిస్సహాయులైన తనతోటి వాళ్ళలో గూడా కారుణమూ, ఆత్మ, రక్తమూ కన్పించలేదు ప్రతాపరెడ్డికి. ఈ మహా సుగుణాలు వున్న రాజూ చిట్టి—ఏమవుతున్నారు?

ఆరోజున చిట్టినుండి జాబువచ్చింది. కొత్తగా పెట్టిన పోష్టు ఆఫీసులోనే దాన్ని చదివించాడు. "రాజుకు జ్వరంగా వుంది. నిన్ను చూడాలని అంటున్నాడు. వెంటనే జయలుదేరి రావలెను—చిట్టి," యింతే. ఈ నాలుగు ముక్కలే. నిల్చొన్నపాటునే బయలుదేరాడు. నడిచి నడిచి, ఆకలితో, దాహంతో, దిగులుతో, జీవచ్ఛవమై రాత్రి పదిగంటలకు కడప చేరాడు.

చిట్టితోపాటు రాజు హాస్టల్లోలేడు. వేరేగది తీసుకొని దుమ్మూ, ఈగలూ ముసురుతూన్న బజారులో వున్నాడు. రాజుకు జ్వరం పేలిపోతున్నది. కాని మాటలధోరణి అట్లాగే వున్నది.

"జన్మభూమి—" అన్నాడు—రాజు.

లోతుకు పోయిన కళ్ళతో ప్రతాపరెడ్డి రోగిని తిలకించాడు.

"జన్మభూమి. కరువు గడ్డకావొచ్చు. ఎడారి యిసుకతిప్ప కావొచ్చు. బీడు, కంచె, వరద, చవిటిదిబ్బ కావొచ్చు. కాని మనల్ని కన్నతల్లి. తల్లిని మనం ప్రేమించకపోతే, మరెవరికి వాత్సల్యం. మన ప్రేమ చివరికి హంపీ శిధిలాలై, రుద్రభూమియై దక్కుతుందేమో. దక్కవచ్చు. కాని ఆ శిధిలాలనుండి కొత్త సౌందర్యంతో తల్లి ప్రకృతి నిలుస్తుంది. ఆ శిధిలాల శివతాండవం నుండి నవ్వుతూ, చేతులు చాచుతూ మన బిడ్డల్ని సాకుతుంది. రాబోయే సంతానానికై యీనాటి శిధిలాల్లో త్యాగం తప్పదు. అందుకు మిమ్మల్ని పిలిపించాను." రాజు కళ్ళు అగ్నివలె మండేవి మరింత ప్రస్ఫుటంగా మారినవి.

ప్రతాపరెడ్డి ఆ మాటల భయంకర సత్యానికి వణికిపోయాడు. మృత్యువునూ, దాని తర్వాతి శాంతినీ వాంఛించిన వాడు—యీతన రాయల పుర శిధిలాల్లో నివసించ మరలాడు.

"రాను—రాను—అక్కడే వుంటాను. చిట్టి అందరమూ యిక్కడే వుందామని అన్నాడు. కాని రాను. అక్కడే, ఆ మిత్తి చావుకు నేను ఎదురుపోయి ఎదురుచూస్తాను."

"అవును, మృత్యువుగూడా చస్తుంది. అది శాశ్వతంగాదు. ఈ గడ్డ, దానిని నమ్మినవాళ్లూ—యివే శాశ్వతమైనవి. ఈమాటు వచ్చినప్పుడు చెప్పగలను." రాజు కళ్ళు మూసుకొన్నాడు—అలసిపోయి.

సాయంత్రం డాక్టరువచ్చి — "సన్నిపాతం. ఆస్పత్రిలో చేర్చాలి. యిక్కడ దిక్కుచూచే ఆడవాళ్ళుగూడా లేరాయెను" అని విసుగుపడ్డాడు.

రాజు డాక్టరుముందే పెద్దగా నవ్వసాగాడు. ఆ బొమికెల గూడు పైకి ఎగిరి పక్కమీద తూలిపడ్డది.

"ఎవరి ధర్మం—అది లోకానికి మేలుకూర్చేదైనప్పుడు వాళ్ళు ప్రాణానికి తెగించయినా నిర్వహించాలి. మన స్త్రీలు అగ్నిగుండాల్లో, పమిటె చేజిక్కించుకో జూచిన శత్రుల కందకుండా, ఎందుకు దూకారు? తమ జన్మభూమి, తమ జన్మహక్కు, తమ అనంతాత్మ—అవి మరిచిపోకనే. వాటి నీడన, వాటి అవ్యాజ ప్రకృతిలో పెరిగి మరిచిపోతారా? పోరు. పోలేదు. పిచ్చిముండాకొడుకు. టైఫాయిడని వట్టి బెదిరింపు. అందుకని నా ఆత్మను చంపుకోనా?"

ప్రతాపరెడ్డి తన మురికితలగుడ్డ కళ్ళ కడ్డం పెట్టుకొన్నాడు.

చిట్టి వచ్చి తండ్రిని అటుపిలిచి — "బదకడని డాక్టరు చెప్పాడు. సంధిమాటలుట" అన్నాడు. నమ్మలేక రెడ్డి కొడుకు వంక బరువుగా చూచాడు.

"డాక్టరుకు డబ్బు యివ్వలేకపోయాం. అందువల్లగూడా కొంత రాద్ధాంతం చేస్తున్నాడు." అని చిట్టి ముగించాడు. చిట్టి తండ్రి కళ్లను సూటిగా చూడలేకపోయాడు.

ఆరాత్రల్లా నడిచి, తెల్లవారుఝామకు రెడ్డియిల్లు చేరాడు. ఈలోకంనుండి సూర్యుడు అస్తమించనున్నాడు - ఈరేయికేగాదు. శాశ్వతంగా. మరి తిరిగి దర్శనమివ్వకుండా. చెట్లనూ, పూలను, పిల్లల బోసినోళ్ళనూ తిరిగి నవ్వించకుండా. భవిష్యత్తును వెన్నెల చల్లదనంలాగా చూపినరాజు, తనచిట్టి ప్రాణ చెలికాడు, తన గురు

పుత్రుడు, తనబిడ్డ, ఈ లోకపు ఆత్మ, తన ఆత్మకు అగ్ని చచ్చిపోనున్నాడు. అయితే తనెందుకు తిరిగి వచ్చాడు. డబ్బుకోసమా? ఈలోకానికి ఆవిషాదప్రవక్త అవసరం లేదుగదా? ఈ విషవాతావరణానికి ఆ స్వేచ్ఛ మలయవాయువు లవసరం లేవుగదా? అంతా రాజు మృత్యువు కెదురు చూస్తున్నట్లుగా వుంది. రాజు చచ్చిపోయింతర్వాతే యీ కరువు మాయమై, యీ చెట్లు వికసించి, యీ చెరువులు నిండి, యీ లోకం కలకలమని నవ్వుతుందేమో. ఆ చావుకే యీ ప్రకృతి విలపిస్తున్నదేమో. కాళీ వరం పొందిన కాళిదాసు మనస్సువలె రాజు సన్నిధినుండి తిరిగి వచ్చిన ప్రతాపరెడ్డి మనస్సు ఆలోచనలతో, దుఃఖంతో నిండిపోయింది. ఎవరిస్తారు డబ్బు? ఎక్కడున్నది డబ్బు? దళారిగుంపులచేతుల్లో, నరరూపరాక్షసులపెట్టెల్లో మూగే డబ్బు? రాయలసీమపంటలను మోసుకువెళ్ళిన షావుకార్ల యినుపపెట్టెల అంతర్భాగాల్లోనా? మృత్యువు తప్పదు. అవును, అన్నాడుగూడా నే? ఆ శిధిలాల శివతాండవం తర్వాతగాని, యీ విలయలోక నృత్యగీతికతర్వాతగాని — జీవనదేవి చిరునవ్వు నవ్వదని. ఎవరికో బలిఅయిపోయే రాజు త్యాగంలో అర్థం ఏమిటి? ప్రవక్తా? బుద్ధుడా? క్రిష్ణుడా? క్రీస్తా? ఎవరీరాజు? ఆశనూ నిరాశనూ సమపాళ్ళలో తాగి తనకు అంటవన్నట్లుగా, నీధర్మం పాలించు, నా మృత్యువు నాపలేవు. ఈ మృత్యువుకుగూడా మృత్యువున్నదని వుపదేశించినరాజు? కలనూ నిజాన్నీ విభజించగలిగిన రాజుకు తన మృత్యువు సంగతి తెలియదా?

ఆరోజు వూళ్ళోకి కడపనించి ముసలి ఆవుల్ని, ముసలి ఎద్దుల్ని కొంటున్న కసాయివాళ్లు వచ్చారు. పుల్లన్న నమ్మితే ఒక ముప్ఫైరూపాయిలన్నా రాకపోవు. ఈ ముప్ఫైతో రాజు ప్రాణం నిలవవచ్చు. అప్పుడు సూర్యు డస్తమించడుగదా!

కాని రాజు జన్మభూమి బిడ్డల్ని నమ్మమన్నాడు. భూమిని నమ్మినవాళ్ళకు నాశనం లేదన్నాడు. తనతల్లి గడ్డనుదున్ని, తన గాదెలు నింపి, తనదాహాన్ని తీర్చిన పుల్లన్నను తను నాశం చేయటమా? హుస్సేనాలీ వచ్చి ముప్ఫై అయిదు యిస్తానన్నాడు. జమాల్ నలభైదాకా పోయాడు. ఈ బేరం సంగతి ఆలకించి అన్నమ్మవచ్చి ఛెళ ఛెళమని తిట్టిపోసింది. "మీ శిరసులు మండా. మీ జిమ్మలు పీక్కపోనూ" అని కసాయి సాయిబుల్నీ, ప్రతాపరెడ్డినీ కలిపి దీవించింది.

ప్రతాపరెడ్డికి భయం వేసింది. మర్నాడుగూడా సాయిబులు వచ్చారు. మూడోనాడు రహస్యంగా కబురు చేశారు. ఆనాడే, రాజు ఆశలేదనీ, చాలా బరువుగా వుందనీ చిట్టినుండి జవాబు వచ్చింది. కాని ప్రతాపరెడ్డికి నమ్మకం కుదరలేదు. రాజు చచ్చిపోవటం? కల్ల. కల్ల. లోకంలో ఆత్మే నశించిపోతుంది. ఆ భగవంతుడి పరిపాలనే అంతమైపోతుందేమో. రాజుకు చావు లేదు. రాజు ప్రవక్త. ఆ స్వప్నదర్శి, ఈ పాపభూయిష్టలోకానికి వెలుగు చూపి, ఆత్మలనుద్ధరించేందుకు వచ్చాడు. ఎవరికి చావు? మృత్యువుకేగాని రాజుకు గాదు.

కాని వుత్తరం తీసుకెళ్ళి తిరిగి పంతులుగారి కొడుకుచేత చదివించుకొన్నాడు. నిజం. ఆమాటలే. ఆశలు లేవు. చూడాలని వుంటేరా. ఆరాత్రి తెల్లవారలేదు. ఇక సూర్యు డుదయించడేమో? ప్రతాపరెడ్డి చిన్ననాటి దిగులుతో ముడుచుకొని, ఆకలి డొక్కలతో వసారాలో వుత్తరీయం పరచుకొని పడుకొన్నాడు.

మరునాడు — కడప కసాయి సాయిబులు కొన్న ఆవుల్ని, ఎద్దుల్ని తోలుకెళ్తున్నారు. రాజు కింకా నూకలు వున్నవి. లేకపోతే యీపాటికి మృత్యువు మింగేసి వుండేది. తనువెళ్ళి బతికించాలి. ఆవేశంతో గొడ్లసావిడిలోకిపరిగెత్తి, పుల్లన్న మెడపలుపు విప్పి, జమాలుద్దీన్ మందలోకి తోలాడు — ఒక్క క్షణంలో. జమాల్ నోట్లు లెక్కబెట్టి అయిదు తక్కువగాయిచ్చాడు. ప్రతాపరెడ్డి బేరమాడలేదు. వుత్తరీయంకోసం వెతుకుతూ యింట్లోకి వచ్చాడు. కనబడలేదు. అక్కడా యిక్కడా వెతికాడు. వుత్తరమేమైనా వచ్చిందేమోనని పోస్టాఫీసుకు వెళ్ళాడు. యింకా జమాను రాలేదు. కూచొన్నాడు. ఇక నిలవలేక బస్సురోడ్డుకని అడ్డంపడి పరుగెత్తసాగాడు. దుర్గవలె అన్నమ్మ ఎదురు వచ్చింది. ఏడుస్తూ, లోతుకుపోయిన కరువు బుగ్గల్తో — అన్నమ్మ, ముఖాన మాడలాగా పెద్దకుంకుమబొట్టుతో, ఆదిదేవతరూపువలె అన్నమ్మ. ప్రతాపరెడ్డి చటుక్కున ఆగిపోయాడు.

రాజు ఏమని చెప్పాడు? తన వుపదేశంలో పృథ్వీపుత్రులను నాశనం చెయ్యొద్దనిగాదా? అన్నమ్మ ఎవరు? పృథ్వీపుత్రి. పుల్లన్న? పృథ్వీపుత్రుడు? తనకు రాజుమాటపై గౌరవంలేదా? చేతులు జోడించి అన్నమ్మకు నమస్కరించాడు. రాజు వర్ణించిన హిందూ క్షత్రియవనితలూ, వాళ్ల ఆత్మబలిదానం తన కట్టెదుట నిలిచినై.

"పుల్లన్నను తిరిగితెస్తాను. ఈ పాపిష్టి డబ్బు నాకువద్దు. పుల్లన్నను తెస్తాను. రాజు చావడు. రాజుకు చావులేదు. లేదు. లేదు..." అని గొంతువిప్పి అరుస్తూ ప్రతాపరెడ్డి అన్నమ్మను తప్పించుకొని రోడ్డుమీది కెక్కాడు.

అప్పటికే మందలు పొలిమేరలు దాటినవి. వగర్చుతూ మంద కెదురు బోయాడు ప్రతాపరెడ్డి.

"నా పుల్లన్నను నా కియ్యండి. నా పుల్లన్న నాకు కావాలి. యిదిగో మీ డబ్బు."

జమాల్ మృగశరీరం మీద తల బరువుగా తిరిగింది. "అరే, చెంబోల్ మొగం! హొవఢ్క యిచ్చావ్ ఛే పుల్లన్నా, ఎల్లన్నా. జావ్ జావ్" అన్నాడు తెలుగు భాషను చంపుతూ.

ప్రతాపరెడ్డిలో తెలుగు వీరుల రక్తం యింకిపోలేదు. ఖిల్లాలు, బురుజులు కట్టిన వీరరక్తం, వెనుజూపి ఎరగని వుడుకు రక్తం, సామ్రాజ్యాలూ, విజయయాత్రలూ కదిపి, నడిపిన చైతన్య రక్తం—రెడ్డిలో నాళనాళాన్ని వుబుకెత్తించింది.

"ఆగరా, వెధవ !—పుల్లన్నా...అహా...హా...వ...య్యా ...య్యా..." అని పుల్లన్న భాషలో మాట్లాడాడు. డొక్కలెండి. నెమరుకుగూడా దవడలు కదలని పిచ్చిపుల్లన్న, నీళ్ళుగారి పుసిగట్టిన కళ్ళతో యజమాని వంకచూచి, గుర్తుపట్టి ఒక్క చెంగణంతో మందనుండి తప్పించుకొని, ప్రతాపరెడ్డి పక్కకువచ్చి, తలవూపింది. రెడ్డి పుల్లన్న పక్కల్ని తడిమి, తట్టాడు.

జమాల్ జొడ్లో కత్తిదీసి ప్రతాపరెడ్డిమీద కలియబడ్డాడు. తళ్ళి కోటలోవున్న రెడ్డి ఆవేశం ముందు - యీ రాక్షస ప్రకృతి తట్టుకోలేదు. జమాల్ కత్తినే లాక్కొని, వాడి కణతమీద బలంగా పొడిచాడు. గాని వెనక పొంచివున్న హుస్సేనాలిని చూడలేదు. ప్రతాపరెడ్డి ముద్దగా కూలిపోయాడు.

పుల్లన్న హంతకుణ్ణి నిటారుగా చూచింది. వాడు వెను తిప్పగానే కొమ్ములు గిటించి, డొక్కల్లో పొడిచి ఎత్తి కుదవేసి, దుమ్ములో పొర్లించింది. అరచి చచ్చిపోయాడు. ప్రతాపరెడ్డి హంతకుడు. మంద చెల్లాచెదరై పోయింది.

పుల్లన్న అలస్యం చెయ్యలేదు. ముక్కుతో యజమానిని తాకి వాసన జూసింది. ప్రాణంలేదు. ఆ కళేబరాన్ని కొమ్ములతో శిరసుమీది కెక్కించుకొన్నది. ఇంటిదారి బట్టింది. ఆరుబయట అన్నమ్మ వేచివున్నది.

భర్త శవాన్ని చూచింది. పుల్లన్న వీపునిమిరి ముద్దెట్టుకొన్నది. తన పమిటె చెరుగుచించి ప్రతాపరెడ్డి గాయాలకు అడ్డు పెట్టింది. ఆ రక్తం తీసి తన నొసలిమధ్య బొట్టుపెట్టుకొన్నది.

సావటిలోనే చితిపేర్చి ప్రతాపరెడ్డిని దానిమీద పడుకో బెట్టింది. చితి ముట్టించి చేతులు జోడించి నించొన్నది. పుల్లన్న తల ఆడించింది బ్రతిమిలాడుతూ—వద్దువద్దని. పుల్లన్నను చరిచి బయటికి పొమ్మన్నది అన్నమ్మ. చితి ముట్టించి, అన్నమ్మ అందు మీదికెక్కి ప్రతాపరెడ్డిని కౌగిలించుకొన్నది. మంటలుచూచి, వూరివాళ్ళు పరుగు పరుగున వచ్చారు. కాని అప్పటికి చితి చిట చిట పట పట మని పేలుతున్నది.

* * * *

ఆ రాత్రి రాజు చనిపోయాడు. చనిపోయేముందు మళ్ళీ పాత కళ వచ్చింది. ఆ ముఖంలోకి—"చిట్టి. యింటికిపో. అమ్మ వీరకుంకుమ ధరించి నిన్ను పిల్చింది" అన్నాడు.



లినోకట్ చిత్రము. శ్రీ వే. రాధాకృష్ణ.

# చైనా చిత్రకళ

★

శ్రీ వరదా వెంకటరత్నము

గ్రీసు, రోము మొదలగు పశ్చిమదేశాలు, హిందూదేశము, ఈజిప్టు పారసీకము మొదలైన ప్రాగ్దేశాలు అనాదినుండి సంస్కృతికి, విజ్ఞానానికి పేరుపడ్డ దేశాలు. ఈ ప్రాగ్దేశాలతోపాటు చైనాదేశముకూడ ఈ రెంటికి పేరుగన్న దేశము. ఈ దేశాల విజ్ఞానానికి ప్రమాణము ఈ దేశీయులు సాగు చేయుచువచ్చిన కళలే. ఆయా దేశాల వాతావరణమునుబట్టి, ప్రజల ఆచారవ్యవహారములనుబట్టి, వివిధ తరహాలలో ఆయా దేశపు కళలు రూపొందుతూ వచ్చాయి. భావప్రకటనలో రచనారీతులు వేరైనా, ఆశయాలు మాత్రము సత్యనిరూపణలే గదా!...

చైనాదేశపు విజ్ఞానము సుమారు 4000 ల సంవత్సరముల నాటిది. చైనాదేశస్థులు అనాదినుండి కళాప్రియులు. అందువల్ల ముఖ్యముగ చిత్రకళను చక్కగ కృషిచేసి చాలఉన్నత స్థాయికి తీసుకురాగలిగారు. వీరు కళలను ఒక ప్రియమిత్రుని చూచునట్లు చూస్తారు. వీరే జపానుదేశానికి కళాభిక్షపెట్టినారు. వీరి కళా ప్రభావము జావా, సయాం, బర్మా, హిందూదేశాలకుకూడ కొంత వరకు ప్రాకినది.

చైనా కళ చైనీయుల అనాది శిల్పముతో ప్రారంభమైందని చెపుతారు. చిత్రకళ వారిలిపినుండి రూపొందినదని కొందరు చెపుతారు. ఎందుకంటె చైనాలిపిలో ప్రతీ అక్షరము పెక్కు చిన్న చిన్న విషయాలతోకూడి ఒక చిత్రమువలె వుంటుంది. ఇది వస్తువుల అకృతుల స్వరశబ్దములనుండి క్రమముగా రూపము దాల్చిందని మరికొందరి నమ్మకం. మతగురువు ఎల్లో ఎంపెరరు, షైహుయాంగ్ కనిపెట్టాడనికూడ ప్రతీతికలదు. ఏది ఎట్లున్నా చైనావారు చక్కని దమ్మాకిని చిత్రకళగా భావిస్తారు పూర్వమునుండి.

చాలమంది చైనా ప్రభువులు గొప్ప చిత్రకారులు. వారిలో లియాంగు కుటుంబానికి (503—557 ఎ. డి.) చెందిన అన్‌టి ప్రభువు ముఖ్యుడు. సంగ్, యువాన్, మింగ్ రాజ కుటుంబాలు చిత్రకళను పోషించి, గొప్ప చిత్రకారుల్ని తయారుచేశాయి.

చైనీయులు వెదురుపొదలు, పైనుచెట్లు, కమలములు, తదితరపూవులు మొదలగు వానిని చాల పవిత్రభావముతో చూస్తారు. ఆయా నెలలలో పుష్పించే పన్నెండు జాతుల పుష్పాలు పన్నెండు రెక్కల యవనికమీద లక్కరంగులతో పూర్వము ఎప్పుడో చిత్రించారు. అట్టి పుష్పాలు, పక్షులు, లతలు సంప్రదాయము చెడకుండ అనుశ్రుతముగ ఎంబ్రాయిడరీ పనులలోను, నేతపనులలోను, తదితర చిత్రవస్తువుల అలంకరణలలోను ఇప్పటికీ ఉపయోగిస్తున్నారు.

హిందూచిత్రకళలో కొన్ని సాంకేతికాలు ఇమిడివుంటాయి. ఆ సాంకేతికాలు అర్థమైనవారే ఆకళను చూచి ఆనందించగలరు. చీనా చిత్రకళలో అట్టి సాంకేతికాలు ఉండవు. అందువల్ల అందరు ఈ కళను సులభముగా అర్థముచేసుకొని ఆనందించగలరు. అంతమాత్రముచేత చీనా కళలో ఆధ్యాత్మిక భావాలు లేకపోలేదు. వీరికళలో బాహ్యసౌందర్యముకంటె అంతరంగిక సౌందర్యము హెచ్చు.

చైనా చిత్రరచనలో పెన్సిలు ఉపయోగించరు. రబ్బరు తుడుపులు లేవు. చిత్రకారుడు తాను చిత్రించదలచుకొన్న చిత్రాన్ని తన మనస్సులో నిర్మించుకుంటాడు. వెంటనే కుంచెతోగాని, వెదురు కలముతోగాని, నల్లనిసిరాగాని, రంగులుగాని ఉపయోగించి, పట్టు గుడ్డపైగాని, కాగితముమీదగాని, విరుపులులేని ఆపులులేని ధారాళమైనమెత్తనిరేఖలలో చిత్రిస్తాడు. అందువల్ల ఆరేఖలు కుంచెనుండా ధారాళముగా ప్రవహించిన రేఖలవలె కనిపిస్తాయి. ఆ రేఖల నిర్మాణంలో చిత్రకారుని మణికట్టు ఎంతసున్నితముగ తిరిగిందో తెలుసుకోవచ్చు. ఇట్లు ఒకే పర్యాయము చిత్రించగలిగే చిత్రకారుడు ఎంతో కృషిచేసి ఆ నేర్పును గడించగలుగుతాడోకూడ గ్రహించవచ్చు. ఇట్టిరచనలో పొరపాట్లు రారాదు. వస్తే, సవరించుకోడానికి వీలుపడదు.

ఈ కుంచెనడక చీనావారు కావలెనని తెచ్చిపెట్టుకున్నది కాదు. ఇది వారి వ్రాతలోను, చిత్రరచనలోను స్వభావసిద్ధమైనదే. భావప్రకాశమైన కుంచెనడక ప్రతీ చీనా చిత్రములోను కనబడుతుంది. ఇట్టిచేత వేహాన్ కాలమునాటి శిల్పాలలోకూడ కనబడతాయి.

ఈ రేఖాప్రాబల్యమువల్లనే వీరు రచించిన అగ్నిజ్వాలలు, సముద్రతరంగములు, ఎగురుతూవున్న పక్షులు మొదలగు వానిలో గొప్పచలనశక్తి కనబడుతుంది. వీరు గోడలమీద చిత్రించిన గుర్రాలు దౌడుతీస్తునట్లు కనబడతాయి. సరంబీలమీద చిత్రించిన డ్రేగన్లు ప్రాకుతూ వున్నట్లుతోస్తుంది.

వీరి రచన మార్దవమైన వర్ణసంవిధానముతోకూడి యుంటుంది. వర్ణసంవిధానమును ముందుగానే ఆలోచించుకొందురు. చిత్రాన్ని భగ్నపరిచే చిన్నచిన్న విషయాలు (*Details*) చిత్రించరు. ఒక విధమైన మార్దవ మాధుర్యాలు చిత్రములో తొణికిసలాడుతవి. రచనలలో ఎప్పుడూ లయ (*rhythm*) తాండవిస్తూ వుంటుంది. చిత్రాన్ని చూడగానే రేఖాయుతమైన సౌహార్ద్రితగోచరిస్తుంది.

అందుచేత వీరి కళలో ఎప్పుడూ గీతలకుప్రాముఖ్యం. పాశ్చాత్య చిత్రాలలోవలె వెలుగు నీడలతోకూడిన ఘనీభవాకృతులు కనిపించక, రేఖాప్రధానమైన సమతలాన్ని సూచించే మృదుత్వముతో కూడివుంటాయి వీరి చిత్రాలు.

వీరు హెచ్చు చిత్రాలు వెదురుకలముతో నల్లసిరా ఉపయోగించి సన్నని ముదుకురేఖలలో చిత్రిస్తారు. రేఖల్ని గీయడానికి ఒకేకలము ఉపయోగిస్తారు. కలాన్ని వివిధ తరహాలుగా త్రిప్పి గీయడంచేత, వివిధరకాల సన్నని ముదుకురేఖలు ఏర్పడతవి, వీరు చిత్రించిన వెదురుపొదలు, ఆకులు రాలిపోయినచెట్లు మొదలగు వాటినిచూస్తే వీరు కలాన్ని ఎంత చాకచక్యముతో ఉపయోగించగలరో తెలుస్తుంది. యుఆన్ కాలపు స్త్రీయైన కువాన్‌టాయోషెంగు నల్లని సిరాతో వెదురుపొదలు, పర్వతములు మాత్రమె చిత్రించేది. ఈ విధమగు రచనలో ఈమె కడు ప్రతిభావంతురాలు. తనపేరు తన దేశములో చిరస్థాయిగా చేసుకుంది.

ఒక్కొక్కప్పుడు నల్లరంగు నీళ్లలోకలిపి ముదురు, లేతఛాయలలో చిత్రంవ్రాసి రేఖలతో ముగిస్తారు. వీరు ఈ ఏకవర్ణ చిత్రాలలోకూడ భావాన్ని ఎంతోసూటిగా వ్యక్తపరచగలరు. అందుచేత ఈ చిత్రాలలో సృష్టియొక్క బాహ్యస్వరూపము కాక ప్రకృతిని ఆరాధించినందువల్ల వారిలో జనించే సౌందర్యము, భావాలు చిత్రాలలో కనబడతాయి. వీరు రంగులను చాల పొదుపుగా వాడతారు. చిత్రములో కొన్నిభాగాలు వర్ణలేపనము లేకుండానే చిత్రిస్తారు. అయినా చిత్రములో ఆలోటు కనిపించదు. ఆ భాగాలికికూడ ఇతరభాగాలతో పొందుకుదురుతుంది.

వీరి చిత్రరచనలో ఉపయోగించే పరస్పెక్టివ్ భావనాపూర్వకమైనదే కాని, శాస్త్రబద్ధమైనది కాదు. వీరి రచనలలో నీడలులేవు. ప్రతి బింబాలు మాత్రము అసలైన ప్రతిబింబాలు.

## ప్రాచీనకళలు

సైనాదేశములో **2205—1765** బి. సి. లోనే కంచుపోతపని ప్రారంభమై చక్కని సామగ్రి తయారుచేసినారు.

జేడ్‌రాతితో చిత్రవిచిత్రమగు బొమ్మలు, గిన్నెలు, పాత్రలు మొదలగు వానిని మలచినారు. ఈరాయిని సైనీయులు చాల పవిత్రభావముతోచూస్తారు. ఈ రాతితో మలచిన వస్తువులను వీరు మణిమాణిక్యములను దాచుకున్నట్లు పట్టుగుడ్డలలోచుట్టి భద్రపరుచుకొందురు.

**1200** బి. సి. లో మట్టిపాత్రల పరిశ్రమ ప్రారంభించి పెక్కుతరహాల ఆకారములలో పాత్రలు తయారుచేసినారు.

**206** బి. సి. లో పింగాణి పరిశ్రమ ప్రారంభించినారు. కొద్దికాలములోనే ఈ పరిశ్రమ ప్రపంచ విఖ్యాతిని గాంచింది. వీరినుండే పాశ్చాత్యులు ఈ పరిశ్రమ నేర్చుకున్నారు. ఈ పింగాణిలో వీరు తయారుచేసే వస్తువుల ఆకృతులు, ఉపయోగించే వర్ణముల ధాతువు, వివిధవింతచ్ఛాయలు అత్యద్భుతములు.

4—5 శతాబ్దాలలో చక్కని శిల్పాలు, గుహానిర్మాణాలు జరిగాయి.

## చిత్రకళ

ప్రాచీన చిత్రాల్నిచూస్తే వానిలో ప్రాచీన వైఖరి చాల తక్కువ గోచరిస్తుంది. ఈ సంగతి క్రీస్తువెనుక **265—420** సం॥ లో చిన్‌రాజుల కాలములో తయారైన చిత్రాల్నిబట్టి తెలుసుకోవచ్చు. ఆ చిత్రాలలో సైనీయుల ఆనాటి నాగరికత, మనోఃపరిశుద్ధత, రచనాకౌశలము వ్యక్తమౌతుంది. అవి ఏనాడో చిత్రించినవైనా, నేటికి రంగులధాతువు తగ్గక అప్పుడే చిత్రించిన వానివలె తోచును.

6 వ శతాబ్దిలో చిత్రించిన గోడచిత్రాలు ఇప్పటికి కొన్ని మిగిలివున్నాయి. ఇట్టివి 300 కుడ్య చిత్రాలు నాశనమైపోయినవి. రాజభవనములకొరకు సేకరించిన కొన్నివేల పట్టుగుడ్డపై చిత్రాలు తార్తారులు కాల్చివేసినారుట. ఇట్టివే తెలియనిదెబ్బలు చాల తగిలి చీనా చిత్రకళ ధ్వంసమైపోయింది.

ఏడవ శతాబ్దములో టాంగ్ రాజకుటుంబము రాజ్యానికి వచ్చింది. వీరికాలములో యన్‌విపెన్ చాలగొప్ప చిత్రకారుడు. పట్టుగుడ్డపై వరుసగా పదముగ్గురు చీనా ప్రభువులను వారి అనుచరులతో సహా చిత్రించాడు. ఈ రచనలో గొప్ప పటుత్వము కనబడుతుంది. ఈతడు చిత్రించిన మానవసాముదాయక చిత్రములలో ఒకటి బోస్టన్‌మ్యూజియం ఉన్నదట. దానిలోని రంగుల ధాతువు నేటికీ చెడలేదుట.

టాంగు చిత్రాలు చాలవరకు నాశనమైపోయినాయి. సైనా సంప్రదాయాన్నిబట్టిచూస్తె ఈకాలపు చిత్రాలే చీనా చిత్రకళకు తలమాణిక్యాలవంటివి. ఈ కాలముననే చీనా సామ్రాజ్యము పడమటివైపు విస్తరించింది. పడమటి రాజ్యాలతో సంపర్కముకలిగింది ముఖ్యముగా హిందూదేశముతో. వీరు బౌద్ధమతావలంబకులైనారు. బౌద్ధచిత్రాలు, శిల్పాలు వీరిని ఆకర్షించాయి. వీరి చిత్రాలలో బౌద్ధకళాసంప్రదాయాలు కొంతవరకు సంక్రమించాయి. అయినా వీరి మూలసంప్రదాయాలు మాత్రము చెదరలేదు. బుద్ధమత సంబంధ చిత్రరచనలో ఘటికుడు ఉటయోట్జు. ఇతడు రేఖలను ధైర్యముతో ధారాళముగ గీసేవాడు. అతితక్కువ వెలుగు నీడలు సిరాతోఇచ్చి మిట్టపల్లములు ఎంతో చక్కగ చూపేవాడు, చాల త్వరితముగ చిత్రాల్ని ముగించేవాడు. ఇతని శైలిని చాలమంది చిత్రకారులు అనుకరించారు.

టాంగుకాలమునాటి చిత్రాలు చాలతక్కువగ భద్రపరుపబడ్డాయి. 8 వ శతాబ్ధిలో లిన్‌చెన్ చిత్రించిన చిత్రాలు కొన్ని జపాను భద్రపరుచుకున్నది. ఇవి ఈకాలపు ప్రామాణిక చిత్రాలు. ఈ రచనను ఆకాలపు చిత్రకారులు చాలమంది అనుకరించారు. ఈ చిత్రాలలో "వుటయోట్జు" చేసినంత కుంచెపని కనిపించదు. ఈ కుంచెపని ప్రాముఖ్యము ఈకాలములో తయారైన బౌద్ధచిత్రాలలోకూడ కనిపించదు. చిత్రణ నాజూకుగా వుండకపోయినా కల్పనభావాలు అత్యద్భుతము. ఈ చిత్రాలు 8—9 శతాబ్దముల బౌద్ధచిత్రాలకు ప్రామాణికాధారాలు. ఈ చిత్రాలలో భావన నియమాలు హైందవ ఫక్కీకి చెందినా, రచనారీతి మాత్రము చీనాదే.

ప్రతిభావంతులగు అందరి చిత్రకారుల శైలులు ఏమరకుండా అలవర్చుకొని వానిని శాశ్వతపరుచుకున్నారు చైనీయులు. బౌద్ధ

చిత్రాలను, మానవజీవిత సంబంధమగు చిత్రాలను జాగ్రతపరిచారు. ఈ కాలముననే పల్లెపట్టు జీవితచిత్రాలు చిత్రించడం ప్రారంభించి, విరివిగా చిత్రించారు. వాటుచిత్ర రచనలో చౌఫాంగ్ చాల నిపుణుడు. చిత్రములోని వ్యక్తులకు తదితరములకు సరియగు ఎడములు, దగ్గరలుఇచ్చి చిత్రకల్పనచేయుటలో చీనాచిత్రకారులు చాల నిపుణులు. వీరి కల్పన సొంతమైనది; సాటిలేనిది. వీరికి అందమైన గుఱ్ఱములంటే చాల ప్రీతి. గుఱ్ఱములను అనేక పోకడలలో చిత్రించారు.

ఈ కాలములోనే భూతల దృశ్యచిత్రరచన (*Landscape Painting*) ప్రారంభమై అభివృద్ధిచెందింది. వీరే మొదట దృశ్యములోవున్న దగ్గరదూరపు వస్తువుల అంతరువులు, పరస్పరదూరములు చిత్రించుటను చాల కృషి చేసి కనుక్కొన్నారు. ఈ రచనలో ముఖ్యులు విన్సూసాహూన్, వేంగ్ విలు. వీరు చిత్రాలను ఆకుపచ్చ, నీలము వర్ణములలో చిత్రించి, బంగారురేఖలలో ముగించేవారు. చిత్రాలలో హెచ్చుగ పర్వతములు, బీటలు వారిన రాతిబండలు కనిపిస్తాయి. పొడవు పాటికొండల వరుసలు, మొనకుకొండ శిఖరాలు సముద్రమునుండిగాని, సరస్సులనుండిగాని అవతరించుచున్నట్లు. అడ్డముగా చాల దీర్ఘమైన చిత్రాలు చిత్రించడం వీరికి ప్రీతి.

తరువాత సంగ్ కుటుంబము రాజ్యానికి వచ్చింది. వీరి కాలములో చిత్రరచన విరివిగా జరిగింది. అయినా ఈ కాలపు చిత్రాలుకూడ అరుదుగా కనిపిస్తాయి. అసలైన సంగ్ చిత్రాల్ని బాగా పరీక్షించి గాని తెలుసుకోలేము. ఆదేశములో ఉత్తరప్రదేశములో జరిగిన చిత్రరచనను ఉత్తర సంగ్ చిత్రరచన, దక్షిణప్రదేశములో జరిగిన దానిని దక్షిణ సంగ్ చిత్రరచన అని రెండు భాగములుగ విడదీశారు. ఈ రెంటియొక్క తేడాలు బాగుగ పరీక్షించిగాని తెలుసుకోలేము. దక్షిణసంగ్ చిత్రాలంటే జపానీయులకు చాల మక్కువ. వీరి చిత్రాలు చాలసేకరించి జపానీయులు భద్రపరుచుకున్నారు. ఈ చిత్రాలు సంగ్ రచనావిధానాన్ని చక్కగా తేటపరుస్తాయి. వీనిలో ప్రత్యేక రచనావిధానం గోచరిస్తుంది.

12 వ శతాబ్ది ప్రారంభములో చీనాదేశాన్ని పాలించిన హుయిట్సాంగ్ గొప్ప చిత్రకారుడని చెపుతారు. ఇతడు పక్షులనే చక్కగ చిత్రించేవాడు. చిత్రాలుకొని చిత్రకారుల్ని పోషించేవాడు. ఒక కళాపరిషత్తునుకూడ నెలకొల్పినాడు. ఈ పరిషత్తు చాల ఉచ్చదశకు వచ్చింది. చాల చిత్రకారులు ఇందు చేరినారు. సంప్రదాయ సిద్ధముగ జరుగుచున్న చిత్రరచనములో ఈ పరిషత్తు కొన్ని ఉపయోగకరమైన మార్పులుప్రవేశపెట్టింది. పక్షులు, పువ్వులు, ఆకులు హెచ్చుగ చిత్రించడం మొదలుపెటారు. సృష్టిని జాగ్రతగా పరిశీలించి, అల్పవిషయాలు విడిచిపెట్టి, హెచ్చుగ గంభీరమైన ధారాళరేఖలకే ప్రాముఖ్యంఇచ్చి, చిత్రరచన ప్రారంభించారు.

ఉత్తరసంగ్ చిత్రకారులలో లీలంగ్ మియన్ ప్రతిభావంతుడు. ఈతడు చీనా చిత్రరచనలో అనుశ్రుతముగా వచ్చుచుండిన సంప్రదాయములను భక్తిగౌరవములతో పాటించేవాడు. ఇతడు గొప్పకవికూడ. ప్రఖ్యాతప్రాచీన చిత్రాలికి తరుచు హెచ్చుగా నకళ్లుతీస్తుండేవాడు. సున్నితమైన రంగులలోను, రేఖలలోను చిత్రాల్ని చిత్రించేవాడు. నల్లరంగుతో ఏకవర్ణచిత్రాలు కూడ చిత్రించేవాడు. పరిషత్తు కొన్ని నూతనపద్ధతులు త్రొక్కుట చేత ఇష్టము లేక పరిషత్తునుండి తప్పుకున్నాడు.

కుయోహిసి, లీలంగ్ మియన్ సమకాలికుడు. ఇతడు గొప్ప దృశ్యచిత్రకారుడని పేరుగడించుకున్నాడు. ఎప్పుడూ ఈతడు అడ్డము పొడవుపాటి చిత్రాలనే చిత్రించేవాడు. సహజముగ సన్నని దీర్ఘమైన చిత్రాల్ని చిత్రించడం చైనీయులకు మనస్సు. హెసియాకుయి అను చిత్రకారుడు పదివేలమైళ్ళ పొడవునావుంటే దృశ్యాన్ని 38 అడుగుల పట్టుగుడ్డపై చిత్రించాడట. కుయోహిసి గొప్ప దృశ్యచిత్రకారుడేకాక ఈ చిత్రరచనపైవ్యాసములుకూడ వ్రాసినాడు. ఈ సంగ్ చిత్రకారుల దృశ్యచిత్రాలలో విశేష వింత భావాలు ఇమిడియుంటవి. ఈ కాలములో ఈ రచన అత్యుత్తమ స్థితికి వచ్చింది. పోగా మిగిలినవాని విశేషభాగము దక్షిణ సంగీయుల చిత్రాలే.

జైన్‌మతవ్యాప్తితో బౌద్ధమత సంప్రదాయమైనట్టి, దైవతా మహిమలు చూపునట్టి చిత్రరచన చాల తగ్గిపోయింది, బుద్ధుని శిష్యులైన ఆర్హతులునిర్మానుష్యమైనకొండగుహాలలో ధ్యానములోనున్నట్లు చిత్రించడం ఈ కాలములో పరిపాటిఅయింది. వీరు అమరులని చైనీయుల నమ్మిక. ఒక్కొక్కప్పుడు వీరు మంచుకొండల శిఖరములపై నివసించుచున్నట్లు, గాలిలో ఎగురుచున్నట్లు చిత్రించేవారు. యోగులయొక్క గురువులయొక్క రూపచిత్రాలు చిత్రించేవారు. మానవజీవిత సంబంధమైన విషయాల రచనలుకూడ చేసేవారు. మొత్తముమీద మత సంబంధమైన చిత్రరచన తగ్గిపోయింది. దృశ్యచిత్రాలు, పక్షులు, పూవులు హెచ్చుగా చిత్రించడం ప్రారంభించారు.

భూతలముపైనున్న ప్రతిప్రాణిని, వస్తువును ఉపాసించి పవిత్రభావాలు గ్రహించారు. వీరు రచించిన చిత్రాలు వాస్తవికముగ కనిపించినా, అందు పవిత్రభావాలు ఇమిడియుంటవి. వీరు చిత్రించిన వ్యక్తులు, వస్తువులు నిజరూపాలుకాక వాటి ప్రతిబింబాలవలె కనబడతవి. అంతేగాని వీరు సృష్టిని అభూతకల్పన చేయలేదు.

ఏ వస్తువునైనా ఇతరవస్తువులతో ఉంచినపుడుగాని, ఖాళీస్థలములో ఉంచినపుడుగాని, ఆ వస్తువుయొక్క ఆకారములోను రంగులోను కొంతమార్పు గోచరిస్తుంది. ఇదే నిజమైన భావానికి దారి చూపుతుంది. ఈ భావమే చిత్రకారుని చిత్రములో ప్రతిఫలిస్తుంది. ఆ చిత్రములోని భావమె చూపరుల హృదయాలలో గోచరిస్తుంది.

చైనీయులు చిత్రములో కొన్ని స్థలాలు వర్ణలేపనము లేకుండానే విడిచివేస్తారు. అయినా ఆ ప్రదేశాలు ఖాళీస్థలాలుగా కనిపించవు. చిత్రములో ఇతర భాగములలో ఐక్యమైపోవును. వీరు ఇరుపైపుల సమానముగా (*Symmetrical*) ఉండాలని చూడరు. వీరి దృష్టి ఎప్పుడూ ఇరుపైపులా సమానాంగములుగల మానవునిపై

ఖడదు. ఎప్పుడూవారి దృష్టివంకరటింకరగా వున్న చెట్లు, రాతి ఖండలు మొదలగు వానిపైకే ప్రసరిస్తుంది.

గొప్పపవిత్ర భావాలతో సంగులు దృశ్యచిత్రాలు చిత్రించారు. వీరి చిత్రాల్ని అనుసరించిచూస్తే వీరి దృష్టిలో దృశ్యచిత్రరచనఅంటేపర్వతములు, చిత్రించుటఅనే అనుకోవచ్చు. ఈ విశాలప్రపంచములో ఈ రెండే హెచ్చుగా ఎన్నుకొని పెక్కుతరహాలలో చిత్రించినట్లు కనబడుతుంది. వీరు ఏకాంతవాసప్రియులుగకూడ కనిపిస్తారు. ఎందుకంటె, జలపాతముల దగ్గర, మిన్నుముట్టు పర్వతాగ్రములమీద, అరణ్యములలోను ఒక వ్యక్తి ధ్యానములో వున్నట్లుగాని, మైమరచి సృష్టిని ఉపాసిస్తున్నటుగాని చిత్రిస్తారు. ఈ చిత్రాలు ఆనందదాయకమై శాంతిప్రియత్వాన్ని సూచిస్తాయి.

సాధారణముగ వీరు చాల ఎత్తునుండి చూస్తున్నప్పుడు దృశ్యము ఎట్లు కనబడుతుందో అట్లు చిత్రంచిత్రిస్తారు. అంటె భూమిని, ఆకాశాన్ని విడదీసేరేఖ (హొరైజన్) చిత్రములో చాల పైభాగములో వుంటుంది. ఆకాశభాగము చాల తక్కువ. హొరైజన్ రేఖ కనిపించకుండా పొగమంచుతోనిండిన ఎత్తైనపర్వతశిఖరాలతో కప్పివేస్తారు. ఇది చైనీయుల దృశ్యచిత్రరచనాభావన. ఈ రీతులన్ని చివరి సంగీయుల చిత్రాలలో కనబడతవి. మయూ ఆన్, హిసియాకుయిలు ఇద్దరు దక్షిణసంగ్ చిత్రకారులలో ప్రతిభావంతులు. వీరి చిత్రాలు చాలవరకు జపానీయులు సేకరించి భక్తిగౌరవములతో భద్రపరుచుకున్నారు.

దృశ్య చిత్రాలేకాక రూపచిత్రాలు, సన్యాసుల సమూహాలు, చరిత్రాత్మక విషయాలు, మానవజీవిత విషయాలు, పల్లెపట్టు ప్రజల జీవితఘట్టాలు, అచేతన వస్తువులు (స్టిల్ లైఫ్) మొదలగు వానినిగూడ చిత్రించారు.

ఇటీవలి మంగోలుల కాలములో మరల ప్రాచీన సంప్రదాయాలను అనుసరించి చిత్రరచన సాగించినట్లు కనబడుతుంది. రచన కొంత నీచస్థితికి వచ్చింది. ఈ కాలపు చిత్రకారులలో ఘనత కెక్కినవాడు చాయో మెంగ్ ఫు. ఇతడు పురాతనపద్ధతులను అనుసరించే రచనసాగించాడు; గుఱ్ఱాల్ని చిత్రించుటలో కడునిపుణుడు. ఈతని సమకాలికులుకూడ గుఱ్ఱాలు చిత్రించేవారు.

ప్రాచీన సంప్రదాయములను అనుసరించి చిత్రరచనచేయడం మింగ్ కాలములో హెచ్చుగా కనిపిస్తుంది. కాని ఈ రచనలలో సంగ్ రచనలలో వుండే గంభీరమైన సరళతగాని, టాంగ్ రచనలో వుండే సత్తువ, విశాలత,గాని కనిపించవు. అయినా లిన్‌యాంగ్, వూవియిలవంటి ప్రతిభావంతులు లేకపోలేదు.

ఈ కాలపు చిత్రాలకంటె పురాతన చిత్రాలే ఆకర్షణీయంగా, జ్ఞానదాయకంగా వుంటాయి. ఈ నవీన చిత్రాలు పూర్వపు చిత్రాల అనుకరణలుగా కనిపిస్తాయి. పూర్వపు చిత్రాలలోవుండే రమ్యమైన వర్ణసంవిధానము, చక్కని కల్పనలు తమ చిత్రాలలో తేగలిగారుకాని, వారిభావపతమను మాత్రము స్ఫురింపజేయలేక పోయారు.

సుమారు ఒక శతాబ్దము క్రిందటివరకు చైనాచిత్రకళను చూచి వచ్చిన వారెవరైనా చైనాకళను గురించి ప్రశంసిస్తే పాశ్చాత్యులు విస్తుబోయి ఆలకించేవారు. చిత్రాలుచూచి అర్థంచేసుకొని ఆనందించలేకపోయేవారు. ఇప్పుడు చీనా చిత్రాలు, తదితర చిత్రవస్తువులు ప్రపంచమంతటా అన్ని పెద్ద గ్యాలరీలలోను, మ్యూజియములలోను గౌరవస్థానాలను అలంకరించివున్నాయి. ముఖ్యముగ ఐరోపాలోను, అమెరికాలోను పెద్దగ్యాలరీలయందును మ్యూజియలందేకాక, ధనికుల గృహాల్లోను, కళాభిమానుల ఇండ్లలోను, కళాకారుల ఇండ్లలోను కనిపిస్తాయి.

కొందరి ప్రవీణ పాశ్చాత్య చిత్రకారుల రచనలలో చైనా పోకడలు కనిపిస్తాయి. ముఖ్యముగ ఇటలీ చిత్రాల్లో కనిపిస్తాయి. ఎంబ్రోజియోలోరెంజెట్టి చిత్రాల నిర్మాణంలో గీసినరేఖలు చీనారేఖలను పోలివుంటాయి. 15 వ శతాబ్దికి చెందిన గొప్ప చిత్రకారుడు బోటిసెల్లి తన చిత్రాలకల్పనకు ప్రతిభావంతులగు చీనా చిత్రకారుల (*Line rhythm*) మీద ఆధారపడ్డాడా అనిపిస్తుంది. ఈతడు చైనా చిత్రకారుడనే చెప్పవచ్చు. ఇంగ్రెస్ కూడ ఇట్టివాడే. ప్రపంచప్రఖ్యాతిగాంచిన క్లాడీలోరైన్ దృశ్యచిత్రాలలోకూడ చాలవరకు చైనా దృశ్యచిత్రాల పోకడలు కనిపిస్తాయి. ఇతడు 17 వ శతాబ్ది మధ్యభాగానికి చెందినవాడు. ఆల్‌ఫ్రెడ్ ఈస్టువంటి గొప్ప ఆంగ్ల చిత్రకారులు, చైనాదేశమువెళ్ళి, అచ్చటి కళాసంస్థలు, చిత్రకారుల్ని దర్శించి, ప్రశంసించి వచ్చారు.



# వి జ య గీ త ము

★

శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

కుంకుమ చల్లినట్టు లదిగో కను డాంధ్ర రసాల శాఖన
ల్వంకలనుం జిగిర్చినది; రమ్యతదీయ కిసాల ఖాదియై
క్రుంకగ చీకటుల్ వెలుగు గొంతున కోకిల ఆలపించు—ని
శ్శంకగ తేనెలొల్కగను స్వాగత గీతి నవాబ్ద లక్ష్మికిన్.

ఏమని పల్కె కోకిల?—"అహీన మహీయసి! అన్న తెన్గు త
ల్లీ! మరి నీకు కష్టములులే" వని పల్కె; "ఖరాబ్దముగ్ర, భయో
ద్దామ వికృత్యసాధునమ దాటెనులే!" యని పల్కె; "కల్ప వ
ల్లీ! మహితాంధ్రమా! శుభము లేలెదవే విజయాబ్దమం" దనున్.

రాజ రాజును కృష్ణరాయని, రఘునాథ
నృపతి గీర్తించు వాణీ ప్రియులను
నన్నభట్టును, పెద్దనార్యుని, చేమకూ
ర స్మరించు సుకవితా లలితమతుల
త్యాగరాజులను, పోతన్న, గోపన్నలన్
భక్తాగ్రణుల నెంచి పరవశమగు
మల్లమ్మ, రుద్రమ్మ మహిత గాథల పాడి
మాటికి మై గగుర్పాటు చెందు
తిమ్మరుసు, యుగంధరుల-మంత్రి ప్రవరుల
ప్రథిత ధీశక్తి వినిచి, గర్వాన నిలుచు
తన అజంతా గుహాల శిల్పమునకు మురియు
తెలుగు కోకిల హర్షావగలను కురియు

జీవన మిచ్చి తెల్గు మన సెల్లను పెన్నగ సాకినట్టి గో
దావరి నెన్న; కృష్ణ నమృతాంబువు నెన్నను; తుంగభద్ర పె
న్నా విమలస్రవంతుల జనప్రియ మూర్తుల నెన్న నమ్రమై
ఈ 'విజయ' ప్రభాతరమ నెన్ను పికమ్మ ముదశ్రుకమ్రమై

శాతవాహనులు, నైక్ష్వాకులును, బృహత్ప
లాయనుల్, కందార రాజ వంశ్యు,
లలఘు సాలంకాయనులు, పల్లవుల్, విష్ణు
కుండి వంశ్యులు-రణశౌండు, లుగ్ర

పూర్వ చాళుక్య నృపులును, కళింగ గాం
గులు, వెలనాటి చోడులును, ఘనులు
కాకతీయులు, శౌర్య ఖనులు రెడ్డి నృపతు
లును, విజయనగరోగ్ర నృపతులును
మును మన తెనుంగు నేల నేలిన దినాల
ప్రాభవమ్ము స్మరించు; ఆ ప్రభుల మేటి
తేజ మద్ది చల్లార లేదిపుడు గూడ
నంచు నానంద వివశనై ఆలపించు.

తెలుగు చరిత్రలో వెలుగు తెన్నులు తీర్చిన తొంటి రాజవ
ర్యుల, సచివావతంసులను, యోధతతిన్, కవి, పండిత ప్రకాం
డుల, మరి ఎల్లరన్ తెలుగు నోములపంటల పేరు పేరునన్
దలచి, నివాపముల్ వదలు నౌదల వంచి పికమ్ము భక్తితో

సకలాంధ్రాళికి రాష్ట్రమున్ విలిచి, శశ్వత్ శ్రేయముం గూర్చు కో
రిక నెంతేని తపించి ఏగిన యశశ్శ్రీ మూర్తులన్ 'దేశ భ
క్త' కదంబమ్మును, 'విశ్వదాతృ' తతి నుద్యద్భక్తి నర్పించి, ఈ
పిక మర్పించు నివాపవారి తెలుగుల్వెన్వెంటరా భక్తితో

తన తెలుగుం బ్రజల్ మనెడి దానికినై తనమేని కండలన్
తృణముగ నిచ్చెనే తెలుగు తేజము, 'పొట్టి' మహాన్వవాయ స
త్ఖని జని జాతిరత్నము-తదాత్మకు కేలు మొగిడ్చి, అశ్రు త
ర్పణ మొనరించు నీ తెలుగు పర్వదినాన పికమ్ము భక్తితో

ద్విజరాజా! సకలాంధ్ర భూప్రతినిధీ! తెల్గమ్మకుం బర్వ మీ
విజయాబ్దోదయ రమ్యవేళ మధుర స్ఫీతాచ్ఛ కంఠమ్మునన్
నిజ కర్తవ్యము తెన్గువానికి వచింతే? నీ మహావాణియే
నిజమై పుణ్యుడ! తెల్గు తల్లికికపై నిండారులే శ్రేయముల్

తొలగె తమములు;-విజయ దుందుభులు మొరసె
ఆంధ్రజాతి అభ్యుదయ సహస్ర కిరణు
డదిగో! పొడువనున్నాడు ప్రాగద్రి కొనల
తెలుగునాడెల్ల కుంకుమ లొలికె నేడు!

# పలాయితుడు

★

శ్రీ కాళీపట్నం రామారావు

నా జీవితంలో పోట్లాడి, స్నేహితు లెలా కావచ్చో చూపించినవాడు రాజశేఖరం. ఆయననుండి నేర్చుకోదగ్గవి చాలా ఉన్నవి. కాని అతను నా జీవితంలో ప్రవేశిస్తూ నేర్పినదిఒకటి—తరువాత విడిపోతూ నేర్పినదీ—యీ రెండుపాఠాలూ నేనెన్నడూ మరువలేను.

ఆయనా నేనూ మొట్టమొదట ముఖాలు చూచుకున్నది ఒక సినీమాహాల్లో సీట్లవద్ద. ఒకసీటుకై పోట్లాడుకుంటూ ఇద్దరం పరిచితులమయ్యాము. నా కప్పటికి ఇరవైరెండేండ్లుంటాయి.

నేను కుర్చీకి జేబురుమాలును కాపుపెట్టి బయటికి పోయాను. తిరిగి వచ్చేసరికి చక్కగా అందులో ఈయన అధిష్టించివున్నారు. ఖద్దరు కళ్ళీలాల్చీ పైజామాలలో—అప్పటి కాయనకు దగ్గర పాతికేండ్లవయసై ఉండవచ్చు. ప్రక్కను ఇంకొక స్థూలకాయుడు ఆయన వయసువాడే ఉన్నాడు. వాళ్ళిద్దరూ చాలా గంభీరంగా ఏదో ఒక మహత్తరవిషయంపై చర్చించేసుకుంటున్నారు. నాకు వాళ్ళు నా స్థలం దురాక్రమణ చేశారనుకోవటంవలనకన్న వాళ్ళేదో తమాషాచేసి నటన సాగిస్తున్నారనే భావం అనాలోచితంగా తట్టటటంవల్ల ఎక్కువ పట్టుదల కలిగింది. నేను స్థలం కాళీ చేయమన్నాను. రాజశేఖరంగారే పసిమిమించిన తెలుపువర్ణంగల తమ పలుచని కోలమొఖాన్ని నావంకకు త్రిప్పి "ఎందుకూ" అన్నారు. నా మొఖంలోకి చిత్రంగాచూస్తూ ఆచూపూ ప్రశ్నించే ధోరణీ నన్ను మరీ ఉద్విగ్నుణ్ణి చేశాయి. చెప్పేను — చాలా. గంభీరంగా సీరియస్‌గా రెండుమూడువాక్యాలలో 'అది నాస్థలం' అని.

'మాకేం తెలుసూ దానిమీద అలా అని ఏమీ వ్రాసిలేదు' అన్నారాయనే.

నేను చప్పున ఉద్రిక్తుణ్ణవుతూ 'వ్రాసిపెట్టే పోయాను. చూడగలిగితే—' అంటూ దురుసుగా క్రిందికివంగి నేలను పొర్లాడుతూన్న రుమాలునుతీసి ఎత్తి దులిపి వారికండ్లముం దుంచాను.

వాళ్ళు నా ప్రవర్తనకి విస్తుపోయుండాలి. ఒకసారి ఒకరి మొఖం ఒకరు చూచుకొని పిదప నా ముఖంలోకి చూస్తూ ఊరుకున్నారు. కొంతసేపయాక ఆ ప్రక్కాయన "పోనీ యిన్ని సీట్లు కాళీగాఉన్నాయి యెక్కడకూర్చుంటే వద్దన్నాయండీ"అన్నాడు నెమ్మదిగా.

నేను ఆ ఉదారత్వం తామే ఏల ప్రదర్శించరాదన్నాను. విడవకుండా వాళ్ళు మరోక్షణకాలం నిరుత్తరులై పోయారు. తరువాత రాజశేఖరంగారు అకస్మాత్తుగా కూర్చున్నచోటునుండి చప్‌నలేస్తూ ఇంగ్లీషులో.

"సరేసరే మీ అమూల్యమైన సలహాకు ఇవే నా అనంతమైన ధన్యవాదాలు"

— అంటూ అందులో ఆ చివరిపదాన్ని ఒక ప్రత్యేకమైన పద్ధతిలో ఉచ్చరించడంద్వారా నన్ను చేయగలంత అపహాస్యానికీ గురిచేసి అక్కడనుండి ఇంకొకచోటికి ఆ సహవాసిని వెంటబెట్టుకు వెళ్లిపోయారు.

నావళ్ళు తెగమండిపోయింది. అయితే దురదృష్టవశాత్తూ అది — ఓడిపోతూ ఓటమితో గెలుపును పొందగల ఆవలివ్యక్తి ఔన్నత్యాన్ని గ్రహించటంవలన కలిగే స్పర్థవల్ల కాదు. ఆయన పోకడను ఓడిపోతూ గెలిచిన ధోరణి ప్రదర్శించుకునే ఒక విచిత్ర పద్ధతిగా అపార్థంచేసుకున్న నా అవివేక జనితమైన అహంకారం వల్ల.

ఈవిధంగా ప్రారంభమయిన మా పరిచయం యింతకన్నా అసహ్యకరమైన మరిఒకపోట్లాటతో సన్నిహిత పరిచయంగా రూపంది కడకదే స్నేహమయ్యింది.

ఆరోజుల్లో నాకింకా పెండ్లి కాలేదు. పట్నంలో ఉద్యోగరీత్యా నివాసం. అందుచే హోటల్‌లో భోజనంచేస్తూ ఒక గది అద్దెకు పుచ్చుకొని ఒంటరిగా ఉంటుండేవాడిని.

హోటల్లో టేబుల్‌మీల్స్ నాగరికత ఇంత బహుళంగా వ్యాప్తంకాని రోజులవి. ఒకనాడు భోజనం చేస్తూఉండగా నా పంక్తి కెదురుగుండావున్న పంక్తిలో సరిగా నా కెదురుగా పూర్వపరిచితమైన ముఖం ఒకటి కానవచ్చింది. పదేపదే ఆయన నావంకచూస్తూరావటంచేతనే నేనాయన ఎవరా అన్న సందేహంలో పడ్డాను. కాని ఎంత ప్రయత్నించినా నేనాయన నెక్కడచూచేనో జ్ఞాపకం రాలేదు. కడకాయన భోజనం ముగించి లేచి చేయి కడుక్కోడానికి పోతూచేసిన సాంకేతిక హాసంతో అత నెవరయ్యిందీ స్పష్టంగా గుర్తుకు వచ్చింది.

తరువాత అప్పుడప్పుడూ మేం అక్కడే తారసపడుతూ ఉండేవాళ్ళం. కాని అత నెప్పు డెదురుపడినా అతనికండ్లలోకి సూటిగా చూడటానికి నాకు ముఖం చెల్లేదికాదు. బహుశా ఆనాడు హుక్కు నిలబెట్టుకోవడమనే మిషతో ఒక స్వల్పవిషయాన్ని ఘనంగాచేసి అనవసరమైన ఉద్రేకాన్ని వెళ్ళగ్రక్కడంలో గల

నా అల్పత్వాన్ని నేను ప్రత్యక్షంగా అంగీకరించకపోయినా నా అరాంతరాలలో దానిని బాగానే గుర్తించి వుండాలి.

ఏమైనా అతను నన్ను విడువలేదు. వేరొకనాడు నేను హడావుడిగా భోజనశాలలో ప్రవేశించి సగం నిండిన పంక్తిలో వెళ్ళి వరసలో కూర్చుంటున్నాను. అప్పుడే నాకన్నా ముందు స్థలంలో కూర్చుంటున్న పెద్దమనిషి "నేను బహుశ మరిఒకసారి మీకోసం అట్టి పెట్టుకున్న స్థలాన్ని దురాక్రమణచేయడం లేదనుకుంటున్నాను" అన్నాడు నెమ్మదిగా. నేను తలయెత్తి చూచాను. అతనే. ఆయనముఖాన వెలుగుతున్న నిష్కల్మషమైన హాసరేఖ అన్నినాళ్ళయి నాహృదయాన్ని అంటిపెట్టుకునిఉన్న కల్మషాన్ని చాలావరకూ కడిగివేసి ఉండాలి. అయినా ముఖ్యంగా అప్పట్లో నేనంత సులువుగా అన్యుల ఔన్నత్యాన్ని అంగీకరించ గల సమర్థుణ్ణిగా వుండేవాడినికాను. అందుచే నాకై నేను 'చిత్రమైన మనిషి' అనుకుంటూ బయటికి మాత్రం 'అబ్బే! లేదు' అన్నాను.

ఆయన మేమిద్దరం భోజనంచేసిన ఆ పావుగంటలోనూ ముక్తసరిగా రెండేరెండు ప్రశ్నలువేశారు. మొదటిది నా పేరునుగురించి. రెండవది నా ఉద్యోగంగురించి. నేనా రెండింటికీ సమాధానాలిచ్చాను. అంతే. అంతకుమించి సంభాషణను పెంచటానికి అప్పట్లో నేనేమాత్రంకూడా సుముఖుణ్ణిగా ఉండేవాడిని కాను. అది అప్పటి నా స్వభావం. చాలానాళ్ళవరకూ అతనితో ఎన్నోసార్లు కలసి మాట్లాడినా నావంకనుండి ఆయన పేరైనా తెలుసుకోలేదంటే అప్పట్లో నాధోరణి ఎట్లావుండేదో స్పష్టంగా అర్థం అవుతుంది.

కాని ఆయన ఇంకొకనాడూ మరిఒకనాడూకూడా నన్ను మాట్లాడించి చివరకు ఉన్నగుట్టు విప్పి ప్రశ్నించారు.

"మీరింకా సినీమాహాలుసంఘటన మరిచిపోలేదనుకుంటాను" అన్నారు నవ్వుతూ.

ఈ విసురు కొంత నామీద పనిచేసింది. నేనెంత ఉదాత్తస్వభావుణ్నో వివరించటానికి ప్రయత్నించాను కొంతసేపు. కాని ఆయన 'ఉన్నసంగతి చెపుతున్నాను' అంటూ జరిగినదానిని చెప్పారు. రుమాలు వారు వచ్చేసరికే క్రిందపడి వున్నది. వారు దానిని నేను వారికి చూపేవరకూ దానిని చూడలేదు. ఆనాడు కొంత పరిశుభ్రమైన హృదయంతో మాటాడాను.

తదాది ఆయన రెట్టించిన ఉత్సాహంతో కనుపించినప్పుడల్లా ఒకటో రెండో నిముషాలు నన్ను ఆపి ఏదో మాటాడుతుండేవారు. నేను అయిష్టంగానే సభ్యతకు కట్టుబడక విధిలేక మాటాడుతూండేవాడిని.

చివరికీ విచిత్రపరిచయం యేస్థితికి వచ్చిందంటే అతను కనపడుతున్నప్పుడల్లా మాటాడుతుండటమేకాక రీడింగ్ రూమ్నుంచి నేను తెచ్చుకునే పుస్తకాలుచూచి అవి తాను చదివి యిచ్చేస్తానని అప్పుడప్పుడు అడిగి పుచ్చుకోవటం — ఆయన ప్రతీసారీ సకాలానికే వాగ్దానం ప్రకారం తిరిగి యిచ్చేసినా నేను ప్రతీసారీ ఏడుస్తూనే యివ్వటం. అయినా అతను ఆసంగతి గ్రహించక నావద్దనుంచి పుస్తకాలు పుచ్చుకుంటూ ఆ సందర్భంలో నాగదికూడా పట్టుకొని అక్కడకుకూడా రాకపోకలు సాగించటం— ఈ రాకపోకలుకూడా ఒకస్థితికి వచ్చాక నేను గదివిడచి బయటికి పోవలసిఉన్నా ఆయనకోసమై విసుక్కుంటూ ఆ గదిలోనే ఉండటం—లేకపోతే గది అతనికి వప్పగించి తిరిగి వచ్చేవరకూ అక్కడే ఉండమని నేను బయటికిపోయి రావటం — అయినా అతను తనపద్ధతి మార్చుకోకపోవడం అందులోనే అప్పుడప్పుడూ అతనికై నేను నాతోపాటు కాఫీలూ సినీమాలూ ఖర్చులు భరించవలసి రావటం—చివరకు నాకిదంతా అత్యాచారంగా తోచడం వరకూ వచ్చాయి.

సంగతేమంటే నేను అతనివిషయమై ఎంతతటస్థంగాఉన్నా ఆయనగురించి నాకు కొన్నివిషయాలు తెలియనే తెలిశాయి. అవి అతని పేరూ — అతని కాలేజీ చదువుల విషయం. ముఖ్యంగా అతనికి సరియైన ఉద్యోగ మేదీలేదనీ హార్బర్లో ఏదో బ్రాహ్మడాత్తపు ఉద్యోగంవంటిదిమాత్రం ఒకటి చేస్తున్నారనీ తెలిసింది. అక్కడనుంచే నాకు అతనిధోరణి అత్యాచారంగా తోచట మారంభించింది.

వెంటనే ఆయనను వదలించుకోవటానికి పద్ధతులూ అందుకుగాను నా అంతరాత్మకు చెప్పుకునేందుకు సమాధానాలు వెతుక్కోవలసి వచ్చింది.

చివరకు అంతరాత్మతో ఏదో మసిపూసి మారడగాయచేసి వ్యవహారం ఫైసలు చేశాను. పద్ధతిలో ఒక శిఖండి పద్ధతి అవలంబించి ఊరుకున్నాను.

ఒకనాడు ఆ రోజుల్లో నాలో ఎంతటి అమానుషత్వం అంతర్గతంగాతలదాచుకొనిఉన్నదో అంతటిఅమానుషత్వాన్నీ ఉన్నంత నగ్నంగానూ ప్రదర్శించి ఆయననుండి విడివడటానికి నిశ్చయించాను.

నిజంగా అది దుర్దినం! నా కండ్లను ఆ దౌర్భాగ్యపు పొరలు అంతదట్టంగాకాక ఏకొంత ఒకపొర తక్కువగాఉన్నా అతను ఏస్థితిలో నావద్దకు వచ్చాడో స్పష్టంగా చూడగలిగి వుండేవాణ్ణి. కాని అట్లా జరగలేదు.

ఆయనవస్తూనే ఎన్నడూ లేనిది చాలా గడబిడగా గొడవ గొడవగా మాటాడ నారంభించారు.

"— చూడండీ మీ రివాళ కనీసం ఒకస్వీటూ రెండు హాట్లూతోనైనా కాఫీ ఇప్పించాలి! తొందరగా లేవండి" అంటూ నా సూట్కేస్ సోఫాగా చేసుకొని "చాలా ఆకలి వేస్తోంది. త్వరగా తెమలండి. మీ రింత వేగిరం బయలుదేరే ఉద్దేశంతో లేకుండా ఉంటే ఆ జేబులో ఏమైనావుంది కావాలు ఇలా పడేయండి" అంటూ త్వరపెట్టసాగారు.

ఇలా అనటం ఆయనకు పరిపాటికూడా కాదు. నిశ్చయంగా అదే మొదటిసారి.

నవ్వటంచేతకాని ఆ గంభీరవదనాన్ని అసహజమైననవ్వొకటి సౌందర్యాంధునకుకూడా స్పష్టంగా కానవచ్చేటంత వికృతంగా మార్చిఉండటం—మెరసే ఆకండ్లలో ఏదో ఒక పిచ్చిచూపు వ్యక్త

మాతుండటం నేనామత్తులో గమనించగలిగి ఉండను. గమనించినా వానినికూడా నా ధోరణికి అనుకూలమైనపద్ధతిలో అనుదివదించుకొని ఉంటాను. కాని ఆయన ఆ పదవాక్యపద్ధతిని అపార్థం చేసుకోవటంలోమాత్రం నిశ్చయంగా పొరపడలేదు.

అందుచేతే నా అవక్రవిక్రమ సాహసాలను ప్రదర్శిస్తూ అన్నాను.

"నేను మీకు స్వీట్లూ హాట్లూతో కాదుగదా ఒట్టి కాఫీ కూడా పోయదలచుకోలేదు. అంతే కాదు. నా జేబులో చాలా డబ్బు లున్నాయి. కానీ మీకు ఒక్కదమ్మిడీ అయినా యీయను. మీరు దయచేసి నన్ను వేధించకండి. ఇంకముందు మీరిట్లా నిత్యం నా గదికివచ్చి నా కిబ్బంది కలిగించడం నేను భరించను. మీరింక నా గదికి రాకండి" అన్నాను.

నా మన స్తత్వ మెట్లా పనిచేస్తుండి ఉంటుందో మీకు అర్థమౌతుంది. వాక్యపద్ధతిలో నేకాకుండా స్వరంలోకూడా అనవసరమైన కర్కశత్వం తెచ్చిపెట్టుకుంటూ నేనిట్లా అనేసరికి ఆ నిర్భాగ్యుడు మొదట ఆశ్చర్యంగా తలయెత్తి చూశాడు. ఆయన నాముఖంలో ఏంచూశాడోకాని నేనాయన పసిమిమించిన తెల్లని ముఖం చూస్తూఉండగానే ఎఱుపునుండి తెలుపునకూ తెలుపునుండి నలుపునకూ రంగులు మారటం గమనించాను. కాని ఆ క్షణాన దాక్షిణ్యమనేది మరీ అంత పూర్తిగా నాలో ఎట్లా మాయమయ్యిందో తెలియదు. అతనట్లా పిడుగడచిన చందాన నిస్తేజుడై నిశ్చలంగా పడిఉంటేనే నింకా వాగసాగాను—

నేను హాస్యమాడబోవడంలేదు. మీరు ఇంకముందు నాగదిక్కి రావద్దు" అన్నాను. అత డీ వాక్యాల తరువాతకూడా తొలిదెబ్బనుండి కొంతసేపటికిగాని తేరుకోలేదు. కోలుకొన్నాక అన్నాడు.

'అంటే' అన్నారు సరిగా పెకలని గొంతును సరిచేసుకుంటూ.

కాని అహంభావ ధోదూయమానసునకు కండ్లే కావు ఇంద్రియపంచకంలో ఏ ఒక్కటి సరిగా పనిచేయదు.

"అంటే—అంటే అనటాని కిందులో ఏమీలేదు. ఇది నా గది. ఇందులోనికి రావద్దనటానికి ఏల రారాదనేవిషయమై మీకు నేను సంజాయిషీ యిచ్చుకోనవసరంలేదు. నాకిష్టంలేదు. కాబట్టి రావద్దు" అన్నాను.

ఈ శిఖండి జవాబుతో అతను నిరుత్తరుడై ఊరుకున్నారు. కాని అతనిముఖంలో ముఖ్యకండరాలన్నీ ఈ మహావమానజనితమైన ఉద్వేగతీవ్రతచే కంపిస్తున్నాయి. ఆ అభిమాని దానిని వ్యక్తం కానీయటం యిష్టంలేక పలుచని పెదవులు మరీ పలుచన కాగా వానినెంత అదిమిపెట్టివుంచినా అవి తమపని మానలేదు. ఒకటి రెండుసార్లు గ్రుక్కిళ్ళు మ్రింగికూడా వానిని వశపర్చుకోలేకపోయారు.

ఐదు...పది...ఇరవై...ముప్ఫై సెకన్లవరకూ ఇద్దరం చిత్ర ప్రతిమలలా మిగిలిపోయాం.

ఆయన యెంత నిగ్రహస్వభావుడైనా నేనుచేసిన అవమానం ఆనిగ్రహాన్ని మించినది.

చూస్తూఉండగానే ఆయన ఉత్తమాంగం చలింప నారంభించింది. చలనతీవ్రత క్రమక్రమాభివృద్ధికాగా మనిషి చివర కాపాద మస్తకమూ వణికిపోతూ చప్న నిలుచున్నాడు. అంతసేపూ ఆయన అతితీవ్రంగా ఆ చూపులకే సామర్థ్యమేవుంటే నన్ను మసి చేయగలంత తీక్షణంగా చూస్తునే ఉన్నారు. అలా చూస్తునే ఆ మూశివున్న పెదవులూ కరచుకొనివున్న పండ్లూ కాస్తగావిప్పి—

"సరే"

— అన్నారు. అట్లాఅని మరి కాస్తసేపట్లో చటన వెనుదిరిగి నా గది విడిచి మెట్లుదిగి వెళ్లిపోయారు.

నేను కొంతసేపుపోయాక ఒక దీర్ఘనిశ్వాసం విడిచాను. తరువాత కూర్చున్నచోటునుండి లేవబోయాను. కాని అప్పటికీకూడా నాకాళ్ళు వణుకుతున్నాయ్. యెందుచేతా అంటే నాకప్పుడు తెలియలేదు. అంతరాంతరాలలో కారణ మేదో సూచితమౌతున్నా దానిని నేను గ్రహించ నంగీకరించలేదు.

ఆనాడల్లా ఏపనీ చేయలేకపోయానుకూడా. మతి స్తిమితంగావున్న జ్ఞాపకమైనా లేదు.

తరువాత కొంతకాలం సర్వకాల సర్వావస్థలలోనూ ఒకటే పనిగా ఆలోచించసాగాను. ఎంతవెదికినా ఆయన నడవడిలోగాని మాటలలోగాని మచ్చుకు ఒక్కటైనా అతనికి నేను చేసిన మహావమానానికి తగినకారణంగా పేర్కొదగ్గ దానిని నేను సాధించలేకపోయాను. చివరకు మళ్ళీ మరొకసారి శిఖండిధోరణి అవలంబించి అంతా మరచిపోవడానికి ప్రయత్నించాను.

అయితే ఆయనకు ఈ స్వార్థపరునీ అహంభావినీ ఉద్ధరించాలనే పట్టుదల ఏల కలిగిందో తెలియదు. జన్మలో ఆయన మళ్ళా నా మొఖం చూడరనుకున్నాను. కాని అలా జరుగలేదు. ఒకనాడు ఉదయాన్నే నేను నూతివద్ద స్నానంచేసి తిరిగి వచ్చేసరికి మూసి ఉన్న నా గది తలుపులు తెరచివున్నాయి. అందులో ఈనాస్తికుని పూజనందుకోవచ్చిన దేవమూర్తిలా ఆయన ఎదురుగా నిలుచుని ఉన్నారు. నిష్కల్మషమైన హాసరేఖ అతనిముఖాన్ని ఉద్దీపితం చేస్తూవున్నది.

నేను క్షణకాలం నిచ్చరబోయాను. తరువాత గదిలో ప్రవేశించి తొందరగా బట్టలువేసుకొని 'పదండి' అన్నాను. బయటకు నడుస్తూ గదితాళంపెట్టి చకచకా అతనిప్రక్క ప్రక్కగా మెట్లు దిగుతూవుంటే నాశరీరం గాలిలో తేలిపోతున్నట్టయింది.

## 2

ఇది జరిగి పదేండ్లయ్యింది. నాటినుండి నేటివఱకూ మేము స్నేహితులమే—కాని ఆయన స్వభావం చరిత్రా మాత్రం ఈనాటికీ నాకు నిత్యనూతనములు.

మేము మూడేళ్ళు ఒకేగదిలో ఉన్నాం. ఆహార శయ్యాసన విహారాదులలో ఎన్నడూ ఒకరినొకరు విడచినదిలేదు. మా వస్తు

వులాడుస్తులా చివరకు పర్సులుకూడా సమిష్టిగా పంచుకున్నాం. నా పెండ్లికి పిదప గదినుండి వీడిపోయినా ఒక యాడాది ఒకేఊరిలో ఉన్నాం. నిత్యం కలసేవాళ్లం. ఆ చివరిరోజులలో అతనుకూడా కుటుంబాన్ని తీసుకవచ్చాక కొంత్మ యెడబాటు యెక్కువైనా తరచు కలుస్తూనే ఉండేవాళ్లం. అయినా అంతకాలంలోనూ ఆయన గురించి నేను తెలుసుకో గలిగినదల్లా అతనికి వివాహమయ్యిందనీ తల్లీ తండ్రీ లేరనీ ఒక్క అన్నా ముసలినాయనమ్మ మాత్రం ఉన్నారనీ ఆస్తులేమీ లేవనీ తప్ప ఇంకేమీలేదు. ఆయన నిజమైన జీవితంతో పరిచయం ఆయనను విడిచిపెట్టాకే ప్రారంభమయ్యింది.

నాకు క్రొత్తగా బదిలీ అయిన ఊరు. ఒక చిన్న పట్టణం. అక్కడకు వెళ్లిన తొలిరోజులలో నాకు అక్కడి వీధులూ ఇళ్లూ బజార్లూ ఎట్లా సంకుచితంగా చిన్నవిగా కానవచ్చాయో అట్లానే అక్కడి మనుష్యుల హృదయాలూ సంస్కారాలూ కూడా చాలా తేలికజాతికి చెందినవిగా కానవచ్చేవి. అందుచే చాలాకాలం వరకూ వాళ్లతో కలసి తిరగలేక పోయేవాడిని. కాని ఒంటరితనం బహు దుర్భరమైనది. అందుచేత కాలక్షేపానికి వాళ్లమాటలనూ చేష్టలనూ స్వభావాలనూ నేనెంత అసహ్యించుకుంటూ వచ్చినా వాళ్లతోనే తిరగక తప్పిందికాదు. మా ఆఫీసులో పనిచేసే నాతోటి వారితో సాయంకాలాలవేళ ముఖ్యంగా సెలవు రోజుల్లో కలసి తిరుగుతూండే వాడిని.

వాళ్లంతా రోజూ ఊరునడుమ ఉన్న చిన్నపార్కులో చేరి ఒక మారుమూలకూర్చుని బాతాఖానీ ఆరంభించేవారు. వారు మాటాడే విషయాలు సాధారణంగా ఏ పై అధికార్లను గురించో వాళ్ల భార్యలను గురించో లేక తమ తమ చిన్ననాటి ముచ్చటలూ ప్రజ్ఞలూగూర్చో అవీ ఇవీ కాకపోతే ఇరుగు పొరుగుల ఆడవాళ్లను గురించో అయివుండేవి. అందులో ఆడవారి గురించి ప్రసంగమైతే ప్రతి ఒక్కడూ కలుగజేసుకొని నోటిదత్తి దీరా అవ్వాకులూ చవ్వాకులూ వాగి చాలా సంతృప్తి పడుతుండేవారు.

ఒకసారి దురదృష్టవశాత్తూ యీ మహానుభావుల నడుమనే రాజశేఖరంగారి పూర్వగాథ యిరుక్కున్నది.

ఆవేళ వారు అదివర కెప్పుడో ఎక్కడో ఆఫీసులో క్రొత్తగా గుమస్తాగిరీలో ప్రవేశించి అచిరకాలంలోనే ఆ వుద్యోగం పోగొట్టుకొన్న ఒక కుర్రవానిగురించి చెప్పుకుంటున్నారు. ఆఫీసరు 'ఫూల్' అని అవమానిస్తే కోపంవచ్చి ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేశాడట.

మా బృందం వాడి తెలివితేటలూ చురుకుదనం అదిగాగల వాటి నన్నింటినీ బాగానే వర్ణిస్తూ 'ఏమైతేనేం పెడసరపు బుద్ధి ఉన్నాక ఒక్కటికూడా రాణించవు' అంటూ ఆఫీసరనే వాడిని ముఖం ముందు స్తుతిస్తూ 'గులాం' గా నటించి ముఖంవెనుక తమలా కసిదీరా తిట్టుకొని సంతోషించటం చేతకాని ఆ కుర్రవాని బుద్ధి హీనతను నలుగురూ నాలుగు విధాలా చెప్పుకొని నవ్వుకున్నారు.

ఆ సందర్భంలో "నేనూ ఎరుగుదును ఒకణ్ణి——" అంటూ అందులో మరిఒకడు రాజశేఖరంగారి పేరెత్తాడు. అతను తన ఎరికలో ఎలా తాలూకా ఆఫీసు ఉద్యోగం పోగొట్టుకున్నాడో చెప్ప నుద్యోగిస్తూ రెండు వాక్యాలు చెప్పాడు. ఇంతలో సాంబమూర్తి అందుకున్నాడు.

ఆ బృందంలో కల్లా——నాలో చాలమట్టుక క్షీణించగా ఇంకా మిగిలిన నాగరిక శక్తంటూ ఏమైనాఉంటే ఆ శక్తుల బలిమిచే నేను ఎక్కుడులో ఎక్కుడుగా అసహ్యించు నేది ఆ వ్యక్తినే! ఆ 'లక్ష్మీపతి' కి తెలియని భోగట్టాలూ మనుష్యులూ ఉండనట్టు కనుపించేది. ఎలా సంపాదిస్తాడో ఆ పరిచయాలూ చరిత్రలూ తెలియదు. అందర్నీ తెలుసునంటాడు. అందరి పుట్టుపూర్వోత్తరాలూ వల్లిస్తాడు. చిత్రమేమంటే ఆయన విషయాలకిచ్చే రంగు లెట్లా ఉన్నా సాధారణంగా ప్రతికృతుల సత్యతలో లోపముండదు. ఆయన తనకుటిల హస్తాలలోకి కుంచను లాక్కొని రాజశేఖరం గారిని చిత్రించ నారంభించాడు.

అంతవరకూ తలను మెడపై ప్రక్కకువంచి కనుబొమలు రెండూ ముడివేస్తూ వింటున్న వాడల్లా సందేహ స్మృతి సూచకములైన చూపులూ స్వరాలూతో "ఏ రాజశేఖరం ?...... రాజశేఖరమేనా?" అన్నాడు బొంగురు గొంతును సరిచేసుకుంటూ. ఆవలి వ్యక్తి అవునని అనగా ఆరంభించాడు. "వాడా! వాడిని నేను బాగా ఎరుగుదును!" అంటూ కూర్చున్న వైఖరిలో మార్పును తేవటం ద్వారానూ ముఖంపై ఒక వెకిలినవ్వుతో తల అడ్డాబిడ్డంగా త్రిప్పటం ద్వారానూ సన్నద్ధతనూ ఉత్సాహాన్నీ ప్రకటిస్తూ చిత్రమైన విరామాలతో చెప్పసాగాడు. "వాడొక కొజ్జా!...గర్వం అతిశయం చూడబోతే పట్టపగ్గాలుండవు!!......పోజులిస్తాడు పోజులు!!!......" అన్నాడు.

నాకు అన్యుల నట్లా అనవసరంగా అవహేళన చేయటంలో అందులో నే నెరిగిన రాజశేఖరాన్ని గూర్చి నోటికివచ్చిట్టు కూస్తూ తద్వారా అతిహీనమైన ఆనందాన్ని పొంద యత్నించే ఆ వ్యక్తి నైచ్యాన్ని చూసేసరికి వళ్ళు మండుకపోయింది. అయినా——

"మీరు పరీక్షించారా ఆయన పుంస్త్వాన్ని..." అన్నాను వ్యంగ్యంగా. కాని ఆదున్నపై అట్లాంటి వేమీ పనిచెయ్యవు. మీద ఏమైన పడినపుడు సరిగా దున్న తల విసిరినట్టే ఒకసారి తల విసిరి కసిరికొడుతున్నట్టు అన్నాడు.

"బాగుంది! నాకు తెలియదంటారేమిటి? వాడిదీ మాదీ ఒకటే ఊరు. కావలస్తే నారాయణరావు నడగండి! ఆమధ్య నేను విశాఖపట్నం వెళ్ళినప్పుడు నారాయణరావూ నేనూ వస్తూండగా వాడు దారిలో ఎదురుపడ్డాడు. దారిలో ఎంతసేపు మాటాడేమో అడగండి" అన్నాడు బుసలుకొడతూ.

ఆ మందకు సాంబమూర్తి మాటలంటే అమృత గుళికలు. కారణం వేరే చెప్పనవసరంలేదు. అందుచేత అతని హక్కును అందరూ సమర్ధిస్తూ అతనినే చెప్పమన్నారు.

సాంబమూర్తి విజయగర్వంతో చెప్పసాగాడు. అతను తన ప్రత్యేక ధోరణిలో విషయానికి తా నీయదలచిన రంగుకు అనుగుణమైన పదజాలంతో వాక్యపద్ధతితో సాంకేతిక పదాలూ అభి

నయాలూ అలంకరణలు కాగా చాలామాటలలో చెప్పిన దాని సారాంశం యిదీ—

"చర్చలో ఉన్న వ్యక్తి తండ్రి నాన్‌కో ఆపరేషన్ గొడవలలో ఒకటో రకానికి చెందిన ఉద్యోగం కి చే జేతలాతిలో దికాలిచ్చుకున్నాడట. రెండుసార్లు జైలుకువెళ్ళి 'మెత్తగా' పోలీసులచే ఒళ్లంతా బాగా 'మర్దన' చేయించుకున్నాడు. కొసకా జైలులోనే చచ్చిపోయాడు కూడా—ఎవ్వడూ మంచినీళ్ళుపోసే దిక్కైనా లేకుండా. చచ్చేముందు 'ఏ మాలాడో మంగలాడో' ఇన్ని నీళ్ళు పోసి ఉంటాడు."

వాళ్లమ్మ ఆ తరువాత ఆరుమాసాలు తిరగకుండా బహుశా బెంగపెట్టుకునే చచ్చిపోయి వుంటుంది.

వాళ్లు ముగ్గురు అన్నదమ్ములు. ముగ్గురూ మగగుంటలే. అప్పటికి ఇంతా ఇంతాగా ఉండేవారు. పెద్దవాడూ తనతోటివాడు. స్ఫోటకంవచ్చి చచ్చిపోయాడు.

వీళ్లని వాళ్ల నాయనమ్మ పెంచింది. ముసలిది ఇప్పటికీ గుండుముక్కలా తిరుగుతూ ఉంటుంది? (ఇక్కడ సాంబమూర్తిగారు ఆమె గుండునుగూర్చి ఐదునిముషాలు మాటాడారు.) మగ సహాయం ఊరులోనే ఉన్న మేనమామలవల్ల పొందారు. కొద్దిగా భూములున్నాయి. వీడికన్నా పెద్దవాడు ఇప్పటికీ ఆ భూములు మీదే ఆధారపడి బ్రతుకుతున్నారు.

వీడికి ఆ మేనమామ తన మూడోకూతుర్ని ఇచ్చి పెళ్లిచేశాడు. ఆ మేనమామ పెళ్లాం ఒక పిల్లలకోడి. వరుసగా. ఇద్దరు మగపిల్లలునీ నలుగురు ఆడపిల్లలనీ కనీ మొత్తం అరడజనూ పూర్తిచేసి కానుపులు ఎత్తిపెట్టేసింది. అప్పటినుండీ బాగా బలిసి ఇప్పుడు గుండ్రగా 'అణా రోట్టెలా వుంటుంది' మామగారు సన్నంగా రివటలా పొడావుగా ఉంటాడు. అందమైన దాంపత్యం.

వాళ్ళు వీడికి బి. ఏ. వరకూ చదువు చెప్పించడంలో సహాయపడతామన్నారు. మనవాడికి విజయనగరం కొళాయినీళ్ళు ఒంటికి విషమించి ఇంటరు చదువుతూనో చదివి పాస్ అయ్యో ఇంటికి తిరిగి వచ్చేశాడు.

ఇంతలో ఆ పిల్ల పెద్దదయ్యింది. కార్యం చేసుకోమంటే చేసుకోడు.........

అటు చదువూ లేకుండా ఇటు ఉద్యోగం—లేకుండా పోనీ 'అదైనా' అటు లేకుండా రెండేళ్ళు రికామీ గొడ్డులా తిరిగాడు. తరువాత రెండుమూడు ఉద్యోగాలుచేసి బుర్ర తిరుగుడు ఫలితంగా శ్రీముఖాలు పుచ్చుకొని చివరకా చెల్లని 'దమ్మిడీ' విశాఖపట్నం వెళ్లి అక్కడ చలామణీ ఐపోయింది. కొన్నాళ్ళు హార్‌బర్‌లో డైలీ వేజస్‌మీద పనిచేసీ — అపాట్లుపడీ ఈపాట్లుపడీ చివరికిప్పుడు ఎలక్ట్రికల్ డిపార్టుమెంటులో పనిచేస్తున్నాడు. కాని అక్కడైనా స్థిరంగా ఉంటాడనే సిద్ధాంత మేమీ లేదు.

ఇక్కడివరకూ చెప్పి అలసిపోవటంచేత కాబోలు ఆ ఉపన్యాసకుడు కొంచంసేపు ఆగాడు. కాని అతని శ్రోతలు అతనిని విడువలేదు. 'అసలు సంగతి చెప్పావ్ కాదే!' 'చెప్పవలసేదంతా ముందే ఉంచేశావ్' అంటూ ఉపన్యాస విషయంయెడ తమకుగల గల శ్రద్ధాసక్తులను అలా ప్రశ్నద్వారానే కాకుండా మరి కొన్ని కొన్ని చిన్న చిన్న సాంకేతిక వాఖ్యలవంటి వానిద్వారాకూడా వెల్లడించి అతనిని మళ్లా 'ముగ్గు' లోకి తోశారు. సాంబమూర్తి ధోరణి ఈసారి మరీ రసవత్తరంగా సాగింది.

రాజశేఖరంగారి నపుంసకత్వాన్ని సిద్ధాంతీకరించిడానికి ఆయన చూపిన తర్కం చాలా చిత్రమైనది.

సినీమాలూ నవలలూ బహుళ ప్రచారంలో ఉన్న ఈరోజులలో మనిషికి దగ్గర ముప్ఫైఏండ్లు వచ్చేవరకూ అందులోనూ భార్య ఈడేరినపిదప ఆమెను ఆరేడేండ్లు విడిచికూడా కార్యం చేసుకోవటానికి మొగ్గకపోవటం — ఆమె ముఖమైనా చూడకపోవటం—పోనీ అని ఆమెలో ఏమైనా లోపముందా అంటే అందం విషయం తీసుకున్నా ఆకారం వియషయం తీసుకున్నా ఎట్టిలోపం లేకపోవడం—తానేమైనా ముండలనో ముసుగులనో మరిగాడనటానికి అమాత్రం రసికత్వం ఆ ముఖాన ఎన్ని కాగడాలువేసి వెదికినా కానరాకపోవటం—ఇవీ అతను తన ప్రతిపాదనను సిద్ధాంతీకరించుకోవటానికి చూపిన కారణాలు.

ఇవికాక చిట్టచివరను వీటన్నిటినీ మించిన 'ఒక గజయుక్తిని' కూడా విశిరాడు.

అతడు ఎలాగైతేనేం ఇంక తప్పక మూడేళ్ళక్రితం కార్యం అయిందనిపించాడు. కాపురంకూడా చేస్తున్నాడు. అయినా ఈ బర్త్ కంట్రోల్ రోజుల్లో ఇప్పటివరకూ ఒక పిల్లణ్ణయినా కనలేదు.

ఆ ముఠాలో ఒకడు కవిగారని వ్యవహరింప బడేవాడున్నాడు. వాడు వ్రాసిన కవిత్వం ఏమీ లేదు. అయినా స్త్రీల ప్రమేయం వచ్చేసరికి మదవతి, మత్తకామిని, కోకస్థని, వంటిపదాలుపయోగించి, శ్రోతలకు శ్రవణానందం బాగా కలిగించ గలడు. ఇంకొకడు సెక్సు సైకాలజిస్టు అనివున్నాడు. అతడేలాటి పదాలు, తర్కం వాడతాడో ఇక్కడ ఉదహరించలేను. వీళ్ళు కాక ఇంకా ఫస్టు పల్లెటూరు తాలింఖానాలలో తయారయివచ్చిన శృంగార శేఖరులు బేడా అర్ధణా పత్రికల్లో చమత్కారాల్ని కంఠస్థంచేసి వాటి నప్పగించ ఉబలాడే బుద్ధిమంతులున్నారు. ఇట్టి ప్రబుద్ధులంతా అట్టి విషయంపై పక్కా గంటకు తక్కువకాని కాలంచర్చకై వినియోగించారంటే ఆ చర్చ ఎంత జుగుప్సాజనకంగా జరిగివుంటుందో అవ్యాజంగా వీరి విమర్శకు గురిఅయిన ఆ నిర్భాగ్యులు వాళ్ళమాటల్లో ఎన్నెన్ని అవాచ్యపు అపభ్రంశపు అవహేళనా పాత్రమైన రూపాలు ధరించివుంటారో వేరే చెప్ప నక్కరలేదు.

అదే కడసారి. ఆ మర్నాటినుండి ఇంకెప్పుడూ ఆ బృందంతో మళ్లా పార్కుమధ్యను కూర్చోలేదు. కాని ఆనాడు రాత్రిమాత్రం సరిగా నిద్రపట్టలేదు. చాలాసేపటివరకు రాజశేఖరంగారి మూర్తి, మాటలూ స్మృతిపథాన మెలగసాగాయి. ఏనాటివో మా యిరువురి మధ్యా జరిగిన ఒక చర్చ ఇంకొకమాటాకూడా జ్ఞాపకం వచ్చాయి. నేను పెండ్లయిన క్రొత్తలో తరుచు ఆడవాళ్ళస్వభావ

గురించి మాట్లాడుతుండేవాణ్ణి. ఒకనాడాయన 'మీకీ నడుమ ఎప్పుడూ ఆడవాళ్ళ ప్రసంగంతప్ప ఇంకొకదాన్ని గూర్చి మాటాడ్డం చేతకానట్టుందే.' అన్నారు. ఇంకొకసారి ఓ చిత్రమైన చర్చ జరిగింది.

ఆ రోజుల్లోనే ఒకనాడు అతను ఒంటరిగా గదిలో కూర్చొని వుండగా నేను వెళ్లేను. అప్పటి కప్పుడే నేను కుటుంబంతో వేరే వుంటున్నాను. వెళ్ళేసరికి ఏదో దీర్ఘాలోచనలో ఉన్నట్టు కనిపించగా ఏమిటి సంగతని ప్రశ్నించేను. ఆయన ఏమీ లేదంటూ లేచి షికారుకు సన్నద్ధులయ్యారు. తరువాత కాఫీ త్రాగుతూంటే చర్చ ప్రారంభమయ్యింది.

సంస్కారం దేనిపై ఆధారపడి ఉంటుంది? పరిసర పరిస్థితుల మీదనా, అయితే అవిమారితే అది మారేందుకు అవకాశమున్నదా? లేక అది జన్మసిద్ధమయినదా? ఇంచు మించు ఇటువంటి ధోరణిలో జరిగిందా చర్చ. నాకది అంత బాగా గుర్తుండక పోవటానికి కారణం ఆయన ఆ చర్చను పురుషపరంగా కాకుండా స్త్రీ పరంగా తీసుకుంటూ రావటం.

నాకానాడే కొంత అనుమానం కలిగింది. కాని ఖచ్చితంగా ఇదమిద్ధమని తేల్చుకోటానికి ఆయనను గురించి తెలుసుకోవటంలో మొట్టమొదటనుంచీ అడ్డుపడుతూ వస్తున్న ఆయన ఆ గంభీర స్వభావమే ఇక్కడకూడా అడ్డుపడ్డది.

ఇప్పుడది జ్ఞాపకంరాగా విషయాలను ఒకవిధంగా అర్థం చేసుకున్నాను. అప్పటి ఉద్విగ్నస్థితిలో ఒకటి రెండుసార్లు పోయి ఒకసారి రాజశేఖరంగార్ని చూచిరావాలనిపించింది. కాని తల నమ్ముకున్న సంసార్లు షైర్లుతిరిగి రావటమంటే సామాన్యంకాదు. రెండు మూడు రోజులతర్వాత ఒక ఉత్తరం మాత్రం వ్రాశాను. అతణ్ణి కలియటమనేది ఆ తరువాత ఒక సంవత్సరంనాడు గాని పడలేదు.

## 3

విశాఖపట్నంలో నాకు వారంరోజులు పని పడింది. చాలా ఉత్సాహంతో బయలుదేరాను. రాజశేఖరంగారింటే మకాం అనుకున్నాను.

రాజశేఖరంగారు ఇల్లు మార్చటంచేత జట్కా తిన్నగా ఆఫీసుకు పట్టించవలసి వచ్చింది. ఆయన నన్ను చూచి చాలా ఆనందంతో ఎదుర్కోలు ఇచ్చారు. ఆఫీసుపనితో అలసి జిడ్డోడుతున్న ఆ ముఖంపై వెలసిన హాసరేఖ మాస్తే దినమల్లా మేఘాచ్ఛాదితమైన ఆకాశంలో అస్త్రాద్రిని చేరనున్న సూర్యమూర్తి ఏదో సందుచేసుకుని క్షణకాలం జగత్తును వింతకాంతిలో ముంచినప్పటి దృశ్యం జ్ఞప్తికి వస్తుంది.

ఆయన నా యోగక్షేమాల నడుగుతూ నేను వచ్చినవిధం తెలుసుకున్నాక అనుకోని విధంగా కొంత తబ్బిబ్బయ్యారు. తరువాత 'సరే మీరువెళ్ళి సామానులు ఇంటివద్ద పెట్టించి మళ్ళీ ఇలారండి. ఇద్దరం ఇక్కడనుంచి కలిసిపోదాం' అన్నారు. నేనా మాటలను ఎలా అర్థంచేసుకోవాలో తెలియక తగబడుతూ 'అలానే, అలా' అన్నాను.

ఆయన ఎడ్రసు చెప్పారు. జట్కాలో కూచుంటూ మరిఒక సారి ఆయన ముఖం చూచాను. ఆయన ఇంకా ఏదో ఆలోచిస్తున్నట్టే తోచింది. నేను పొరపాటుచేస్తున్నానేమో అనుకుంటూనే జట్కావాలాకు ఎడ్రసు చెప్పాను. జట్కా అచిరకాలంలోనే రాజశేఖరంగారి ఇంటిముందు ఆగింది.

అసలు సంగతి అప్పుడు తెలిసింది.

ఇంట్లో ఆయన భార్యా నాయనమ్మా ఉన్నారు. వాళ్ళు నన్నూ నా సామానులనూ ఎంతసేపయినా వీధిలోవుంచే, మాటాడుతూ వచ్చారు. భార్య ఘోషా స్త్రీవలె తలుపుచాటున నిలబడి మాటాడింది. నాయనమ్మ ఎదుటబడి సవాలక్షప్రశ్నలు వేసింది. నాయనమ్మ పూర్వకాలపు మనుష్యుల సహజభావస్తాన్ని వ్యక్తం చేస్తే, మనుమరాలు 'ఏమో, మా మగవారు ఇంట్లో లేరు' అన్నట్టు మాట్లాడింది.

నేను ఒకటి రెండుసార్లు జట్కాను ఏ సత్రవుకో రెస్టు హౌస్‌కో పట్టిద్దామా అనికూడా అనుకున్నాను. కాని అంత వరకూ వచ్చాక అది మరీ పాడుగా తోచింది. అందుచేత అలానే అన్ని ప్రశ్నలకూ సంశయాలకూ ఇయ్యవలసిన జవాబులన్నీ ఇచ్చిచివరకు వారి ధర్మమా అని సామానులన్నీ ఇంట్లో చేర్చగలిగాను.

నే నీదుస్సంఘటననుండి బయటను పడుతూ మొట్టమొదట నాలో నేను వేసుకొన్న ప్రశ్న, పాపమా మానవుడు వీరితో ఎట్లా వేగుతున్నాడా, అని.

నేను రాజశేఖరంగార్ని బాగాఎరుగుదును. ఆయనస్వభావం ఈతీరుమనుష్యులతో సరిపుచ్చుకోగలిగేది కాదు.

రాజశేఖరంగారి భార్యనుగూర్చి సాంబమూర్తి చేసిన వర్ణనలో పెద్ద అతిశయోక్తిగాని అసత్యంగాని ఏమీలేదు. ఆమె కనుముక్కుతీరూ అంగసౌష్టవం విడివిడిగాచూస్తే ఏదోషమూ ఎన్నలేము. కాని మొత్తంపైచూస్తేమాత్రం వికారం వేస్తుంది. కనీసం రాజశేఖరం వంటివానికి.

ఆమె కాస్త పొడవుగా ఇంచుమించు ఆయనంత ఎత్తుగా వుంటుంది. బక్కపలుచగా చామనచాయవర్ణంలో నాజూకుగా వుండటానికి ప్రయత్నించేమనిషి.

కాని ఆ చూపులలో మొత్తంపై ఆకారంలో స్త్రీలలో సహజంగా ఉండవలసిన లాలిత్యమనేది కానరాదు. మనుష్యులలో ఉండవలసేవిషయాల నర్థంచేసుకునే తెలివి అసలే ఉన్నట్టు కానరాదు. 'క్షణంలో కన్నీరు కార్చకలదు. తల్చుకుంటే నిర్దాక్షిణ్యంగా నిముషంలో ఇంటినంతటినీ నరకంగా మార్చగలదు'— అనిపిస్తుందా ముఖముద్రతీరు. అందుచేతే అట్టిమనిషితో రాజశేఖరంగా రెలా వేగుతున్నారో అనుకోవలసి వచ్చింది. కాని అతను వేగుతున్నాడు.

మరునాడల్లాకూడా అతను ఎప్పటిమనిషి కాలేకపోయాడు. మూడవనాడు సాయంకాలం బీచ్ నుంచివస్తూ అతను కొంత కులాసాగా మాటాడసాగారు. అప్పటికప్పుడే బాగాచీకటిపడ్డది. వీధుల నిండా విద్యుద్దీపాలు కాంతివంతంగా ప్రకాశిస్తున్నాయి. రోడ్డుపై సాయంసంధ్యా జనసాంద్రత ఇంకా తగ్గలేదు. మేము మందగమనంతో మెయిన్‌రోడ్‌న ఆ జనప్రవాహాన్ని మెల్లమెల్లగా తప్పించుకుంటూ జంటగా వస్తున్నాం. అదనుచూచి నేను జరిగినదానికి నా సానుతాపాన్ని వ్యక్తం చేసుకునేందుకు అన్నాను. "నేను మిమ్మల్ని చాలా ఇబ్బంది పెట్టాను ..అన్నివిధాలా!" అంటూ చివరిపదంకు ప్రత్యేకోచ్చారణద్వారా సాంకేతికార్థాన్ని ఆపాదించాను.

ఆయన "అంటే?" అన్నారు గ్రహించే. నేను నీళ్ళు నమలాను.

ఆయన కొంతసేపుపోయాక దానినంతా ఒకఒడ్డుకు నెట్టేస్తున్నట్టు అన్నారు.

"అదేం లేదులెండ"అని కాస్తసేపాగి"ఈనడుమ మాయింట్లో యిట్టివి చాలా సామాన్యమైపోయాయి" అన్నారు.

నేనేమీ మాటాడలేదు. మరి కాస్తసేపుపోయక ఆయనే అన్నారు. "ఎందుచేతో తెలియదు కాని కొన్నినాళ్ళయి నేను మరీ ప్రతీ చిన్నవిషయానికీ ఓరిమి పోగొట్టుకుంటున్నాను. కోపాన్ని నిగ్రహించుకోవాలనే కోరికకన్నా ప్రదర్శించాలనే లాలసతే బలంగా పనిచేస్తూ వస్తోంది...... .." అంటూ అర్థోక్తిలో ఆగిపోయినట్టు ఆగిపోయారు. నేను ఆయన ధోరణి మారినట్టు కనిపెట్టి యింకేమీ మాటాడలేదు. తరువాత మరి కాస్తసేపు కూడా ఊరుకొని ఆయన అన్నారు.

"బహుశః అందరు ఆడవాళ్ళూ అంతేనో లేక మా ముసలమ్మ ప్రత్యేకంగా అట్టిదో తెలియదు. కాని ఆమె/అంత వయస్సులో కూడా అనవసర మమకారాలను పెంచుకుంటూనే వస్తుంది......" అంటూ నాకోఅవకాశం ఇచ్చారు. నేను దానిని జారవిడువలేదు. లోకంలో స్త్రీ జాతే అంత అంటూ స్త్రీ జన చిత్తవృత్తిని హేతు సహితంగా వివరింప నారంభించాను. అతను అంతా మాటాడకుండా వింటూవచ్చారు. ఆనాటి కంతే.

మరునాటికి నా పని అనుకొని విధంగా పూర్తయ్యింది. ఆ రాత్రికే నా ప్రయాణం పెట్టా. ఆ సాయంకాలం బీచ్‌లో ఆయన నా ప్రయాణం మాట తలపెట్టి 'మళ్ళీ ఎప్పుడువస్తారు?' అన్నారు. నేను మరిఒకసారి నా బిడియాన్ని వ్యక్తంచేస్తూ ఆయన నాకై చేసిన 'దండగ' ను తడవి, 'ఇలా అయితే యింకోసారి వచ్చేటప్పుడు వారితో గడపటం కష్టమన్నాను. ఆయన దానికి జవాబుగా నిష్ఠూరపు ధోరణిని నటిస్తూ ప్రారంభించి ప్రసంగవశాత్తు అతనెట్టి ఆర్థికదుస్థితిలో చిక్కుకొని ఉన్నారో కొంత వివరించారు. జీతంచాలక అప్పులుచేస్తూ వాటిని రెండుమూడు వందలవరకూ పెంచవలసి వచ్చిందని విని నేను నిచ్చరబోయాను. నేను అంతరంగంలో ఆస్థితిలో ఆయన పడగల ఇబ్బందు లూహించుకొని నా ఆత్రతను వ్యక్తంచేస్తూ.

"అయితే ఆ అప్పులు ఎలా తీరుతాయంటూరు." అన్నాను. ఆయన అది తీరేపద్ధతి అంటూ సూచించిన మార్గం చూస్తే ఆయన అప్పులలో ఇరుక్కోవటం కన్న ఆ యిరుక్కున్నందువల్ల ఆయన జీవనవైఖరిలో వస్తున్నట్టు కనుపించిన మార్పులు చాలా ప్రమాదికరాలుగా ధ్వనించాయి.

ఆయన పూర్తిగా మునగదలిచిన వారికి సముద్రం మోకాటి బంటి అన్నట్టు మాటాడాడు. నేను అప్పటి కా పరిస్థితుల్లో ఇంకేమీ మాడలేకపోయాను. ఇంటికి వెళ్ళాక వారంరోజు లాలోచించి రెండుటావుల ఉత్తరం వ్రాశాను. అందులో అత నప్పుడు పెంచి పోషించుకుంటున్న భావాలు ఎంతటి ప్రమాదకరమైనవో మానవశక్తి ప్రయత్నం ఎంతటి మహత్తరమైనదో ఋణశేషం ఎట్టిదో వివరించి అతని ఆర్థికస్థితిని చక్కబరచుకోవటానికి సూచన కూడా ఇస్తూ ముగించాను. ఇది పోస్టుచేశాక కొన్నాళ్లు జవాబు వస్తుందేమోనని ఎదురుచూశాను. కాని ఆ వుత్తరం ఆయనకు అందిన చిహ్నంకూడా కానరాలేదు.

*　　*　　*　　*

తరువాత మూడేండ్లదాకా—అంటే ఏడాదిక్రితం నేను అతని నక్కడకు చూడబోయేవఱకూ అతని జీవితం ఏవిధమైన పరిణామాలు పొందుతూ వచ్చినదీ తెలియలేదు. ఈలోగా మాత్రం ఒక్కసారి—వెనుక నేను ఐదారురోజు లక్కడ ఉండివచ్చిన తరువాత ఇంచుమించు ఆరుమాసాలకు—ఒకనా డతను అకస్మికంగా వచ్చి మాయింట ఒకపూట ఉండి తిరుగు ట్రైనులోనే ఇంటికివెళ్లిపోయాడు. అది ఒక చిన్న సంఘటన. అంతకు ముందురోజునే అతను వ్రాసిన ఉత్తరం ఒకటి నా కందింది. అందులో ఎట్టి కారణాన్న పేర్కొకుండా వీలైతే ఒక వందరూపాయలు పంపమనీ — అవకాశం లేకపోతే విచారించవద్దనీ వ్రాసిఉంది. నేనొక్కక్షణమైనా ఆలస్యం చేయకుండా ఆదివారమయినా అర్జెంటు T.M.O. చేశాను. ఆ సాయంకాలం మెయిల్‌లోనే అతను వచ్చారు. అతని ముఖంలో పిచ్చికళలు కానవచ్చాయి. రెండుమూడు గంటలున్నారు. భోజనంచేశారు. ఆ రాత్రే తిరిగి వెళ్ళిపోవాలన్నారు. నేను ఆయనను స్టేషనుకు దిగబెట్టేముందు నా మనియార్డరు అందిందా అన్నాను. అందిందనారు. సరి పోదా అన్నాను. సరి పోతుందన్నారు. ఏమిటి విశేషమన్నాను. ఏమీలేదన్నారు. ఆపూట విశ్రాంతి తీసుకొనిపోరాదా అన్నాను. ఇంట చాలామంది చుట్టాలువచ్చి ఉన్నారన్నారు. "అయితే మరేల ఇలావచ్చారూ?" అన్నాను. ఈ ప్రశ్నకుమాత్రం కాస్త కాలం యెక్కువ తీసుకొని చివరకు "ఊరికేనే" అన్నారు.

నేను జేబులోనుంచి ఐదు పదిరూపాయలనోట్లు తీసి ఆయన జేబులో ఉంచబోయాను. ఆయన నాముఖంలోకి సూటిగాచూస్తూ ఒక విషణ్ణహాసంచేసి ఆ డబ్బు నాకు వాపసు ఇవ్వబోయారు. కాని అవసరంలేకపోతే ఆతరువాత తిరిగి పంపించేయవచ్చంటూ ఆనోట్లు తిరిగి ఆయన జేబులోనే కుక్కాను. అప్పుడుమాత్రం ఆయన చూచిన ఆచూపూ ఆముఖంలో వ్యక్తం అవుతూ వచ్చిన ముద్రా నేను నా జన్మలో మరచిపోలేను. నా ఎరికలో రెండవసారిగా ఆయన ముఖకండరాలన్నీ కంపింపగా వానిని నిగ్రహించుకోవ

మీ కు

......ఆర్థిక స్వాతంత్ర్యము పొందాలని కోరిక వుంటే,

......పురోభివృద్ధిచెందు సంస్థలలో ఒక స్థానము ఉండాలని కోరిక వుంటే,

......నిరంతరమైన స్నేహ సౌహార్ద్రము పెంపొందాలని కోరికవుంటే,

......జీవితం, అగ్ని, మోటారు వివిధరకాల భీమా వ్యాపారములో పరిపూర్ణత్వము వహించిన కంపెనీతో సంబంధ ముండాలని కోరికవుంటే,

మా తో సంప్రదించండి.

# హిందూస్థాన్ ఐడియల్ ఇన్సూరెన్సు

## కంపెనీ, లిమిటెడ్,

(ఇండియాలో స్థాపితము: 1935)

హెడ్ ఆఫీసు: మచిలీపట్నం.

# గాంధి కేఫ్

గాంధినగరం, విజయవాడ - 2.

## మా ఖాతాదార్లకు
## మా అభిమానులకు

నూతన సంవత్సర ఉగాది అభినందనలు
అందజేస్తున్నాము.

* పరిశుభ్రమైన, శుచికరమైన భోజనము.
* రుచికరమైన వెన్న కాచిన నేతి పలహారములు
* విశాలమైన, గాలి వెలుతురుగల వసతి సౌకర్యం.

నూతన సంవత్సరంలోగూడ మీకు సంతృప్తికరంగా అందించగలం.

పరిశుభ్రత - రుచి - మా ప్రత్యేకతలు.



## విఖ్యాత నాడీ కళా వేత్త

(నాడీ కళానిధి)

చిలకపాటి అనంత కృష్ణమాచార్యులు

ఒంగోలు.

డానికి ఆయన ప్రయత్నించటం చూచాను. ఒకస్థితికి వచ్చాక ఆయన ముఖం త్రిప్పేసుకున్నారు.

దారిలో ఆయన—ముసలమ్మ పోయిందనీ తనకు కర్మకాండలపై నమ్మకం లేకపోయినా తక్కినవారు విడవరనీ ముసలమ్మకూడా మరీమరీ చెప్పి బ్రతిమలాడిందనీ చెప్పారు. అన్నగురించి ఏదో చెప్పబోయి అంతలో మళ్లా విరమించుకున్నారు. నేను ఏమని అడుగలేదు.

నాకా మనిషి కృతజ్ఞత చూపించినవిధం చూస్తే ఎక్కడలేని జాలీ అనంతమైన గౌరవం కలిగాయి. తిరిగివస్తూ, ఆయన పరిస్థితి నంతా మరోమారు మననం చేసుకోసాగాను. జీవితంలో నేను మహదానందంతో గడపిన ఘడియలలోకల్లా ఆ మిగిలినరాత్రి నేను గడిపిన ఘడియలు ప్రప్రథమశ్రేణిలోకి వస్తాయి.

ఆతరువాత కొంతకాలం తరుచు ఉత్తరాలు వస్తుండేవి. నేనుకూడా వెంటవెంటనే జవాబులు వ్రాస్తుండేవాడిని. అందులో అతను మా కుటుంబపు యోగక్షేమాలనుగూర్చి ప్రశ్నించటంతప్ప యింకేమీ వ్రాసేవారు కాదు. కనీసం తన యోగక్షేమాలైనా పేర్కొనేవారు కాదు. నేను వాటికి వ్రాసేజవాబులలో మాయోగక్షేమాలు తెలుపుతూ అతనిలానే తనూ మొదలగువారియోగక్షేమాలు వ్రాయమంటూ ఉండేవాడిని. కొన్నాళ్ళు గడిచాక ఆ ఉత్తరాలు క్రమశః రావడం మానేశాయి. నా కొనకుమ ఒకటి రెండుసార్లు ఉత్తరం వ్రాయాలనే బుద్ధిపుట్టినా నా అంతట నేనుగా వ్రాస్తే ఆ డబ్బు విషయం దృష్టిలోకి తెచ్చుకొని అతనేం మనసు కష్టపెట్టుకుంటారో అని మళ్ళా ఊరుకున్నాను.

చివరకు ఏడాదిక్రితం తమ్ముడిపెండ్లికి ఏలూరు పోయివస్తూ ఒకరోజు ముందుగా బయలుదేరి విశాఖపట్నంలో దిగాను. ముందుగానే ఉత్తరం వ్రాసిఉన్నానేమో మనిషి స్టేషనుకుకూడా వచ్చాడు. అయితే చిత్రమేమంటే ఆయనను నేను వెంటనే పోల్చుకోలేకపోవడం.

## 4

ట్రెయిను వాల్తేరు ప్లాట్‌ఫారము మీద ఆగేసరికి ఉదయం 8 గంటలవుతుంది. చేత హోల్డాల్‌తో తెగమాసిఉన్న బట్టలతో రాత్రల్లా నిద్దరలేక నలిగిన మొఖంతో బయటపడి చుట్టూవున్న జనంలో రాజశేఖరంగార్ని వెతకసాగాను. ఆయన ఎక్కడా కనుపించలేదు. బహుశా అతను రాలేకపోయా రనుకుంటూ కూలీని మాటాడనున్నాను.

ఠగా అదెసమయంలో పెదవులపై చిరునవ్వుతో చెయ్యెత్తి నవీనపద్ధతిలో విష్ చేస్తూ అల్లంత దూరంలో సరిగా రాజశేఖరం గార్ని పోలివున్నాడనిపించే మనిషి కనుపించాడు. అతను నావంకే చూస్తూ నా దగ్గరకే వస్తుంటే మొదట అతనెవరా అనీ తరువాత అతను రాజశేఖరమా అనీ ఆశ్చర్యపోయాను.

మనిషి పూర్తిగా మారిపోయాడు. ముఖంలో ద్విగుణీకృతమైన గాంభీర్యం నడకలో దుస్తుల్లో ఆకారంలో కన్పిస్తున్న చాలా మార్పులు అతన్ని క్రొత్తమనిషిని చేసేయి. మెరసే చక్కనిబూటూ వెనుకన్నా మడతలు చెడని ఖరీదైన దుస్తులూ, మీస కట్టుతో సహా పరిశుభ్రంగా గీయబడ్డ పచ్చని గడ్డంతోడి, కొంచెం గండరించిన మొఖము, క్రొత్తగా పెట్టిన క్రాఫూ అన్నిటా ఆ మార్పు కొనవస్తుంది. మాటాడేటప్పుడు ఆ మాటల పద్ధతేకాక గొంతుకూడా మారినట్టే కనిపించింది. స్టేషనునుండి వెలుపలకు వస్తూ, జేబులోంచి సిగరెట్ కేస్‌తీసి, అలవాటు చొప్పున కొబోలు నావంక ఒకసారి చూపించి, నేను కాల్చనని జ్ఞాపకం వచ్చిందేమో వెనుకకు తీసేసుకున్నాడు. చివరకు ఈ అలవాటుకూడా క్రొత్తదే.

అసలే విశ్రాంతి లేక శ్రాంతిపొందిన ఆలోచనాశక్తులకు ఆయన తన మార్పులతో కలిగించిన విభ్రాంతి తోడుకాగా ఆ మార్పులను ఏవిధంగా అర్థంచేసుకోవాలో తెలియక బహుశా అతను క్రాస్‌వర్డ్ పజిల్సులోనో కనీసం కొన్నివేలు పొందడంవంటిదేదో జరిగివుంటుందనుకున్నాను. కాని అతను నా కిచ్చిన ఎదుర్కోలు ధోరణిని ఆ క్షణాన అతని ముఖంపై కొనవచ్చిన ఒక విధమైన సంకీర్ణభావ ముద్రను విమర్శించుకో గలిగివుంటే అట్లాంటి ప్రాతిపదికను చేసుకొనివుండను.

ఆ విభ్రాంతిస్థితిలోనే ఆయనవెంట స్టేషను విడిచి జట్కాలో ఇంటికి పోయాను.

రాజశేఖరంగారి ఇంట్లోకూడా చాలామార్పులు వచ్చినట్టున్నయ్. పెద్దగదిలో అన్నీ ఆయన దుస్తులూ జోళ్ళూ మంచం, తప్ప ఆడవారి చీరలూ ఒకటో రెండో చేటలూ, జల్లెళ్ళూ, వంటివీ కొనరావు. అలమారులో డబ్బాలూ, డొక్కులూ, సీసాలూ మొదలయినవిపోయి క్రొత్తగా వచ్చినట్టు కనిపించే పుస్తకాలు జాగ్రత్తగా అమర్చబడి వున్నాయి.

ఆయన గదివెనుక తలుపులు చేరవేసి, నాకై మడతకుర్చీ వాల్చి, తానుపోయి మంచంమీద కూర్చున్నారు.

అంతే ఇద్దరం మాటాడలేదు. గదిలో ఆ ఉదయపు తొలిమలి జాముల సంధ్యలోకూడా ఎట్లావచ్చిందో తెలియదు. అనంతమైన స్తబ్ధత్వం ఆవరించినట్టుంది. నేను బడలికతో కళ్లు మూసుకొని ఏవో ఏవో భావాలు పరంపరలుగా రాగా, అన్ని ఊరులూ అన్ని వీధులూ, అందరి మనుష్యులూ, అన్ని సంక్షోభాల్లోనించి ప్రయాణం చేసి, చేసి చివరకు ఒక స్థితిలో అభావసిద్ధిని పొందినట్టయింది.

*

ఎంతసేపు ఆ యీజీఛైర్‌లో పడివున్నానో తెలియదు. కొంతసేపు పోయాక రాజశేఖరంగారి గొంతు వినిపించింది. ఆయన రెండుచేతులతోనూ రెండు కప్పుల కాఫీ పట్టుకొని ఉన్నారు.

నేను కళ్లు తెరవగానే ఒక దానివి నా కందిచ్చారు, అప్పటికి పదిగంటలవుతుంది అనుకున్నాను. గడచినవి రెండుగంటలే అయినా నేను ఏలూరునుండి బయలుదేరటం, ఆ రైలు, ఇంటికి రావటం నిన్ననో మొన్ననో జరిగినట్టున్నాయి. రాజశేఖరంగారిలో వచ్చిన మార్పులు మాత్రం ఇంకా క్రొత్తతీరలేదు.

కాఫీ త్రాగి నేనా విచిత్రమానసిక స్థితినిగూర్చి తలపోస్తూ అలానే కూచున్నాను. ఆయన కప్పులు లోనికి తీసుకొనిపోయి తిరిగివస్తూ—

'నిద్రపోతారా' అన్నారు. నేను బద్ధకంగా ఆవులించి అక్కరలేదన్నాను, ఆయన మరియొకసారి సలహా యిచ్చిచూచి నేను వినకపోగా సిగరెట్టుతీసి ముట్టించి చిత్రవిచిత్రములైన గతులలో ఆ పొగను విడుస్తూ పరధ్యానంగా ఆలోచనలో పడ్డారు. నేను నిద్రకు ముందు విషయాలు తలపోస్తూ రాజశేఖరంగారు తమ అత్తమామలు వచ్చినట్టు చెప్పిన విషయం జ్ఞాపకం రాగా—

'చుట్టాలెవరైనా బయటికి వెళ్ళేరా?' అన్నాను. పరధ్యానంగా ఉన్న రాజశేఖరంగారు కొంతసేపు పోయాక ప్రశ్నార్థకంగాచూచి అంతలో ప్రశ్న స్ఫురణకురాగా 'లేదు' అని మరి కాస్తసేపు పోయాక—

'బహుశా ఆయన బజారుకు వెళ్ళివుంటారు' అన్నారు. ఆయన క్రొత్తధోరణికి నేను క్రమంగా అలవాటు పడుతున్నాను. నేనుకూడా మరి కాస్తసేపు ఊరుకొని అడిగేను.

'ఏల వచ్చినట్టు?'

దీనికికూడా అతడు సుదీర్ఘకాలమే తీసుకొని జవాబిచ్చేరు—

'తెలియదు...అనటం మాత్రం వాళ్ళ అమ్మాయిని తమతో తీసుకువెళతామని...ఇవాళ ఉదయమే నేను నీ దగ్గరకు బయలు దేరుతుంటే చెప్పారు.!'

విషయం మూడు ఖండాలుగా చెప్పారు. కాని ఆ చెప్పేటప్పుడు ఈసారి అత నుపయోగించిన మాటలు వైఖరిచూస్తే అది ఒట్టి తమాషాకు తక్కిన మార్పులన్నిటితో తెచ్చుకున్న ధోరణి కాదని దానివెనుక ఏదో చాలా కథ ఉన్నదేమోనని అనుమానం వేసింది. చూస్తుండగానే అతని ముఖం క్షణక్షణ సంచలనభావంచే వివర్ణమై ఉన్నట్టు అతని గమనం చేష్టలూ చిత్రమైన వాక్యపద్ధతీ వాని ఉచ్చారణ భ్రూకుటీ ఔష్ఠ్యాదుల వివిధవిక్షేపాలూ అనుక్షణ చంచలములైన చూపులూ సమస్తం ఆ కారణంచేతే అంతగా అట్లా క్రొత్తగా అసహజంగా వికృతంగా ఉన్నట్టు తోచసాగింది.

కాని అప్పటి కింకా ఇదమిద్ధమని తేల్చుకోలేకపోయాను. ఇంకొక అసంబద్ధపు ప్రశ్నతో అది అంత సులువుగా తేలిపోతుందని అప్పటికి నాకు తెలియదు. అడిగేను.

'అంటే ఎప్పట్లో తిరిగిరావచ్చు?'

ఆ ప్రశ్న నేను రకరకాలుగా మననంచేసుకుని అడిగేను' ఆయన దానికి జవాబివ్వటానికి పూర్తిగా రెండు నిముషాలు తీసుకున్నారు. ఇంతసేపూ అంతగా ఆలోచించ వలసినంత అర్థము అందులో ఏముందో తెలియక మా నడుమను వెలసిన నిశ్శబ్దం ఆయన ముఖంలో మెదులుతూ వచ్చిన భావాలూ నానరాలమీద పనిచేస్తూండగా ఆశ్చర్యసంకోచాలతో ఉత్తలమయ్యే మనస్సునుకట్టి పెట్టుకుని కూచున్నాను. ఆయన గ్రుక్కిళ్ళు మ్రింగి మ్రింగి సిగరెట్ అయిదారుసార్లు గట్టిగా పీల్చి వివిధములైన ముఖాంగ విక్షేపాలతో ఆలోచించి ఇచ్చిన జవాబిది.

'తెలియదు...బహుశా నెలలు పట్టవచ్చు...లేక సంవత్సరాలుపట్టినా పట్టవచ్చు...' అంటూ కాస్త ఎడముతో 'అది ఇంకా అక్కడ హైకమాండు నిర్ణయాలనుబట్టి వుంటుంది...ఇది ఒక రకమైన తక్షణ ప్రతీకారచర్య అనుకుంటాను' అని ముగించాడు.

నేనా వాక్యాలు వింటూ అలానే ఉండిపోయాను. ఒక్కసారి నా రక్తనాళాలలోని రక్తం తీవ్రగతిని శరీరమల్లా ప్రవహించి వచ్చి కాస్తగా నీరు విడవనారంభించింది. నిద్రమత్తూ, బద్ధకం— అన్నీ ఎగిరిపోయాయి. కాని రాజశేఖరంగారు ఇంకేమీ చెప్ప లేదు. కొంతసేపు ఆయన ముఖంచూస్తూ అలానే ఉండి అందలి ప్రమాదం గుర్తుకురాగా చూపులు ప్రక్కకు త్రిప్పుకున్నాను.

పావుగంట గడిచింది. ఇంతసేపూ గాఢమైన నిశ్శబ్దం వెలసింది. పెరట్లో ఆడవాళ్ళ గిన్నెలచప్పుళ్ళూ వీధిలో బళ్ళ రాకపోకల చప్పుళ్ళూ ఎక్కడో మనుష్యులు మాటాడుతున్న సవ్వళ్ళూ పిట్టల కూతలూ ఉండీ ఉడిగీ వినిపిస్తుండేవి. మే మిద్దరం మౌనంగా అట్లా కూర్చుని ఉన్నాం.

తరువాత ఆయన లేచి అలమారులోనుండి ఒక కాగితమేదో తీసి తొందరగా వ్రాసి నన్నుద్దేశిస్తూ అన్నారు.

“అలా బయటకు వెళ్ళిరావాలి. మీరు వస్తారో రారో ఖచ్చితంగా తెలియలేక ఇంకా శెలవు చీటీ పంపించలేదు. టైమ్‌కూడా అవవచ్చినట్టుంది. మీరుకూడా వస్తారా” అన్నారు.

నేను నసుగుతూ “అలానే” అన్నాను. కాని ఆయన ఏమనుకున్నారో “మీ రుండండి. నే నిప్పుడే త్వరగా వస్తాను” అంటూ నా జవాబుకోసరం ఎదురుచూడకుండానే జోళ్ళు తొడుక్కొని వెళ్ళిపోయారు.

ఆయన వెళ్ళిపొయ్యారే గాని ఆయనతో నేనుకూడా ఎందుకుపోయి ఉండలేదా అని ఆతరువాత చాలా విసుక్కోవలసి వచ్చింది.

ఆయన వెళ్ళాక ఒక్కణ్ణే దిక్కులుచూస్తూ ఏం జరిగి ఉంటుంది? ఏం జరుగనున్నదీ? అనేవానిపై ఆలోచిస్తూ ఎటూ తోచనిస్థితిలో దిక్కులుచూస్తూ కూర్చున్నాను. ఏం నెపం పెట్టుకొని సాయంత్రంలోగా అక్కడనుండి తప్పుకోవటమా అని ఆలోచనలో ఉండగా ఒక ముసలాయన బయటినుండి చేతిలో ఒక పెద్ద సంచీతో తిరిగి వచ్చారు.

ఆయనకు చూపు కొంచం మాంద్యంలా ఉంది. లేక ఎండ పొడఫలితమో! మొదట నన్ను రాజశేఖరమే అనుకొని ఉంటారు. తరువాత ఇంకొకరుగా కనుపించడంతో కావోలు కాస్త ఒక అడుగు ముందరకువేసి జాగ్రతగాచూసి

“ఎవరు బాబూ” అన్నారు.

నేను లేవబోతూ “రాజశేఖరంగారి స్నేహితుణ్ణాను.

ఆయన “కూర్చో కూర్చో నాయనా!” అంటూ లోనికి వెళ్ళిపోయారు.

ఆయన లక్షణాలు కాస్త అసామాన్యమైనవి. సన్నగా పొడుగ్గా ఆరడుగుల ఎత్తుంటారు. పండిన బట్టతలపై స్వచ్ఛధవళ

మైన పలుచని శిఖ ఉన్నది. కాయ శరీరం. ఎన్నేండ్లో చెప్పలేం. కాని అరవైకి తక్కువ కావనిపిస్తుంది.

ఆయనలోనికివెళ్ళి నాలుగైదునిముషాల్లో తొడుక్కొనిఉన్న లాల్చీ విడచి కాళ్లు కడుక్కొని ఒక తడిఅంగవస్త్రంతో ముఖం గుండెలూ చేతులూ తుడుచుకుంటూ వచ్చారు. నేను మర్యాదగా లేచి కుర్చీ వారికిచ్చి మంచంమీద కూర్చున్నాను. ఆయనకూడా కొంతసేపు మర్యాదే అప్పగించి చివరకు కుర్చీని వీధిద్వారందగ్గరకు ఈడ్చుకొని కూర్చున్నారు.

తరువాత నెమ్మదిగా బాతాఖానీకి దిగారు.

మొదట్లల్లా నాపేరూ నాఊరూ ఉద్యోగం కులగోత్రాలూ తల్లిదండ్రులూ, వివాహం, మా ఆవిడ పుట్టుపూర్వోత్తరాలూ, సంతానం రాబడీ ఖర్చువెచ్చాలూ మొదలైనవాటన్నిటినిగూర్చీ ప్రశ్నించి తెలుసుకొని నన్నేమని అర్థం చేసుకున్నారో—కొంత సేపు మౌనం తరువాత నెమ్మదిగా అడిగారు.

"అయితే బాబూ మీరు వచ్చేసరికే బయటకు వెళ్ళి పోయాడా?" అన్నారు.

నేను చెప్పాను.

వెంటనే ఆయన చాలా ఆశ్చర్యపోతూ "ఏమిటి... మీరీ ఊర్లో ఉండటం లేదూ...?" అన్నారు.

జరిగిన పొరపాటు నే నేడిపార్టుమెంటులో పనిచేస్తున్నానో కాని ఏఊళ్ళో పనిచేస్తున్నానో అనేది ఆయన ప్రశ్నల్లోగాని నాజవాబుల్లోగాని రాలేదు. ఇప్పుడాపొరపాటు సర్దుకొని ఉన్న విషయం చెప్పగా ఆయన—

"అలానా...!" అంటూ ఆ దీర్ఘంలో ఏదో గొప్పవిషయం గ్రహించినట్టు తలతాటించి—ఆతరువాత ఆకస్మికంగా చేయితిరిగిన కళాకారునిధోరణిలో ఆరంభించారు.

"అలా చెప్పు! అందుచేత నీకూ ఏమీ తెలిసి ఉండదు. నేను అనుకుంటునే ఉన్నాను" అని ఒకసారి వీధిలోకిచూసి అదే స్వగతంగా అడేప్రకాశంగా "ఇంత బుద్ధిమంతుడైన స్నేహితుడుంటూ ఒకడున్నాక ఇతనైనా ఏల చివాట్లువేసి ఉండడా అనుకున్నాను. కాని అదీ సంగతి. నీకుకూడా తెలిసిఉండదు" అంటూ క్షణమాగి చిన్న గొంతు తగ్గిస్తూ—

"విన్నావా బాబూ! పిల్లదానివంటిమీద బంగారం అంతా అమ్మేశాడు. నాలుగుతులాల గొలుసు! రెండుతులాల పుస్తెలతాను తులం నరయెత్తు గాజుల జత సమస్తం అమ్మేశాడు! ముక్కునా చెవినా మాత్రం యింకా వుంచాడు. మంగళసూత్రంజోలికి పోలేదు.

ఏంచేశాడో తెలియదు. ముండలకే పెట్టాడో ముఠాకోర్లకే తగలేశాడో తెలియదు. అడిగితే మాటాడడు" అని మరిఒకసారి వీధివంకచూసి—

"రోజూ అర్ధరాత్రికిగాని ఇంటికి రాడు. అడ్డమైన స్నేహితులనూ చేర్చి డబ్బు తగలేస్తూ ఉంటాడట. ఎక్కడలేని పుస్తకాలూ కొలతేసి డబ్బుపోసికొని మళ్ళా వీడికీ వాడికీ పంచి పెట్టేస్తాడట. పిల్లతో కులాసాగా ఒకమాటగాని మంచిగాని లేదట! ఎంతసేపూ ఆఫీసూ ఆవీధీ యీవీధి అని తిరగటం! ఇదీ వరస"

— అని ఆగి ఆశ్చర్యం వ్యక్తమయ్యే నా ముఖం చూస్తూ గొంతు కాస్తంత హెచ్చించి.

"ఆమధ్య పిల్లకు నెలతప్పింది. ఆవిషయం మాకెవ్వరికీ వ్రాయ లేదు. తొలిచూలుబిడ్డ. వెనుక ఆసరాలేదు. ఒక్కర్తీ దానిపాట్లు దానినే పడమంటాడా! హాస్పటల్లో పురుడా! పదకొండోనాటి నుంచే ఇంటిపనా!!" అంటూ కాస్త ఆగి ఆ విరామంలో అభివృద్ధి పొందిన ఆకస్మికోద్వేగంతో — "పిల్లనెల తప్పతే కనుక్కున్న తలిదండ్రులకు ఒక్క ఉత్తరం ముక్క వ్రాయవమూ? పోనీ పురుడు వచ్చాకైనా—అందులోనూ మగపిల్లడే—ఒక్క ఉత్తరం ముక్క వ్రాయవ్!......నీకు మేమేం విషం ముషిడీ పెట్టాం?...... మేం పుట్టెడుకష్టాలలో ఉన్నాం...తీసుకు పోవడానికిగాని వచ్చి చూచిపోవడడానికి మొత్తం పైసంవత్సరం సంవత్సరంనరవరకూ వీలు చిక్కలేదు కాదు. నిజమే! కాని ఉత్తరాలు వ్రాస్తూనే ఉన్నామే వాటికి రెండునెలలకో మూడునెలలకో నీకు బుద్ధి పుట్టి నప్పుడు నువ్వు జవాబులు గిలుకుతునే ఉంటివే...ఒక్క ఉత్తరంలో నాలుగక్షరాలువ్రాస్తే నీపుస్తేం మునిగిపోతుంది!...పైగా పిల్లదివ్రాస్తానంటే దానిని దండించి వ్రాయకుండా చేస్తావా? ఇదేనా ధర్మం?"

—అంటూ ప్రశ్నించి నాముఖంలోకిచూస్తూ ఆగిపోయారు. నేనా విషయం విని నిజంగా నమ్మలేనంత ఆశ్చర్యపోయాను. కొంతసేపుపోయాక ముసలాయన మళ్ళా జడివానలా ప్రారంభించాడు. ఆయన మరిఒకసారి ద్వారంవంక చూసి అందు కున్నాడు.

"పోనీయేం నిర్వాహకుడవని అనవసరపు భారాలు నెత్తిన వేసుక విర్రవీగుతావ్? ఒక్క పెళ్ళాన్ని పోషించడం చేతకాక ఆడపిల్లవంటినున్న బంగారంతీసి అమ్ముకుంటావ్? బంగారమమ్మి నాయనమ్మ సంవత్సరీకాలకు డబ్బు పంపిస్తావ్? బంగారమమ్మే పురిటిఖర్చు ఖర్చులు పెడతావ్? 'టిక్ టాక్'గా బూట్ వేసుక తిరుగుతావ్? కత్తిరమార్కు సిగరెట్లు కాలుస్తావ్? పుస్తకాలు కొంటావ్! అదేమని పిల్లది అనబోతే దానితో మాటలు మానేసి ఏడిపిస్తావ్! నేనడగవచ్చినా మొండి జవాబు లిస్తావ్? ఇదేనా పెద్దమనిషితరహా" అని సవాలుచేసినట్టు ప్రశ్నించి ఆగి యింకా అభివృద్ధిపొందిన ఉద్రేకంతో మళ్ళా ప్రారంభించారు.

"నేనెవర్ని — నీకు తెలుసా — కాదు నిన్నే అడుగు తున్నాను" అంటూ మధ్య నన్ను నిర్దేశించి నాచేత తెలియదని పించుకొని "మేనమామను! పిల్లనిచ్చుకొన్న మేనమామను! మీ అమ్మా నాయనా నువ్వు ఎనిమిదేళ్ళనిండని క్షురకుంకవుగా ఉండినప్పుడుపోతే నిన్నూ నీ అన్నలనూ—కొడుకు చచ్చి ఏడు స్తున్న మీ నాయనమ్మను, చిప్ప చేతబట్టుకొని పంచలంబడి పడ కుండా అడ్డుపడ్డవాడని నువ్వుకూడా మీ అన్నలాగే తెత్తెత్త

పప్పుప్ప అంటూ గొడ్లను తోలుకోకుండా ఇంటర్ వరకూ చదువు చెప్పించి ఈ ఉద్యోగంపాటిదైనా చేసుకోవడానికి నీకు అవకాశం కల్పించినవాణ్ణి. అట్టిది ఇదా నువ్వు నాకీయవలసే జవాబు? నువ్వు నాకు తిరిగిచేసే నిర్వాకం ఇదా? ఇందుకేనా నీకు నేను పిల్లనిచ్చినది? ఇందుకేనా నీకై నేనన్ని శ్రమదమాదులు పడ్డది? నీకు నీతీ జాతీ ఉన్నదా ? మంచీ చెడ్డా ఉన్నదా? కాదు — ఉన్నదా అంట" అంటూ ఆ చివరకూవచ్చేసరికి ఉద్రేకం కడలంటగా అంత ఉద్రేకాన్నీ వ్యక్తంచేస్తూ — అలసిపోయారేమో మడతకుర్చీలో చారబడి పోయారు.

ఇంతసేపూ నేను హృదయోద్వేగంతో సతమతమౌతూ వచ్చాను. ముసలాయనయొక్క ఉద్రేకం హృదయవేదనా కలిగించిన కల్లోలంమాట అటుఉంచినా నన్ను పట్టుకొని పీడిస్తున్న బాధ ఇంకొకటున్నది.

ఏక్షణాన రాజశేఖరంగారు వస్తారో తెలియదు. ఆయన యెంతోదూరంవెళ్ళిఉండరు. ఏనిముషానవచ్చినా ఆయనరావచ్చు. ఇంక ముసలాయన చూడబోతే ఒళ్లూ పయీ తెలియకుండా మాటాడుతున్నాడు. ఎప్పుడు ఏం మూడుతుందో అని గుండెలు అరచేతపట్టుకొని కూర్చుని ఉన్నాను.

కొంతసేపుపోయాక ముసలాయన మళ్ళీ ప్రారంభించ బోయారు.

"సరే......" అన్నారు. కాని ఆ సరేతరువాత మరి పూర్తి కాలేదు. ఆయన భార్యకాబోలు ఒక స్థూలకాయ ఆమె ఎప్పుడు అక్కడకు వచ్చిఉన్నదో తెలియదు. భర్తను ఉచ్చస్వరంలో మందలిస్తూ అన్నది.

"ఇప్పుడాసొదంతా చెప్పుతా రెందుకూ? అయిపోయిందేదో అయేపోయ్. మీరిప్పుడు పదిసార్లు వల్లిస్తే మాత్రం జరిగినదానిని మార్చగలరా" అన్నది దీర్ఘాలు తీస్తూ.

ముసలాయన అంత ఆసక్తితో ప్రారంభించబోయినవాడూ ఆమెగొంతులో ఆమె ముఖంలో ఏంవిన్నాడో ఏంకన్నాడో తెలియదు. మంత్రముగ్ధమైన వృద్ధనాగమయ్యలా ఆమెముఖం చూస్తూ మడతకుర్చీలో వెనక్కు చార్లబడి పోయాడు. తరువాత ఉపన్యాసాన్ని సవ్యంగా ముగించే ధోరణిలో శాంతగంభీరస్వరంతో చెప్ప సాగారు.

"అహ! అదికాదు. కుర్రవాడు చిన్నవాడైనా బుద్ధిమంతుడు లానూ మంచివాడులానూ కనుపిస్తే చెబుతున్నాను. ఎప్పుడైనా తానే నామెమ్మదిమీద నాలుగుచివాట్లు పెట్టకపోతాడాఅని. అంతే కాని ఇప్పు డేమనుకుంటే ఏంలాభం అంతా అయిపోయింది" అంటూ ఉపసంహారం పూర్తిచేశాడు.

కాని అయిల్లాలు భర్తను మందలిస్తూనే తానింకో ఉపన్యాసం ఆరంభించింది. అందులో—అసలు రాజశేఖరంగారి వంశే మేటు వంటిదో ఆయన తండ్రి ఎటువంటి నిర్దాక్షిణ్యస్వభావుడో—ఇటు మొదటినుండీ వారింటి ఆడబిడ్డలైతేనేం మగవాళ్ళయితేనేం కష్ట సహిష్ణులూ ఉదారులూ ఇతరుల బాధలు చూచి సహించలేనివాళ్లూ కావడంచేత మొదటినుండీ ఎలా చిక్కుల్లో ఇరుక్కుంటూ వచ్చారో అభివర్ణించి, తానీపెండ్లికి మొదటినుండీ ఎలా అయిష్టత కనబరుస్తూవచ్చిందో—అయినా భర్త మేనల్లుడిమీది అభిమానం చేతనైతేనేం అతడిని బాగుచేతామనే సదుద్దేశంతోనైతేనేం చచ్చి పోయిన ముసలిదానిఏడుపులకూ మొత్తులకూ లొంగిపోయిఅయితేనేం అందానికీ తెలివికీ భ్రమసి అయితే యెట్లా మోసపోయారో చెప్పి —జాతీయమైన నుడికారం, సన్నని మృదుమధురమైన స్వరం, పొంకమైనశయ్యతో ఆడవాళ్ళు తమ ఉపన్యాసంద్వారా చేయ గలపని మొగవాళ్ళు తమ బండభావంతోనూ ఉద్రేకాలతోనూ చస్తే చేయలేరనిపించింది.

కాని చివరకి కొండవీటిచేంతాడు ముగిసేసరికి నేను భయ పడ్డంతపనీ జరిగి ఊరుకున్నది.

ఆమె చేయవలసిన ఉపన్యాసమంతా చేసి అన్నది "ఇంతకూ చెప్పవచ్చే దేమంటే మా ఆడబడుచు మగడు బ్రతకడానికి పట్టుమని పదెకరాల పొలమైనా లేకపోయినా, ముగ్గురు పసివాండ్రను ఆమె మెడకు చుట్టబెట్టి ఎంతమంది వద్దు వద్దంటున్నా ఆ నానుకో అప కేమనుగొడవలలో జైలుకు పోయాడు. జైలుకుపోయినవాళ్ళుకూడా ఎంతోమంది మాకీగొడవ లిక వద్దని వ్రాసియిచ్చి తిరిగి వచ్చారు. అప్పుడైనా ఆపనిచేసిరమ్మని ఎందరో ఎన్నోవిధాల చెప్పారు. కాని వినలేదు. చివరకాజైలులోనే పోయారు. అట్టివాని కొడుకీయన. అభిమానాలు ఎలా వస్తాయ్! అయ్యాపోలికలు ఎక్కడకు .........ఎక్కడకు........."అంటూ ఆగుమ్మంప్రక్క తిప్పిన చుప్పులు ఆలానే త్రిప్పినట్టుఉంచి నీరు విడిచిపోతున్నట్టు ఊరు కున్నది. నేను తలత్రిప్పిచూశేసరికి రాజశేఖరంగారు గుమ్మం ప్రక్క మూలను జోళ్లు విడుస్తున్నారు.........

కాని రాజశేఖరంగారు ఆయన ధర్మమా అని మేం ఇద్దరమూ స్నానాలకై నూతికిపోయినప్పుడైనా ఏమీ ప్రశ్నించలేదు. అయితే అతనామాటలు వినలేదనటానికి వలనుకాదు. వినటం మేరకు నిజం !

* * * *

ఒంటిగంటకు ప్రారంభించిన నిద్రనుండి రాత్రి బాగా చీకటిపడ్డాకగాని లేవలేకపోయాను. తెలివివచ్చి కన్నులు విప్పే సరికి నాకు మొట్టమొదట కానవచ్చిన దృశ్యం సాంద్రమైన చీకట్లులో ఒక నిప్పుకణం వృత్తపాదవర్తులగతిని నెమ్మదిగా కదిలి ఒక చోటనిలచి కణకణమనివెలగడం. అప్పటికప్పుడే పాతజ్ఞాపకాలతో బరువెక్కుతున్న గుండెలో ఒంటరిగా సిగరెట్లు కాలుస్తూ దీర్ఘాలోచనతో చీకటినడుమపడిఉన్న రాజశేఖరంగారిదుస్థితీ మత్తువిడి చురుకును కొల్కొంటున్న అంతఃచక్షువులముందు — ఆ చీకట్ల వెనుక అయోమయముద్రతోడి ఆయన గంభీరవదనం మెదల సాగాయి. నేనట్లానే కదలకుండా ఆరాత్రే ఎట్లాసైనా తప్పించు కొని అక్కడనుండి పారిపోవడానికి ప్లానులు వేయసాగాను. ఒక నిర్ణయానికివచ్చాక ఆయననుద్దేశించి.

"లైటెంతవుతుందాంటారు?" అన్నాను. ఆయనలేచి లైటు వేశారు. నేనుకూడా ఈలోగా మంచం దిగాను. వాచీ చూడగా తొమ్మిదిన్నర అయింది.

ఆత్రత ధ్వనింపజేస్తూ "నేనూ పదకొండుగంటల ట్రైనులో వెళ్ళాలే" అన్నాను.

ఆయన నావంకచూడకుండానే "తప్పదంటారా" అన్నారు. నేనోక్షణం తటపటాయించి కొట్టుకొనే గుండెలతో 'వెళ్ళాలి' అన్నాను.

ఆయన ఇంకేమీ మాటాడలేదు. ముఖం కడుక్కొందుకు నీళ్ళిచ్చారు. తరువాత ఇల్లు తలుపు తాళంపెట్టి అప్పుడే జన సంచారం బాగా తగ్గినవీధులవెంబడి హోటల్‌కు బయలుదేరాము. దారికడాకా అతనగారు ఒక్కమాటకూడా మాటాడలేదు. నేను వేళగానివేళనిద్రపోయిలేచానేమో చలివేస్తున్నట్టుఉష్ణంవచ్చినట్టు అనుభూతులు పొందుతూ ఆయనవెంట నడుస్తున్నాను. భోజనంచేసి వచ్చాక గదిలో హోల్డాల్ తీసుకొని రిక్షాలో స్టేషనుకు చేరుకున్నాం. ఆయన ఈలోగా ఏవో ఒకటీఅరాగా అప్రస్తుతములైన మాటలాడారు. అంతే. ఇంతసేపూ ఆయనచేస్తున్నపని సిగరెట్ వెనుక సిగరెట్ తగలవేయటం.

చివరకు నేను కంపార్టుమెంటులో బెడ్డింగ్ పెట్టి క్రిందకు దిగివచ్చాక, నా కుడిచేయి తన అరచేతులలోకి తీసుకుంటూ ఒక సుదీర్ఘమైన నిశ్వాసం విడచి నవ్వటానికి ప్రయత్నిస్తూ అన్నారు. ఆయనమాటలలో — అవి అనేటప్పుడు ఆముఖంలో వెలసిన చిరునవ్వులో వ్యక్తమైన విషణ్ణ వ్యంగ్యం మరి ఒకసారి నా గుండెను కదలించినవి.

"మీరు మనం విడిపోయాక బహుశా రెండుసార్లే కాబోలు మాయింటికి వచ్చారు. రెండుసార్లూ చాలా మంచి అనుభవాలే సంపాదించుకపోతున్నారు. అదృష్టవంతులు. కాని—ఇంకొకసారి ఎప్పుడు వస్తారూ?" అన్నారు నా చేతులను కదుపుతూ.

నేను మాటాడలేకపోయాను. నా ముఖంలో ఏం వ్యక్తమౌతుందో నాకు తెలియదు. మాపులుమాత్రం ఆయనముఖాన్నంతటినీ తడుముతున్నాయి. అదిచూచి ఆయనవెనుక ఏనాడో నేను నాగదిలో అవమానించిననాటి వికృతహాసం మరలా ముఖాన కానరాగా అన్నారు.

"మీరు భయపడకండి. నేను చాలా మొండివాడిని. కాగా ఏమైనా జరుగుతే అది మంచికేతప్ప చెడుకుకాదు......ఉత్తరాలుమాత్రం వ్రాస్తుండండి" అన్నారు నన్ను పెట్టి వంకకు నడిపిస్తూ.

అచిరకాలంలోనే ఆయనా నేనూ దూరంకాసాగాం — రెండేసినిమషాలకోమైలుదూరం — ఆయన విశాఖపట్నంలోనూ నేను ట్రైనులోనూ.

## 5

ఇంటికి వచ్చిన రెండుమూడురోజులనాడుగాని జరిగిన దానినంతట్నీ మననంచేసుకుని అర్థం చేసుకోవటం సాధ్యమయ్యింది కాదు. ఈరోజులలోకూడా అల్లుళ్ళను, కూతుర్ని కాపరానికి పంపకపోవటంద్వారా శిక్షించదలుచుకున్న అత్తమామలుండటం చూచి ఆశ్చర్యపోయాను.

ఈసారి తిరిగివచ్చాక నేను వెనుకటిలాకాకుండా చాలా ఆసక్తితో జవాబులు రాకపోయినా మూడు నాలుగు ఉత్తరాలు వ్రాశాను. చివరి ఉత్తరంలో నా యడ్రసుతో కవరుకూడా పుంచే సరికి క్షమాపణ కోరుతూ ఆయన జవాబు వ్రాశారు. అక్షరం అక్షరానా ఆయన అనుతాపం కానవస్తునేవచ్చింది. అంతతో శాంతించి మళ్ళా మరిఒక ఉత్తరం వ్రాయడం—మానేశాను.

చివరకు రెణ్ణెల్లక్రితం ఒకసాయంకాలం నేను ఆఫీసునుండి ఇంటికి బయలుదేరనుండగా రాజశేఖరంగారి అన్నగారు మా ఆఫీసుకు వచ్చారు. ఆయనను — నేనూ రాజశేఖరంగారూ ఒక్క గదిలో ఉండేరోజులలో ఆయన రెండుమూడురోజులు మాతో ఉండడంవల్ల కొంతవరకూ ఎరిగి ఉన్నాను.

ఆయవచ్చి 'మాతమ్ముడు ఎక్కడ ఉన్నాడో మీకేమైనా తెలుసా' అన్నారు. కొన్ని తడబడ ప్రశ్నలూ ఆశ్చర్యాలూ జవాబులూ అయినతరువాత తేలిన విషయం—ఆయన మాటలలో రాజశేఖరంగారు 'పరారీ' అయిపోయారని.

దగ్గర మూడువందలవఱకూ మొత్తమైన ఒక అప్పులజాబితా గది తాళాలూ పోస్టుద్వారా పంపిస్తూ వాటితో ఒక చిన్న ఉత్తరం కూడా వ్రాశాడు. ఎక్కడకు పోయాడో తెలియదు—అన్నారు.

ఆయన చూడమనగా అప్పులజాబితా చూశాను. అందులో నాపేరు లేదు. ఉత్తరం చూపించారు. తనకోసం వెతకడానికి డబ్బు తగలవేయవద్దనీ ఉత్తరాలు వ్రాస్తూ ఉంటాననీ ఉన్నది. ఆస్తిపాస్తుల లెక్క లేవో కొన్ని ఉన్నవి.

నేను దగ్గరస్నేహితుడ నవటంవల్ల నాకేమైనా భోగట్టా తెలియవచ్చునని వచ్చారట. చాలా ఒట్లూ సత్యాలూతో నాకేమీ తెలియదని ఆయనను ఎలానో నమ్మించగలిగాను.

ఆయన ఆరాత్రి మా యింటఉండి మర్నాడు ఉదయం రైలును అందుకున్నారు. రాత్రిలో చాలాభాగం తమ్ముడిగురించి తమ కుటుంబ చరిత్రగూర్చి చాలా చెప్పారు. ఒక ప్రశ్నకు జవాబుగా తమ మరదలు ఇంకా పుట్టింటనే ఉన్నదనీ వాళ్ళంతకన్నా తిక్కమనుష్యులనీ చెప్పారు. పిల్లడు పోయాడట. ఆ విషయం వ్రాస్తే చూడటానికైనా రాజశేఖరం రాలేదట. తాను కఠినంగా ఉత్తరం వ్రాసి పోస్టుచేసిన మరునాడే తనకి ఉత్తరం తమ్ముడి దగ్గరనుండి వచ్చింది.

విషయమంతా విని నేనొక నిట్టూర్పు పుచ్చాను.

రాజశేఖరంగారు ఏల ఇల్లు విడిచినారో ననేదానిని గురించి ఏవో సత్య సన్నిహితములో దూరములో అయిన అభిప్రాయాలేర్పరచుకో గలిగాను. కాని ఆయన భవితవ్యంలో ఏంచేయదలచుకున్నాడో మాత్రం ఎంత ఆలోచించినా బోధపడలేదు. ఇంతట్లో ఆయననుండి ఒక పెద్ద కవరువు ఉత్తరం వచ్చింది. చాలా ఆత్రతతో విప్పిచదివాను.

అప్రస్తుతములైన అద్యంతాలు విడుస్తే అది ఇట్లా ఉంటుంది.

"...............................

నేనీ ఉత్తరం వ్రాయటంలో అంతర్యాలు రెండు.

మొదటిది నేను క్షేమంగా ఉన్నానని మీకు తెలియచేయ గోరటం. రెండవది మూడేండ్లక్రితం మీరు వ్రాసిన ఉత్తరానికి ఇంతవరకూ వ్రాయలేని సమాధాన్ని ఇప్పుడు వ్రాద్దామని బుద్ధి పుట్టడం!

మీరు బహుశా మానవుడు సామాజిక జీవిఅనీ అతని కష్ట సుఖాలూ ఆనంద విషాదాలు లక్ష్యాలు సాధించటం సాధించలేక పోవటం ఒక్క అతని ప్రయత్నంమీదనే ఆధారపడి ఉండవనీ బయటిచూపులకు వాని పగ్గాలు అతని చేతులలోనే ఉన్నట్టు కనుపించినా అవి నిజంగా అతని చేతులలో లేవనీ గ్రహించగలిగి ఉండరు. అందుకు కారణం మళ్ళా మీ రిప్పుడు పొరపడుతున్నట్టు మీ ప్రయత్న లోపంవలన మాత్రమే కాదు. మీ పుట్టుకా మీకై ఏర్పడ్డ జీవనపథం అందుకు అనుకూలమైనవి కాకపోవడం. అంతే.

నేనుకూడా ఆదిలో జీవితం గురించి ఇంచుమించు ఇట్టి అభిప్రాయాలతోనే బయలుదేరాను. కాని నా జీవితపు టనుభవాలు—అచిర కాలంలోనే నా పొరపాటును బయట పెట్టసాగాయి.

మా తలిదండ్రులు నా కారేండ్లు నిండకముందే పోయారు. ఏ తత్ఫలితంగా నేను పడ్డ శారీరక మానసిక యాతనలు ఎన్నో ఉన్నవి. వాటిని అదుపులోపెట్టి ఉండటానికి నా కేమాత్రం అవ కాశం ఉన్నదంటారు?

మా నాయనమ్మ అన్నయ్యా మామయ్యా కలసి నా పెండ్లి చేశారు. నా కేమాత్రమూ సరిపడని ఆ అమ్మాయితో. కాస్తయినా ప్రేమలేకుండా అనుక్షణం ఆమెతో ఘర్షణపడుతూనే అస హ్యించుకొంటూనే నా సంస్కారానికీ నీతినిగూర్చి నాకున్న అభిప్రాయాలకూ పూర్తిగా విరుద్ధంగా ఆమెతో కాపురంచేసి ఒక బిడ్డడి జన్మకుకూడా కారణమయ్యాను. అది ఎంత దురదృష్టఘటనో ఊహించగలరు. అది అలా కాకుండా చేయటం నా చేతులలోనే ఉన్నదంటారా?

మన జీవితముల పగ్గాలు మన చేతులలోనే లేవు. ఈ సృష్టి నంతటినీ ఏదో లేక ఏవో సూత్రాలకు లోబడి పాలించే ఒక మహత్తర శక్తిచేతులలో కొన్ని ఉన్నవి. ఏది సత్యం—ఏది సత్యం! ఏది ధర్మం—ఏది ధర్మం! ఏది న్యాయం—ఏ దన్యాయం! అంటూ దేనినిగూర్చీ ఇదమిద్ధమని స్పష్టమైన అభిప్రాయాలు లేకుండానే వ్యక్తుల ప్రవర్తననూ ధర్మాన్నీ నీతినీ న్యాయాన్నీ బహుతీవ్రంగా విమర్శిస్తూ గ్రుడ్డివారి గొడవగా గోలచేసే సమాజం చేతిలోనూ—కల దశదిశలకూ పరుగుగూ పదిమార్గాల ఆ సమాజాన్ని నడిపించ యత్నించే తిన్మార్గదర్శకులైన మేధావంతుల చేతులలోనూ కొంత ఉన్నది.

అన్నిటినీ మించి చర్మచక్షువులనే కాక జ్ఞానచక్షువులను కూడా మోసంచేసే మహత్తర ఇంద్రజాలం—ప్రపంచంనే డాక్రియించివున్న వివిధానర్థ హేతుభూతమైన ఆర్థికవిధానం చేతిలో చాలా ఉన్నవి. మనచేతిలో ఉన్నది తక్కువలో అతి తక్కువ.

మీరు నా ఆర్థికదుస్థితిని చక్కబరచుకోవటానికి కొన్ని మార్గాలు సూచించారు జ్ఞాపకం ఉన్నదా? ఇంచుమించు అవన్నీ మీరు నాకు వ్రాయకముందే ప్రయత్నించి ఉన్నానంటే నమ్ముతారా?

ఏం ఖర్చులు తగించమన్నారు నన్ను! తిండా? బట్టా? ఇల్లద్దా? తక్కువ పాలు పెరుగు ఖర్చులా? ఏది? ఏది? సంవత్సరాల కొలదీ ఆలోచించి చేతకాక విడిచిపెట్టుకొన్న ఆలోచనలవి. ఆరేళ్ళక్రితం శేరుబియ్యం వెల ఐదుఅణాలు. పదహారు ఔన్సుల రేషను ఇచ్చేవారు.

ఆ దినాలలో సరిపోయిన డెబ్బైరెండు రూపాయలూ శేరు ధర ఎనిమిదణాలూ ఎనిమిది ఔన్సుల రేషనూ ఇచ్చి తక్కిన బియ్యం బ్లాక్ మార్కెట్‌లో శేరు రూపాయిన్నరకు కొనుక్కోమన్న రోజులలో మిగిలినవాటి ధరలుకూడా ఆ రేటున పెరిగిపోయిన రోజులలో ఏ నిష్పత్తిలో నా ఖర్చులు తగ్గించుకుంటే సరిపోతుం దంటారు. ఈ పరిస్థితిని అదుపులో పెట్టుకోవటం మన చేతులలోనే ఉన్నదంటారా?

రెండవది ఆదాయం పెంచుకోవటమన్నారు. ఎలా? ఏంచేసి? పార్టు టైమ్‌జాబ్ చూచుకొనా, కోమటికొట్లలో పద్దులువ్రాశా? ప్రైవేట్లు చెప్పుకొనా? అన్నీ ప్రయత్నించాను. అన్నిటికీ ఇంతకు ముందే ఎవరో సిద్ధపడిఉన్నారు. వాని కిలాటి ఊళ్ళలో ప్రత్యేకంగా వానిపైనే ఆధారపడి జీవించే మనుష్యులుంటారు. ఇంకేది దా రంటారు?

ఇవన్నీ ఎలాంటి ఊహలంటే కోతులు మిణుగురుపురుగులను పట్టుకొని చలికాచుకొన యత్నించటంవంటివి. నేను మీకన్నా పిచ్చి పిచ్చి ఊహలకుపోయాను. చాలాకాలం యాతనలు పడి పడి ఆలోచనలకు పెట్టబడి తెలుసుకున్న విషయమిది.

మానవుని సౌఖ్యానందాలు రెండురకాల శక్తులపై ఆధారపడి ఉన్నవి. ఒకటి అధిమానవశక్తులు. రెండవది మానవశక్తులు. మొదటి వానిని సుముఖం చేసుకోగలగటం విషయమై నా కింకా సందేహా లున్నా రెండవరకం వానినిగూర్చి నా అభిప్రాయాలు కొన్ని ఉన్నవి.

ఈ పృథివిపై సమస్త సంపదలూ ఉన్నవి. ఈ సంపదలపై—భూమిని బుట్టిన జీవరాసు లన్నిటికీ హక్కున్నది. బలవత్తరమైన జీవులు కొన్ని బలహీనమైన వానిని తమ స్వార్థం దురాశా హేతువులుగా తక్కినవానిని వంచించి అన్యాయం చేస్తున్నవి. తక్కిన జీవరాసులలో కన్నా ఇది మానవులలో ఎక్కువ స్పష్టంగా నేను చూడగలుగుతున్నాను.

మానవుడు పుట్టినదాది నేటివరకూ యీ అన్యాయాన్ని అరికట్టడానికి అవిరామంగా ప్రయత్నం జరుగుతునే ఉన్నది. దాని ఫలితమే ఇన్నిన్ని మతాలు ఇన్నిన్ని రకాల ప్రభుత్వాలు ఇన్నిన్ని న్యాయశాస్త్ర గంథాలు ఇన్నిన్ని తదితర మహాగ్రంథాలు ఇన్ని కళలు శాస్త్రాలు తంత్రాలు ఆయుధాలు సమస్తం.

కాని ఇవన్నీ ముసుగులో గ్రుద్దులాటలుగానే సాగుతూ వచ్చాయి. నవయుగం దీనిన్ని బహిరంగం చేసింది.

ఇప్పుడు నా జీవితపు దుస్థితికి హేతువు తెలుసుకున్నాను.

నేటి మానవసమాజంలో అటు కండలు కరిగించీ సంపద నుత్పత్తిచేసేవారూ ఇటు మేధాశక్తి వినియోగించి మానవసమాజపు సృజనశక్తుల నభివృద్ధిచేసేవారూ అందుకు తోడ్పడేవారూ—వీరందరి ఆరోగ్యం ఆనందం సంస్కారం పరిరక్షిస్తూ ఉత్తమగతు లేర్పరచేవారూ అర్థాకలితో అణుచుకున్న కోర్కెలతో ఆసంపదలో తక్కువలో తక్కువ పొందుతూ బ్రతుకుతున్నారు. వారిశ్రమ జన్యమైన సంపదలో అత్యధిక భాగం మరికొందరు అనుభవిస్తున్నారు.

చిత్రమేమంటే సంపద నెక్కువగా అనుభవిస్తున్నవారు దానికైచేసే శారీరక పరిశ్రమగాని మానసిక పరిశ్రమగాని ఏమీ లేకపోవటం. వీరిలో ఏకొద్దిమందోతప్ప చాలామంది, తమకా సంపద లెలా లభిస్తున్నాయో పోయినప్పు డెలా పోతున్నాయో కూడా ఊహించలేనంత, ఊహించటానికి ప్రయత్నమైనా చేయలేనంత మూర్ఖులు.

ఈ ఇంద్రజాలంకంతటకూ కారణం ఇప్పుడు మానవు డనుసరిస్తున్న ఆర్థికవిధానం.

ఈ జూదగొండి ఆర్థికవిధానం హస్తాలలో ఇరుక్కొని ఉన్నంతకాలం మన జీవితాలను మనం ఆనందమయంగా చేసుకోలేం.

మీరేమంటారూ? కోరికలు చంపుకోమంటారు. మనకన్నా తక్కువవారిని చూసి వాళ్ళకు లేనిది మనకున్నందుకుగర్వించమంటారు కలవానిని చూచి అసూయ పడరాదంటారు.

ఇవి మీరు ఆలోచించి చెప్పినవి కావు. చెప్పగా విని చెప్పేవి.

శోచనీయమైన సంగతేమంటే ఈ ప్రచారం అర్థాకలితో మాడుతూ కోరికలు కొనసాగించుకోలేనివారు తమలో తాము చేసుకోవటం నిస్పృహావంకకు పరుగులెత్తడం.

వీరందరూ సంపద నెక్కువగా అనుభవించేవారు — మనకన్నా ఏవిధంగా అర్హులని ఎల ఆలోచించరో తెలియదు. వానిని ఉచితమైనరీతిని పొందటానికి మార్గమేమా అని ఆలోచించరు.

మనుష్యులు దైవభీతీ పాపభీతీ పోగొట్టుకున్నారు. అధర్మభీతి పేర ధర్మాన్ని చూచి ఎల భయపడతారో తెలియదు. మరికొందరు ధర్మాధర్మాలను గుర్తెరిగికూడా అంతరంగంలో ధర్మపక్షవిజయాన్నే పరికాంక్షిస్తూ కూడా కురువృద్ధుల ధోరణిలో తీరా సమయం వచ్చేసరికి ఎందుకు అధర్మపక్షాననే నిలచిపోరాడ సన్నద్ధు లవుతారో తెలియదు.

ఇంకేం చెప్పమన్నారు?
తక్కిన విషయాలు తెలిసే ఉంటాయి.
..............................”

అంటూ మరి రెండు వాక్యాలతో ఉత్తరం ముగించబడింది. ఎటువంటి మనిషి ఏ స్థితిలో ఎక్కడ మునిగి ఎక్కడ తేలాడో ఆలోచిస్తూ నేనలానే దిగాలుపడి కూర్చుని ఉన్నాను.

---

# విజయ వసంతము ★

శ్రీ బులుసు వెంకటేశ్వరులు

ఈనవీన వసంత మీ నామహాంధ్ర భూ
మీతలంబును స్వర్గమే యొనర్చె
పరపాలనా మహోపతనంబునుం బోలె
రాలిపోయినవి కారాకు లెల్ల
విజయ చిహ్నంబులై విలసిల్లు చున్నవి
జిలుగు బసందు గొం జిగురు లెల్ల
నవనవస్ఫూర్తి విన్ననువొప్ప బ్రత్యణు
భూభాగమునయం దపూర్వ భంగి

ఇది వసంతమే? యిట్టి సంపద గతించి
నట్టి ఋతువుల ననుభూత మయ్యెనే యొ
కింతయైన? నోహో తెల్పు నిది మహాంధ్ర
రాష్ట్ర లక్ష్మి శుభాగమ ప్రథిత వేళ

శమ్మని కంఠమెత్తి యధికమ్మగు మాధురి జిమ్మ నెల్లడిం
దమ్ములు పల్లవింప నమృతంబుల సోనలు క్రుమ్మరింప బూ
తమ్మగు మావికొమ్మను రుతమ్మొనరించు స్వతంత్రమైన దే
శమ్మున స్వేచ్ఛబాడు కవిచందమునన్ బరిపుష్ట మల్లదే.

ఆరామంబున బాడు కోయిల విశిష్టానూనకంఠంబులో
నూరున్ నూత్న రసప్రవాహములు పెంపొందున్ మహా మాధురుల్
జేరన్ జుజ్జుచు బాంధలోకము ప్రహర్షింపన్ నితాంతంబు
విస్ఫారం బొచు వినూత్నమైనరుతి సంస్పందించు డెందంబులున్.

కాయలు కాచిపోయినవి కన్నులు కన్గొన నాంధ్ర రాష్ట్ర ల
క్ష్మి యపరూప దర్శన విశిష్ట శుభోదయమున్, మరింక నె
ప్డోయని మానసంబులును నుజ్జన నూటలు నూరుచుండ శో
భాయుత సద్వసంత నవపల్లవముల్ పొడసూపె నిప్పుడే

చక్కనై యొప్పు నాంధ్ర భాషాలతాంగి
నల్గడల పల్లుకొన నునఘ్నములు లేక
వాడి వెల్వెల్ల నగుచుండి నేడు పరమ
శుభ వసంతంబునన్ క్రొత్త శోభ నందు

ఆలాపింపు స్వతంత్ర పాంధ్ర కవిరాజా! ముక్తి గీతావళుల్
కాలంబింక వృథా యొనర్పక యశఃకామిా! పవిత్రాంధ్ర భా
షా లాలిత్య మనోహరత్వ సుమనస్సందోహ సమ్మోహితల్
లీలామాత్రగ జాటు మెల్లెడల లేలే లెమ్ము వైతాళికా!

అదె యరుణోదయమ్ము హృదయంగమమయ్యె స్వతంత్ర భాను డ
ల్లదె వెనువెంటనే యుదయమౌచు దమోహారతన్ జెలంగు నీ
కిదె సమయమ్ము స్వాగతము నిమ్ము నివాళు లొనంగుమయ్య! అ
భ్యుదయ మహాంధ్ర రాష్ట్ర సుమహోన్నత కీర్తులు నింగి ముట్టగన్

తెలుగుందల్లికి దొల్తగద్దెయిడి భక్తి శ్రద్ధ తాత్పర్యమున్
విలసిల్లంగ నమస్కరించి పరమావేశంబునుం దాల్చి త
ద్విలసత్పాదయుగాంబుజస్మరణమే విఖ్యాతి మాకంచు గ
న్నులకున్ భక్తిని నద్దుకొందు సకలాంధ్రుల్ భక్తిసంయుక్తులన్

భుక్తిని ముక్తి నిచ్చి యిహముం బరమున్ సకలంబు నీయగా
శక్తిగలట్టి తల్లి మనశారద, తొతలనాటినుండి సం
సక్తి నభీప్సితార్థములు సర్వమొసంగిన యాంధ్ర వాణికిన్
భక్తిని మ్రొక్కి నూతన జవంబును జీవమునందు డెల్లరున్

విజయ వసంత వేళ అతి విశ్రుతమైన ఉగాదిపూట—ది
గ్విజయ మభీష్ట సిద్ధి తనబిడ్డల కీయగ వచ్చునట్టి యాం
ధ్రజయరమన్ బరమ తత్పరతన్ గయిసేయుకోసమై
సజల వలాహక ధ్వనులు సల్పి యొనంగుడు స్వాగతంబులన్.

# సారంగపాణి, క్షేత్రయ్యల అసభ్యరచనలు

★

**"శీరపాణి"**

"కావ్యాలాపాంశ్చ వర్జయేత్" — "కావ్యప్రపంచం ఛండాలం, అటోలికి పోగూడదు" —

ఇవి, అవివేకులూ, అజ్ఞానులూ అన్న మాటలుగావు; సమస్తం తెలిసిన ప్రాజ్ఞులూ, పెద్దమనుషులు అన్నమాటలు; అంటున్న మాటలు. అందుచేత వాటిని ఖాతరీ చెయ్యకుండా, ఛాందసపు ప్రసంగాలక్రింద కొట్టిపారేసి, వినిపించుకోకుండా రొమ్ములు విరుచుకు తిరగటం కేవలం మౌఢ్యమనిపించుకుంటుందిగాని మరొకటి గాదు. ఒక విమర్శ అనేది వచ్చినప్పుడు, వెనక్కి తిరిగి చూసుకుని, అలాంటివాక్యం పుట్టటానికి గల కారణం యేమిటని, ఆత్మవిమర్శ చేసుకోవలసిన అవసరం సాహిత్యరంగంలో కృషిచేస్తున్న ప్రతి పెద్దమనిషిమీదా వుంటుంది.

సాహిత్యరంగం, ఇంత గర్హనీయమైనదిగా భావింపబడటానికి కారణం ఏమిటి? నిజంగా సాహిత్యరంగంలో అలాంటి కశ్మలంవుందా? ఎందుకువుంది? వుంటే దాన్ని క్షాళనంచేసుకోవటమెలా? ఇవి సాహిత్యకారులంతా సమాలోచించుకోవలసిన సమస్యలు.

సంఘంలోని వ్యక్తులే సాహిత్యాన్ని నిర్మించుతూవుంటారు గనక, సంఘంలో మోస్తరుగానే సాహిత్యరంగంలో కూడా అనేక హేయమైన సంప్రదాయాలు పుట్టుకు రావటానికి అస్కారంవుంది. అలాంటివి పొడచూపినప్పుడు, వాటిని ఛేదించి, సాహిత్యక్షేత్రం సస్యశ్యామలం కావటానికి ప్రయత్నించాలిగాని, అలాంటి అవినీతి నంతా సమర్థించటానికి పూనుకోవటం అనర్థదాయకం. మనచేలో ఉమ్మెత్తలూ, జిల్లేళ్ళూ మొలిస్తేవాటిని దున్నిపారేసి ఆక్షేత్రాన్ని వ్యవసాయయోగ్యంగా చేసుకుంటాంగాని, అవన్నీ కల్పవృక్షాలనీ, అదొకనందనోద్యానమనీ పొగుడుతూ కూర్చుని మన్ని మనం మోసంచేసుకుని, యితరులను మోసంచెయ్యటానికి ప్రయత్నించుటవల్ల కలిగే ప్రయోజనం యేమీ వుండదు — నవ్వుబాట్ల పాలుగావటం తప్ప.

మన సాహిత్యరంగంలో ఉమ్మెత్తలూ, జిల్లేళ్ళూ అనేకం పెరిగివున్నయ్. ఈమాటను అంగీకరించినంత మాత్రంచేత వచ్చే గౌరవభంగం ఏమీలేదు. పొరపాట్లువచ్చినా తిరిగి సర్దుకోగల యుక్తాయుక్త పరిజ్ఞానం కలవారనీ, తెలివిగలవాళ్లనీ లోకం గ్రహించటానికి వీలవుతుంది. ఇలాంటి కుత్సితంతో సాహిత్యంగా పరిగణించటంలేదని చాటి, సాహిత్యంకేవలం లోకకల్యాణ దృష్ట్యామాత్రమే నిర్మింపబడుతున్నదనీ, ప్రాజ్ఞులైన వారికి దీనియందు హేయభావం వుండ నక్కరలేదనీ నచ్చచెప్పి, పూజ్యులైన అలాంటివారి ఆశీరామోదాలు తిరిగి సాహిత్యరంగానికి లభించేలా చేసుకోవలసి వుంటుంది.

సాహిత్యరంగంలో అనాదిగా ఒక సంఘర్షణ సాగుతూవుంది. భోగవిలాసాలలో మునిగి తేలుతూవుండే రాజాది పూరుషులూ, తదాశ్రయులూ ఉపజీవులూ అయిన సాహిత్యకారులూ, సాహిత్యరంగాన్ని కేవలం, విలాస విభ్రమాలకూ, కామోన్మాదాలకూ, ప్రోత్సాహజనకంగా వుండే దిగంబర కామకూటంగా (న్యూడిస్టు కాలనీ, తయారు చెయ్యాలని అనాదిగా ప్రయత్నించుతున్నారు. సాహిత్యానికి మరో యితరప్రయోజనం యేమీ వుండకూడదంటూ కొన్ని దుర్వాదాలు లేవదీశారు. తమ ధోరణులను సమర్థించుకోవటానికి "శృంగార ఏక ఏవరసః" (భోజుడు) ఇత్యాది అలంకార సూత్రాలను కూడా నిర్మించి అధికారికంగా మాట్లాడటానికి తెగించారు. అధికారిక ధనికవర్గాల పలుకుబడివల్ల సాహిత్యరంగానికి యెప్పటికప్పుడు యిలాంటి దుర్గతిపడుతున్నా, అదృష్టవశాత్తూ ప్రజాజీవితంలో ధర్మప్రతిష్ఠాపన చేయటమే సాహిత్యానికి పరమప్రయోజనమని నమ్మినవారూ, జగత్కళ్యాణమే పరమాశయంగా సాహిత్యసృష్టి చేసినవారూ, మహామహులు కొందరు ఉంటూ వచ్చారు. రాజాది పూరుషులూ, తదనుయాయులూ, ఇలాంటి మహామహులను హేళనచేస్తున్నా, లెక్కచేయక, అమోఘవచస్కులై నిర్దుష్టమైన సాహిత్యపథాన్ని నిర్మించారు. మహామహుడు భవభూతి 'ఏకోరసః కరుణఏవ' అనే పరశువును చేతబట్టి దుర్వివాద విషవృక్షాల నన్నిటినీ నిర్మూలించి, సాహిత్యరంగాన్ని నిష్కంటకంగానూ, వ్యవసాయయోగ్యంగానూ చేశాడు. నేడు, భవభూతి లేకపోయినా ఆ పరశువు సాహిత్యక్షేత్రంలో శాశ్వతంగా మిగిలివుంది.

కాగా, రాజాదిపూరుషులూ, తదనుయాయులూసాహిత్యరంగాన్ని ఉద్ధరించారని ప్రచారం చెయ్యటం, ఆరకం మనుషులు నిర్మించిన అవినీతి సంప్రదాయాలను సమర్థించటానికి ఉపకరించు

తుందిగాని, ఈ ప్రజాస్వామికయుగంలో, సాహిత్యక్షేత్రం యొక్క భవిష్యత్తుకుగాని, ప్రజాజీవితంయొక్క భవిష్యత్తుకుగాని యేవిధంగానూ తోడ్పడదు.

క్షేత్రయ్య పదాలూ, సారంగపాణి పదాలూ, సభాపతయ్య పదాలూ ఇత్యాదయః జావళీలు, పూర్వం, యెక్కడో, సాని గూడేలలోనూ, పానకూటాలలోనూ మాత్రమే వినిపిస్తూవుండేవి, భోగంవాళ్లూ, దేవదాసీలు వగైరా ఈ బాపతు జనంమాత్రమే వీటిని పాడుతూవుండేవాళ్ళు; ఈనాడు ఇవి సంసారికొంపల్లోకీ రేడియో స్టేషన్లలోకీకూడా ప్రాకి, సంసారస్త్రీలు సహితం

'కుప్పుసములో చేయినుంచీ
కుచములనుబట్టీ,
తప్పుకార్యము జేసిమోపీ,
చప్పరించీ పోయెనమ్మా—

అంటూ పాడుతూవుంటే, పెద్దమనిషి అయినవాడు ఈ గందరగోళమేమిటి? అని గిజాటు పడవలసిన పరిస్థితి యేర్పడ్డది. ఈ రకం జావళీలకు ఎన్నడూలేని పంథాలో ఇలాంటి సభ్యత ఎలా కలిగింది? చాటునా మాటునా వుండే ఈ అవినీతిని బజారులో ఘనతకు తెచ్చిం దెవరు? ఎందుకు తెచ్చారు?

ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పాలంటే, నేటి అధునాతన సాహిత్య చరిత్రను కొంత అవగాహన చేసుకోవలసి వస్తుంది.

ఇటీవలగా సాహిత్యరంగంలో చిత్రమైన సంప్రదాయం ఒకటి బయలుదేరింది. ఇది నిజానికి, జాతీయమైన సంప్రదాయం కాదు. విదేశాలనుంచి దిగుమతి అయిన సరుకు; దీన్ని "భావ కవిత్వం" అనటం కద్దు. ఈ సంప్రదాయంలో శృంగారానికి మినహా మానవ జీవితానికి సంబంధించిన తక్కిన వ్యవహారాలకు వేటికీ స్థానం కనుపించదు. ప్రతి కావ్యం ప్రేయసీప్రియుల కాముక జీవితానికి సంబంధించిన వెర్రిఘోషగా వుంటుంది. నాయికానాయకుల తరతమభేదాలనుబట్టి 'త్రిజగతీ పతి కోటీర దివ్యరత్నరాజి నేలెడి వజ్రతురాయి' ఊర్వశి మణికూజితాల దగ్గిరనుంచీ, ఎంకి నాయుడుబావల మోట పరాచికాలదాకా వీటిలో వినిపించుతూ వుంటై. ఇదంతా చాలావరకు 'సబ్జక్టివ్ పోయిట్రీ'; అంటే ఎవడి ప్రియురాలి ఘోష వాడు చెబుతాడు, ఇతర ప్రపంచంతో వాళ్ళకి సంబంధం లేదు.

ఇంతవరకూ, ఇది బాగానేవుంది, ఎవళ్ళఘోష వాళ్ళు పడుతున్నారంటే యెవళ్లకుమాత్రం యేమిటి అభ్యంతరం. కాని అక్కడితో ఆగారుకాదు; ఈ ఆత్మఘోషలన్నీ అచ్చువేసి జనం మీదవేసి రుద్దారు. ఇదంతా ఉత్తమసాహిత్యమంటూ ప్రచారాలు చేసి అమాయకులైన యువతీయువకులను లేనిపోని వెర్రిమొర్రి భ్రమలలోకి నడిపించి అనేక అనర్థాలకూ సాంఘిక అరాచకానికీ దారితీశారు.

ఈ భావకవిత్వప్రభావంవల్ల, దేశంలో పడుచువాళ్ళ కాపరాలు అనేకం భ్రష్టమయాయనేది దాచుకోవటానికి వీల్లేని చారిత్రికసత్యం. సాహిత్యానికి మంచిచెడూ ప్రయోజనాలు వుంటాయని గుర్తించటానికి మనసొప్పని వారు ఈసత్యాన్ని అంగీకరించపోతే పోతారుగాక, కాని యీ విషయం అందరికీ బహిరంగంగా తెలిసినసంగతే. దీని పరిణామం, దిన దినం యింకా వాడవాడల్లోనూ చూస్తున్న సంగతే!

ఇందువల్ల తెలుగు నాటకవులన్నా, సాహిత్యవేత్తలన్నా కొంత ఏహ్యభావం యేర్పడ్డానికి అవకాశం కలిగింది.

ఈ ప్రణయకాండలకు తోడు, వీరిలోకొందరు రచయితలు 'ఫ్రాయిడ్' సిద్ధాంతాలను అర్థంలేని వెర్రి నినాదాలరూపంలో జనానికి అందజేసి దాంపత్యజీవితానికి వున్న స్థాయిని ఛిన్నాభిన్నం చేశారు. నిజానికి ఫ్రాయిడ్ సిద్ధాంతాలను శాస్త్రవిజ్ఞాన దృష్ట్యా సమన్వయపరచి, దాంపత్య జీవితంలో వచ్చేదైనందిన సంఘర్షణలను అవగతంచేసుకుని సమన్వయింపచేసుకోవటానికి అనువుగానూ, దాంపత్య జీవితం బలపడటానికి అనువుగానూ, క్రమమైనపద్ధతిలో అందజేయగలిగివుంటే యెంతో సత్ప్రయోజనం కలిగేది. అలాంటిదేవీ లేకుండా దాంపత్యజీవితం మూలచ్ఛేదమై పోయేలాగు విధ్వంసక నినాదాలరూపంలో అందించటంతో చాలా కల్లోలం జరిగింది.

ఈభావకవిత్వ సంప్రదాయంయొక్క అనర్థాన్ని గుర్తించటంవల్ల యిటీవలి సాహిత్యకారులలో కొందరు, ఈ పంథాను ఖండించుతూ ఒక నూతనోద్యమాన్ని లేవదీశారు. ప్రజాక్షేమం సాహిత్యానికి పరమ ప్రయోజనంగా వుండాలనే నినాదం ప్రారంభించారు. ఈ నినాదాన్ని అంగీకరించితే వ్యక్తిగత భావనారూపమైన భావకవిత్వం అనేదానికి అస్తిత్వం వుండటానికి వీల్లేదు, అందుచేత ఈ ఉభయ సాంప్రదాయాలమధ్యనూ సంఘర్షణబయలుదేరింది; ఈ సంఘర్షణలో తమ స్థానాన్ని కూడదీసుకోవటానికి, భావ కవిత్వ సంప్రదాయంవారు యితరత్రా బలాన్ని చేకూర్చుకోవటానికి ప్రయత్నించారు.

మున్ముందు, ఇది దేశీయ సంప్రదాయాల పరిణామమేనని నిరూపించుకోవటానికి ప్రయత్నించారు. ప్రాచీనులైన సంస్కృతాంధ్ర రచయితలలో తమ పంథాకు కొంచెం పోలికలో వుండే రచనలకోసం అన్వేషణ ప్రారంభించారు. చాటునున్న జయదేవుణ్ణి బజారులోకి లాగారు. భక్త జయదేవుడూ లక్ష్మణసేన మహారాజుదగ్గిర నాట్యకారుడుగావుండే ఈ జయదేవుడూ ఒకడేనని బుకాయింపులు ప్రారంభించారు. 'పద్మావతీ చరణ చారణ చక్రవర్తి' గాథను, గేయరూపికలుగా వెలయించారు. కాశ్మీర్ మొదలైన దూరదూర ప్రాంతాలనుంచి 'నోణకజాయ' వగైరా వ్యభిచార గాథలను దిగుమతి చేసుకుని వాటన్నిటికీ పావిత్రాన్ని ఆపాదించటానికి ప్రయత్నించారు. క్షేత్రయ్య పతితపావనుడన్నారు. మధురభక్తి భావనలో కేవలం రాధకు అపరావతార మన్నారు సభలు జరుపుతున్నారు. మీమాంసలు సారించుతున్నారు. పూజలూ పురస్కారాలూ చేస్తున్నారు. త్వరలో గుళ్ళూ గోపురాలూ కూడా కట్టవచ్చు.

క్షేత్రయ్య మహామహుడని సాగుతున్న ఈ ప్రచారంలో నిన్న మొన్నగా, మరికొన్ని కొత్తమాటలు కూడా వినిపించు

తున్నయ్—"సారంగపాణి కార్వేటినగర వేణుగోపాలునిపై ప్రసిద్ధములైన పదములు వ్రాశారు"—"గాయకులు సారంగపాణి పదాలను విరివిగా పాడకపోవటం శోచనీయం"—ఇత్యాదయః.

ఈధోరణులనుబట్టి చూస్తే, వీరికి, క్షేత్రయ్య పదాలతో పాటు సారంగపాణి పదాలనుకూడా వెలుగులోకి తెచ్చి, వాటికి కూడా సభ్యతను చేకూర్చాలనే అభిలాషవున్నట్టు అనుకోవలసి వస్తోంది. అందుచేతనే సారంగపాణి క్షేత్రయ్యల ఉభయుల రచనలనూ కలిపి, యిప్పుడు ఇంత తొందరగా యీ పరామర్శ చేయవలసిన అవసరం కలిగింది.

క్షేత్రయ్యపదాలలోగాని సారంగపాణి పదాలలోగాని, అసలు 'మధురభక్తి' సాంప్రదాయమనేది ఒకటి వున్నదని వాదించటానికి వున్న ఆస్కారమల్లా "మువ్వగోపాల," "వేణుగోపాల"అన్న మకుటాలు. అందుచేత వీటి సంగతి ముందు కొంత పరిశీలించి చూదాం.

క్షేత్రయ్య, 'మువ్వగోపాల' మకుటం ప్రయోగించటానికి కారణంగా ఒక కట్టుకథ చెబుతున్నారు. టూకీగా ఆకథ 'కృష్ణాజిల్లా మొవ్వగ్రామంలో మొవ్వ వరదయ్య అనే ఒకపరమ భక్తుడుండేవాడు. ఆయన, తాను రాధననుకుని ఆ గ్రామంలో వేంచేసివున్న గోపాలస్వామిని మధురభక్తి పద్ధతిలో ఉపాసించి భగవత్సాక్షాత్కారం పొందాడు. అనంతరం దక్షిణాదినవున్న అన్ని పుణ్యక్షేత్రాలూ తిరిగి ఆయాదేవుళ్ళందరి మీదాపాటలు వ్రాశాడు. అందుచేత క్షేత్రయ్య అనిపేరు బడ్డాడు'—

కథాకల్పన బాగానేవుందిగాని, దీనికి కొన్ని వ్యాఘాతాలు కనుపించుతున్నయ్! క్షేత్రయ్య పుట్టటానికి దాదాపు ఒకటిన్నర శతాబ్దాలకు పూర్వమే తిరుపతిపురవాసి తాళ్ళపాక తిమ్మక్క 'సుభద్రా కళ్యాణ'మనే గేయవాక్యంలో "మురవైరి వందిత మువ్వగోపాల" అని వ్రాసివుండటం చేతనూ, కార్వేటినగరంలోని వేణుగోపాలస్వామిని గూడా మువ్వల వేణుగోపాలు డనటం వున్నది గనుకనూ, 'మువ్వగోపాల' అనే మకుటం వాడినంత మాత్రంచేత క్షేత్రయ్యకూ కృష్ణాజిల్లా మువ్వగోపాలుడికీ రాధామాధవబాంధవ్యం ముడిబెట్టటానికి తగిన ఆస్కారం కనుపించటంలేదు. పైగా క్షేత్రయ్య యితర దేవుళ్లమీద వ్రాసిన పదాల చివరకూడా ఈ మువ్వలగోపాల అన్న మకుటం కనుపించుతోంది—"ఇనపురి మువ్వగోపాల", "కంచివరద మువ్వగోపాల", "కోవర్యూరి మువ్వగోపాల", "శ్రీరంగేశ మువ్వగోపాల"—ఇత్యాది ప్రయోగాలు విచ్చలవిడిగా కనుపించుతున్నయ్.

ఇటీవల క్షేత్రయ్య పదాలను ఆంధ్ర ప్రజానీకానికి అందజేయటానికి అనేక కష్టనిష్ఠురాలుపడ్డ శ్రీ విస్సా అప్పారావుగారు క్షేత్రయ్య కృష్ణాజిల్లా మొవ్వగ్రామం వాడేనని నిరూపించటానికి నానా తంటాలూ పడ్డారు. వారి ఉద్యమానికి మొవ్వగ్రామం వారు చాలా సాయపడ్డారు గనుక అలా ప్రయత్నించటంలో తప్పుకూడా మరేమీలేదు. తమ వాదానికి బలంగా 'మువ్వగోపాల' అన్న ప్రయోగంతోపాటు 'మోవ నాటగలిగిన' వగైరా ప్రయోగాలు యెత్తిచూపారు. కాని సొగసేమిటంటే, తమ వాదంలో బలం వున్నట్టు వారికే నిబ్బరం కలుగలేదో యేమో: 'ఏది యెట్లైననూ మువ్వగోపాలస్వామి మువ్వపురివాసి, అదే మువ్వ, అదే నేటిమొవ్వ, అదే క్షేత్రయ్యపుట్టిన చోటు.' అని ఊపిరిసలపకుండా ఉద్ఘాటించారు. నిజానికి 'మోవనాట కలిగిన' అనీ, 'మువ్వపురి వెలసిన' అని వున్నంతమాత్రంచేత ఈ వాదానికి చేకూరే కొత్తబలమేమీలేదు. ఎంచేతనంటే, చంద్రగిరి తాలూకాలో పూర్వం మువ్వలవారిపల్లె అని ఒకటి వుండేదని భోగట్టా కనుపించుతోంది. ఇదిగాక మూవనల్లూరనే గ్రామం మరొకటి వుంది. అందుచేత ఈ ఆధారంకూడా అస్తవ్యస్తంగానే వుంది.

కాని, నిజానికి క్షేత్రయ్య కృష్ణాజిల్లా మొవ్వవాడేనని నిరూపించటానికి యీ పాటలలో బలమైన ఆధారం ఒకటివుంది. ఆవిషయం శ్రీవిస్సా అప్పారావుగారికి యెందుకు తట్టలేదో బహు ఆశ్చర్యంగావుంది. తట్టకపోవడమో లేక ఆ విషయాన్ని క్రోడీకరించితే క్షేత్రయ్య పదాలలో వుండే కళ్మలాన్ని బహిరంగంగా అంగీకరించినట్టవుతుందని అనుమానించారో మనం ఊహించలేం. అదేమిటంటే: నిజానికి క్షేత్రయ్య ఈపాటలలోయిచ్చిన భోగట్టాయావత్తూ, దేవుడికి సంబంధించిందీకాదు దయ్యానికి సంబంధించిందీ కాదు. ఇదంతా కేవలం సానిగూడెపు భోగట్టా. 'సానెంపాటి' లంజదిబ్బల భోగట్టా. ఈ 'సానెంపాటి'లంజదిబ్బలు మొవ్వగ్రామానికి కూతవేటుదూరంలో వున్నయ్. ఇది పూర్వం పెద్దబోగం గూడెం. ఈసానిపేట లంజదిబ్బల విషయం శ్రీ అప్పారావుగారికి కూడా తెలిసివున్న సంగతే; తెలిసివుండి కూడా అంశాన్ని తమ వాదంలో ఎందుకు క్రోడీకరించక పోయారో తెలియదు.

క్షేత్రయ్య మొవ్వవాడేనని అంగీకరించటానికి మనకు ఎలాంటి అభ్యంతరమూ లేదు. క్షేత్రయ్య వ్రాసిందేమిటి? అన్నది మనకు ప్రధానంగాని అతను యేవూరు వాడైతే మాత్రం మనకు తగాదా యేమిటి ? క్షేత్రయ్య మొవ్వవాడంటే మనం అంగీకరించుతాం. కాని క్షేత్రయ్యకూ, ఆవూరిగుళ్ళోవున్న దేవుడికీ పుస్తికపెతామంటే మాత్రం పొసగదు. అలాటికథను కల్పించటానికి, క్షేత్రయ్యపదాలలోగాని యితరత్రాగాని యెటువంటి ఆధారమూ లేదు.

కచ్చితంగా క్షేత్రయ్య తన పదాలలో వ్రాసిందంతా సానెంపాడు లంజలసంగతి; డబ్బుకోసం వాళ్లుపడే తాపత్రయాలూ, వాళ్ళ యేత్పేయేడుపులూ, అది వుంచుకున్న విటకాణ్ణి ఇదీ, ఇది వుంచుకున్న విటకాణ్ని అదీ లాగటానికిచేసే సవతిపోరాటాలూ, మరుగు మందులు, మాయలూ, తీర్పుకత్తెల జంజాటాలూ, యివన్నీ పాటపాటలోనూ మనకు స్పష్టంగా గోచరించుతున్నయ్. ఆ ఆడపురుగులకు మానాభిమానాలు శూన్యం; ఆయా విటకాళ్లతో తమకు గల సాంగత్యానుభవాలు నడిబజార్లో నుంచుని బాహాటంగా చాటెయ్యగలరు. డబ్బు ప్రధానం; డబ్బుకోసం వాళ్లు యేమైనా చేస్తారు. ఏమైనా వాగుతారు. స్థాలీపులాకన్యాయంగా క్షేత్రయ్యరచనలలో యే ఒకటి రెండు పాటలు పరిశీలించినా విషయం కళ్ళకు కట్టినట్టు బోధపడుతుంది; మచ్చుకు:

(1)

[డబ్బు తాపత్రయాలు]

అందగాడు వౌదువులేరా - ఆదివరాహా!
అందుకైతే జాణవు - అల్లందుకైతే జాణవు - ఆది వరాహా
ముప్పెవగలు చాలించు - మొగవారు లేరె నీకులోన,
నవ్వగా బిలువ మనేవు - ఆదివరాహా
తప్పు సుద్దులకెల్లనే - తాళేదానను గాను
అప్పుడే విన్నవించినాను - ఆదివరాహా!
విటరాయ నీతో జేరి - వేగించిన నా సొమ్ము
అటమరించేది న్యాయమా - ఆదివరాహా
మటుమాయలు చాలించు - మాకియ్యవలసిన పైడి
అట్టుబెట్టి మాటలాడు - ఆదివరాహా!

(2)

[పెట్టుడు మందుల రాద్ధాంతం]

చెలియ పెట్టిన మందు
తల కెక్కె నాపక్క
కలువరింపక మోవి
గంటు జేసితి నమ్మ—

* * *

ఇచ్చిన నమ్మిక
లేమాయె నలనాటి
మచ్చిక లన్నియు
మరచితివా ?—
ముచ్చు మందులమారి
ముదితనవలె గాని
యచ్చోట నిన్నన
నగునా నా సామి !—
కలనైన నా యిల్లు
కదలని వానికి
చెలియ బెట్టిన మందు
తల కెక్కెనో!—

(3)

[బాల శృంగారం]

[డబ్బుకోసం వయసురాని ఆడపిల్లలను బలవంతాన విట కాళ్ళ దగ్గిరికి పడదోస్తుంటే వాళ్ళు వాడిలి గోలపెట్టడం ఈ క్రింది పాటలో అభివర్ణించాడు.]

నన్నేటికి బొమ్మనేరే వానివద్దకి
మిన్నక వానివద్దికి, మీరే పోరే
పడకింటికి రమ్మననే, నే రానంటే
కడు కెరపించి హుమ్మనెనే,
అమ్మనే వెరతు!—
ముచ్చకంటి యిపుడిపుడూ
వచ్చిన లేత చన్నులను
నొచ్చె ననగా బట్టెనే!
వద్దంటె వినక
మచ్చరాన గోరు బెట్టెనే—
వచ్చెద నంటే,
ముచ్చువగల దోవగట్టెనే
అమ్మ నే వెరతు!—
నెలత నమ్మిక లిచ్చి
యల మువ్వ గోపాలుడు
చెలిమితో నను దీసెనే,
కుయ్యేకు మని
బలిమి నోరు మూసెనే
పరవశమై, తెలియనైతి
నేమేమో జేసెనే—
అమ్మ నే వెరతు.

* * *

(4)

[బాలింత శృంగారం:]

పచ్చి యొడలి దానర
పచ్చియొడలిదాన, పాపడు నిలువడు
... ... ... ... ...
పట్టకురా రొమ్ము పాలంటు జేతుల
ఎటు లోర్తునూ పరు లేమందురు
పట్టబోతే మొరబెట్టును పసిబిడ్డ
అట్టె మనసు బిగబట్టుకో రెన్నాళ్లు
కారము దిన్నాను కరకరలాడేని
యూరేయి, శ్రీరంగేశుడ,
మారుకేళి కూడ
మా మువ్వగోపాల
ఆరడి బెట్టకు మారి నాసామి!

* * *

వచ్చెను నీ చెలికత్తెతనము!
ఎనయ లేదని నాతోనంటివి, వా
డేమి కావలెనో మచ్చుకంటి!
వినవే! యింత సేపేల యుంటివో
వెలది నీ మాయనెల్ల గంటి;
తోడి తెచ్చెదనని యందుజేరి, వాని
గూడుదురటే దోసకారి!
మోడితో నీవిపుడున్న దారి తెలిసె
మువ్వగోపాలు పొందుగోరి ॥ఈ॥

(7)

[అంతంతమాత్రం మగవాడైతే, సానింపేట భడవాలు యేడిపించే పద్ధతులు]

ఒక్కసారికే యీలాగైతే
ఓహో ఏమిటి రతిరా?
మక్కువ దీర్చర మా మువ్వగోపాల—
సాక్కియున్న నీ సొగసది యేమిర?—
నెమ్మొగమున నీ బడలిక లేమిర?
నీటుకాడ రొమ్మదరే దేమిర?
కమ్మని వాతెర కందిన దేమిర?
కన్నుల నిద్దుర గమ్మె దేమిర?
తిన్నని పలుకుల పలుకవ దేమిర?
తెలిసి తెలియకున్నావ దేమిరా?
ఇనపురి ముద్దుల మువ్వగోపాల
ఏపున నను గలసితి వీవేళ?

[సానిపడుచులగోష్ఠి]

చెలియరో యేమని
చెప్పుదు నాతోను
కలకలమని నవ్వి
కౌగలించేనే
మాటాడవద్దని
మరి నన్ను బెదిరించి
మదనకేళీ... చేయించి
చేష్ట లేమేమో చేసితే భ్రమసితి
చేరెనో ఆవేళ
తెలియదేమారితి.

ఇలా ఉదహరించటానికి పూనుకుంటే, క్షేత్రయ్య వ్రాసిన ప్రతి పాటనూ ఉదహరించవలసి వస్తుంది. ఈ తతంగాన్నంతా యేదో మధురభక్తి సంప్రదాయమనీ, అలౌకికమైన ఆధ్యాత్మిక సాధనలనీ వాదించటానికి పూనుకునేవారిని చూస్తే నిజంగా నవ్వు వస్తుంది.

పోనీ, పరమభక్తుడు గనక క్షేత్రయ్యకు నిజంగా మువ్వగోపాలుడిమీద మధురభక్తి సంబంధమైన విరహవేదనేదో కలిగిందనుకుందాం—ఈ మగరాధకు తంజావూరి విజయ రాఘవనాయనింగారిమీద కూడా, వల్లమాలిన ఓపలేనితనం కలగటంలో గల పరమార్థ మేమిటి మహాత్మా? ఈ విజయరాఘవ నాయనింగారి సంగతేమిటండీ: యీయన అంతఃపురంలో ఒక 700 మంది దాకా భార్యలూ 15300 మంది ఉంపుడుకత్తెలూ వుండేవారని ప్రతీతి. ఇది చాలక, ఈ చపలచిత్తుడు ఉద్యోగుల భార్యలను కుమార్తెలను చెరబట్టేవాడు. అలాంటి అవినీతిపరుడు గావటంచేత సేనానాయకులు వగైరా తిరుగబడి దేహశుద్ధి చేయటానికి ఆలోచించారు. ఈయన్ను "రసికాగ్రేసరుడు" అంటూ సన్నుతించుతున్నారు మన వారు కొందరు! మువ్వగోపాలుడిమీద వ్రాసినట్టే ఈయనమీద కూడా కొన్ని పాటలు వ్రాశాడు క్షేత్రయ్య.

పోనీ 1600.0 గోపికాస్త్రీలను సమకూర్చుకున్న శ్రీ కృష్ణ భగవానులవారి అంశం ఈయనలోకూడా, కొంత గాకపోతే కొంతైనా కనుపించుతోంది గనుక యీయనమీదకూడా మధుర భక్తి కలిగిందనుకుదాం. తుపాకుల వెంకటకృష్ణయ్యమీదా, తురకసాయెబు అబ్దుల్లామీదా కూడా ఈ వెర్రివ్యామోహాలేమిటి? తుపాకులాయన "చెంజి"కోట సేనాని; తురకసాయెబు గోల్కొండ నవాబు అబ్దుల్లా కుతుబ్ షా.

ఇదంతా మధురభక్తీగాదు మట్టిగెడ్డలూ గాదు! క్షేత్రయ్య ఈపాటలలో వ్రాసిందంతా సానెంపాటి లంజలసంగతి! ఈజావళీల నన్నిటినీ, భోగం మేళాలవాళ్ళుపాడుకోవటానికి వ్రాశాడు. దేవదాసీలు పాడటానికి వ్రాశాడు.

ఇదంతా మధురభక్తి కాదంటే మరి పదాల చివర ఈదేవుళ్ల పేర్లు యెందుకు యిరికించవలసి వచ్చింది అనే వాదానికి సమాధానం చెప్పుకోవలసివుంటుంది. దీనికి తగిన కారణం లేకపోలేదు; పూర్వం, యించుమించు ప్రతిపెద్ద దేవస్థానానికీ కొంతమంది దేవదాసీలు వుండేవారు. ఆదేవదాసీలు, ఉత్సవ సమయాల్లో, జనాన్ని అలరింపజేయటానికి యీ రకం జావళీలుపాడి అభినయించేవాళ్ళు; ఆ దేవదాసీలు పాడి అభినయించటానికి అనువుగా, కొంతమంది, ఈబాపతు జావళీలు వ్రాసిపెట్టి డబ్బు సంపాదించుకునేవాళ్లు. అలరింపజేయవలసింది జనంలో వుండే పెదమనుషులనే అయినా, —మరీ విజయరాఘవుడివంటి సొంతం మతి చెడి బరి తెగినవాడైతే తప్ప,—తన పేరుబెట్టి సంబోధించి బజార్లో అల్లరిపెడితే యే పెద్ద మనిషీ సహించడు; అందుచేత నోరులేని దేవుణ్ణే బజారులో బెట్టి రసభచేసేవాళ్ళు. ఆ పాటలోవుండే పేరు దేవుడిదే అయినా, ఊరేగింపులోనుందు నిల్చునున్న ప్రతిపెద్దమనిషీవిట రాయడైన ఆ మువ్వగోపాలుడు తానే ననుకుని లోలోపల ఆనందించుతూవుండేవాడు. అందుచేత 'మువ్వగోపాల,' 'మువ్వల గోపాల', వేణుగోపాల,' 'రాజగోపాల' 'పరిమళరంగ' యిత్యా;



ఆర్ఫ్యూస్ - యురిడిస్

చిత్రకారుడు జి. యఫ్. వాట్స్

# ఆర్ఫ్యూస్ - యూరిడిస్

మన పురాణాలలో రురుడు, ప్రమద్వర ఉపాఖ్యానానికి పోలినట్టిదే గ్రీకు పురాణాలలోకూడా ఒక కథ ఉంది. అక్కడి దంపతులు ఆర్ఫ్యూస్, యూరిడిస్‌లు.

ఆర్ఫ్యూస్ సూర్యదేవుడైన ఎపోలోకును, కాలియోప్ అనే గంధర్వ కన్యకకు జన్మించిన కుమారుడు. ఇతని భార్య యూరిడిస్. ఆర్ఫ్యూస్ గోపాలకృష్ణునివలెనే మురళీ మోహనుడు. అతని గానానికి అడవిలో మృగపక్షి సంతతులన్నీకూడా వచ్చి అతని పాటవింటూ, మైమరచిపోయి నిలచేవి. యూరిడిస్‌నొకనాడు అడవిలో పాము కరచింది. ఆమె చనిపోయి నరకానికి పోతుంది. ఆర్ఫ్యూస్ ఆమెకోసం విలపిస్తూ ప్రియురాలి ప్రాణాలను తిరిగి తెచ్చుకోటానికై, నరకలోకానికి వెళ్తాడు. నరకద్వారం వద్దనున్న కాపలా కుక్క అతని పాటకు నిద్రపోతుంది. నరకాధిపతిఅయిన ప్లూటో (మృత్యుదేవత) అతని పాటకు పరవశుడయి యూరిడిస్ అతని వెనకాతలే రాగలదు తీసికెళ్ళమంటాడు. కాని దోవలో ఆమెకోసం వెనక్కి తిరిగిచూస్తే మాత్రం మళ్ళీ ఆమె నరకానికి వచ్చేస్తుందని ఆంక్ష పెడ్తాడు. దోవలో ఆర్ఫ్యూస్ ఆమెను చూడాలన్న కౌతుకం ఆపుకోలేక వెనక్కు చూస్తాడు. యూరిడిస్ శాశ్వతంగా అతన్నివదలి వెళ్ళిపోతుంది. ఈ చిత్రంలో మృతురాలయిన యూరిడిస్‌కోసం ఆర్ఫ్యూస్ విలపించటం, ప్రసిద్ధ చిత్రకారుడైన ఎఫ్. జి. వాట్స్‌చేత చిత్రించబడ్డది. ఈ చిత్రం హైదరాబాద్‌లో సాలార్‌జంగ్ మ్యూజియంలో సేకరితమై ఉంది.

ప్రయోగాలన్నీ 'విటరాయ' అనటానికి సాంకేతికపదాలుగా మనం తీసుకోవాలి. ఇలాంటి మకుటాలిచ్చి జావళీలు వ్రాయటం చిరకాలంగావస్తున్న సంప్రదాయం. ఈ 'మువ్వలగోపాలుడ'న్న పదం యీనాటిదిగాదు: 'నవకింకిణీకజాలాభిరామ జఘనా'ల ప్రసక్తి లీలాశుకుని నాటినుంచీ వినిపిస్తున్నదే.

ఇక్కడికి క్షేత్రయ్యపదాల వ్యవహారమేమిటో కొంతటూకీగా పరిశీలనచేశాంగనుక, సారంగపాణిగారి అలౌకికాధ్యాత్మికేత్యాది మధురభక్తి సంప్రదాయమేమిటో కూడా కించిత్తు పరిశీలనచేద్దాం. ఇదంతా నేను వక్కాణించటం కాకుండా సారంగపాణిపదాలే రెండుమూడు ఉటంకించి సహృదయులైన పాఠకుల తీర్పుకు వదిలేస్తాను.

(1)

వారివలె చక్కనివాడైతే
చేరనిత్తువు నిజమే—ఏమైనా ॥వారి॥

సారెకు దొరగండ్ల జూచుచు
కూరిమి నిన్ననుభవించే ॥వారి॥

మీసా లెరుపా, చేతులు నలుపా,
మీనాక్షయ్యవలె—రొమ్మున,
నీ సాక్షిగ, వీపున గూనా,
వ్యాసాచార్లవలె,
పళ్ళు పారలా మెడలో కణితా
పాపాపిళ్ళవలె—అవటి
కండ్లా, పాపపు చెవుడా, బోయి
కదిరిగానివలె, నేమైనా,
దూడకడుపా, తిరువళ్ళూరి
ఆడిగానివలె—నున్నగ
పేడు మూతా తిరుపేగూడా
పెరియాళ్వారివలె—
దొడ్డికాళ్ళా తొట్టి పెదవా
బుడ్డయివారివలె—ముక్కు
సడ్డా, తల వణుకా, మరగుజ్జా
నల్లపరెడ్డివలె, నేమైనా?
నత్తా యిప్పుడు వచ్చిన, సారాయి
గుత్తవ నరసువలె—మూగాడ
కొత్తచీర దెచ్చిన, బోడిశెట్టివలె-
పొడిదగ్గా వక చంపనలుపా
బోజిగానివలె - ముసలి
బడుగా కడపా భవాని సింగూ
బావమరదివలె, నేమైనా ॥వారి॥

తడయక నిను గూడిగదా యెగ
తాళి సేయవలె - యింతకు
పడతిరో వేణుగోపాలుని
పద్దు చెల్లవారి నేమైనా ॥వారి॥

(2)

నిష్కర్షగా రాత్రి కొచ్చేవాడవైతే
నిష్కాలు గొంచురారా! - నేను
ముష్కరి విసను యీ శుష్కప్రియాలు తు
రుష్కులు దిగివుండే లష్కరులోనుంచి
నిష్కాలు గొంచురారా! ॥నిష్కర్ష॥

దండిగ పొవ్వాకు - రెండు వీశల వక్క
పండుడాకుల యిడియ - పాలకావిళ్లు,
కండశర్కరదుత్త, కౌజుల చుట్టలు
యెడక జారగానె యెత్తించుకొని నీవు ॥నిష్కర్ష॥

పూలు, గంధము, చుక్క,
పునుగు, లవంగాలు,
యేలకాయలు, తుల
మెత్తు జాపత్రి,
పాలుమాలేవు, దీ
పాని కడ్డెడు నూనె,
యీలో బంపించి, నీ
వింట్లోనె భోంచేసి ॥నిష్కర్ష॥

మునిమడుగు రవికెలు
మూడు కొంగులు చీరె
దినుసువారి పప్పు తేటద్దమూ,
పనిబూని వేణుగో
పాల సాగించుక
ననురతిని గూడి, ఆ
నంద మందుటకు ॥నిష్కర్ష॥

(౩)

వక్కకైనా లేదుగదవే
వాని చెలిమి కొక దండమె - మంచి
చక్కనివాడైతే నిండునటె, సఖియ వేణు
గోపాలుని చేతి ॥వక్క॥

చెడ్డచేసి కింటి వడ్ల పొంగలి
జేసినట్లు యెదురు దరిసించితె,

దొడ్డ రసికుడన్న పేరు మాత్రమె
గుడ్డిగవ్వ జూచితె నీయాన ॥వక్క॥
ఉడుము బోతెపోయినది చెయి మాత్రము
విడిచితె చాలుననే వేధగా
పడతి తాను కుదువబెట్టిన సొమ్ములు
పైక మిచ్చి విడిపించితె చాలద ॥వక్క॥
మొగమాట తోయజాలక
మును పెవతెకే కడుపాయ నందురు
వగ యింతలేక వాని గూడితి
వుసురు వుంటే వుప్పముక్కోగలను ॥వక్క॥

(4)

అంతమాత్రము నేసియునటే
అజ్ఞానురాలా! - నే
నింత బిలిచిన నసేమిరా యని,
గంతు వైచుచు పరుగెత్తేవు ॥అంత॥

సేవాకాలము రాతిరి గుళ్ళో
ఆవేళదాక నిలుచుంటే,
తేవాకులయ వారొక దోసె వొళ్లో.........
॥అంత॥

గద్దగూడువలె తల బెట్టుక
సుద్దులాడ వచ్చితె సాతాని,
పెద్ద వెలగచిప్ప దెచ్చుకొమ్మని
సిద్దిలోని చమురు వంచియిచ్చెను ॥అంత॥

రొయ్యా దిన్న నోటికి
పొవ్వా కింతియ్యమనుచు
యెడమ చేయి సాచితె
అయ్యా తోడలేదని తన చారెడు
బియ్యమిచ్చె ఉగ్రాణపు దాసరి ॥అంత॥

పాతగుడ్డ పైట కందలేదని
భంగపడితే, నాంచారు కప్పెడు
పాతియున్న చీర గుంజి వేగమె
చేతికిచ్చె పరిచారక వైష్ణవు ॥అంత॥

వేణుగోపాల రారమ్మని
వింతగాను నను గూడితివైనా
వీణుగా నిను పొమ్మందునటే
వెర్రిదాన తెలుసుకోవైతి ॥అంత॥

(5)

పదిమంది కొడుకుల గన్నదాని చేతికి
పైకమిచ్చి వత్తురా—యింత
పదటట వేణుగోపాల నీకు రూక
లదనమై వుంటే, నేనరువు తెరువుమాలి॥

ఒకడు బిడ్డలతండ్రి
ఒంటిమిట్టలో ఠాణా;
ఒకడు కొత్వాల్ గిరి
ఓరుగంటి కాడ;
ఒకడు పైశిలుకీడకు దూదిబేరము,
ఒకని వంచించి వేరొకనికి మనసిచ్చి ॥పది॥

ఒకడు నీ పొడుగ్గై, నాటకశాలనట్టువు,
ఒకడు బంగాళాబారుకు సుబేదారు,
ఒకడు శృంగారతోటకు ఖుల్‌దారోగా:
ఒకటి యెరుగవు, దిన
మొకరిని తల దడివి ॥పది॥

ఒకనికి మీసకట్టిక మొనజూపు, నే
రొకని పల్లికూటానికి బంపే ప్రాయము
ఒకడు చేతిబిడ్డ, తకతకలాడిని
యిక మానవంటే యేలుకో
చెలులు నవ ॥పది॥

జుగుప్సాకరములైన ఈ రచనలు చదివించి పాఠకులను యిప్పటికే చాలా బాధపెట్టినట్టున్నాను. సారంగపాణి మధురభక్తి సంప్రదాయ మేమిటో తెలుసుకోవటానికి యింతమాత్రం చాలు ననుకుంటాను. ఇంకా కొన్ని ఉటంకించి వుందునుగాని, సభ్యత దృష్ట్యా ఇంకేపాటనూ ఈ రచనలో ఎత్తిరాసే అవకాశంగా లేదు. సారంగపాణి పదాలలో బూతులులేని పాటకోసం వెదకటం ప్రయాస పని.

సారంగపాణి, క్షేత్రయ్యా, రాజగోపాల పదాలు వ్రాసిన మూవనల్లూరు సభాపతయ్యా, ఇత్యాదయః, జావళీలు వ్రాసినవారి సంగతి పూర్తిగా అవగతం చేసుకోవాలంటే, కొంచెం వెనక్కు పోయి భోగంమేళాల సంగతీ, దేవదాసీల సంగతీ కొంత తిరగ వెయ్యవలసి వస్తుంది.

ఇప్పుడిప్పుడు ప్రభుత్వం నిషేధాజ్ఞను అమలుజరపటంవల్ల, వివాహాది శుభకార్యాలకు భోగం మేళాలను పిలిపించే అనువాయితీ రద్దయిపోయిందిగాని, మొన్న మొన్నటివరకూ పరిస్థితి అలా వుండేదిగాదు. ఏ కొంత సంపన్నుడైనా కుమారుడిపెళ్ళి చేస్తున్నాడంటె తప్పకుండా భోగంపే [illegible] పిలిపించేవాడు; మగ పెళ్ళివారు భోగంమేళాన్ని తెప్పించకపోతే, వాళ్ళు యింతకలవారని అనుకునేవారుగాదు. మనవేపున సుబ్బిచెరువూ, మేడూరూ అంటే

భోగం మేళాలకు మంచి ప్రసిద్ధి; ఈ భోగం మేళం పల్లకీ ఊరేగింపు ముందు నాట్యం చెయ్యటమేగాక, వీళ్ళ చేత పెళ్లి అయిదు రోజులూ సాయంత్రంపూట మేజువాణీలు పెట్టించేవారు. ఇలాంటి మేజువాణీలలో యే సదస్యంనాడో, నాయకురాలిచేతనే గజ్జగట్టించి భామకలాపం పెట్టించేవాళ్ళు. ఆ భామకలాపం ప్రదర్శించవలసివచ్చినప్పుడు నాయకురాలు తనకు సహకారం చెయ్యటానికి భరతశాస్త్రంలో ప్రావీణ్యత గల ఒక వ్యక్తిని స్వయంగా పిలిపించుకుంటుంది. ఈ యన్ను "హాంగుదారు"అంటారు. ఈవ్యక్తులకు భరతశాస్త్రంలోనూ సంగీత సాహిత్యకళలలోనూ వాసాకాలపు చదువుగా కొంత కొంత ప్రవేశంవుంటుంది. హాస్యం చెప్పటంకూడా కొంత చేతైవుండాలి. ఈ హాంగుదారు తాళాలు తీసుకుని వంతపాడటం, నాట్యగత్తెకు ఉత్సాహంగా వుండేలాగు ఆయా తాళాలలో 'స్వరశబ్దాలు' విన్యాసంచెయ్యటం, నాట్యగత్తెకు అలసట కలిగినప్పుడు కొంచెం విశ్రాంతి నివ్వటానికి హాస్యంచెప్పి సభికులను రజింపజెయ్యటం— ఇదీ వీరి పని. 'అయ్యవారూ!' అంటే 'ఏమే భామామణీ' అనుకుంటూ ఒకరికొకరు సహాయంగా భామకలాపమంతా ఆడేసేవారు. ఈ 'హాంగుదారుల వృత్తి' కేవలం భోగం మేళాలమీద ఆధారపడివుండేది. అందుచేత వీరు భోగం మేళాలకు కావలసిన సరంజామా అంతా తయారుచేసేవాళ్ళు; అటు గ్రాంధికమూ ఇటు వ్యవహారికమూ తీసుకొని సంకరభాషలో ఈ రకం జావళీలూ బూతు కీర్తనలూ వ్రాసేవాళ్ళు. ఆయా దేవస్థానాలలో వుండే దేవదాసీ బృందాలు, పేరుబడ్డ యిలాంటి హాంగు దారులను, తమ ధర్మకర్తల ద్వారాపిలిపించుకుని తమకు కావలసిన గ్రంథాన్ని తయారుచేయించుకునే వాళ్ళు. తమదేవుడిపేర ప్రత్యేకంకొన్ని జావళీలు వ్రాయించుకుని, వాటికి అభినయం చెప్పించుకునేవాళ్లు. సారంగపాణి, క్షేత్రయ్య, సభాపతయ్య వీళ్లంతా ఆ తరగతికి చెందిన "హాంగుదారులు." ఇలాంటివాళ్లను జల్సారాయళ్ళయిన జమీందారులు, రాజులూ సముఖానికి పిలిపించుకుని వాళ్లచేత, తమ ఉంపుడుకత్తెలు తమమీద పాడటానికి అనువుగా జావళీలు వ్రాయించుకునేవాళ్లు.

దక్షిణాదినవున్న ప్రసిద్ధదేవస్థానాలలో క్షేత్రయ్య పదాలు లేని దేవుడులేడు. సారంగపాణికేవలం దేవుళ్ళమీదా రాజులమీదనే కాక పావలా డబ్బులు పారేసిన, ప్రతి వస్మరంతిమీదా తలకొక పాట రాసిపారేసి డబ్బుసంపాయించుకున్నాడు.

భోగం మేళాలూ, దేవదాసీ పద్ధతీ అవినీతికరమైనవిగా భావించి, వాటిని రద్దుచేయించాం. నిజానికి వాళ్ళ నోటికాడ వృత్తులుతీసి పారేసి కడుపులమీద కొట్టాం. సంఘాన్ని సంస్కరించుకోవాలనే మహాదాశయం కోసం అలాంటి కఠోరమైన చర్యకు పూనుకోవటానికి కూడా మనం వెనుకాడలేదు. ఇంతకూ వాళ్ళుచేసిన తప్పిదమేమిటి? ఈ క్షేత్రయ్య పదాలనూ సారంగపాణి పదాలనూ పాడి అభినయించేవాళ్లు; ఆ నేరం జరిపినందుకు వాళ్ళను శాసించినవాళ్లం ఆ పదాలను మన భార్యలచేతా చెల్లెళ్ళచేతా పాడించటానికి పూనుకోవటంలోగల ఔచితి యేమిటి?

'కులకాంతలు విడిబడి నలుదిక్కుల
చెలరేగి రిదేటిపాపమో – అయితే
వెలయాండ్ల జీవనమేమిక, శ్రీ
వేణుగోపాల, సంకరమై. ॥కు॥'

అని గోలబెట్టాడు సారంగపాణి ఒక పాటలో. దానికి నకలుగా వుంది యీ పరిస్థితి. మేళాలను రద్దుచేయించిన వాళ్లం, 'భరతనాట్య'మనే పెద్ద పేరుబెట్టి: "ఉగుటు గుబ్బలు" అంటూ నడిబజారున వేలానికి బెట్టించటంలో గల సభ్యత యేమిటి? వాటిని అంగీకరించినవాళ్ళం భోగం మేళాలను యెందుకు రద్దుచేయించినట్టు. ఈ అసభ్యతనంతా, 'మధురభక్తి సంప్రదాయమనీ,' మట్టిగడ్డలనీ, ఉత్తమసాహిత్యమనీ ప్రచారంచేసి, ఉట్టెగట్టుకు ఊరేగదలచినప్పుడు నిష్కారణంగా వాళ్ళవృత్తులు తీసెయ్యడం దేనికి?

ఈకశ్మలాన్నంతా మధురభక్తి సంప్రదాయమని ప్రచారం చెయ్యటం అటు ఆధ్యాత్మిక రంగానికిగాని యిటు సాహిత్యరంగానికిగాని, యేవిధంగానూ గౌరవప్రదం గాదు. సభ్యత దృష్ట్యా గాని, కావ్యప్రయోజనదృష్ట్యా గాని ఈ జావళీలకు సాహిత్యమనిపించుకోదగ్గ ప్రతిపత్తిలేకపోవటమే గాక, వీటికి సాహిత్యానికి కావలసిన యే యితర యోగ్యతలుకూడా లేవు. వీటిని సాహిత్యంగా యెప్పుడూ యెవరూ అంగీకరించలేదు; ఎవరు యెన్ని ప్రచారాలుచేసినా యిప్పుడు అంగీకరించటానికి వీల్లేదు. ఆంధ్ర సాహిత్య రంగంలో వీటికి తావులేదు.

# విజయశ్రీ

★

శ్రీ చింతలపాటి నరసింహదీక్షితశర్మ

శ్రీలు చివురింప, సర్వజ్ఞ శేఖరుండు కళల మురిపించు కవిరాజ కావ్యరమకు
దళుకు ముస్తాబుగూర్చి యందాలు దీర్చి స్వాగతమ్మిడు విజయవర్షమ్ము లవ్వి-

మధుర పరీమళమ్ములు సమగ్రముగా విరజిమ్మఁ బుష్పసం
గ్రథితపుఁ దోరణమ్ములు విరాజిలె వార ముఖమ్ములన్ యథా
తథముగ గ్రమ్ముకొన్నవి యుదారవసంత(రసార్ద్రి) వీచికల్
ప్రథిత కవీంద్ర మిత్రులలరన్ విజయమ్మభి సూచకమ్ముగన్

చలువల చూపుదొంతర ప్రశాంత వసంతములెన్ని వేప పూ
జిలి బిలి కమ్మతావులను జిమ్మెడు తెమ్మెర కోడెగాండ్రు లే
దలిరుల తీవెకన్నెల యెదన్ వలపించి తుఱంగలించిమై,
బులకలు చెందమోజుపడి పోయెనొ? ఆవిజయాను రక్తిమన్;

అది యుదయావనీధర శిఖాగ్రము నందరుణారుణ ప్రభా
స్పద కిరణావళుల్ కొసలు సాచి కొలంకుల దమ్మికొమ్మనె
మ్మది గిలిగింత వెట్టి సుషమా కిలికించిత మంద హాసనం
పదలు వెలార్చు నూత్న సుకుమార మనోరమణీయ దృశ్యమా;

వలపుం బువ్వులు దోయిలించె దళుకొప్పన్, బద్మినీదేవి ము
ద్దుల నెమ్మోమున నిండు గోరికలు చిందుల్ వెట్ట, సౌహార్ద ని
ర్మల భావంబుల నూత్న మిత్రునకు ప్రేమన్ మంచు ముత్యాల కా
న్కల నర్పించె నుమః కళామయి సువర్ణ స్నిగ్ధ శోభాళితో

ఆ నవరాగదీధితులయందు సుధీంద్ర జిగీష నేగె వి
ద్యానగరంపు వీధుల జనావళి గుంపులు గూడ జైడి ని
ద్దానిగ పాలకిందెలుగు దర్పముకీవిదలిర్ప రెడ్ల యా
స్థాన కవీశ్వరుండు, నరదాలరుదార నుదార మూర్తియై

ఆయెడ దక్షిణా పథమునందు యశ[illegible]ను గొల్ల గొట్టెమే
ధాయుతుడైన డిండిమ బుధ ప్రవ[illegible] గ్రణి, కంచుఢక్కదె
బ్బాయతి ప్రౌఢరాయల సభాంగణ పండితమండ లీంద్రుడై
ఆయన ముందు మారుపలుకాడెడు వాడి గలాడు లేడురా!

అలనాడాతని పేరు మాత్రవిన సింహా స్వప్నమై పోయె గుం
డల ముల్ దాల్చిన పండితేంద్రులకు గంటల్ కంకణాల్గాంచి ఆ

మ్ములు నిక్కించెడు కావ్యకర్తలకు గొమ్ముంగోడెమై సీటు వా
టిల శ్రీనాథ కవీశ్వరుండు తోడ గొట్టెన్ వానిపై డీకొనన్

ఇతడటె? గౌడడిండిము జయించెడి వాడితడే నకేనవ
ప్రతిభుడు రెడ్డిరాజుల సభాకవి యీతడటే జయా తిపే
ల్లితమగు కంచుఢక్క పగిలించెడి ప్రోడ నిజంబుగా కళా
చతురుడు లేడెయన్ గుసగుసల్ చెలరేగ నొకేవిధమ్ముగన్

గెలుపుల యాత్రసేయ గమకించిన యాంధ్ర కవీంద్రు ప్రౌఢరా
యలు తొలుదొల్త సేవినియు నాతని రాకడయెంచి యెల్లది
క్కుల గల విజ్ఞ సత్కవులకున్ వినిపించి నితాంత వైభవో
జ్జ్వలముగ నొక్క పండిత సభన్ జరిపెన్ సమయవ్యస్థితిన్

అతటి నానెగొంది పురమంతయు వెగ్గె నపూర్వసాహితీ
జ్యోతులతో బరస్పర జయోదయమెంచు కవీంద్ర సింహ వి
ఖ్యాత విశేషవాదముల నారయవచ్చిన సత్కవీశ్వర
వ్రాతము చేతముల్లసనభావ కళామయదీప్తి జిందగన్.

తేజ మెసంగ నోలగము దీరిచె నంతట ప్రౌఢరాయలు
త్తేజనుడండి, డిండిమసుధీమణి వాద జయాభిలాషనీ
రాజన రేఖలై బిరుదరత్న పతాకలు చెంగలింప వి
భ్రాజితమూర్తియై సభకువచ్చె మగంటిమి పెంపు సొంపునన్

పసమించు సరిగంచు పట్టుశాలువ మించు వలెవాటు పండితప్రౌఢి జిలుకి
చిఱునవ్వు చిమ్ము నూర్జిత భావ సౌమ్య వక్త్రమ్మునన్ బ్రహ్మ వర్చస్సు
కమనీయపాణి కంకణమణీ కింకిణీక్వణములం బ్రజలనబ్బుమ్ములొలుక [గులుక.
వలకాలిపసిడి జగ్గుల గండ పెండారమదుగద్దునకు ఘల్లురనుచు బలుక
“సరససాహిత్య సామ్రాజ్య చక్రవర్తి” కమలనాభుని పౌత్రు డుత్కంఠతోడ
నరుగు దెంచెను ప్రౌఢరాయల మహా సభాస్థలికి కవి “శ్రీనాథ భట్టసుకవి”

తమ యుచితాసనంబుల యథావిధిగా గయిసేసి యుండె వా
దము వినవచ్చి హెచ్చిన బుధ ప్రకరంబిటు కొండవీటి సిం
హము నటు డిండి ముందును జయాంచిత పీఠము లెక్కిరాభి ము
ఖ్యము చెలువార వారల ముఖంబుల గేల్కొని నెల్ల దృష్టులున్

అంచుల్ దీరిన వాదకేళి నిజ చర్యాధిక్య శక్తి న్నిరూ
పించన్ సాటి కవీశుడెంతయును కీవిన్ గంచుఢక్కన్ బజా
యించెన్, డిండిమభట్ట పండితుడు; బ్రాహ్మీదత్త శంఖంబు పూ
రించెన్ “భమ్మని” రెడ్డిరాజుల కవి శ్రేష్ఠుండు శ్రీనాథుడున్—

తొలుదొల్త న్నియమంబు నేర్పఱచిరేదో కాదు శ్రీనాథుడే
గెలుపుం జెందిన గంచు ఢక్కనొక ఫక్కిన్ ముక్కలన్ జేసి యు

జ్వాల తత్తద్బిరుదాళి దాల్చుటయు నావాదంబునం దాత డే
తల క్రిందైన గవిత్వ సన్న్యసన తత్వంబొందెడె గైకొంటయున్.

నరయన్స్ఫూర్తి గవీంద్ర సింహములు గర్జల్ చేసి వాదోప వా
దరసావేశమునందు దూకిన నమంద ప్రౌఢి భాట్ట ప్రభా
కర ముఖ్యాగమ సంప్రదాయములు దుర్గ్రాహ్యస్థితిం జెందె ని
ర్వార రూపొందు సరస్వతీ ప్రతిభలం బొల్పొంది రప్పట్టునన్.

తల సూపెన్ సునిగూఢగూఢ హృదయ స్థైర్యంబుల న్విప్పి ని
స్తుల శాస్త్రంబులు, సాగిపోయినవి రోజుల్ కొన్ని యుక్తి ప్రయు
క్తులు నిండారె, మనీషలూరె; గడు రంతుల్ మీరె, నేవోజిగీ
షలు పెంపారె, నసూయలుట్టిపడె, నానల్ సుంతమోసుల్ గొనెన్.

ఎవని కెవ్వడు దీసిపోయినదిలేదు, గెలుపుగొను ప్రోడయెవ్వడో తెలియరాదు
మిగులు బుధులెల్ల గుటకలుమ్రింగుకొనుచు బొంచియున్నార లేదొ యూ
హించు [illegible]చు—

పైన జయంబుడంబు పసి పట్టిన దిట్టరి కొండవీటి యా
స్థాన కవీంద్ర శేఖరుని ధాటికి మాటికి నాసగొంది యా
స్థాన కవీశ్వరుండు కల తన్గొని యంత రవంత సాహితీ
జ్ఞానము తప్పుదారుల ప్రసంగములన్ బెనుగాడ జూడగా.

సలలిత మందహాసముల చాయలు చక్కని ముత్తియంపు బం
టలుగద, నోరచూపుల దటాలున వానిని బాణినీయ ని
స్తుల తమ భాష్య ఫక్కికల ద్రోసె నతండు నిరుత్తర స్థితిన్
వెల వెల బాటుమోమున జనింప గరంబనుకంపనీయుడై.

కిమ్మనలేక చేతులు మొగిడ్చి మహోదయ! శబ్ద శాస్త్రవా
దమ్మున నోడినాడ, బిరుదమ్ములివే-గెలు పొంది నావులే
లెమ్మిక గంచు ఢక్క వగిలించెద నీవిజయమ్ము లాంధ్ర దే
శమ్ముల సొమ్ములై గొనలు సాగుత దెల్గు గవీంద్రులుబ్బగన్.

"జయ" శ్రీనాధ కవీంద్ర సింహ విజయ స్వాతంత్ర్య లక్ష్మీ కళా
మయ! సాహిత్య నవాంధ్ర మార్గకవితా మాధుర్య సామ్రాజ్య ని
ర్ణయ సింహాసన సార్వభౌమ! జయ! యన్వాదంబులంబూర్ణ వి
స్మయులై పోయిరి రాయలున్ బుధులు "శుంభద్భిన్నఢక్కార్భటిన్"

ఉదయ శ్రీమృదులారుణ ప్రభలలో నుయ్యాలలూగెన్ నవా
భ్యుదయుండై కవిభాస్కరుండు విజయంపుం దమ్మినెమ్మోమును వి
చ్చె దయామూర్తి సువర్ణ పుష్ప మధుర శ్రీనించె భూభర్త కీ
ర్తి దలిర్పన్ గవిసార్వభౌమ "విజయ శ్రీ"వర్షముత్కర్షమై.

# ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్

## ప్రధాన కార్యాలయము - మచిలీపట్నం.

నూతన "విజయ" సంవత్సరము మీ కన్నివిధముల విజయవంతమగుగాక...

జీవిత భీమాతోబాటు అగ్ని, ప్రమాదము, మోటారు, నౌక
మొదలైన ఇతర భీమా వ్యాపారముగూడ జయప్రదముగా నిర్వహింపబడుచున్నది.

**బోనస్సు సాలుకు 1000 కి రు. 9 లు.**

## 1953 మా వాల్యుయేషను సంవత్సరము

| | | | |
|---|---|---|---|
| అమలులోనున్న భీమా మొత్తం | | ... | రు. **10** కోట్లు మించినవి |
| మొత్తపు ఆస్థులు | ... | ... | రు. **2** కోట్లు మించినవి |
| సాలినా ఆదాయము మొత్తము | | ... | రు. **60** లక్షలకు మించినవి. |

**మా ఆఫీసులు:**

మద్రాసు, బొంబాయి, కలకత్తా, నాగపూర్, బెంగుళూర్, బెల్గాం, అనంతపూర్, శికింద్రాబాద్, వరంగల్, బర్హాంపూర్, ఎర్నాకులం, బెజవాడ, రాజమండ్రి, గుంటూరు, జెంషడ్‌పూర్, విశాఖపట్నం, మంగళూరు, డిబ్రుగర్ - (అస్సాం), పాట్నా, అలహాబాద్, ఢిల్లీ, వగైరా.

---

*The Beverage for Every One*

# OVOMALT

REGD. TRADE MARK NO. 154050




ఓమాల్టు పాలలో తక్కువగానుండు కార్బోహైడ్రేట్సును ఉత్తమరూపంలో సప్లయిచేస్తున్నది. సామాన్యప్రజల కొనుగోలుశక్తికి అందుబాటులో ఉన్నది.

## OVOMALT LABORATORY

H.O. 26 GODOWN ST, MADRAS. 1.

# సంజ వెలుగు

★

"హితశ్రీ"

ఎప్పటిలాగే సూర్యుడు తూర్పు దిక్కున ఉదయించాడు. శశిరేఖ నిద్రలేచింది. సోఫావైపు చూసింది. కిటికీలోంచి రివ్వున వీచేగాలికి పేపరు టపటపకొట్టుకొంటోంది. శశిరేఖ మంచంమీదినించి లేచి సోఫాలో కూర్చుంది.

"రాజా."

"............"

"పేపరు వార్తలేమిటి, రాజా?"

"............"

ఒక క్షణం ఆగి శశిరేఖ గట్టిగా నవ్వింది.

"ఇది నిన్నటి పేపరు, భలే!"

ఆ పేపరు లాగేసి, ఆరోజు పేపరు దాని స్థానే ఉంచింది, శశిరేఖ.

"ఏదో ఒకటి, పేపరంటూ ఉంటేసరి, కాదూ?"

చిన్నగా నవ్విందామె. క్షణం నిశ్శబ్దం. ఆమె ముఖంలో హాసరేఖలు అదృశ్యమయాయి.

"రాజా!" దీనంగా పిలిచింది.

"............"

వంటమనిషి కాఫీ బల్లమీద పెట్టి వెళ్ళిపోయింది.

"కాఫీ, రాజా."

"............"

"కాఫీ అక్కర్లేదా?"

"............"

"అన్నట్లు, ఇవాళినించే కాబోలు కాఫీ మానెయ్యటం, అంతేనా?"

"............"

"పలకరా, రాజా?"

'రాజా పలకడు, ఉలకడు, ఆమె కళ్ళలో గిర్రునతిరిగిన కన్నీటి బిందువులు రెండు పేపరుమీదికి జారాయి. కొంతసేపటిదాకా ఆమె అలాగే ఉండిపోయింది. "కాఫీ చల్లారిపోతోందమ్మా." కప్పులు తీసుకు వెళ్ళటానికివచ్చిన పనిమనిషి, కాఫీ సంగతి జ్ఞాపకంచేసింది. శశిరేఖ గబగబా కాఫీ తాగేసింది. పనిమనిషి, కప్పులు తీసుకువెళ్ళిపోయింది.

"స్నానానికి టైమయింది, రాజా."

"............"

"లేవరా?"

'రాజా' కదలడు, మెదలడు.

పనిమనిషి బకెట్‌లో నీళ్ళు తెచ్చిపెట్టి వెళ్ళిపోయింది. శశిరేఖ నీళ్ళలో తువ్వాలుముంచి ముఖం కడిగింది. కొత్తపర్ష తొడిగింది.

కిటికీలోంచి లేత సూర్యకిరణాలు 'రాజా' మీద పడుతున్నాయి.

"ఇవాళ ఎంత బాగున్నారో అద్దంలో ఓసారి చూసుకోండి."

'రాజా' కళ్ళెత్తడు.

ఆమె 'రాజా' వైపు అలాగే చూసింది.

'రాజా' నోరు విప్పడు.

కాసేపు నిశ్శబ్దం.

"మరి నేను వోస్తా, రాజా. డాక్టర్లకి ఎంత పనుంటుందో మీకు చెప్పేదేముంది?"

బరువుగా, దీర్ఘంగా ఓ నిట్టూర్పువిడిచి, 'రాజా' తల ఓసారి నిమిరి, చెమ్మగిలిన కళ్ళు తుడుచుకుని, గదిగడపదాటింది శశిరేఖ.

ఎప్పటిలాగే సూర్యుడు అస్తమించాడు. క్రమంగా చీకటి దట్టంగా వ్యాపించసాగింది. గడియారంలో గంటల ముల్లు తొమ్మిది మీదికి జరిగింది.

"ఇవాళ ఓ ఆపరేషన్ చాలా నేర్పుగా చేశాను, రాజా. మొదట కొంచెం భయపడ్డాను. కాని జయప్రదంగా చేశాను. మీరే అయితే అసలు..." శశిరేఖ ఆగింది.

'రాజా' వైపు ఆర్ద్రనేత్రాలతో చూసింది.

'రాజా' మెప్పుకోలుకి సంతోషించడు.

"అంతా మెచ్చుకున్నారు, రాజా,"

కాని 'రాజా' మెచ్చుకోడు.

"ఎంత గొప్ప డాక్టరైనా నా రాజాతరవాతే."

'రాజా' సంతోషించడు.

"ఎప్పుడూ పేపరు చదువేనా?" కొంటెగా పేపరు లాగివెయ్యబోయింది.

'రాజా' అడ్డుపెట్టడు. "ఏమిటే కొంటెచేష్టలు?" అనడు.

"ఎప్పుడూ చదువుతుంటే కళ్ళు పాడయిపోతాయి."

'రాజా' కళ్ళు మూసింది ఆమె. కాని 'రాజా' తన చల్లని చేతితో ఆమె చేతిని కళ్ళకద్దుకోడు. ముద్దుపెట్టుకోడు. దుఃఖం

ఆమెగుండె చీల్చుకొని బయటికి వొచ్చి నదీప్రవాహంలా ప్రవహించసాగింది. 'రాజా' బుజంమీద తల ఆన్చి కన్నీటితో అభిషేకంచేసింది. అలా ఎంతసేపున్నా ఆమెకి టైం తెలియదు. ఏ రాత్రివేళో లేచి మంచంమీద పడుకుంటుంది. మామూలే. 'రాజా' ఆమెని ఓదార్చడు. ఓదార్చలేడు. మళ్ళీ తెల్లవారుతుంది...

మళ్ళీ 'రాజా'ని పలకరిస్తుంది; లాలిస్తుంది; హాస్యాలాడుతుంది; నవ్వుతుంది; కబుర్లు చెబుతుంది; పొగుడుతుంది. 'రాజా' పెదవిమెదల్పడు; కళ్ళెత్తి చూడడు; చిరునవ్వునవ్వడు. ఆమె ముఖంలో విషాదం అలుముకుంటుంది; కన్నీరు గిర్రున తిరుగుతుంది; విలపిస్తుంది. కాసేపు అదే అవస్థలో 'రాజా' బుజంమీద తల ఆనించి ఏదో లోకంలో విహారిస్తుంది; ఏదో ప్రశాంతత మరికొంత సేపటికి ఆవరిస్తుంది. అదే అవస్థలో తనని తాను మర్చిపోతుంది. ఏరాత్రివేళో మెళకువ వస్తుంది. లేచి మంచంమీద పడుకుంటుంది. మళ్ళీ తెల్లవారుతుంది—

## 2

"డాక్టర్‌గారు చాలా మంచివారు."

తన తండ్రి జబ్బు నయంచేసిన డాక్టర్ రాజగోపాలరావుని గురించి శశిరేఖ ఆమాటలంటే ఇంట్లో అంతా 'అవును' అని ఘంటాపథంగా ఒప్పుకున్నారు. కాని శశిరేఖకి మాత్రం తృప్తికలగలేదు. మళ్ళీ ఆ మాటలే అంది. 'నిజమే' అన్నారంతా. 'పాపం, చాలా మంచివాడు' అంది శశిరేఖ మూడోసారి.

'అలాగా!' అన్నాడు ఆమె తండ్రి కొంచెంనవ్వి. అప్పట్లో ఆమెకి తెలియలేదు, ఆమాటల వెనకాల ఉన్న అర్థం. ఇంటర్మీడియెట్ అయితే ప్యాసయింది కాని ఆలోచనాశక్తి అంతగా అలవడలేదు అప్పటికి.

"అంత మంచి డాక్టర్ని నేనెక్కడా చూడలేదు." అంది.

"నువ్వుకూడా డాక్టర్ చదివితే అంతకంటె మంచిదానివౌతావు."

"ఎవరైనా ఆయన తరవాతే."

ఆమె తండ్రి చిన్న నవ్వునవ్వి ఊరుకున్నాడు.

"డాక్టర్ని మరీ అంత ఆకాశానికెత్తాలిసిన అవసరమేమీ నాకు కనపడటంలేదు." అన్నాడు శశిరేఖ తమ్ముడు.

"ఏం?"

"డాక్టరైనవాడు తన పని ఏదో చూసుకుపోవాలిగాని ఊరికే ఇంట్లో అందరి ముఖాలవైపూ తేరి పారచూడటమెందుకు?"

శశిరేఖ గుండె గతుక్కుమంది. వీడు ఉన్నట్టుండి ఏదో అంటాడు, వెధవ! అయితే తనుకూడా అనుకుంది. నిజానికి చాలాసార్లు, డాక్టర్ అప్పుడప్పుడు తనవైపు అలా చూడటం అంత బావుండలేదని. తమ్ముడి రిమార్కుని ఎవరూ లక్ష్యంచెయ్యలేదల్లే ఉంది. ఎవరూ ఏమీ మాట్లాడలేదు కాసేపటివరకూ.

"డాక్టరుకి పెళ్ళయిందా?" అమ్మ అడిగింది. ఆవిడ కి [illegible]మానాలు. ఇంతవరకు ఎవరికీ ఆ సందేహం కలగలేదు.

"ఏమో!"

ఆ సమాధానానికి శశిరేఖకి కొంచెం కోపం వొచ్చింది. చుట్టుపక్కల ఉండేవాళ్ళని గురించి ఆమాత్రం తెలుసుకోరేం?

"అయే ఉంటుంది." అన్నాడు తమ్ముడు. వాడివైపు ఆమె చురచుర చూసింది. అన్నీ తెలిసినట్టు మాట్లాడతాడు.

"ఆయన మంచితనానికి తగ్గ మంచి భార్య దొరికితే అదృష్టవంతుడే." అన్నాడు నాన్న తనవైపుచూస్తూ. అలా తనవైపు చూడటమెందుకు?

"మన శశిరేఖలాంటి పిల్లయితే సుఖపడతాడు." అమ్మ అంది. అమ్మకి తనమీద ఎంతో అభిమానం. ఆమెమీద తనకిగల ప్రేమ ఆ క్షణంలో ద్విగుణీకృతమైంది.

ఆవిడ అన్నట్టు డాక్టర్ రాజగోపాలరావు శశిరేఖని పెళ్ళిచేసుకొని చాలా సుఖపడ్డాడు. కావాలంటే ఆమెని మెడిసిన్ చదవమన్నాడు అతను. కాని అందువల్ల అతనికి కలిగే ఇబ్బందుల్ని తలుచుకుని శశిరేఖ ఆ మాట తలపెట్టటం మానుకుంది. రాజగోపాలరావు వ్యక్తిగతంగా చాలా నిర్లక్ష్యస్వభావం కలవాడు. అతనికి కావలసిన ప్రతీదీ శశిరేఖ స్వయంగా సమకూర్చి పెట్టాలి. అలాంటి పరిస్థితిలో అన్నేళ్ళు అతనిని విడిచి పెట్టి ఎలా ఉంటుంది?

జాలిగా అదే ప్రశ్న అడిగింది శశిరేఖ. రాజగోపాలరావు యుద్ధప్రదేశానికి డాక్టరుగా వెళ్ళటానికి నిశ్చయించుకున్నప్పుడు. అతను నవ్వి అన్నాడు.

"నువ్వు లేనన్నాళ్ళూ ఎలా ఉన్నాను?"

"ఆ సంగతి వేరు."

"మళ్ళీ కొన్నాళ్ళు అలాగే బతుకుతాను."

ఆమె బతిమాలింది. ప్రాధేయపూర్వకంగా అడిగింది. ఉద్దేశం మార్చుకోమని.

"మనుషులు చచ్చిపోతుంటే డాక్టరైనవాడు చూస్తూ ఎలా ఊరుకోగలడు?" అన్నాడతను.

"డాక్టర్ల అవసరం యుద్ధభూమిలోనే కాదుగా!" అందామె.

"ప్రతివాడు అలాగే అనుకుంటే ఇహ వెళ్ళేవాళ్ళెవరు?"

ఆమె సమాధానం ఏమీ చెప్పలేకపోయింది.

"పోనీ, నాకోసం..." చివరి ప్రయత్నంగా అంది.

"శశీ, చదువుకున్నదానివి. నువ్వే అలా అంటే ఎలా?" ఇహ ఏమనగలదు?

"నీకంటే నాకు ఎవరున్నారు? కాని విధ్యుక్తధర్మం నెరవేర్చవద్దా?"

అతని ఉద్దేశాలు, ఆదర్శాలు ఆమెకి తెలియనివి కావు.

"గాయపడి వైద్యసహాయంకోసం కొన ప్రాణాలతో ఆశగా ఎదురుచూసేవాళ్ళని తలచుకో, ఒక్కసారి." శశిరేఖ కళ్ళలోనీరు

తిరిగాయి. అదృశ్యం ఎక్కువపేపు మనసులో నిలుపుకోలేక పోయింది. అంతా తన నేదో అర్థిస్తున్నారు. జాలిగా వేడుకుంటున్నారు. దీనావస్థలోఉన్న ఆ నిర్భాగ్యులకో సం తను ఇవ్వగలిగినది ఇవ్వకుండా ఎలా ఉండగలదు.

"రాజా!" ఇహ తను చెప్పగలిగిందేమీ లేదన్నట్టు, కంపిత స్వరంతో అంది. రాజగోపాలరావు ప్రేమపూర్వకంగా ఆమెని దగ్గరిక తీసుకున్నాడు.

"శశీ, మెడిసిన్ చదువుతావా?"

ఆదర్శప్రాయుడైన తన భర్త అడుగుజాడల్లో నడవటాని కంతకంటే సదవకాశం ఏం ఉంటుంది?

"ఊరికే కాలంగడపటంకంటె ఏదో పనికివచ్చే చదువు చదవటం మంచిదికదూ!" ఆమె తల ఊపింది.

శశిరేఖని స్వయంగా మెడికల్ కాలేజీలో చేర్పించి వెళ్ళిపోయాడు రాజగోపాలరావు.

తను మెడిసిన్ ప్యాసైతే భర్తకి ఎంతో అండగా ఉంటుంది. ఇద్దరూకలిసి ప్రాక్టీసుచెయ్యవచ్చు. ఎంతో ఆదర్శప్రాయంగా, 'డాక్టర్లంటే అలా ఉండాలి' అని నలుగురూ అనుకునేలా వైద్యవృత్తి చెయ్యవచ్చు. బీదలకోసం ఉచితవైద్యశాల నడపవచ్చు. శశిరేఖ ఎన్నో కలలుకంది. కష్టపడి చదవసాగింది. సంవత్సరంమీద సంవత్సరం గడిచిపోయింది.

రాజగోపాలరావు రాలేదు. ఏరోజైనారావొచ్చు ఏ క్షణానైనా రావొచ్చు. ప్రతిరోజు పోస్టు శశిరేఖకి ఆశాభంగం కలిగిస్తూనే ఉంది.

'రాజగోపాలరావు ఇహరాడు. ఇహరాడు!' శశిరేఖ ఈవార్త నమ్మలేదు. నమ్మలేకపోయింది. కాని—అంతా నమ్మారు. పోస్టులో అతని దుస్తులువొస్తే మరి నమ్మక ఏం చెయ్యగలరు, ఎవరు మాత్రం? "ఇహరారా, రాజా?" దీనంగా, బాధగా అడుగుతుంది, రోజూ. సమాధానం ఎవరు చెబుతారు?

శశిరేఖ మెడిసిన్ ప్యాసైంది. ప్రాక్టీసుచేస్తోంది. 'లేడీ డాక్టర్ శశిరేఖ చాలామంచిది' అని ఎవరైనా అంటే ఆమెకి వెంటనే తన భర్త జ్ఞాపకం వొస్తాడు.

"ఎవరైనా ఆయన తరవాతే."

ఆమె కళ్ళలో నీళ్ళు గిర్రున తిరుగుతాయి. తన భర్తనించి తను నేర్చుకోవాలిసిందంతా అలా వృథాగా పోవాలిసిందేనా?

# 3

ఉదయం ఏడు గంటలయింది.

"రాజా, కాఫీ."

"..........."

"కాఫీ, రాజా."

రెండు కన్నీటి బిందువులు ఆమె కళ్ళనించి జారిపోయి 'రాజా' చేతుల్లోని పేపరు తడిపాయి.

కొన్ని క్షణాలు అలాగే గడిచిపోతూయి. ఆమె ఏవేవో సంగతులు జ్ఞాపకంచేసుకుంటోంది. మబ్బుపట్టిన సూర్యబింబంలా కాంతిహీనమైన ముఖం 'రాజా' భుజంమీద ఆనించి అలాగె ఉండిపోయింది.

"శశిరేఖా."

అస్పష్టంగా వినిపించాయి మాటలు.

'రాజా' పెదవులవైపు చూసింది, భ్రమతో. మళ్ళీ తలవాల్చుకుంది.

"శశీ."

ఏవేవో భావాలన్నీ అణచుకుంటూ గాద్గదికంగా వినిపించింది ఆ పిలుపు. శశిరేఖ తలెత్తిద్వారంవైపు చూసింది. సుదీర్ఘ విగ్రహం. దొరటోపీఉంది. నల్లటి కళ్ళద్దాలున్నాయి. షర్టుకుడిచేయి వేళ్లాడుతోంది. ఎడమచెంపమీద చెవిదాకా పెద్ద గాయంతగిలి మానిన మచ్చఉంది. ఎవరు?

అతను నల్లకళ్ళద్దాలుతీ సేశాడు.

"శశీ... నేనే, నీ..."

"రాజా!"

గుండె ఆగిపోయినట్టు ఒక క్షణం అనుభూతి పొందిందామె.

అతనామెని సమీపించాడు. ఆమె నుంచోలేకపోయింది. నెమ్మదిగా సోఫాలో కూచోబెట్టాడు. ఆమె గుచ్చిగుచ్చి చూస్తోంది.

"మీరేనా!"

"నేనే శశీ.?"

అతనివైపు అలాగే చూడసాగిందామె. తరవాత ఆమెకేమీ కనిపించలేదు. కన్నీటి తెరలు చూపుని అరికట్టాయి. కళ్ళుమూసుకొంది. ఆమె తలని హృదయాని కదుముకున్నాడతను.

పనిమనిషి బకెట్‌తో నీళ్ళు తెచ్చి అక్కడ పెట్టబోయి హఠాత్తుగా కొత్తవ్యక్తిని ఆ పరిస్థితిలో చూసి కంగారుపడి, బకెట్ తటాలున వొదిలేసి వెనక్కి వెళ్ళిపోయింది. చప్పుడుకి ఇద్దరూ మళ్ళీ ఈ లోకంలోకి వొచ్చారు. ఆమె ఏదో అడగాలనుకుంది. ఏమడగాలో, ఏది ముందడగాలో ఆమెకి తెలీలేదు.

"జీవితంలో మళ్ళీ ఎప్పటికైనా నిన్ను చూడగలుగుతానా అనుకున్నాను. శశీ."

శశిరేఖ మాట్లాడే స్థితిలో లేదు.

"గుండుదెబ్బతగిలి పడిపోయినప్పుడు కళ్ళని కమ్మిన చీకట్లో మెరుపులా ఒకసారి నువ్వు మెరిశావు. అదే ఆఖరిసారనుకున్నాను. కనీసం నా శశి ప్రతిబింబమైనా చూశాను. ఇహఏమైనా పరవాలేదనుకున్నాను. అదృష్టం బావుండి ఆ దెబ్బకి చచ్చిపోలేదు. ఆ రాత్రి తెల్లవారింది. చుట్టుపక్కల ఎవరూలేరు. అప్పటికప్పుడే ఆ ప్రదేశంనించి మనవాళ్ళు వెళ్ళిపోయారు. అకస్మాత్తుగా జరిగిన ముట్టడికి వాళ్ళు తట్టుకోలేకపోయారు కాబోలు. తరవాత ఎన్ని అవస్థలు పడ్డానో దైవానికే తెలుసు. ఖైదీల క్యాంపులో

దుర్భరజీవితం గడిపాను. ఎలాగో తప్పించుకున్నాను. యుద్ధం ఐపోయింది. నా సంగతి పట్టించుకున్నవాళ్ళు ఎవరూ లేరు. బహుశా చచ్చిపోయాననుకుని ఉంటారు. ఎన్నో అగచాట్లుపడి చివరికి మనదేశం చేరుకున్నాను."

డాక్టర్ రాజగోపాలరావు ఆగాడు. అతని కష్టాలకి ఆమె గుండె తరుక్కుపోతోంది. కాసేపు అదే అవస్థలో ఉండి తరవాత అడిగింది.

"వొచ్చేటప్పుడు ఉత్తరమైనా రాయలేదేం?"

రాజగోపాలరావు కొంచెం తట పటాయించి అన్నాడు.

"ఇక్కడి పరిస్థితులు ఎలా ఉన్నాయో నాకు తెలియదు కదా. స్వయంగావచ్చి పరిశీలించి, వీలునుబట్టి నన్ను తెనియ బరచుకుందా మనుకున్నాను. అందరూ నేను చచ్చిపోయి ఉంటానని నమ్మిఉంటారు."

శశిరేఖ అతన్ని మరింత దగ్గరగా హృదయానికి అదుముకుంది.

"అదేగాక..." అతను ఆగాడు.

ఏమిటన్నట్టు ఆమె అతనివైపు చూసింది.

"నువ్వు ఏ పరిస్థితిలో ఉన్నావో ముందు స్వయంగా చూడటం మంచిదనుకున్నాను, నిజంచెప్పాలంటె," ఆమె మళ్ళీ కన్నీళ్ళు నింపటంకంటె మరేమీ సమాధానం ఇవ్వలేదు.

"కాని, శశీ. మొదట అది విగ్రహం అనుకోలేదు. చప్పున వెనక్కుతగ్గాను. ఇంతలో 'కాఫీ రాజా' అని ఆర్ద్రంగా విషాద స్వరం వినిపించింది. శశీ, ఆ పిలుపులో ఏదో అనిర్వచనీయమైన అనుభూతి, మానవహృదయపు లోతుల్ని పరిశోధించి ఏదో నిత్యమైన సత్యాన్ని విన్నట్లుగా, అస్పష్టంగా నా హృదయం అంతటా నిండింది. ఏదో పాఠంచూశాను. ఇహ ఆగలేకపోయాను. లేక పోతే అంత అకస్మాత్తుగా కనిపించి ఉండను, శశీ."

భావోద్వేగంలో అతను ఇహ మాట్లాడలేకపోయాడు. శశిరేఖకూడా ఏమీ ప్రశ్నలు వెయ్యలేదు. అదే స్థితిలో మౌనంగా ఒకరి పక్కన ఒకరు ఆలోచించలేని మనస్సులతో నిశ్శబ్దంగా ఉండిపోయారు.

## 4

తెల్లవారింది ఆ రాత్రి. శశిరేఖ నిద్రలేచింది. ప్రక్కన చూసింది, ఎవరూ లేరు. సోఫావైపు చూసింది. కిటికీలోంచి వచ్చేగాలికి 'రాజా' చేతిలో పేపరు టపటప కొట్టుకుంటోంది. అంతాకలేనా! శశిరేఖ బరువుగా లేచి సోఫావైపు నడిచింది.

"పేపరు వార్తలేమిటి, రాజా?"

రాజా పలకడు.

"ఇది నిన్నటి పేపరు, భలే."

ఆరోజు పేపరుకోసం వెళ్ళబోతుండగా రాజగోపాలరావు ప్రత్యక్షమయాడు గుమ్మందగ్గర.

కలకాదు! ఆమె ముఖంలో సంతోషరేఖలు అ. ముకున్నాయి.

"పేపరు వార్తలేమిటి, రాజా?"

"రాజగోపాలరావు అనే మిలిటరీ డాక్టరు చిన్నచిన్న 'జేమీజీలతో' స్వదేశానికి తిరిగివచ్చాట." నవ్వుతూ అన్నాడతను. ఆమెకూడా హృదయపూర్వకంగా నవ్వింది. ఆ నవ్వులో గతంలోనిబాధా, వర్తమానంలోని సంతోషం మేళవించగా, కొన్ని క్షణాలు ఆమె తన ఉనికినే మర్చిపోయింది.

గాలికి పేపరు టపటపకొట్టుకుంది. ఆ ధ్వనికి శశిరేఖకి చైతన్యంకలిగింది. తటాలున ఆమెకి పేపరుసంగతి జ్ఞాపకం వొచ్చింది 'రాజా' వైపు చూసింది ఓసారి. వెంటనే రాజగోపాలరావు వైపుకి దృష్టి మళ్ళించి, ఓక్షణం ఆగి గభాలున అతని చేతిలో పేపరులాగేసి 'రాజా' చేతుల్లో పెట్టింది. అత నామెవైపు ఆశ్చర్యంగా చూశాడు. ప్రత్యుత్తరంగా ఆమె ఓ చిరునవ్వు మాత్రం నవ్వింది.

వంటమనిషి కాఫీబల్లమీద పెట్టి వెళ్ళిపోయింది. రాజగోపాలరావు పేపరు చూస్తున్నాడు.

"కాఫీ, రాజా."

సప్రేమగా కాఫీకప్పు అందుకున్నాడతను, పెదవులమీద మందహాసంతో.

శశిరేఖ 'రాజా' వైపు చూసింది. మళ్ళీ రాజగోపాలరావు వైపుచూసింది. ఏదో తృప్తి ఆమె అనుభవించింది. కాని మళ్ళీ ఏదో భావం మనసులో మెదిలింది.

'రాజా'—తను రోజూ ఆరాధిస్తున్న 'రాజా'కి 'కాఫీ అందివ్వలేదు. తన హృదయంలో ఉన్న రాజా ఎదురుగా ఉండగా ఇంకా ఈ విధంగా తను ఎందుకు నొచ్చుకోవాలి! ఆమె నవ్వింది! చిన్నగా. కాని సంపూర్ణంగా నవ్వలేకపోయింది. చెప్పలేని వెలితి ఏదో మిగిలిపోయింది.

"శశీ."

"..........."

"ఏమిటాలోచిస్తున్నావు?"

"..........."

"కాఫీ చల్లారిపోతోంది."

శశిరేఖకి అతనన్న మాటలేవీ వినపడలేదు. అత నామె బుజాన్ని తట్టాడు. ఉలిక్కిపడ్డది.

"ఏమిటలా చూస్తున్నావు?"

ఆమె పెదవులమీదికి నవ్వు తెచ్చుకొని అంది. "ఏంలేదు."

"కాఫీతాగు."

అప్రయత్నంగా ఆమె కాఫీ గబగబతాగేసి కప్పు కింద పెట్టింది.

"నీళ్ళు అక్కర్లేదుగా, అమ్మగారూ?" కప్పులు తీసుకు పోతూ పనిమనిషి అడిగింది.

"ఎందు కక్కర్లేదు?"

మళ్ళీ శశిరేఖ హృదయంలో ఏదో బాధ మెదిలింది. పని మనిషి మాట్లాడకుండా బకెట్‌లో నీళ్ళు తెచ్చి అక్కడపెట్టి వెళ్ళిపోయింది. శశిరేఖ తువ్వాలు నీళ్ళలో ముంచి 'రాజా' ముఖం, చేతులూ తుడిచింది. కొత్త పర్దువేసింది. రాజగోపాలరావు ఇదంతా ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

"ఏమిటి శశీ, ఇదంతా?"

ఆమె రెప్పవేయకుండా 'రాజా' వైపు చూస్తోంది. ఏమీ అనలేదు.

రాజగోపాలరావుకూడా ఆమె చూస్తున్నవైపే చూశాడు తదేకంగా. ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌తో చెయ్యబడ్డ అవిగ్రహం మూడు మూర్తులా తనలాగే ఉంది. అకస్మాత్తుగా చూస్తే సజీవుడైన మనిషేనని భ్రమకలిగిస్తుంది. మొదట రాజగోపాలరావుకూడా అలాగే అనుకున్నాడు—పేపరు చూస్తూ, సోఫాలోకూర్చున్నట్టుగా ఉన్న ఆ విగ్రహంచూసి.

ఉన్నట్టుండి రాజగోపాలరావు గట్టిగా నవ్వాడు. కలలోనించి తేరుకున్నట్టుగా శశిరేఖ ముఖ భంగిమపెట్టి అతనివైపు చూసింది, ప్రశ్నార్థకంగా.

"నీ బొమ్మకూడా ఒకటి చేయించి దానివైపు నన్నుకూడా చూస్తూ కూర్చోమంటావా ఏమిటి?"

శశిరేఖ నవ్వలేదు. అతనివైపు తృప్తిగా తేరిపారచూసి అతని బుజంమీద తల ఆనించి 'రాజా' అని ఆనందాతిరేకంతో కౌగలించుకుంది.

ఎన్నాళ్ళో తపస్సుచేసింది. తన రాజా తనకి తిరిగి లభించాడు. జీవితంలో అంతకంటె కావలసిందేముంది? అంతకంటె తను కోరే సౌఖ్యం, ఆనందం, కోరిక ఏముంటాయి?అలా ఎప్పుడూ తను అతని బుజంమీద తల ఆనించి ఏ భావనాప్రపంచంలోనో విహరించకలిగితే చాలు; జీవిత పరమావధి అందుకున్నట్టే. తన రాజా తనని ఇహ విడిచిపోడు. ఇహ తనకి కష్టాలు లేవు. విషాదం తన నించిదూరమైపోయింది. అనంతమైన ఆనందం, అనిర్వచనీయమైన ఆనందానుభూతి ఇహనించి తనదే. శశిరేఖ మురిసిపోయింది. సంతోషంతో హృదయం నిండిపోయింది. కాని...కాని, ఏమూలో—ఎక్కడో—ఏదో వెలితి. ఏదో తన నించి అస్పష్టంగా, కాని నిజంగా దూరమై, సుదూరమై పోతున్నట్టు- మనసులో మారుమూల ఛాయామాత్రంగా అనిపించింది.

## 5

"ఇవాళ ఓ ఆపరేషన్ చాలా నేర్పుగా చేశాను, రాజా."

రాజగోపాలరావు గర్వంగా వింటున్నాడు.

"మొదట భయపడ్డాను. కాని చాలా జయప్రదంగా చేశాను."

"నా శశి గొప్ప డాక్టరైపోతోందన్నమాట."

"ఎంతగొప్ప డాక్టరైనా నారాజా తరవాతే."

"శశీ." అనురాగంతో నిండిన హృదయంతో ఆమె కళ్లలోకి చూశాడు, రాజగోపాలరావు.

అకస్మాత్తుగా శశి 'రాజా' వైపు చూసింది, ఆమె ముఖంలోని సంతోష చిహ్నాలు నెమ్మదిగా అంతరించాయి. అలాగే ఆ విగ్రహంవైపు చూస్తూనుంచుంది. తను 'రాజా' తో ఇప్పుడు అసలు మాట్లాడటంలేదు. ఆమె హృదయంలో ఏదో బాధ ఆమెని కలచివేసింది. తన 'రాజా'ని తను నిర్లక్ష్యం చేస్తోంది. ఒక్కమాటకూడా మాట్లాడటంలేదు. బాధగా అంది. "రాజా!" ఈ పరిస్థితి అర్థంకాక రాజగోపాలరావు తికమకపడ్డాడు.

"శశీ!" ఆమె పలకలేదు. మళ్ళీ పిల్చాడు. బుజం తట్టాడు.

"అలా ఐపోయావేం?"

శశిరేఖ అతనివైపు చూసింది. క్రమంగా ఆమె ముఖం వికసించింది. తన 'రాజా' అక్కడే, తన ఎదురుగానే ఉన్నాడు. ఏమిటి తన కాపిచ్చి భ్రమ—దౌర్బల్యం! తను తన రాజాని ఏమాత్రం నిర్లక్ష్యంగా చూడటంలేదు. ఎంతో ప్రాణంగా చూసుకుంటోంది. ఆమె నవ్వుతూ అతని ముఖంలోకి చూసింది. తొలగిపోయిన ఆనందం మళ్ళీ ఆమెని ఆశ్రయించింది. కాని-ఆ ఆనందం వెనకాల, దూరంగా, లీలగా, పోగొట్టుకున్న వస్తువేదో పోతే కలిగే అనుభూతి లాంటిది-తన ఉనికిని తెలియచేస్తోంది. రానురాను శశిరేఖకి ఇదో సమస్యగా పరిణమించింది. ఉన్నట్టుండి 'రాజా' విగ్రహం జ్ఞాపకంవొస్తుంది. మళ్ళీ తన రాజాని తలుచుకొని తృప్తిపడుతుంది. ఏదో వెలితి మాత్రం లీలగా గోచరిస్తూనే ఉంటుంది.

ఈ పరిస్థితి చాలాసార్లు గమనించాడు రాజగోపాలరావు. ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌తో చెయ్యబడిన ఆ విగ్రహం చూస్తున్న కొద్దీ మానసికంగా అతనికేదో బాధకలిగేది. నిండైన ఆ విగ్రహం పూర్తిగా తన పోలికే. తను పూర్వం—యుద్ధంలోకి వెళ్ళకముందు అలాగే ఉండేవాడు. కాని ఇప్పుడు...రాజగోపాలరావు ఇహ ముందు ఆలోచించలేకపోయేవాడు. ఆ ఆలోచనే అతనికి భయం కలిగిస్తుంది. తను కుడిచెయ్యిలేని డాక్టర్. ముఖంమీద వికృతంగా పెద్దమచ్చ. బండబారిన ముఖం...కాని తను, ఎలా ఉంటేయేం? తన శశికి తనమీద ఎంతో మక్కువ, అయినా శశి ఆ విగ్రహంవైపు అలా చూస్తుంటే, దాన్ని అంతశ్రద్ధగా రోజూ శుభ్రంగా ఉంచటానికి పాటుపడుతుంటే అతనిలో ఏదో అయిష్టత గూడుకట్టుకుని ఎక్కువ కాసాగింది. తను పక్కన ఉండగా ఇంకా ఆ విగ్రహం గురించి అంత బాధెందుకని ఎన్నోసార్లు అడిగాడు - పరోక్షంగా, దాన్ని మరోచోటికి మరలించమని సూచించాడు. కాని శశి ఒప్పుకోలేదు. ఎక్కువగా ఆ విషయం గురించి మాట్లాడటం హాస్యాస్పదంగా ఉంటుందని ఊరుకున్నాడు.

శశి ఆరోగ్యం విషయం అతనికి కొంచెం ఆందోళన కలిగించింది. ఆమె ఏదో మనసులో బాధపడుతున్నట్టుగా అతనికి కొన్నాళ్ళనించీ అనుమానంకలిగింది. ఆ ఉదయం కాఫీ తాగుతుంటే అడిగాడు కారణం. ఆమె నవ్వి ఏమీ లేదంది.

"అలా రోజురోజుకీ తగ్గిపోతూ ఏమీలేదంటావేం?"

శశి తనవైపు ఓసారి చూసుకుంది.

"నేనేం తగ్గాను?"

రాజగోపాలరావు సూటిగా అన్నాడు.

"నిజంగా అడుగుతున్నాను, శశీ. నీ మనసులో బాధేమిటో నాకు చెప్పకూడదా?"

అతని వ్యథచూసి ఆమె బాధపడ్డది. ఏం చెబుతుంది? తనకేం తెలుసు? 'రాజా' వైపుచూసింది. మళ్ళీ రాజగోపాలరావువైపు చూసింది. మళ్ళీ విగ్రహంవైపు చూసింది. మనసులో ఏవో ప్రశ్నలకో ఏవేవో సమాధానాలు చెప్పుకుంది. ఏదో తెలియని వేదన - అశాంతి తృప్తి. మళ్ళీ అశాంతి. "రాజా!" ఆమె అతని భుజంమీద తల ఆనించి కళ్ళుమూసుకుంది. తెలియనిదేదో తెలుసుకోవాలనే వేదన భరించలేకుండా ఉంది. తనకేమీ తక్కువ కాలేదు. కోరికలేమీ లేవు. అయినా మనసుకి కావలసిన ప్రశాంతత తనకి ఎందుకు కొరవడింది? ఒక్కసారి ఏడవాలని ఉంది. ఎందుకు? ఏమో! కాని తను ఏడవలేదు. ఏడుపు రాదు. ఆ పాడురోజులు పారిపోయాయి. తనకి జీవితంలో కావలసినంత సౌఖ్యం. తన రాజా, తన జీవన విధాత తనపక్కనే ఉన్నాడు. ఆమె అతన్ని గట్టిగా కౌగలించుకుంది.

అతను ఆలోచించి బుర్ర బద్దలుకొట్టుకుంటున్నాడు. ఏమిటి, తన శశికి ఏం కావాలి? అలా తనవైపూ, విగ్రహంవైపూ ఎందుకు చూస్తుంది? చూసి ఎందుకు బాధపడుతుంది? ఆమె మనోవ్యథకి కారణం ఇందులోనే ఉందా? రాజగోపాలరావుకి బాధాకరమైన ఆలోచన తట్టింది. కాని . . కాని . . . అసంభవం.

"శశీ." ఆర్ద్రంగా పిలిచాడు. ఆమె వినేస్థితిలో లేదు. మళ్ళీ పిలిచాడు. సమాధానం లేదు. అతని మనసు. ఆలోచిస్తూనే ఉంది. సమాధానంకోసం వెతుకుతూనే ఉంది. రోజంతా ఆలోచిస్తూనే ఉన్నాడు. రాత్రి పడుకున్నా మనసు మాత్రం మెలకువగానే ఉంది. ఎప్పుడో కునుకుపట్టింది. కలత నిద్రలో లేచాడు.

"శశీ."

సమాధానం లేదు. పక్కనచూశాడు. ఆమె లేదు. అతని గుండె గతుక్కుమంది. సోఫావైపు చూశాడు. ఆ మసక వెలుతురులో అస్పష్టంగా కనిపించింది. విగ్రహం భుజం ఆనుకుని శశిరేఖ భావనా ప్రపంచంలో ఉంది.

"శశీ."

ఆమె పలికే స్థితిలో లేదు. ఏదో ఆలోచిస్తోంది. హృదయంలో ఏదో బలీయంగా ఆమెని బాధిస్తోంది. 'రాజా' దగ్గర సోఫాలో కూర్చుంది. విగ్రహం భుజంమీద తల ఆనించింది. ఏదో అనుభూతి దగ్గరౌతూ, మళ్ళీ దూరంగాపోతూ ఆమెని వేధిస్తోంది. ఆమెకి ఏడవాలనిపించింది. కాని కన్నీరురాదు. విగ్రహం ముఖంలోకి చూస్తోంది. 'రాజా' అంటుంది. 'నీతో మాట్లాడటం లేదని కోపమా, రాజా' అంటుంది. బరువు తీరిపోయేలా ఒక్కసారి దుఃఖం పొంగిపొర్లితే బావుండుననిపిస్తుంది. కాని తనకేం లోటు? తనకంటే సౌఖ్యవంతురాలు ఎవరు? తనరాజా ఇవాతనని విడిచివెళ్ళిపోడు. తనకేం కష్టాలు లేవు. జీవితాంతం సుఖంగా గడపవచ్చు. కాని . . . భర్తపక్కన ఉండగా ఇంకా తనకీ విగ్రహం మీద ఈ అపేక్ష ఎందుకు? అన్నేళ్ళ సహవాసమా?

రాజగోపాలరావు లేచివచ్చి నెమ్మదిగా ఆమె భుజంతట్టాడు. ఉలిక్కిపడ్డది. దగ్గరకి తీసుకున్నాడు. అతనిభుజంమీద తల ఆనించి అలాగే కూర్చుండిపోయింది ఆమె. అతను బుజ్జగించి అడిగాడు.

"శశీ, నాకు చెప్పవా, నీ బాధ?"

ఏం చెబుతుంది? ఏదో చెబితే బావుంటుందనిపించిందామెకి, అతని వేదనచూసి. కాని ఏం చెబుతుంది?

"నాకు చెప్పలేదనా?"

"కాదు రాజా. కానేకాదు." అందామనుకుంది. నోటిదాకా వచ్చింది. కాని ఏదో కారణం చెప్పకపోతే తన రాజా ఎంతో మథనపడతాడు. అంచేత మాట్లాడకుండా ఊరుకుంది. అతను మళ్ళీ అడిగాడు. "ఊఁ" అనలేకపోయింది. అతన్ని దగ్గరగా తీసుకుంది. "అంతేనా?" అన్నాడు. ఇంకా మౌనమే. అతనిగుండె గట్టిగా కొట్టుకుంది. మనసు మనసులో లేదు. తలలో నరాళ్ళు పరిగెత్తుతున్నాయి, కాని ఆమెకిదేమీ తెలీదు. రాజగోపాలరావు కొద్దిక్షణాలకి సర్దుకున్నాడు. అవును. స్పష్టంగా కనిపించే విషయం కనిపెట్టటానికి తనకిన్నాళ్ళు పట్టింది. ఆమె విగ్రహంవైపూ, తనవైపూ చూడటంలో అర్థమేమిటి? ఆ విగ్రహానికి ఉన్నదేదో తనకి లోపించింది. ఏం లోపించింది? హుఁ. తనకంటె గుడ్డివాడు ఈ ప్రపంచంలో ఇంకెవరూ లేరు. ఈ స్వల్ప విషయానికి బుర్రబద్దలు కొట్టుకున్నాడు. ఆ మసక వెలుతురులో శశిరేఖ ముఖంలోకి చూశాడు. ఆమె కళ్ళుమూసుకుని ఉంది. మనసులో పిలిచాడు. "శశీ!" అతని కళ్ళలో నీళ్ళుతిరిగాయి.

## 6

మధ్యాహ్నం భోజనంచేసి వెళ్ళిన కెప్టెన్ రాజగోపాలరావు సాయంత్రమైనా తిరిగి రాకపోవటంచూసి ఆశ్చర్యపడ్డది శశిరేఖ. కాని ఆ రాత్రికూడా అతని దర్శనం కాదని ఆమె కలలోకూడా అనుకోలేదు. అమితంగా గాభరా పడ్డది. తెలిసినచోట్లకి వెళ్ళి చూపింది. కాని జాడలేదు.

మర్నాడు 'రాజా' పట్టు మారుస్తుంటే, జేబులో ఏదో కాగితం కనిపించింది. తీసి చదివింది శశిరేఖ ఎడంచేతిదస్తూరీ.

"ప్రియమైన శశీ!"

రాత్రంతా గాభరాపడ్డావా? కన్నీరు విడవటంకంటె ఏం చెయ్యగలను? నేను నీ ఎదురుగా ఉన్నంతకాలం నీకు శాంతి ఉండదు. నాకు తెలుసు, నీ మనోవేదన. నీ ప్రియమైన రాజా కుడిచెయ్యి పోగొట్టుకుని, వికారి ఐ ఏమీచెయ్యలేక జీవచ్ఛవంగా బతకటం నువ్వు సహించలేవు. ఒకనాడు ప్రఖ్యాతి వహించిన సర్జన్ నేడు పనికిమాలినవాడు. శశీ, ఇలా జీవించటం నాకూ దుర్భరంగానే ఉంది. అసలు తిరిగిరాకుండా ఉండవలసింది. ఒక్క ఆకర్షణ నువ్వే, శశీ! నిన్ను చూశాను. చాలు. నేనుఆ

ఉన్నంతకాలం నీకు మనశ్శాంతి ఉండదు, నువ్వుకూడా నా కళ్ళ ముందే, నేను చూస్తూ ఉండగానే జీవచ్ఛవంలా ఐపోయి, నిరంతర వేదనతో ఎందుకూ కొరగాకుండాపోటం ఎలా సహించగలను?

శశీ, మరోలోకం ఏదైనా ఉంటే మనం తప్పకుండా కలుసుకుంటాం - అక్కడ. అందాకా ఎక్కడో—

నీరాజా,

ఉత్తరం ఎలా పూర్తిచేసిందో తెలియదు; శశిరేఖ 'రాజా' మీద రెండు చేతులూ వేసి తల బుజంమీద ఆనించి భోరున ఏడ్చింది. కన్నీరు ఎడతెగకుండా ప్రవహిస్తూ 'రాజా' ని తడిపేస్తోంది.

రాజా ఇహ రాడు.

ఆమె కుమిలికుమిలి ఏడ్చింది.

"ఇదేనా రాజా, మీరు అర్థంచేసుకుంది?"

ఎన్నో వందలసార్లు అడిగింది.

'రాజా' పలకడు. కళ్ళెత్తిచూడడు.

దుఃఖం ఆమెగుండె చీల్చుకుని నదీప్రవాహంలా ప్రవహించసాగింది. ఆ ప్రవాహంలో వ్యథలూ, బాధలూ అన్నీ కొట్టుకుపోయాయి. అపారమైన, అనిర్వచనీయమైన శోకం ఏదో గీతిక ఆలాపించగా, శశిరేఖ కన్నీటి కెరటాలమీద తేలిపోతోంది - ఎక్కడికో, ఏ సీమలోకో. ఆ తరంగమృదంగవాద్యం వింటూ, తన్మయావస్థలోకి ప్రయాణిస్తున్న శశిరేఖ మనసులో కనిపించింది, మారుమూల, ఛాయామాత్రంగా - క్రమంగా స్పష్టంగా - తననించి దూరమైనదేదో తన దగ్గిరికి వొస్తోంది క్రమంగా, నిజంగా.

శ్రీరస్తు-శ్రీ త్రిపురసుందరీ పరశివాభ్యాం నమః

# శ్రీవిజయనామ సంవత్సర పూర్ణశాస్త్రీయ (ఆంధ్రపత్రికా) పంచాంగమ్

## బ్రహ్మశ్రీశ్రీమత్పిడపర్తి చినపూర్ణార్య సిద్ధాన్తినస్తృతీయఃపుత్రేణకృష్ణమూర్తిశాస్త్రిణాప్రణీతం

విఘ్నేశ విధిమార్తండచంద్రేంద్రోపేంద్రవందిత । నమో గణపతే తుభ్యం బ్రహ్మణాం బ్రహ్మణ స్పతే ॥
వేదమయీం నాదమయీం బిందుమయీం పరపదోద్యదిందుమయీం
మంత్రమయీం తంత్రమయీం ప్రకృతిమయీం నౌమి విశ్వవికృతిమయీం ॥

### గమనిక

ఈసంవత్సరమున రాజును మంత్రియు చంద్రుడే ఆయెను. శ్రీకృష్ణుడు పశుపాలకుడు. 3 కుంచములు వర్షము, సర్వసస్యసముదాయమగు ౧౬ వీసములలో ౧౧ వీసముల పంటయు గలుగును.

ఆషాఢ శు ౧౫ ఆ. న ముచ్ఛ్యమానోదయ చంద్రగ్రహణమున్ను, పౌష శు ౧౪ సో. న గ్రస్తాసమయ చంద్రగ్రహణమున్ను సంభవించును.

చైత్ర బ ౧౦ గు. న నర్మదానదీ పుష్కరప్రవేశము.



### మౌఢ్యములు

చైత్ర బ ౯ బు. ప్ర॥ అధిక వైశాఖ శు ౨ బు.ప॥ శుక్రమౌఢ్యము. అధిక వైశాఖ బ ౧౪ మం. ప్ర॥ నిజవైశాఖ బ ౧౨ సో. ప॥ గురుమౌఢ్యము. తిరుగ మార్గశిర బ ౯ మం. ప్ర॥ మాఘ బ ౯ శ. ప॥ శుక్రమౌఢ్యము.

| | |
|---|---|
| కల్యాద్యబ్దాః | ౫౦౫౪ |
| శాలివాహనశకః | ౧౮౭౫ |
| ఫసలీ సన్ | ౧౩౬౨-3 |
| హిజరీ సన్ | ౧౩౭౨-3 |
| క్రీస్తుశం. | 1953, ౫4 |

శ్రీ శ్రీ శ్రీ

## ఆంధ్రపత్రికా కార్యాలయము, మద్రాసు 1.

# పంచాంగపద్ధతి ప్రశంస

భారతదేశమున గ్రహసంచారాది గణితమును బోధించు సూర్యాదిసిద్ధాంతములు అనాదికాలమున రచింపబడినవి. తరువాత నాయాసిద్ధాంతములచే సాధింపబడిన గ్రహసంచారాదికము ఆకసమునందు సరిపడక అంతరము గలుగుచుండ తత్తత్కాలమందైన గ్రంథకర్తలు ఆ అంతరములను గనుగొని సంస్కరించుచుండిరి. అట్లు సంస్కరింపబడు అంతరమునకే బీజసంస్కారమని పేరు. ఆ బీజసంస్కారమున్ను ఒక్కొక్క రొక్కొక్కవిధముగ కాలభేదముచే గనుగొనిరి. అట్టి బీజసంస్కారసహితములగు గ్రంథములును పంచాంగములును భారతదేశమున పలువిధములైనవి. ఒక్కొక్క దేశమునందొక్కొక పద్ధతి పంచాంగము వ్యవహరింపబడుచుండెను. అది వారివారి ఆచారసిద్ధమయ్యెను. మనదేశమున ఆచారసిద్ధమగు పంచాంగపద్ధతి మనపూర్వపద్ధతి. ఇది యిట్లుండ మనదేశమున అట్టి సంస్కారముల గనుగొను పరీక్షకులు యంత్రసామగ్రియు ఇటీవల తక్కువయగునపుడు విదేశములందు పరీక్షకులు సూక్ష్మయంత్రసామగ్రిచే గ్రహగతుల పరిశీలించి గ్రంథములను రచించిరి. గ్రహనక్షత్రసంచారమునున్ను ప్రకటించుచుండిరి. వాటింబట్టి నూతన మార్గమున చేసిన పంచాంగములు ఆకసమున సరిపడుచున్నవి. ఇవియే దృగ్గణిత పంచాంగములు. భారతదేశమునందిట్టి (అబ్జర్వేటరీ) దృగ్గణితపంచాంగము మద్రాసు నగరమునుండి యే తొలుదొల్త క్రీ. సం 1869 నుండి ప్రకటింపబడెను. మహారాష్ట్రదేశమునందును ఆ సంవత్సరమునుండియే ప్రకటింపబడెను. ఈపద్ధతి క్రమముగ నన్నిదేశములందును వ్యాప్తినొందినది. అట్టి దృగ్గణిత పద్ధతియందు మేషారంభమునుగూర్చి చాల వివాదములు గలిగినవి గాని,అందు చిత్రాపక్షముఖ్యాశ్విన్యాది బహుప్రమాణసిద్ధమై వైదికమైనదగుటచే భారతదేశమునందంతటను అనేకులగు పంచాంగకర్తలు అట్టి వైదికాశ్విన్యాదిని బట్టి దృగ్గణితపంచాంగములను రచించి ప్రకటించుచున్నారు. ఈ పంచాంగములందలి గ్రహసంచారము జాతకాదులందు బాగుగ రుజువిచ్చుచున్నది. కావుననే దేశమందంతటను దృగ్గణితపంచాంగములు వ్యవహరింపబడుచున్నవి. ఐనను కొన్ని కర్మలపట్ల కొందరు పూర్వపద్ధతి పంచాంగమునకై నిరీక్షించుచున్నారు. కావుననిందు పూర్వపద్ధతిచేనైన తిథులున్ను తిథినిర్ణయములున్ను గూడ వేరుగ చూపబడినవి. దృగ్గణితపద్ధతి పంచాంగమే పూర్ణశాస్త్రీయము. అందు సాయనమానముచే ఋతువులు మార్పుచెందినవి. అట్టి ఋతుపరిణామమునుగూర్చి లోకమాన్య బాలగంగాధరతిలకు మొదలగు విమర్శకులు విశేషముగ వ్రాసియున్నారు. ఆ ప్రకారము ఋతుపరిణామమున్ను సూచింపబడినది. వర్షములు ధరలు దేశక్షేమాదికమున్ను విమర్శించి వ్రాయబడినవి. ఇందుగల ప్రతి విషయమున్ను విమర్శించి శాస్త్రప్రమాణసిద్ధమగు నదియే వ్రాయబడినది.

శ్రీః శ్రీః శ్రీః

## దేశాంతర చక్రము

| పట్టణములు | మేష తులా | వృష కన్యా | మిథున సింహ | కర్కాటక | వృశ్చిక మీన | ధనుః కుంభ | మకర |
|---|---|---|---|---|---|---|---|
| శృంగేరి | ౬౫ | ౮౩ | ౮౯ | ౭౧ | ౫౮ | ౫౧ | ౪౯ |
| మైసూరు | ౫౦ | ౬౦ | ౬౭ | ౮౨ | ౪౦ | ౩౨ | ౨౭ |
| బెంగుళూరు | ౪౨ | ౫౧ | ౫౭ | ౬౧ | ౩౩ | ౨౬ | ౨౩ |
| అనంతపురం | ౪౨ | ౪౮ | ౫౧ | ౫౩ | ౩౮ | ౩౩ | ౩౧ |
| కర్నూలు | ౩౮ | ౪౦ | ౪౨ | ౪౩ | ౩౪ | ౩౨ | ౩౧ |
| నెల్లూరు | ౧౮ | ౨౩ | ౨౮ | ౨౯ | ౧౦ | ౮ | ౫ |
| హైదరాబాదు | ౩౨ | ౩౧ | ౩౧ | ౩౦ | ౩౩ | ౩౩ | ౩౪ |
| తంజావూరు | ౨౮ | ౪౦ | ౫౧ | ౫౪ | ౧౪ | ౪ | ౦ |
| కంచి (కామకోటి) | ౨౦ | ౨౯ | ౩౮ | ౩౯ | ౧౧ | ౩ | ౧ |
| వరంగల్లు | ౨౪ | ౨౩ | ౨౩ | ౨౨ | ౨౫ | ౨౫ | ౨౬ |
| బెజవాడ | ౧౨ | ౧౩ | ౧౪ | ౧౪ | ౧౧ | ౧౦ | ౧౦ |
| చెన్నపురి | ౧౫ | ౨౪ | ౩౦ | ౩౩ | ౬ | ౦ | ౩ |
| కుంభకోణం | ౨౩ | ౩౮ | ౪౮ | ౫౧ | ౯ | ౨ | ౫ |
| విజయనగరం | ౧౬ | ౧౭ | ౨౦ | ౨౨ | ౧౪ | ౧౨ | ౧౦ |
| బరంపురం | ౩౦ | ౩౪ | ౩౭ | ౪౦ | ౨౬ | ౨౨ | ౨౦ |
| రంగూన్ | ౧౪౫ | ౧౪౫ | ౧౪౪ | ౧౪౪ | ౧౪౫ | ౧౪౬ | ౧౪౬ |

## రాజమండ్రినుండి స్వగ్రామమునకు మార్పుట

రాజమండ్రినుండి ఆయాపట్టణములకు మేషాదిసాయనమాసములందుగలుగు దేశాంతరవిఘటికలు పైచక్రమునందు గలవు. ఆయా రాశ్యయనప్రవేశము మొదలు ఆయారాశి సాయనమాసము లగుచుండును. పై దేశాంతరవిఘటికలు సాయనమాసారంభమునందగును. స్వగ్రామమునకు సమీపమందున్న పట్టణమునకు అభీష్టసాయనమాసమందగు దేశాంతర విఘటికలను పంచాంగతిథ్యాదులందు నల్లని రేఖకు పైనున్నవాటిని తీసివేయవలెను. క్రిందనున్నవాటిని కలుపవలయును. అట్లుచేయగా స్వగ్రామములకు తిథ్యాదు లగుచున్నవి.

## మేషాది నిరయనరాశి ప్రమాణములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| మేషము | ౪-౨౨ | సింహము | ౫-౧౮ | ధనుస్సు | ౫-౧౭ |
| వృషభము | ౫-౧ | కన్య | ౫-౧౩ | మకరము | ౪-౩౯ |
| మిథునము | ౫-౩౧ | తుల | ౫-౨౪ | కుంభము | ౪-౭ |
| కర్కాటకము | ౫-౩౧ | వృశ్చికము | ౫-౩౫ | మీనము | ౪-౧ |

## మేషాదిసాయనరాశిప్రమాణములు

(నిరక్షరదేశమునకు)

| | | | |
|---|---|---|---|
| మీనమేషములు | ౪-౩౯ | కర్కాటధనుస్సులు | ౫-౨౨ |
| వృషభకుంభములు | ౪-౫౯ | సింహవృశ్చికములు | ౪-౫౯ |
| మిథునమకరములు | ౫-౨౨ | కన్యాతులలు | ౪-౩౯ |

## ఇవి దశమ లగ్నాయనమున కావశ్యకములు

| | ° | ′ | ″ |
|---|---|---|---|
| అయనాంశములు | భా ౨౩ | లి ౧౧ | విలి ౨౦ |

| | ′ | ″ |
|---|---|---|
| అయనాంశగతి | విలి ౫౦ | ౨ |

## సంవత్సర ఫలము

జగల్లగ్నము:

| మి | వృ | మే | మీ |
|---|---|---|---|
| | | కు గు శు | ర చం బు |
| కే | జగల్లగ్నము | | |
| ల | | | రా |
| | శ | | |

వర్షలగ్నము:

| మి | వృ | మే | మీ |
|---|---|---|---|
| | గు | ర కు | చం బు శు |
| కే | వర్షలగ్నము | | |
| ల | | | రా |
| | శ | | |

జగల్లగ్న వర్షలగ్న చక్రములు రెండిటియందును లగ్నము సింహమే అయినది. చతుర్థస్థానాధిపతియైన కుజుడు భాగ్యమందు స్వక్షేత్రగతుడై యుండుటచేత జగల్లగ్నమునుబట్టి కుజునకు శుభ సంబంధ ముండుటచేతను వర్షలగ్నమునుబట్టి కుజుడు రవితో గలసినను రవి లగ్నాధిపతి యగుటచేతను వ్యవసాయము మొదలగు పరిశ్రమలు లాభదాయకములై సుఖకరము లగును. కాని జగల్లగ్నమును బట్టి లగ్నాధిపతి యష్టమమున నుండుటచే ప్రపంచసౌఖ్యము కొంచె మల్పమైనను శుభసంబంధాధిక్యముచే మిశ్రమముగ నుండును. రాజ్యాధిపతి వర్షలగ్నమునుబట్టి అష్టమమందు వ్యయాధిపతితో గలసియు, జగల్లగ్నమునుబట్టి షష్ఠాధిప శనివీక్షణము గల్గియుండుటచే రాజ్య సంబంధమైన వివాదములు గలుగుచున్నను జగల్లగ్నమునుబట్టి కుజగురు సంబంధముచేతను వర్షలగ్నమునుబట్టి బుధ సంబంధముండి రాజ్యమున గురుస్థితిచేతను తృతీయమున రెండు చక్రములందును ఉచ్చశని సంబంధముచేతను ధైర్యసాహసముల చేతను నీతిచేతను వివాదములు పరిహరింపబడి సత్పరిపాలనము గలిగి రాజకీయమగు అభివృద్ధి విశేషములు గలుగును. షష్ఠవ్యయములందు రాహుకేతు సంబంధముచే వ్యయ మల్పమై లాభాధిక్యము గలిగి యుండును. వర్షలగ్నమునుబట్టి ధర్మస్థానమున ఆధిపత్య శ్శుభులైనను నైసర్గిక పాపులగు రవికుజు లుండుటచేతను జగల్లగ్నమును బట్టి గురుశుక్రు లున్నను కుజ సంబంధముచేతను రెండిటియందును శని వీక్షణముచేతను వైదికధర్మము లుప్తప్రాయమైనను కొంచెము అభివృద్ధి ప్రయత్నములు జరుగుచుండును.

రెండుచక్రముల బట్టియు అగ్రిమపూర్ణిమా ప్రవేశలగ్నమును బట్టియు విచారింప ధాన్యము గోధుములు ప్రత్తి పప్పుపదార్థములును కొంచెము ధరగలిగియున్నను సులభముగ దొరకుననియును, శర్కర బెల్లము చింతపండు మొదలగు షడ్రసవస్తువులు దుర్లభము లగుననియును తోచుచున్నది. కాని ఆయా మాసములందైన గ్రహస్థితినిబట్టియు వేర్వేరుగ పదార్థముల ధరలు మరియొకచోట వ్రాయబడినవి.

ఈ సంవత్సరమున కొంతవరకు మొదట నచటచట ఖండఖండములుగ మంచి వర్షములు గురిసినను శ్రావణ భాద్రపదములలో అంతటను అనుకూలములగు వర్షములు గలుగవచ్చును. భాద్రపదాశ్వయుజములలో అపుడపుడు వాయుయోగములు గానవచ్చుచున్నవి. సర్వసస్య సముదాయమగు ౧౬ వీసములలో ౧౧ వీసముల పంట ఫలించును.

సర్వేషాం సమస్త శుభాని భవన్తు.

## చంద్రగ్రహణము

ది 26 జూలై 1953 సం.

విజయ సంవత్సరే ఆషాఢ శు ౧౫ ఆ. రే ముచ్యమానోదయ ఖచ్ఛన్న చంద్రగ్రహణమ్. రాహుగ్రస్తః. పింగళవర్ణః సూర్యోదయాదితః.

స్పర్శకాలః ౨౫-౪౩ ప గం 3-59
నిమీలనకాలః ౨౮-౧౦ ప గం 4-58
మధ్యకాలః ౩౦-౧౬ ప గం 5-48
సూర్యాస్తమయాదితః
ఉన్మీలనకాలః ౦-౮ సా గం 6-39
శుద్ధమోక్షకాలః ౨-౩౪ సా గం 7-38



ఆద్యంత పుణ్యకాలః ౯-౫ గం 3-38 బింబాదర్శనకాలః ౪-౧౨ గం 1-41

ఉత్తరగోలః సవ్యగ్రహణం ఈశాన్య దిక్స్పర్శః. నైరృతి నిమీలనం. ఈశాన్యోన్మీలనం. నైరృతిదిఙ్మోక్షః.

## నిత్యభోజన ప్రత్యాబ్దికాది నిర్ణయము

"గ్రస్తోదయే విధోఃపూర్వం నాహర్భోజన మాచరేత్." అను ధర్మశాస్త్రవచనముచే నీ గ్రహణము గ్రస్తోదయముగావున నీనాడు, పగలు భుజింపరాదు. రాత్రియందైనను శుద్ధ మోక్షానంతరము స్నానముచేసి భోజనము చేయవలెను. ప్రత్యాబ్దికాదికమున్ను— "గ్రస్తోదయో భవే దిందో ర్దివా శ్రాద్ధం నకారయేత్ | రాత్రావపి తదాకుర్యా త్ప్రత్యబ్దం మను రబ్రవీత్ ||" అను ప్రమాణముచే శుద్ధ మోక్షానంతర మే చేయదగినది.

## చంద్రగ్రహణము

ది 18 జనవరి 1954 సం.

విజయ సంవత్సర పౌష శు ౧౪ సో. రే గ్రస్తాస్తమయ ఖచ్ఛన్న చంద్రగ్రహణమ్ | కేతుగ్రస్తః పింగళవర్ణః సూర్యాస్తమయాదితః.

స్పర్శకాలః ౩౧-౨౧ తె గం 6-22
పరదినే సూర్యోదయాదితః
నిమీలనకాలః ౨-౫౭ ఉ గం 7-49
మధ్యకాలః ౩-౩౬ ప గం 8-4
ఉన్మీలనకాలః ౪-౧౬ ప గం 8-20
శుద్ధమోక్షకాలః ౭-౫౪ ప గం 9-48



ఆద్యంత పుణ్యకాలః ౮-౩౪ గం 8-36 బింబాదర్శనకాలః ౧-౧౯ గం 0-32 దక్షిణ గోలః. అపసవ్యగ్రహణం ప్రాగ్దిశి స్పర్శః నైరృత్యాం నిమీలనం దక్షిణ నైరృతి మధ్యే ఉన్మీలనం. వాయు దిశి మోక్షః.

## నిత్యభోజన ప్రత్యాబ్దికాది నిర్ణయము.

ఈ గ్రహణము గ్రస్తాస్తమగుటచే శు ౧౫ మం. వ రాత్రి చంద్రోదయానంతరము స్నానముచేసి భుజింపవలెను. ఇందుకు ప్రమాణము. "గ్రస్తావేవా స్తమానంతు రవీందూ ప్రాప్నుతో యది | తయోః పరేద్యు రుదయే స్నాత్వాభ్యవహరేన్నరః ||" అని గలదు. సూర్యచంద్రులు గ్రస్తులై యస్తమించినచో పరదినమున సూర్య గ్రహణమున సూర్యోదయానంతరము చంద్రగ్రహణమున చంద్రోదయానంతరమున్ను స్నానముచేసి భుజింపవలయును. పరదినమున జరుపవలసిన ప్రత్యాబ్దికము గలిగినచో గణితశాస్త్రముచే నిందు వ్రాయబడిన శుద్ధమోక్షానంతరము ప్రత్యాబ్దిక మాచరింపవలయును. ప్రమాణము :— "గ్రస్తేచంద్రేస్తం గతేచే త్తదహ్ని కుర్యాత్ప్రత్యబ్దం యథాకాలమేవ" అని గలదు.

## ధర్మశాస్త్రవిషయములు

### వైష్ణవ శ్రీరామనవమి (పూర్వపద్ధతి పంచాంగే)

చైత్ర శు ౮ సో ౦-౨౮ ఆర్ద్ర ౨౪-౬ స్మార్తమాధ్వ శ్రీరామ ౯ మీ|| శు ౯ మం ౨-౧ పున ౨౭-౩౪ శ్రీ వైష్ణవ శ్రీరామ ౯ మి. నిబంధనగ్రంథములందు నవమిత్రిముహూర్త పరిమితి గలిగియున్నచో దశమి పారణయోగ్యమైనపుడు నవమినాడు శ్రీరామనవమి యగునని గలదు. ప్రస్తుతము నవమిత్రిముహూర్తాల్పమగుటచే స్మార్తులకును వైష్ణవులకును గూడ అష్టమీశేషముగల సోమవారముననే శ్రీరామనవమి యగును. రామానుజ సంప్రదాయమువారికి అష్టమీశేషము నిషిద్ధమగుటచేతను స్వల్పనవమియైనను గ్రాహ్యమగుటచేతను పరదినమున శేషనవమినాడే శ్రీరామనవమి.

### సరస్వత్యుద్వాసనము (పూర్వపద్ధతి పంచాంగంలో)

ఆశ్వయుజ శు ౮ శు ౮-౫౪ ఉషా ౩౧-౨౪ దినం ౨౯-౯ సరస్వత్యుద్వాసనం||

శ్రవణ ప్రథమపాదమున సరస్వత్యుద్వాసనము చేయవలయును. శ్రవణ ప్రథమపాదము రాత్రియందు వచ్చినను ఆనాడే ఉద్వాసనము చేయవలయుననియు, రాత్రిభాగమనగా సూర్యాస్తాది త్రిముహూర్త కాలమనియు ధర్మశాస్త్రమునందు గలదు. గావున పూర్వపద్ధతి పంచాంగప్రకారము ఈనాడే సరస్వత్యుద్వాసనము చేయదగినది. దృక్పంచాంగమున సందేహము లేదు.

### మహోదయము.

పౌష బ ౩౦ బు ౩౬-౫౪ శ్రవ ౪౬-౧౮ సిద్ధి ౧-౫౮ వ్యతీ ౫౨-౨౫ చతు ౯-౨౮ మహోదయాలభ్యయోగ పుణ్యకాలము.

అమావాస్య, శ్రవణము, వ్యతీపాత, ఆదివారము గలిసినచో అర్ధోదయయోగము. ఇందు వారము మరియొకటైనచో మహోదయయోగము అగును. గాని ఆదివారముగాక సోమవారమే యైనచో మహోదయమని కొన్ని గ్రంథములందు గలదు. వైద్యనాథ దీక్షితీయమున బుధవారమైనచో మహోదయమని గలదు. గావున ప్రస్తుతము బుధవారమైనదిగాన సిద్ధియోగానంతరము మహోదయముగాదగియున్నది. గాని—"దర్శస్యాంతః పూర్వభాగశ్చ పాతే శ్రోణామధ్యం భాస్కరస్యోదయశ్చ | భానోర్వారేత్వేష చార్ధోదయస్స్యాత్సైవ్యేవారే తన్మహత్పూర్వమాహుః" అనుశ్లోకముచే చతుష్పాత్కరణము గతించిన పిమ్మట దర్శోత్తరార్ధ, శ్రవణమధ్య పాతపూర్వభాగములు గలియునుగావున అప్పటినుండియు మహోదయయోగము. ఈ యోగము సంగవకాలము దాటినచో ముఖ్యకాలముగాదు. కావున ఘ ౯-౨౮ లగాయతు ఘ ౧౧-౨౨ వరకు పుణ్యకాలమని గ్రహించెదరుగాక.

## శ్రీ విజయనామసంవత్సర పఞ్చాఙ్గ పీఠికా.

అచింత్యావ్యక్త రూపాయ నిర్గుణాయ గుణాత్మనే | సమస్త జగదాధారమూర్తయే బ్రహ్మణేనమః ||౧|| లంబోదరాంఘ్రి ద్వయ మంబుజశ్రీ సర్వస్యహార్యన్వహ మర్చయామః | యదర్చయా బ్రహ్మ ముఖామరేశా నిరంతరాయం సఫలీకృతార్థాః ||౨|| ప్రావృట్ఛరన్మేఘనిభా భుజంగశయ్యా విభూషా విహగోక్షవాహకా | గోపాలమల్లేశ్వర దేవదేవౌ భజే ప్రియాదత్తహృదర్ధదేహౌ ||3|| వేదమయీం నాదమయీం బిందుమయీం పరపదోద్య దిందుమయీం | మంత్రమయీం తంత్రమయీం ప్రకృతిమయీంనౌమి విశ్వవికృతిమయీం||౪||

గురుస్తుతిః || శ్రీ నోరివంశాబ్ధిసోమం సూర్యనారాయణం బుధం | జ్యోతిశ్శాస్త్రి కులగురుం ధ్యాయామి మనసానిశం ||౫|| యదనుగ్రహతః ప్రాప్తం విజ్ఞానం సర్వశాస్త్రజం | తం సాహిత్య గురుంవందే దర్భా బైరాగి శాస్త్రిణం ||౬|| చిలుకూరి ఖ్యాతవంశ మణిం కొండయ్య శాస్త్రిణం | శబ్దశాస్త్రేతి నిష్ణాతం వందే మచ్ఛాబ్దదేశికం ||౭|| మాతులం న్యాయసాహిత్యాచార్యం మన్నాన్యయదేశికం | భజామ్యహం వారణాశి వేంకటేశ్వర శాస్త్రిణం ||౮|| యస్య బోధలవం ప్రాప్య మీమాంసా శాస్త్రసాగరా | తీర్ణామయా గురుం వందే భూమానందయతీశ్వరం ||౯|| మహామహోపాధ్యాయం శిరోఘోపాఖ్యమురలీధరం|తంనౌమ్యస్మద్గురుంజ్యోతిషాబ్ధిపారంగతోయతః||

స్వీయవంశక్రమః॥ శ్రీ కౌండిన్యసగోత్రే పిడపర్త్యాఖ్యాన్వయే ప్రసిద్ధతమే। త్రిస్కంధ శాస్త్రకృతినో భవన్తి శశ్వద్బహవః కాలాత్ ॥౧౧॥ చలమాఖ్య వేంకటచలావ్యాఖ్య స్తత్రాభవద్విబుధః। యోలుప్తమాసవిషయక వాదేనాగణయదపిచ విశ్వపతిం ॥౧౨॥ తస్య సుత స్తత్సదృశశ్శేషాచల దైవవిత్ప్రవరః। జజ్ఞాతే తస్యసుతౌ పూర్ణౌ విద్యాసుపరిపూర్ణౌ ॥౧౩॥ తయోర్ద్వితీయోఽద్వితీయ ప్రతిభావాన్బుధోత్తమః। శ్రీ పూర్ణార్యః పుష్కరాది సంస్రత్ప్రాప్తో జ్వలద్యశాః ॥౧౪॥ తదనుగ్రహాత్త విద్యాః పంచసుతా స్తస్య శంభువక్త్రసమాః। శ్రీకృష్ణమూర్తి శాస్త్రాభిఖ్యాయ స్తృతీయోహ మేషు మయా ॥౧౫॥ గురువరకరుణావశతస్సిద్ధాంతీకృత్యనిఖిల సంసత్సు। స్వమతం తథాద్యక్రియతే పంచాంగం ధర్మకర్మార్హం ॥౧౬॥

## సంవత్సరాదికృత్యం.

అబ్దాదౌ మిత్రసంయుక్తో మంగళస్నాన పూర్వకం। అలంకృతో గణాధ్యక్షం వాణీం దైవవిదం గ్రహాన్॥ ౭॥ గురూన్విప్రాంశ్చసంపూజ్య ముదితో బ్రహ్మజన్మతః। సంవత్సరఫలం శృత్వా సుకృతానాం ఫలం లభేత్॥ ౮॥ యద్వర్షాదౌ నింబ సుమం శర్కరామ్ల ఘృతైర్యుతం। భక్షితం పూర్వ యామేస్యా త్తద్వర్షం సౌఖ్యదాయకం॥ ౯॥

## బ్రహ్మయః ప్రమాణాదికం.

బ్రహ్మణస్సౌరమానేన తృటికాల ప్రమాణం మా ౫ ది ౨౭ ఘ ౪౬ విఘ ౪౦. లవకాలప్ర. సం ౪౯ మా ౪ ది ౧౭ ఘ ౪౬ విఘ ౪౦. నిమేషకాల ప్ర. సం. ౧౪౮౧ మా ౫ ది ౨౩ ఘ ౨౦ గుర్వక్షరోచ్చారణకాల ప్ర. సం. ౪౦ సహస్రాణి. ప్రాణకాల ప్ర॥ సం ౪ లక్షాః. విఘటీప్ర. సం. ౨౪ ల. ఘటీప్ర. సం ౧౪ కో ౪౦ ల. దినప్ర సం ౪౩౨ కోటయః. అనేన బ్రహ్మయః ప్రమాణసౌరాబ్దాః ౩,౧౧,౧౪,౦౦౦ కోటయః. వర్తమానస్యాస్య బ్రహ్మణః పరాఖ్యస్యాయుషోర్ధంగతం॥ ద్వితీయ పరార్థే ప్రథమవర్షే ప్రథమవాసరే గతఘట్యాదయః ఘ ౧౩ విఘ ౪౨ ప్రా (౦) గుర్వ ౩ నిమే ౧౯ లవ ౧౮ తృటయః ౩౪. సంప్రతి పంచత్రింశత్తమే తృటికాలే గతసౌరమానాదయః. మా ౨ ది ౨ ఘ ౧౩ విఘ ౨౦. బ్రహ్మణస్సౌరమానేన వయోగతవత్సరాః ౧, ౫౫, ౫౨, ౧౯ ౭కో ౨౯ల౪౯ సహ ౫౪ సం. ఇదానీంతనశ్వేతవరాహకల్పే స్వాయంభువాద్యాషణ్మనవో గతాః। సప్తమే వైవస్వతమన్వంతరే సప్తవింశతి మహాయుగా గతాః। సప్తర్షీంద్ర మనూనామపి స్వకాలేనాయుర్వర్షశతమేవ। తచ్చైకసప్తతి ౭౧ మహాయుగమితం తత్పరిమాణ సౌరాబ్దాః ౩౦ కో ౬౭ల ౨౦ సహ॥ తత్సంవత్సరప్ర ౨ ల ౫౫ సహ ౬౦౦ సం॥ అహోరాత్రప్ర. ౮౫౨౦ సం. అహఃప్ర ౪౨౬౦ సం। ఘటీప్రసం. ౧౪౨. వర్తమాన స్యాస్య వైవస్వత మనోర్వయోగతవత్సరాః। ౧౨ కో ౫ ల ౩౩ సహ ౫౪ సం॥ విష్యబ్దాః ౧౮ కో ౬౧ ల ౮౬ సహ ౯౪౬ సం। శ్రీ మజ్జగద్గురు శ్రీమచ్ఛంకర భగవత్పాద పూజ్యావతారాబ్దాః ౨౦౨౫ శ్రీ శాలివాహనశకే గతాబ్దాః ౧౮౭౫ ప్రభవాది గతాబ్దాః ౨౬ విష్యబ్దాః ౩౪.

## వ్యవహారమాన నిరూపణం

అథాస్మిన్దేశే లోకవ్యవహారార్థం చాంద్రమానాబ్దో గ్రాహ్యః। వింధ్యస్యోత్తరదేశే బార్హస్పత్యమానాబ్దో గ్రాహ్యః। అయమేవ ఫలప్రదర్శనార్థం మాసనామ్నా గ్రాహ్యః। చాంద్రమానవశాదయం విజయనామ సంవత్సరః। బార్హస్పత్యమానవశాదయం పరాభవనామ సంవత్సరః। అయమేవ మార్గశీర్షాబ్ద ఇత్యుచ్యతే। ప్రభవాదిక్షయాంతేషు షష్టి సంవత్సరేషు వర్తమానానాం ద్వాదశయుగానాం మధ్యే అహిర్బుధ్న్య దేవతాకంపష్ఠయుగం వర్తమానం। తత్ర సూర్య దేవతాకః పరివత్సర సంవత్సరః। అస్మిన్యవదానం మహాఫలం॥ పరివత్సరఫలం। ప్రముఖే ద్వితీయే (ప్రముఖే ఆదౌ వృష్టిః) కాంత మత్రయుగఆదితస్త్రయం। ఇతి। బార్హస్పత్యమానేన ఇద్వత్సరఫలం। స్వల్పోదకం పంచమ మబ్ద ముక్తం॥ ఇతి।

తా॥ ఈ దేశమున చాంద్రమానముచే విజయసంవత్సరము. దీనికి పరివత్సరమనియు పేరు. ఇందు యవదానము మహాఫలము. బార్హస్పత్యమానముచే పరాభవసంవత్సరము. ఇది మార్గశీర్షాబ్దమనియు చెప్పబడును. ఇందు మొదట అనుకూలవర్షములు గలుగును. బార్హస్పత్యమానముచే మొత్తముమీద వర్షములు తక్కువయగును.

## విజయసంవత్సర ఫలం

నశ్యతే వారి ధారాభిః పూర్వకృష్యఖిలంఫలం। రాజభిశ్చాపరంసస్యం విజయా జ్జైజయేప్సుభిః॥ బార్హస్పత్య మానాబ్ద ఫలం॥ పరాభవాబ్దే రాజానః ప్రాప్నువంతి పరాభవం। ఆమయః క్షుద్రధాన్యాని ప్రభూతాని సువృష్టయః॥ మార్గశీర్షాబ్దఫలం॥ సౌమ్యాఖ్య వర్షే శలభాండజాఖుమృగాదిభిశ్చాఖిల సస్యహానిః। అత్యల్పవృష్టిర్బహు రోగపీడా భవంతి భూపాః కలహోత్సుకాస్స్యుః॥

తా॥ విజయసంవత్సరమున పూర్వసస్యఫలము వర్షములచే హానిచెందును. జయకాంక్షులగువారి యుద్ధములచే రెండవపంట హానిచెందును. బార్హస్పత్యమానముచే పరాభవగాన ప్రభువులు పరాభవము నందుదురు. రోగములు క్షుద్రధాన్యములు వర్షములు వృద్ధిగ నుండును. మార్గశీర్షాబ్దమగుటచే సస్యములకు పీడచేయు మిడతలు పక్షులు ఎలుకలు మృగములు వృద్ధియగును. వర్షములు తక్కువయగును. వ్యాధులు హెచ్చగును. ప్రభువులు యుద్ధోత్సుకులయ్యెదరు.

## రాజాదినిర్ణయము

| | | |
|---|---|---|
| రాజా చంద్రః | ధాన్యాధిపతిః కుజః | నీరసాధిపతిర్గురుః |
| మంత్రీ చంద్రః | అర్ఘాధిపతిస్సూర్యః | పురోహితో గురుః |
| సేనాధిపతిస్సూర్యః | మేఘాధిపతి స్సూర్యః | పరీక్షకో బుధః |
| సస్యాధిపతిర్గురుః | రసాధిపతిశ్శనిః | గణకశ్శుక్రః |
| గ్రామపాలకశ్చంద్రః | దేవాధిపతిర్గురుః | జంగమాధిపతిర్గురుః |
| దైవజ్ఞస్సూర్యః | నరాణామధిపతి స్సూర్యః | సర్పాధిపతిశ్శుక్రః |
| రాష్ట్రాధిపతి శ్చంద్రః | గ్రామనాయకో బుధః | మృగాధిపతి స్సూర్యః |
| అశ్వాధిపతిశ్చంద్రః | వస్త్రాణామధిపతి శ్శనిః | శుభాధిపతిశ్చంద్రః |
| గజాధిపతిర్గురుః | రత్నాధిపతిశ్చంద్రః | స్త్రీణామధిపతి స్సూర్యః |
| పశూనామధిపతి స్సూర్యః | వృక్షాధిపతిః కుజః | |

చంద్రుడు—రాజు, మంత్రియు నయ్యెను. మరియు గ్రామపాలకుడు, రాష్ట్రాధిపతి, అశ్వాధిపతి, రత్నాధిపతి, శుభాధిపతియు నయ్యెను.

సూర్యుడు—సేనాధిపతియు, అర్ఘాధిపతియు, మేఘాధిపతియు నయ్యెను. మరియు దైవజ్ఞుడు, పశ్వధిపతి, మనుష్యాధిపతి, మృగాధిపతి, స్త్రీలకధిపతియు నయ్యెను.

గురుడు—సస్యాధిపతి నీరసాధిపతియు నయ్యెను. పురోహితుడు, గజాధిపతి, దేవాధిపతి, జంగమాధిపతియు నయ్యెను.

కుజుడు—ధాన్యాధిపతి—వృక్షాధిపతియు నయ్యెను.

శని—రసాధిపతియు, వస్త్రాధిపతియు నయ్యెను.

బుధుడు—పరీక్షకుడును, గ్రామనాయకుడు నయ్యెను.

శుక్రుడు—గణకుడు, సర్పాధిపతియు నయ్యెను.

టచే పశువృద్ధి, సస్యవృద్ధి, సుభిక్షము, పశువులకు తృణక్షీరాద్యభివృద్ధియు గలిగి ధరలనుకూలముగ నుండును. తక్కిన యాధిపత్యములు యమునకగుటచే అల్పవృష్టి, దుర్భిక్షము, తృణాదిహాని కించిత్తుగ పశుపీడయు గలుగుచుండును.

## వర్షధాన్యాది ప్రమాణములు

వర్షం ౧౩ ధాన్యం ౮ శీతం ౧౧ తృణం ౧౯ ఉష్ణం ౧౩ మారుతః ౮ ప్రజా వృ ౧౮ నా ౧౫ రాజ విద్వరం ౧౧ వ్యాధయః ౧౫ ఉపశమనం ౧౯ ఆచారః ౧౩ అనాచారః ౧౯ మరణాని ౮ జన్మాని ౧౫ దేశోపప్లవః ౧౩ దేశస్వాస్థ్యం ౨౧ చోరభయం ౮ నా ౮ మృగోపద్రవః ౧౫ నా ౯ కీటభయం ౯ నా ౧౮ మూషక వృ ౧౮ నా ౯ సర్పవృ ౧౧ నా ౮ గోమాయు వృ ౧౧ నా ౫ కీట వృ ౫ నా ౫ శలభవృ ౩ నా ౧౧ మశకవృ ౮ నా ౮ మత్కుణ వృ ౧౧ నా ౩ వృశ్చిక వృ౧౧నా ౧౧ వ్యాఘ్రవృ ౩ నా ౮ సస్య వృ ౯ నా ౮ శుకవృ ౮ నా ౮ పికవృ ౭ నా ౫ కుక్కుట వృ ౭ నా ౭ ఖగవృ ౨ నా ౩ గో వృ ౨నా ౪ మహిషవృ ౨ నా ౬ మృగ వృ ౩ నా ౩ ఛాగ వృ ౫ నా ౫ అశ్వ వృ ౬ నా ౫ అండజ వృ ౧౩ నా ౮ స్వేదజవృ ౧౧ నా ౧౯ వ్రీహి వృ ౧౪ శాలి వృ ౧౪ కుళుత్థ వృ ౪ తిల వృ ౧౨ మాషవృ ౬ ముద్గ వృ ౧౨ సర్షప వృ ౧౦ చణక వృ ౧౬ ఆఢక వృ ౧౦ గోధూమ వృ ౧౭ కోద్రవవృ ౧౦ ప్రియంగు వృ ౧౬ యావనాళ వృ ౧౭ శ్యామాక వృ ౧౨ రాజమాష వృ ౪ నీవార వృ ౧౬ శింబిధాన్య వృ ౧౨

## రవిచారఫలము

చైత్ర బ ౩౦ సో. మేషేర్కః ౨౪-౫౪॥ అమావాస్య—సస్యనాశము । సోమవారము—సుభిక్షము । రేవతి—సువృష్టి । వైధృతి—అనావృష్టి, నాగవం—ధర పెరుగుట, సింహలగ్నము—అనావృష్టి, పూర్వాషాఢాది నవకం—శుభము । పగలు—దుర్భిక్షము యుద్ధభయము, సాయంకాలము-శుభము.

ఈ సంవత్సరము సూర్యుడు సేనాధిపతియగుటచే స్వల్పవృష్టి, అల్పమైన పంటలు, దుర్భిక్షము, ప్రభువులు యుద్ధాసక్తులయ్యెదరు.

ఆర్ద్రాప్రవేశము—జ్యేష్ఠ శు ౯ ఆ. రే (తత్కాలదశమి) ఆర్ద్రార్కః ౩౩-౩౩ ఘటు. దశమి—శుభము, ఆదివారము—పశుహాని। [illegible]—చిత్రగానంవృద్ధి । పరిఘ—దుర్భిక్షము, తైతిల—శుభము, సుర్లగ్నము - సుభిక్షము । అస్తసమయము—సుభిక్షము । అర్ధరాత్రము—సువృష్టి । మఘాదిమండలము—మధ్యవృష్టి.

## చంద్రచారఫలము

జ్యేష్ఠ శు ౧ శుక్రవారము । ప్రజలకారోగ్యము, సుభిక్షము, క్షేమము, సస్యవృద్ధి, సువృష్టి, ఆషాఢ శు ౫ గురువారము—సుభిక్షము, ఆరోగ్యము ।ఆషాఢ శుక్లమున స్వాతివవమినాడయ్యెను. ఫలము—చల్లిన విత్తనములు ఎగిరిపోవునట్లు గాలి వీచుచుండును. ఆషాఢ బహుళమున రోహిణి దశమినాడయ్యెను. ఏకాదశియు గలదు. దశమి—సర్వసస్యసమృద్ధి । ఏకాదశి—మధ్యమము । చంద్రుడు రాజగుటచే మంచివర్షములు, సస్యవృద్ధి సుభిక్షము.

మరియు నధిక వైశాఖమున ౫ మంగళవారములు. జ్యేష్ఠమున ౫ శనివారములు. ఆషాఢమున ౫ ఆదివారములు. శ్రావణమున ౫ మంగళవారములు. కార్తికమున ౫ శనివారములు. ౫ ఆదివారములు. మార్గశిరమున ౫ మంగళవారములు. ఫాల్గునమున ౫ శనివారములు.

ఆదివారము లైదగుచో దుర్భిక్షము । మంగళవారము లైదగుచో యుద్ధభయము । శనివారము లైదగుచో—జననాశనము, దుర్భిక్షము, భూకంపము మొదలగు ఉపద్రవములు గలుగును.

## సౌరార్ఘలు

మేషమిథున కర్కాటక తులా ధనుః కుంభమాసములందు యావనాళయాలక్షీకుంకుమహింగు కాంస్యతైలైరండగోధూమ కస్తూర్యాదులు శూన్యార్ఘములగును । ధాన్యాజ్యచణకవస్త్ర కర్పూర లవణతామ్ర కుళుత్థలవంగ పుష్పసీసాదు లత్యర్ఘములగును । సువర్ణ రజతకార్పాసమాష ముద్గ మరిచ నాగవల్లీదళతిః జీరజాజిపిప్పలి పట్టావికాయస శ్రీగంధ క్రముక శర్కరాదులు సమార్ఘములగును.

వృషభమీనమాసములందు—యావనాళాదులు సమార్ఘములు। ధాన్యాదులు శూన్యార్ఘములు । సువర్ణాదు లత్యర్ఘములు.

సింహకన్యావృశ్చిక మకర మాసములందు—యావనాళాదు లత్యర్ఘములు । ధాన్యాదులు సమార్ఘములు । సువర్ణాదులు శూన్యార్ఘములు.

## చాంద్రార్ఘలు

చైత్ర నిజ వైశాఖ భాద్రపద పౌష ఫాల్గునమాసములందు—యావనాళాదులు సమార్ఘములు । ధాన్యాదులు శూన్యార్ఘములు । సువర్ణాదు లత్యర్ఘములు

అధికవైశాఖ ఆషాఢ శ్రావణ ఆశ్వయుజ కార్తిక మార్గశిర మాఘమాసములందు—యావనాళాదులు శూన్యార్ఘములు । ధాన్యాదు లత్యర్ఘములు । సువర్ణాదులు సమార్ఘములు.

జ్యేష్ఠమాసమున - యావనాళాగులత్యర్ఘములు. ధాన్యాదులు సమార్ఘములు. సువర్ణాదులు శూన్యార్ఘములు.

## మౌఢ్యనిర్ణయము

చైత్ర బ ౯ బు (8-4-1953) ప్ర॥ అధిక వైశాఖ శు ౨ బు (15-4-1953) ప॥ శుక్రమౌఢ్యము. అధికవైశాఖ బ ౧౪ మం (12-5-1953) ప్ర॥ నిజవైశాఖ బ ౧౨ సో. (8-6-1953) ప॥ గురుమౌఢ్యము, మార్గశిర బ ౯ మం (29-12-1953) ప్ర॥ మాఘ బ ౯ శ. ప॥ (27-2-1954) శుక్రమౌఢ్యము.

## మకరసంక్రాంతి పురుష లక్షణము

అష్టకర్ణో విశాలాక్షో లంబభ్రూ ర్దీర్ఘనాసికః । అష్టబాహుశ్చతుర్వక్త్రః సంక్రాంతి పురుషస్మృతః॥ శతయోజన మాన్నత్యం విస్తీర్ణం ద్వాదశ స్మృతం । ఏవంరూపం హి విజ్ఞేయం సంక్రాంతి పురుషాకృతేః ॥



ఈ మకర సంక్రాంతి పురుషునకు మందాకి యని పేరు. బ్రాహ్మణులకరిష్టము । నింబోదకముచే స్నానము - పాలకులకు శుభము ! యావకాక్షతల ధరించును - యావకనాశనము । నీలాంబరమును ధరించును - గొప్ప భయము । లాక్షారసము గంధము - యుద్ధభయము । జపాపుష్పము - యశోహాని । గోమేధికాభరణము - పశుహాని । సీసపాత్రలో పాలు త్రాగును - ఆరోగ్యము - పశుహాని । రేగు పండును-తినును - శుభము । ఏనుగువాహనము - పాలకులకు హాని । ధనుస్సు ఆయుధము—

యుద్ధము । బంగారు గొడుగు—సువర్ణనాశనము । అస్త్రమును ధరించుట, రోగభయము. ఆగ్నేయదిక్కునకు ప్రయాణము—ఆగ్నేయ దేశమున కరిష్టము । విస్మయచేష్ట—ప్రజలకు వ్యాధి । నివిష్టుడగును. సస్యవృద్ధి ।

పక్షఫలము :—శుక్లపక్షే యదా పౌషే మకరస్థో దివాకరః। ప్రజానాం వ్యాధిపీడాచ నృపాణాం సమరోభవేత్ ॥ తా॥ మకర సంక్రాంతి శుక్లపక్షమున నైనచో ప్రజలకు వ్యాధిపీడ, పాలకులకు యుద్ధములు గలుగును. తిథ్యాది ఫలములు :—పౌష శు ౯ బు. (తత్కాలదశమి) మకరర్క్షః ౫౧-౫౬ దశమి—ప్రీతి గురువారము—సువృష్టి । ఉగ్రనక్షత్రము—శూద్రపీడ । వృశ్చికలగ్నము-యుద్ధభయము । ౨౬ వ మహూర్తము - రాష్ట్రపీడ । అపరరాత్రము—నటులకు హాని. శ్రీః.

## సస్యవిచారము

సస్యజాతక రీతిచే విచారింప పూర్వాపర సస్యములన్నియు బాగుండునట్లు తోచెడిని. అందు పూర్వసస్యములకే విశేషము గాన్పించుచున్నది. నాయకులబట్టి చూచినను పూర్వసస్యాధిక్యమే తెలియుచున్నది. సర్వ సస్యసముదాయమగు ౧౬ భాగములలో ౧౧ భాగముల పంట పండుననియును తెలియుచున్నది.

## ఆదాయవ్యయములు

| | | | |
|---|---|---|---|
| మేషవృశ్చికయోః | ఆ ౧౪ వ్య ౨ | సింహస్య | ఆ ౮ వ్య ౨ |
| వృషభతులయోః | ఆ ౮ వ్య ౧౧ | ధనుర్మీనయోః | ఆ ౨ వ్య ౧౧ |
| మిధునకన్యయోః | ఆ ౧౧ వ్య ౮ | మకరకుంభయోః | ఆ ౫ వ్య ౫ |
| కర్కటకస్య | ఆ ౫ వ్య ౮ | సర్వస్య | ఆ ౫౩ వ్య ౪౭ |

## రాజపూజావమానములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| మేషస్య | రా ౪ అ ౫ | సింహస్య | రా ౨ అ ౪ | ధనుషః | రా ౬ అ ౭ |
| వృషభస్య | రా ౭ అ ౫ | కన్యాయాః | రా ౫ అ ౪ | మకరస్య | రా ౩ అ ౩ |
| మిధునస్య | రా ౩ అ ౧ | తులాయాః | రా ౧ అ ౭ | కుంభస్య | రా ౬ అ ౩ |
| కర్కటకస్య | రా ౬ అ ౧ | వృశ్చికస్య | రా ౪ అ ౭ | మీనస్య | రా ౨ అ ౬ |

## కందాయఫలములు

| అశ్వి | భర | కృ | రోహి | మృగ | ఆర్ద్ర | పున | పుష్య | ఆశ్లే |
|---|---|---|---|---|---|---|---|---|
| ౫ | ౦ | ౩ | ౬ | ౧ | ౪ | ౭ | ౨ | ౫ |
| ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ |
| ౦ | ౨ | ౪ | ౧ | ౩ | ౦ | ౨ | ౪ | ౧ |
| మఘ | పూఫ | ఉఫ | హస్త | చి | స్వా | విశా | అనూ | జ్యే |
| ౦ | ౩ | ౬ | ౧ | ౪ | ౭ | ౨ | ౫ | ౦ |
| ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ |
| ౩ | ౦ | ౨ | ౪ | ౧ | ౩ | ౦ | ౨ | ౪ |
| మూ | పూషా | ఉషా | శ్ర | ధని | శత | పూభా | ఉభా | రేవ |
| ౩ | ౬ | ౧ | ౪ | ౭ | ౨ | ౫ | ౦ | ౩ |
| ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ |
| ౧ | ౩ | ౦ | ౨ | ౪ | ౧ | ౩ | ౦ | ౨ |

ఫలం ॥ విషమేష్వర్థ లాభస్స్యాత్సమేషు సమతా భవేత్ ।
శూన్యేషు శూన్యం భవతి ప్రత్యేకం త్రయయోగతః ॥
ఆదిశూన్యే భవేద్వ్యాధి ర్మధ్యశూన్యే మహద్భయం ।
అంత్యశూన్యే భవేద్ధానిః కందాయ ఫలమీదృశమ్ ॥

## సంవత్సరఫలము

| | | | | | |
|---|---|---|---|---|---|
| అశ్విని | పుష్య | స్వాతి | అభిజిత్తు | వారలకు | రోగభయము |
| భరణి | ఆశ్లేష | విశాఖ | శ్రవణం | ,, | ఆయుర్వృద్ధి |
| కృత్తిక | మఘ | అనూరాధ | ధనిష్ఠ | ,, | ధనలాభము |
| రోహిణి | పూఫ | జ్యేష్ఠ | శ. తా | ,, | మనస్తాపము |
| మృగశీర్ష | ఉఫ | మూల | పూ. భా | ,, | రాజపూజ్యత |
| ఆర్ద్ర | హస్త | పూ. షా | ఉ. భా | ,, | యుద్ధభయం |
| పునర్వసు | చిత్త | ఉ. షా | రేవతి | ,, | అలంకారప్రాప్తి |

## కుజచారఫలము

రోహిణి, ఆర్ద్ర, ఆశ్లేష, మఘ, పూఫ, ఉత్తరఫల్గుని, స్వాతి, జ్యేష్ఠ, మూలనక్షత్రములందు చరించుకుజుడు అనావృష్టినిచేయును. మృగశిర, చిత్త, విశాఖలందు చరించి వర్షమును గలుగచేయును. నందన సం॥ చైత్ర బ ౧౪ బు. న వక్రించిన కుజునకు అశ్రుముఖము ఉష్ణముఖము నైనవి. ఆ ఫలము—ఈసంవత్సర శ్రావణ బ ౯ మం. కుజోదయపర్యంతము జరుగును. అశ్రుముఖమగుచో నానావిధ వ్యాధులు గలుగును. ఉష్ణముఖమగుచో నగ్ని యంత్రములచే జీవించువారికి పీడ.

## బుధచారఫలము

ఈ సంవత్సరమున నాయామాసములం దుదయించిన బుధుడు నిజవైశాఖ, ఆషాఢ, కార్తిక, పౌషమాసములందు కనుపించుటవలన శస్త్రభయము చోరభయము అగ్నిభయము వ్యాధిభయము జలభయము దుర్భిక్షభయము గలుగును. మరియు—శైఘ్రుడైన బుధోదయానంతర మేదని విపరీతఫలము గలుగును. అదివరకు వర్షమున్ననానావృష్టి, ననావృష్టియున్న వర్షము, ఇట్లు వైపరీత్యమును చేయును.

## గురుచారఫలము

గురుడు రాజుగాని సస్యాధిపతిగాని సేనాధిపతిగాని యగుచో భూమి యజ్ఞములచేతను ధాన్యములచేతను వర్షములచేతను నిండి సుభిక్షముగనుండును. ప్రస్తుతము గురుడు సస్యాధిపతియయ్యెను. వత్సరాది ప్ర॥ చైత్ర బ ౧౦ గు. ప॥ మేషగురుడు మేషములకు హాని, పాలకులకు కలహములు, గాని ప్రజలు సుఖింతురు. వర్షములు సస్యములు అనుకూలములగును. చైత్ర బ ౧౦ గు. ప్ర॥ శ్రావణ ౭౬ ఆ॥ ప॥ తిరుగ కార్తిక బ ౯ ఆ. ప్ర॥ వత్సరాంతపర్యంతమున్ను వృషభమున గురుడు. పశువులకు స్త్రీలకు శిశువులకును హాని, సస్యహాని, మధ్యవృష్టి, గొప్పయుద్ధములు గలుగును. నిజవైశాఖ శు ౧౦ శ. ప్ర॥ జ్యేష్ఠ బ ౧౦ సో. ప॥ వృషభ మధ్యభాగమున గురుడు, ఇది దుర్భిక్షయోగము. శ్రావణ బ ౬ ఆ. ప్ర॥ కార్తిక బ ౯ ఆ. ప॥ మిధునగురుడు—ఒక్కొకచో మంచి వర్షములుండును. పాలకులకు కలహములందాసక్తి, ప్రజలకు ఈతిబాధాభయము శస్త్రభయము హెచ్చగును.

## శుక్రచారఫలము—ఉదయాస్తఫలము

చైత్ర బ ౯ బు. అశ్వినిలో మధ్యమ మార్గమున గోవీధియందు పడమట నస్తమించి అధిక వైశాఖ శు ౨ బు. న రేవతిలో ఆ మార్గమున నావీధియందే తూర్పున నుదయించును. ఫలము—మధ్యమమార్గమగుటచే సస్యములు ధరలు మధ్యమముగ నుండును. పరరాష్ట్రములు స్వరాష్ట్రమున చేరుటయోగము. వాటిని చక్కగ పాలించుట క్షేమము. ఈ యోగక్షేమములును మధ్యమముగనుండును. గోవీధిగావున సస్యములకును గోసంపదగలవార్లకును హానియగును. తిరుగ మార్గశిర బ ౯ మం. న మూలనక్షత్రమున దక్షిణమార్గమున మృగవీధియందు తూర్పున నస్తమించి మాఘ బ ౯ శ న పూర్వాభాద్రయందు మధ్యమమార్గమున గోవీధియందు పడమట నుదయించెను. దక్షిణమార్గమగుటచే ధాన్యమును జాగ్రతచేసి భూమియందు నూవులచల్లవలెను. (నూవులు పండును. ధాన్యముపండదు) మృగవీధిగావున మృగములకు వ్యాధులు గలుగును. తపసుజేయువారికి సస్యములకును వ్యాధులు గలుగును. (మధ్యమమార్గ గోవీధులకు పూర్వోక్తఫలమే) పక్షఫలం ॥ శుక్లపక్షమున ఉదయాస్తమ లగుచో యుద్ధములు సంభవించును. కృష్ణపక్షమున గల్గినచో సైనికవృద్ధి, షణ్మండలములలో మొదటి ఉదయాస్తములు రెండవసారి ఉదయము ధనిష్ఠాదిమండలమున జరిగినవి. ఇది శుభప్రదము, పశువృద్ధి ధనవృద్ధి ధాన్యవృద్ధియు నగును. ఒక్కొకచో భయము గలుగుచుండును. రెండవసారి అస్తమయము జ్యేష్ఠాదిమండలమున

సైనది. దుర్భిక్షము, చోరభయము, రోగభయము గలుగును. కాశ్మీరము, అశ్మకదేశము, మత్స్యదేశము, చారుదేవీనదీ తీరము, ఉజ్జయిని ప్రాంతము ఇవి నశించును.

## శ ని చా ర ఫ ల ము

వత్సరాది ప్ర॥ అధిక వైశాఖ శు ౧౧ శు. ప॥ చిత్రలో తులయందు శని. పిమ్మట శ్రావణ శు ౧౧ శు. ప॥ చిత్రలో కన్యయందు శని. ఆ పిమ్మట అశ్వయుజ శు ౧౪ బు. ప॥ చిత్రలో తులయందును, అటునుండి స్వాతీ నక్షత్రమున తులయందును శని.

ఫలము :—కన్యారాశి సంచారముచే సువృష్టి, సస్య వృద్ధి, అనుకూలమైన ధరలు, సైనికవృద్ధియు గలుగును గాని మద్యపసములు, పాలకులు పంచకార్మికులు పీడనందెదరు. (నాపక, చాక్రిక, రజక, సూచిక, చిత్రకారులు పంచకార్మికులు) తులారాశిసంచారముచే ప్రజాసుఖము, సువృష్టి సస్యవృద్ధియు గలుగును. కులూతదేశము (కాశ్మీరప్రాంతము) లాక్షారసము, కుంకుమపూవు మొదలగు ద్రవ్యములును నాట్యముచే జీవించువారును స్త్రీలును పీడనందెదరు.

చిత్రానక్షత్ర సంచారముచే స్త్రీజనము, లేఖకులు, చిత్రకారులు, నానావర్ణములుగల అలంకారములు మొదలగునవి నశించును. స్వాతినక్షత్రసంచారముచే మగధదేశవాసులు, గూఢచారాదిచారులు దూతలు, సూతులు నావికులు నటులు మొదలగువారు హాని జెందెదరు. రెండు నక్షత్రములందే చరించుటకు ఫలము మంచిదిగాదు.

కూర్మచక్రముచే—లంకా, తాలికట, గిరినగర (కొండవీడు) కొంకణ, దశపుర గోనర్ద, కర్నాట, నాసిక్య (నాసికాప్రాంతము) చోల, అత్రినగర (అత్తిలి)' ధర్మపత్తన (ధర్మపురి) కాంచీ, సింహల, కేరల, దండకారణ్య, ఆంధ్ర, హస్తిఖండ, మలయదర్దుర, మహేంద్ర (మందసా) చిత్రకూట, కోల్లగిరి, ఋశ్యమూక, శ్రీపర్వత (శ్రీశైల) త్రికూట, కిష్కింధా, కావేరీ, తామ్రపర్ణీ, నర్మదా, వేణాద్యాశ్రయ తత్తత్ప్రాంతస్థ దక్షిణదేశవాసులకును—పహ్లవ, కాంభోజ, సింధు, సౌవిర, అరబ, ఆనర్త, బర్బర, కిరాత, ఆభీర, రైవతక, సురాష్ట్ర, ద్రవిడ, మహారాష్ట్ర బాహ్లీకాది నైరృతి దేశవాసులకు అరిష్టము గలుగును.

## రాహుచారము - గ్రహణమాసఫలము

ఆషాఢమాసగ్రహణముచే కాశ్మీరము గాంధారము, ఫులిందదేశము, చైనాదేశమున్ను పీడనందును. తటాకములు నదీప్రవాహములు తగ్గును. పండ్లు దుంపలు వీటివర్తకముచే జీవించువారలకు హాని, ఖండవృష్టిగ వర్షించును.

పౌషమాసగ్రహణముచే బ్రాహ్మణక్షత్రియులకు హాని. సైంధవ, కుకుర, విదేహదేశములు ధ్వంసములగును. అల్పవృష్టి, దుర్భిక్షము, భయము గలుగును.

## దే శా రి ష్ట యో గ ము లు

1. వత్సరాది ప్ర చైత్ర శు ౧౦ మం. ప॥ బుధశనిగ్రహద్వయవక్రము. ఫలం ॥ (ప్రభుసంక్షోభము)

2. వత్సరాది ప్ర॥ చైత్ర బ ౧౦ గు. ప॥ గురుశని సమసప్తకము. ఫలము—వింధ్యకును కావేరికిని మధ్యదేశమున జనహాని.

3. వత్సరాది ప్ర. చైత్ర బ ౧౦ గు. ప॥ కుజగురులకు సప్తమ శని, ఫలము—అయోధ్యనుండి లంకవరకునైన దేశమున యుద్ధభయము, దుర్భిక్షము గలుగును.

4. చైత్ర శు ౯ సో. ప్ర॥ బ ౩౦ సో. ప. శుక్రాగ్రకుజుడు ఫలం॥ అనావృష్టి.

5. చైత్ర శు ౧౦ మం. ప్ర॥ బ ౨ బు. ప. బుధశుక్ర శనిగ్రహత్రయ వక్రం. ఫలం - యుద్ధభయము అనావృష్టియు గలుగును.

6. వత్సరాది ప్ర॥ అధిక వైశాఖ శు ౧౧ శు. ప॥ తులలో శని ఫలము—పాలకులకు ప్రజలకును హాని దుర్భిక్షము గలుగును.

7. చైత్ర బ ౨ బు. ప్ర॥ అధికవైశాఖ బ ౫ సో. ప॥ శుక్ర శనిగ్రహద్వయ వక్రము. (1 చూ)

8. చైత్ర బ ౧౦ గు. ప్ర॥ అధిక వైశాఖ శు ౧౧ శు. ప. గురు శని షష్ఠాష్టకము. ఫలం॥ వింధ్యకు దక్షిణదేశమున జనహాని.

9. చైత్ర బ ౩౦ సో. ప్ర॥ అధికవైశాఖ శు ౧౧ శు. ప॥ రవి శని సమసప్తకము. (అనావృష్టి)

10. అధికవైశాఖ శు ౧౧ శు. ప్ర॥ జ్యేష్ఠ శు ౧౧ మం. ప॥ కన్యలో శనివక్రము. ఫలము॥ దుర్భిక్షము. సస్యహాని, ప్రజలకు భయంకరములైన మశూచికాది పిత్తవ్యాధులు, గవాశ్వాదిపీడ, యుద్ధభయము గలుగును.

11. అధిక వైశాఖ శు ౧౧ శు. ప్ర॥ శ్రావణ శు ౧౧ శు. ప॥ కన్యా శని. ఫలము, అంగ వంగ కళింగ గౌడదేశములందును సౌరాష్ట్రబాహ్లీక దేశములందును పీడయగును. ఇతరదేశములందు శుభప్రదము.

12. అధికవైశాఖ శు ౧౩ సో. ప్ర॥ నిజవైశాఖ శు ౧౧ ఆ. ప॥ గుర్వగ్రమున కుజుడు. ఫలము॥ యుద్ధభయము.

13. నిజవైశాఖ శు ౧౦ శ. ప్ర॥ జ్యేష్ఠ బ ౧౦ సో. ప॥ వృషభమధ్య గురుడు. ఫలము, దుర్భిక్షము.

14. నిజవైశాఖ శు ౧౨ సో. ప్ర॥ ఆషాఢ శు ౧౨ గు. ప॥ శుక్రాగ్రగురుడు. ఫలము॥ దుర్భిక్షము.

15. నిజవైశాఖ బ ౯ శ. ప్ర॥ ఆషాఢ శు ౬ శు. ప॥ ఆషాఢ బ ౭ ఆ. ప్ర॥ శ్రావణ బ ౧౧ గు. ప॥ తూర్పునను ఆర్ద్రాది పంచకమున బుధ దర్శనము. ఫలము, వ్యాధులు, అనావృష్టి, దుర్భిక్షము, రాజవిద్వరము, వీటివలనభీతి.

16. ఆషాఢ శు ౭ ఆ. ప్ర॥ శ్రావణ బ ౧౧ గు. ప॥ కుజ కేతుయోగము. ఫలము, కళింగ అంగ, వంగదేశములందు సస్యహాని భూకంప భయము యుద్ధభయము గల్గును.

17. ఆషాఢ శు ౧౨ గు. ప్ర॥ బ ౩ బు. ప॥ శుక్రాగ్రకుజుడు. ఫలము, అనావృష్టి.

18. శ్రావణ శు ౧౧ శు. ప్ర॥ బ ౬ ఆ. ప॥ గురుశని షష్ఠాష్టకము. ఫలము, (8 చూ)

19. శ్రావణ శు ౧౧ శు. ప్ర॥ సంవత్సరాంత ప॥తులలో శని. ఫలము,అంగవంగ కళింగ గౌడ సౌరాష్ట్ర బాహ్లీక దేశములందు పీడ.

20. శ్రావణ శు ౧౨ శ. ప్ర॥ భాద్ర బ ౧౨ ఆ. ప॥ శుక్రాగ్రకుజుడు. (17 చూ) (శ్రావణ శు ౧౨ శ. ప్ర॥ శ్రావ బ ౯ సో. ప॥ కేతువ్యవధానము)

21. ఆశ్వ. బ ౧ శు. ప్ర॥ కార్తిక శు ౯ శ. ప॥ శుక్రాగ్ర శని ఫలము, జలనాశము.

22. ఆశ్వ బ ౧౨ మం. ప్ర॥ కార్తిక బ ౩ సో. ప॥ బుధగురు గ్రహద్వయవక్రము ఫలము—యుద్ధ ప్రయత్నములుజరుగును.

23. కార్తిక బ ౯ ఆ. ప్ర. మార్గ శు ౯ మం. ప॥ రవి గురు సమసప్తకము. ఫలము, అనావృష్టి.

24. కార్తిక బ ౯ ఆ. ప్ర॥ సంవత్సరాంతప॥ గురు శని షష్ఠాష్టకము. ఫలము, (చూ 8 యో)

25. కార్తిక బ ౧౦ సో. ప్ర॥ మార్గ బ ౪ గు. ప॥ గురు శుక్ర సమసప్తకము. ఫలము, ప్రజలకు జలభయమో, అగ్నిభయమో, రోగభయమో, యుద్ధభయమో, చోరభయమో, దుండగుల వలని భయమో, సర్పభయమో గల్గును.

26. మార్గశిర శు ౩ బు. ప్ర॥ పౌష బ ౯ గు. ప॥ తులలో కుజశనులు. మార్గశిర బ ౧౩ శు. న కుజశనియుతి ఫలము, అగ్నిభయము వాయు భయము గల్గును.

